అంతర భారతీయ పుస్తకమాల

# ఫణీశ్వరనాథ్ రేణు ఉత్తమ కథలు

సంకలనం
భారత్ యాయావర్

అనువాదం
పి.విజయరాఘవ రెడ్డి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ISBN 81-237-2914-6

ప్రథమ ముద్రణ 1999 (శక *1921)*


*Original Title in Hindi* : Phanishwarnath Renu Ki Shreshta Kahaniyan
*Telugu translation* : Phanishwarnath Renu Uttama Kathalu

రూ. **85.00**

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్, న్యూఢిల్లీ-110016
ద్వారా ప్రచురింపబడినది.

# విషయసూచిక


| | పేజీ |
|---|---|
| ముందు మాట | vii |
| పహిల్మాన్ డోలు | 1 |
| పార్టీ-పిశాచి | 10 |
| మెకానిక్కు రసూల్ | 28 |
| మూడుచుక్కలు | 39 |
| రసప్రియ | 57 |
| మూడో ఒట్టు | 71 |
| ఎర్ర పెదాల బేగం | 104 |
| నేపథ్యంలోని నటుడు | 118 |
| టేబుల్ | 125 |
| ఒంటరి ప్రయాణం | 148 |
| మంచి మనుష్యుడు | 163 |
| సందేశవాహకుడు | 184 |
| ఓ మొదటి రాత్రి సువాసన | 194 |
| తెగతెంపులు | 210 |
| ఆత్మసాక్షి | 226 |
| వింత విపత్తు | 241 |
| స్మృతిరేఖలు | 256 |
| రూపసౌందర్యం | 272 |
| రేఖలు-వృత్త చిత్రాలు | 282 |
| అగ్ని భక్షకుడు | 299 |
| భిత్తి చిత్రాల మయూరి | 314 |

# ముందు మాట

అభివృద్ధి పథంలో హిందీ కథ ఎన్నో మజిలీలను దాటి వచ్చింది. ప్రథమ దశలో ప్రేమ్‌చంద్ లాంటి ప్రతిభా సంపన్నుడైన కథాశిల్పి హిందీ కథకు చేయూత నిచ్చిన కారణంగా అది ఒక శిఖరాన్ని చేరుకుంది. ప్రేమచంద్ తొలిసారిగా తన కథల్లో వైవిధ్యంతో కూడిన కథా వస్తువును ప్రవేశ పెట్టటమే గాక కథాశిల్పానికి సంబంధించిన అనేక నూతన ప్రయోగాలను కూడా ప్రవేశ పెట్టారు. ప్రేమ్ చంద్ తర్వాత జైనేంద్ర, అజ్ఞేయ, యశపాల్ మున్నగు కథా రచయితలు హిందీ కథకు నూతన పోకడలను చేకూర్చారు. కాని వారు ప్రేమ్ చంద్ ప్రవేశపెట్టిన మార్గాన్ని వదలి సూక్ష్మ ఇంద్రి కోద్వే గాలతో కూడిన పట్నవాసపు జీవితంలోని లోతుపాతులను కళాత్మక రీతుల్లో ప్రవేశ పెట్టారు. ఫణీశ్వర్ నాథ్ రేణు తన కథల్లో ప్రేమ్‌చంద్ వారసత్వాన్ని అనుసరిస్తూనే హిందీ కథకు మొట్టమొదటి సారి క్రొంగొత్త గుర్తింపును కల్పించడానికి నూతన భంగిమలను ఆపాదించారు. ప్రేమ్‌చంద్ అటు తర్వాత జైనేంద్ర, అజ్ఞేయ, యశ్‌పాల్ తరం నాటి కథా రచయితలు; స్వాతంత్ర్యానంతర తరం అంటే 'నయీ కహానీ' ఆందోళనకు జన్మనిచ్చిన తరం నాటి కథా రచయితల సంధి కాలంలో రేణు ఉద్భవించారు. అందు వల్లనే ఆయన ఒక మారు అజ్ఞేయ, యశ్‌పాల్‌కు సమవయస్కులు గానూ, మరొకమారు 'నయీకహానీ' కథారచయితలకు సమవయస్కులుగానూ అగుపిస్తారు.

రేణుగారి ప్రసిద్ధి గాంచిన నవల 'మైలా అంచల్' ఆగష్టు 1954లో ప్రచురింప బడింది. సరిగ్గా పది సంవత్సరాల క్రితం ఆగష్టు 1944లో ఆయన మొదటి కథ 'బట బాబా' విశ్వమిత్ర వార పత్రిక (కలకత్తా)లో ప్రచురింపబడింది. అంటే రేణు గారి కథలు 'మైలా ఆంచల్' ప్రచురణకు పది సంవత్సరాల క్రితం నుంచే వెలువడుతూ వచ్చాయన్నమాట. అయిదవ దశకంలో ఆయన రాసిన అనేక ప్రసిద్ధ కథలు వెలువడ్డాయి. ఈ కథల్లో 'మైలా ఆంచల్' 'పరతీ పరికథా' నవలల్లోని ప్రౌఢ కథానైపుణ్యం కనబడుతుంది. ఒక పెద్ద కళాకారుడుగా రూపుదిద్దుకుంటున్న రచయితకు వుండవలసిన లక్షణాలన్నీ; నైరంతర్యకళా వీక్షణ, తీక్షణ మానవతా సంవేదన, మారుతున్న సామాజిక, రాజకీయ మూల్య - అవగాహన

మనకు తర్వాత వెలువడిన వారి కథలకు మల్లే ఈ కథల్లోనూ కన్పిస్తాయి. కాని 'మైలా ఆంచల్' 'పరథీ పరికథా' ల అపూర్వ ఆదరణ, ఈ నవలలు వెలువడిన నాటినుండి వీటిపైన చెలరేగిన దుమారం, వాదవివాదాల మూలంగా రేణు కథల పై విమర్శలు, సమీక్షలు ఎక్కువగా జరగలేదు.

రేణు కథలు అల్లిక లేక నిర్మాణం దృష్ట్యా కూడా హిందీ కథా రచనా సంప్ర దాయంలో క్రొత్త గుర్తింపు పొంది మిగిలిన వారి కథలకన్నా భిన్నంగా కన్పిస్తా యి. ఓక్రొత్త కథా రచనా ప్రక్రియకు ఇవి నాంది పలుకుతాయి. ఈ కథలు ప్రేమ్ చంద్ కథలకు భిన్నంగా కన్పడినట్లే ఆయన సమకాలీనుల కథలకూ భిన్నంగా వుంటాయి. అందువల్లనే రేణు కథలపై విమర్శ సమీక్ష చేసే దానికి ఓ క్రొత్త కొలమానాన్ని, ఓక్రొత్త సౌందర్య శాస్త్రాన్ని నిర్మించుకొనే అగత్యం అవసరమౌ తుంది.

రష్యా కథకుడు మిఖాయిల్ షోలోఖోవ్, బెంగాలీ కథకులు తారా శంకర్ వంద్యో పాధ్యాయ, సతీనాథ్ బాదుడీ, ప్రఖ్యాతి గాంచిన హిందీ కథకుడు ప్రేమ్ చంద్ నుండి రేణు తన రచనలకు ప్రేరణ పొందాడు. రేణుకథల మీద వీరి నల్గురి సమ్మిళిత ప్రభావం కనపడుతుంది. ప్రేమ్‌చంద్ నిర్మించిన కథా భూమిని తీసుకొని షోలోఖోవ్ వలె రేణు దాన్ని సాంస్కృతిక గౌరవ గరిమతో నింపుతా డు. సతీనాథ్ బాదుడీకి మల్లే శిల్పంలో క్రొత్తదనాన్ని ఆధునికతను గ్రహించి తన కథలను తారాశంకర్ వంద్యోపాధ్యాయుని వలే స్థానిక రంగులతో రంగరిస్తారు. అందు వల్లనే ప్రేమచంద్ ద్వారా చిత్రింపబడ్డ భారతీయ గ్రామీణసమాజపు అణువణువు రేణు లేఖనీ ద్వారా రససిక్తమై ప్రాణంబోసుకొని క్రొత్త దృక్పధంలో దర్శన మిస్తాయి.

'నయీకహానీ' ఆందోళన పేరుతో స్వాతంత్ర్యానంతర కాలంలో వెలువడ్డ హిందీ కథల గురించి గ్రామకథలు, నగర కథలు అన్న పేర్లతో గొప్ప వివాదం చెలరేగింది. ఈ వివాదాలలో పడక రేణు తన కథలు రాసుకుంటూ పోయేవారు. ఈ కారణంగా కూడా ఆయన కథలపైన సమీక్షకుల దృష్టి చాలాకాలం తర్వా తనే పడింది. 'కహానీ' పత్రిక 1956 నాటి ప్రత్యేక సంచికలో ప్రప్రథమంగా డా. నామవర్ సింగ్ తన వ్యాసంలో రేణును గురించి ప్రస్తావించారు. ఆయన ఇలా రాశారు "రేణు కథల్లో (విభిన్న ప్రాంతాలలోని, విభిన్నగ్రామీణ ప్రాంతాలలో జాన పదుల జీవన విధానాన్ని కథావస్తువుగా స్వీకరించిరాసిన కథలు) ఖచ్చితంగా తాజాదనం వుంది. గ్రామీణ జీవితాన్ని ఆధారంగా తీసు కొని ప్రేమచంద్ రాసిన

కథలకంటే కూడా వీటిలో ఒరకమైన క్రొత్తదనం వుంది... ఫణీశ్వరనాథ్ రేణు, మార్కండేయ, కేశవమిశ్ర, శివప్రసాద్ సింహ తమ కథల ద్వారా ఈ క్రొత్తదనాన్ని మనకు అందిస్తారని నాకు నమ్మకం కలుగుతుంది." తర్వాత 'నయీకహానీ' ఆందోళనకుచెందిన కథా కారులు కూడా రేణుని ఉన్నతస్థాయి కథాకారునిగా గుర్తించారు. ఇలా గుర్తించిన వారిలో ప్రముఖులు - రాజేంద్రయాదవ్, నిర్మలవర్మ, భీష్మసాహనీ, కమలేశ్వర్, మున్నగువారు. రేణు కంటే ఒక దశకం ముందటి కథాకారులుగా ప్రఖ్యాతి గాంచిన యశపాల్, అజ్ఞేయ కూడా రేణును శ్రేష్ఠ కథా రచయితగా గుర్తించి ప్రశంసించారు. కమలేశ్వర్ రేణు వైశిష్ట్యాన్ని గురించి ఇలా వర్ణించారు- "ఇరవయ్యో శతాబ్దానికి చెందిన ఈ సంజయుడు రూపం, గంధం, స్వరం, నాదం, ఆకారం, బింబాల మాధ్యమంతో మన మహా భారతావని వాస్తవరూపాన్ని, సత్యాన్ని, అసహ్యాన్ని, హింసను, ప్రమాదాన్ని, మానవత్వాన్ని, ఆక్రోశాన్ని, దుస్సంఘటనలను వర్ణిస్తూ ముందుకు సాగుతున్నాడు. అతని ఉన్నతలలాటం పైన వేద వ్యాసమహర్షి ఆశీస్సులు అంకితమైవున్నాయి." ధరిత్రిలోని ధనవంతుడని అజ్ఞేయ ఆయన్ను అభివర్ణించారు. రేణు యొక్క 'సమగ్ర మానవతా దృష్టి' ని ఉటంకిస్తూ సమకాలీన కథాకారుల మధ్య ఆయన్ను ఓ సాధువుగా నిలబెట్టి నిర్మల వర్మ ఇలా రాశారు - "బీహారులోని ఓ చిన్న భూఖండపు - అరచేతిలో, సంపూర్ణ ఉత్తర భారతావని లోని కృషీవలుని అదృష్టరేఖను రేణు చిత్రింప చేసాడు."

హిందీ కథారచనా పరిణామంలో రేణు ప్రత్యేకతను, హిందీ కథారచనాకారుల్లో తల మాణికాలని ఎంచబడ్డ రచయితలందరూ ఒప్పుకుంటారు. సాహిత్య విమర్శలో డా. నామవర్ సింగ్ తర్వాత డా. శివకుమార్ మిశ్రా పేరెన్నిక గన్న వారు. 'ప్రేమచంద్ కీ పరంపరా ఔర్ ఫణీశ్వర్ నాథ్ రేణు' అన్న ఓ ప్రసిద్ధి కెక్కిన వ్యాసంలో మిశ్రాగారు ఇలా రాశారు- "మధ్య తరగతి నగర జీవితాన్నే ఆధారంగా తీసుకొని అసలైన భారత జీవిత విధానాన్ని పరిత్యజించి నడుస్తున్న హిందీ కథా సాహిత్యాన్ని చాలా కాలం తర్వాత దాన్ని ప్రేమ్‌చంద్ చూపిన మార్గానికి మరలా మళ్ళించిన కథాకారుల్లో రేణు అగ్రగణ్యులు. ఆధునిక వాదమన్న పేషన్‌కు లొంగిపోకుండా రేణు ఈపని చేసారు." ఈ విధంగా రేణు ఉత్తమ హిందీ కథాకారుల తొలిపంక్తిలోని కథారచయితగా గుర్తింపబడ్డారు. ఇప్పుడు ఆయన తిరుగు లేని గొప్ప కథారచయితగా గుర్తింప బడ్డారని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఇక రేణు కథల్లోని ముఖ్య విశేషాలను గురించి ఆలోచిద్దాం!

'ప్రాణంలో మిళితమైవున్న రంగునూ,' మనస్సులోని రంగును అనగా వ్యక్తుల రాగ ద్వేషాలను, ప్రేమను, దుఃఖాన్ని, కరుణను, ఆనందోత్సాహాలను, బాధను ఒకేసారి తన కథల్లో గుప్పించి 'ఆత్మశిల్పి' గా నిలచిన ప్రప్రథమ హిందీ కథా రచయిత రేణు. ఒక గట్టి పునాది మీద ఆయన ఓ ప్రత్యేకమైన కళానైపుణ్యంతో వ్యక్తి చిత్రణ గావిస్తారు. వీరి పాత్రలు ఏదో ఒక స్థలానికి గానీ లేక ఏదో ఒక భౌగోళిక పరిసరానికి చెంది లేదా చరిత్రలోని ఏదో ఒక కాల ఖండంలో జీవించి వున్నప్పటికి సార్వత్రిక, సమకాలీన జీవిత మర్మాన్ని ఉద్ఘాటిస్తాయి. అందువల్లనే 'రేణు ప్రత్యేకత ఒకప్రాంత విశేషానికి పరిమితమై లేదు, దాన్ని అతి క్రమించటం లోనే వుంది' అని అంటారు.

'రేణు మనస్సు ఆవాల పొట్లం లాంటిదా!' అని మనకు అనిపిస్తుంది. ఆయన తన కథా సంవిధానంలోని రిక్తస్థానాలను మూడు ఆవాలగింజలతో పూరిస్తారు. ఈ మూడు గింజలు అంటే డాట్,-డాట్,-డాట్ లు రేణు కథల్లోని సూక్ష్మమైన అంతర్గత ధ్వనులన్న మాట. ఆయనలోని కథకుని మనస్సు ఇక్కడేదాగి వుంది. ఈ మూడు గింజలు (...) కళ్ళల్లో గుచ్చుకోవు, కథా ప్రవాహానికి అడ్డురావు. ఇవి తమలో సంపూర్ణ రససాగరాన్ని ఇముడ్చుకొని వుంటాయి.

'సంవదియా' కథలోని సందేశవాహకుడు; హరగోబిన్ మాదిరి రేణు తన కథల్లో తన ప్రాంతపు నిస్సహాయ-దళిత-విపన్న పాత్రల సందేశాన్నితీసుకొని పాఠకుల ముందుకు వస్తారు. వాళ్ళ బాధలు వాళ్ళహాహాకారాలను తన అంతరంగంలో దాచు కొని వాళ్ళ సందేశాన్ని సరీగ్గా చెప్పేదానికి సంకోచిస్తారు. కాని ఆ చెప్పవలసిందేమిటో ఆఖరికి బట్టబయలు అవుతుంది.

రేణు మనిషి కార్యకలాపాల భావప్రవణతను చిత్రిస్తారు. వీటి విషయంలో ఇంత శ్రద్ధ వీరు ఎందుకు చూపుతారు? మనిషి పోరాటాలు, అతని ఆపదలు, విపత్తులు, అతని దుఃఖం దరిద్రాలతో ముడిపడివున్న కార్యకలాపాలే, అతని బ్రతుకు బాటకు ఆధారాన్ని కల్పిస్తాయి. నైరాశ్యపు ఊబిలో పడిపోకుండా అతన్ని కాపాడుతాయి, అతని పోరాట శక్తిని పెంపొందిస్తాయి. 'నిత్యలీల' అన్న పేరుతో రేణు రాసిన ఒక కథేవుంది. ఆయన రాసిన చిన్న (ఠుమరీల మాదిరి చిన్నకథలు) కథల్లో మనకు ఈ లీలా భావాలు ఎక్కువగా కన్పిస్తాయి. ఈ కథల్లో రెండు విపరీత ధోరణులు ఒకే సారి చోటుచేసుకుంటాయి. ఒకప్పుడు నిరాశానిస్పృహలను అవి ప్రేరేపిస్తే మరొకప్పుడు హర్షోల్లాసాలను రేకెత్తిస్తాయి. వీటి మధ్య

నుంచి ప్రకృతి యొక్క సార్థక్యతను చాటి చెబుతాయి. జీవితం, ప్రకృతి ఈ రెంటి యొక్క సూక్ష్మాతి సూక్ష్మ రేఖల నుండి రూపు దిద్దుకొన్న ఈ కథలు పాఠకుల అంత రంగంలో సంగీతంవలె మధుర ధ్వనులను ప్రతిధ్వనింపచేస్తాయి. ఓ తుచ్ఛమైన ట్రాజడీలో చిక్కుకొని వున్న జీవిత చిత్రణ మనకు స్ఫూర్తిని కలుగ చేస్తుంది.

రేణు తన కథల్లో తుత్తునియలవుతున్న జీవిత ఆదర్శాలను, నాశనమవుతున్న క్షణాలను మూర్తీభవించిన రూపంలో పరీక్షిస్తారు, వాటి ద్వారా జనించిన బాధలను చిత్రీకరించి క్రొత్త వాటికి రెండడుగులు ముందుకు వేసి స్వాగతం పలుకుతారు. 'రసప్రియ,' 'ఆత్మసాక్షి,' 'విఘటన్ కేక్షణ' (స్మృతిరేఖలు) 'ఉచ్చాటన్'(తెగతెంపులు) మొదలగు కథల్లో మారి పోతున్న గ్రామీణ-జీవిత వాస్తవాలను ఒక క్రొత్త రీతిలో ప్రస్ఫుటింప జేస్తారు. ఈ కథలు విచ్ఛిత్తిని, నాశనాన్ని చిత్రీకరించటమేగాక మనిషి అనుభవిస్తున్న చిత్రహింసలను కూడా వ్యక్తపరుస్తాయి. రేణులోని కథకుడు మారుతున్న ఈ పరిసరాలను చిత్రిస్తూ కరుణార్ద్రుడవుతున్నట్లు కనిపిస్తాడు. అతను ఈ పరిస్థితులను ట్రాజడీలగా స్వీకరిస్తాడు. భయక్రాంత భయాందోళిత అగ్రామీణ వాతావరణంలో మరలా ఆయన 'పహిల్మాన్ ఢోలు' శబ్దాలు మార్మోగటం చూడాలను కుంటాడు. 'తలె ఏకలాచలోరే' (ఒంటరి ప్రయాణం) లో మాదిరి భూమి వివాదాలను, గ్రామీణుల పరస్పర జగడాలను ఆపేదానికి కిట్టిగాడి ఆత్మ త్యాగ మార్గాన్ని ఆదర్శప్రాయంగా తీసుకొని మానవ పోరాటంలో అతను ముందుకు పోవాలని తలుస్తాడు. నేపథ్యంలో జీవితం గడుపుతున్న జానపద కళా కారులను - వాళ్ళు 'రసప్రియ'లోని పంచగౌడి మృదంగవాదకుడుకానివ్వండి, 'నేపథ్యకా అభినేత' (నేపథ్యంలోని నటుడు)లోని పారసీ థియేటర్ కళా కారుడు కానివ్వండి, లేక 'భిత్తి చిత్రకీమయూరి' (భిత్తిచిత్రాలమయూరి) లోని భిత్తిచిత్రాల మహిళా చిత్రకారిణి కానివ్వండి లేక మెకానిక్, 'మెకానిక్కు రసూల్' కానివ్వండి వీరిని తన కథల్లో పునఃప్రతిష్ఠింపజేస్తాడు.

గ్రామీణ జీవితాలనుంచి నగర జీవితాల వరకు వ్యాపించి వున్న రేణు కథల కాన్వాస్ పరిధి విస్తృతమైంది. ఏ కుంచెతో ఆయన పనికి మాలిన, పాడుపడ్డ అంతూ పొంతూ లేని ప్రాంతపు దీన దళితులను చిత్రీకరించాడో అదే కుంచెతో నగర జీవితానికి చెందిన 'టేబుల్,' 'వికటసంకట్' (వింత విపత్తు), జలవా (రూప సౌందర్యం), 'రేఖాయేఁ: వృత్త చిత్ర' (రేఖలు-వృత్త చిత్రాలు), 'అగిన్ ఖోర్' (అగ్ని భక్షకుడు) కథలను కూడా చిత్రీకరించాడు.

వీరి ఒక్కొక్క కథ ఒకే ప్లాటుకు చెందినది కాదు. ఈ కథల్లో ఒక మూల కథతో పాటు కొన్ని ఉపకథలు కూడ అంతర్లీనమైవున్నాయి. కథల్లోని ముఖ్య పాత్రలతో పాటు ఎన్నో ఇతర పాత్రల జీవితాలు ముడి పడివున్నాయి. తన పాత్ర లను వీరు సంపూర్ణ భూతల ప్రకృతి లేక 'ల్యాండ్ స్కేప్'లో చిత్రీకరిస్తారు.

ఈ కథలు ఏదో ఒక ఐడియా లేక అభిప్రాయం లేక సిద్ధాంతాన్ని ఎన్నుకొని రాసినవి కావు. ఇవి మనల్ని నేరుగా జీవితాల్లోనికి దింపుతాయి. కావున ఇతమి త్థంగా వీటిని విశ్లేషించి ఒక నిర్ణయానికి రావటం కష్టసాధ్యంగా వుంటుంది.

రేణు కథల పరిసరాలు మనకు తెలిసినవి అయినప్పటికి అవి మనల్ని ఆక ర్షింపజేస్తాయి. వీటిని చదువుతున్నప్పుడు కథాసన్నివేశాలు మొట్ట మొదటిసా రిగా సంభవిస్తున్నట్లు అగుపడుతాయి. దీనికి కారణం ఏమంటే పరిసరాలు సన్ని వేశాల నిర్మాణంలో కల్పించిన గుభాళింపుల చైతన్యం, రంగులు, ధ్వనుల సంధానం మన నిత్య జీవితపు అనుభవం లోనికి రావు. అసలైన కళా సాధనకు రేణు గేయాలలో గంథ సమ్మేళనం (మూడు చుక్కలు) కావాలంటారు. తన కథా చిత్రాలకు ప్రాణం పోసేటందుకు సంగీతంతోనూ, ధ్వనులతోనూ నింపుతారు. ఇందువల్లనే ఈ కథల నేపథ్యంలో ఒక మౌన సంగీతం, మరొకప్పుడు స్వరబద్ధ సంగీత ధ్వనులు విన్పిస్తాయి.

రేణు కథలలోని భాష, జానపదుల భాషా పునాదులపైన నిర్మించబడుతుం ది. ఈ భాష మధ్యయుగపు భక్త కవులు - కబీరు, సూరదాసు, తులసీదాసు, మీరాబాయి, జాయసీ మున్నగు కవుల భాషకు ఎంతో దగ్గరగా వుంటుంది. రేణు భాష సెలయేటిలా ప్రవహిస్తూ వస్తుంది. కాని దానిగతి, లయ, ప్రవాహం, సంగీతం నిరంతరం మారుతూ వస్తుంది.

— భారత్ యాయావర్

14 జూన్
సంపాదక్ - వివక్ష
హిందీ విభాగ్
చాస్ మహావిద్యాలయం,
చాస్ బొకారో స్టీల్ సిటీ - 827002.

# పహిల్మాన్ డోలు

అది చలికాలం. చల్లని నల్లని అమావాస్య రాత్రి. మలేరియా, కలరా రోగాలతో ఆ ఊరంతా భయాక్రాంతుడైన బాలుని మాదిరి వణకిపోతూ వుంది. నశించి పోయిన పాత వెదురు బోద గుడిసెల్లో చీకటి - నిశ్శబ్దం రాజ్యమేలుతుంది. ఒకటే చీకటి స్తబ్దత.

చీకటి రాత్రి కన్నీరు కారుస్తున్నది. స్తబ్దత కరుణతో కూడిన ఎక్కిళ్ళనూ దుఃఖాన్ని బలవంతంగా తన హృదయంలో నొక్కి పెట్టే ప్రయత్నం చేస్తున్నది. ఆకాశంలో నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. భూమిపైన వెలుతురు అనే మాటే లేదు. ఆకాశంలో నుండి ఊడి బడాలని ఏనక్షత్రమైనా అనుకున్నా దాని వెలుతురూ, శక్తి మార్గమధ్యంలోనే నశిస్తాయి. మిగతా నక్షత్రాలు దాని భావుకత, అసమర్థ తను చూసి కిలకిలా నవ్వుకుంటున్నాయి.

నక్కలఅరుపులు, గుడ్లగూబల భయంకర కూతలు అప్పుడప్పుడూ నిశ్శ బ్దాన్ని భంగపరుస్తున్నాయి. ఊరిలోని గుడిసెల నుండి ఏడ్పులు, వాంతులు చేసుకొనే శబ్దాలు, "అయ్యో దేవుడా, ఓరీ, భగవంతుడా!" కేకలు మాత్రం విన పడుతున్నాయి. అమ్మా, అమ్మా అంటూ నీరసించిన గొంతులతో పిల్లల అరు పులు వినబడుతున్నాయి. కానీ వీటివల్ల రాత్రి స్తబ్దతకు ఎలాంటి మార్పులు లేవు.

పరిస్థితులను పసిగట్టే గొప్పనేర్పు కుక్కల కుంటుంది. అవి పగలంతా గుట్టల పైన మూటల మల్లె ముడుసుకొని దిగులుగా పడివుంటాయి. రాత్రివేళల్లో అన్నీ కలిసి ఏడుస్తూంటాయి.

రాత్రిళ్లు ఈ విధంగా భయంకరంగా గడిచిపోతూ ఉంటే, దొమ్మరివాడి డోలు మాత్రం నిరంతరం మోగుతూ ఉండేది. సాయంత్రం అయినప్పటి నుంచి తెల్లా రేదాకా "ఛట్ - థా గిడ్ - థా ... ఛట్ - థా గిడ్ - థా (అంటే రా, ఢీకొను రా, ఢీకొను) అనే శబ్దం ఒకే తాళగతిలో మోగుతూ వుంటుంది. మధ్య మధ్యలో చటాక్ చట్‌థా... చటాక్ ...చట్‌థా" అంటే ఎత్తి కింద పారేయి ఎత్తి కింద పారేయి అనే శబ్దాలు వినిపిస్తాయి.

మృత్యుముఖంలో వున్న ఆ ఊళ్ళో డోలు శబ్దాలే సంజీవని శక్తిగా పనిచే

సేవి.

లుట్టన్ సింగు పహిల్వాన్‌ను హోల్ ఇండియా ప్రజలకు తెలుసునని అంటూ వుంటాడు. కానీ అతని హోల్ ఇండియా హద్దు ఒక జిల్లా వరకు మాత్రమే. ఆ జిల్లాలోని ప్రజల కందరికి అతను తెలుసు.

లుట్టన్ తల్లి దండ్రులు అతని తొమ్మిది సంవత్సరముల వయసప్పుడే అతన్ని అనాథగా మిగిల్చి చనిపోయారు. అదృష్టము కొద్దీ అప్పటికే అతనికి పెండ్లి అయింది. లేకపోతే తల్లిదండ్రులతో పాటు అతను గతించేవాడు. విధవరాలయిన అత్త అతన్ని పెంచి పెద్ద చేసింది. బాల్యంలో ఆవులను మేపుతూ, వాటి పాలు తాగుతూ, కసరత్తు చేస్తూ గడిపేవాడు. పల్లెప్రజలు అతని అత్తను నానా విధాలుగా బాధించేవారు. పల్లె ప్రజలతో ప్రతీకారం తీర్చుకోవాలనే ఉద్దేశ్యంతోనే అతని బుర్రలో కసరత్తు నేర్చుకోవాలని బుద్ధి పుట్టింది. క్రమం తప్పకుండా కసరత్తు చేయటం వల్ల బాల్యావస్థలోనే అతని ఛాతి, బాహువులు బలిష్టమైనాయి. పుష్టికరమైన కండరాలు ఏర్పడ్డాయి. యవ్వనంలో అడుగిడుతూనే పల్లెలో కెల్లా మంచి పహిల్మాన్‌గా పేరు తెచ్చుకొన్నాడు. ప్రజలు అతనికి భయపడేవారు. తాను రెండు వైపులా చేతులను $45^0$ కోణంలో చాపి - పహిల్మాన్‌ల మాదిరి నడిచేవాడు.

అతను కుస్తీకూడా పట్టేవాడు.

ఒకనాడు అతడు కుస్తీ చూడ్డానికి శ్యామ్‌నగర్ జాతరకి వెళ్ళాడు. పహిల్వాన్‌ల కుస్తీలో వాళ్ళ పట్టువిడుపులు చూస్తూ వూరకుండలేక పోయాడు. యవ్వనపు వేడి, మరం వల్ల ఢోలు శబ్దాలకి అతని రక్తనాడులు వేడెక్కాయి. ముందు వెనుకా చూడకుండా కుస్తీలో “సింహం పిల్ల”తో చాలెంజ్ చేశాడు.

ఆసింహం పిల్ల అసలు పేరు చాంద్‌సింగ్. వీడు పంజాబు నుంచి తన గురువు బాదల్ సింగ్ వెంట తొలిసారి శ్యామ్‌నగర్ జాతరకు వచ్చాడు. అందమైన యువకుడు. అతని ప్రతి అంగంలో సౌందర్యం ఉట్టిపడుతూంది. వచ్చిన మూడు దినాల్లోనే పంజాబు మరియు పఠాన్ పహిల్మాన్‌ల దళంలోని తన సరిజోడు పహిల్మాన్‌ల నందరిని నేలకరిపించి, “సింహం పిల్ల” అనే బిరుదును పొందగలిగాడు. అతను కుస్తీ మైదానంలో లంగోటా బిగించి చెంగుచెంగున విజయగర్వంతో హర్షధ్వనులు చేస్తూ గుర్రం పిల్లమాదిరి ఎగురుతూ ఉండేవాడు. అతని దెబ్బకు అక్కడి యువ పహిల్మాన్‌లు అందరూ కుస్తీ మాటంటేనే భయపడేవారు. తన బిరుదును నిలుపుకొనేందుకు చాంద్‌సింగ్ మధ్య మధ్యలో

కుస్తీకి ఎవరైనా ఉంటే రమ్మని కాలు దువ్వేవాడు. వేటలూ, కుస్తీలంటే చెవి కోసుకునే శ్యామ్‌నగర్ వృద్ధమహా రాజా చాంద్‌సింగ్‌ను తన దర్బారులో పహిల్వాన్‌గా ఉంచుకోవాలని అనుకుంటూ ఉండగానే లుట్టన్ అసింహం పిల్లతో పోటీపడతానని చాలెంజ్ చేశాడు. బిరుదు పొందిన చాంద్‌సింగ్ లుట్టన్ చాలెంజ్ విని నవ్వుకున్నాడు. వెంటనే డేగ మాదిరి అతని మీదికి లంఘించాడు.

నిశ్శబ్దంగా ఉన్న ప్రేక్షకుల గుంపులో కలవరం మొదలయింది. "పిచ్చోడు, పిచ్చి ముండాకొడుకు, చచ్చ చచ్చ"... ఓహో! గొప్పోడే. లుట్టన్ చాకచక్యంగా దాడిని తప్పించు కొని లేచి నిలబడ్డాడు. మహారాజు కుస్తీని ఆపుచేయించి లుచ్చన్‌ను తనవద్దకు పిలిపించుకొని సముదాయించాడు. అతని ధైర్యసాహసాలను మెచ్చుకుంటూ 10 రూపాయల నోటు చేతికందించి "పో జాతర చూసి ఇంటికిపో" అన్నాడు.

"లేదు మహారాజా కుస్తీ పడతాను... తమరు ఆజ్ఞాపించండి."

"పో పిచ్చోడా."

"శరీరంలో శక్తి లేకపోయినా సింహం పిల్లతో కుస్తీ పట్టవచ్చావటరా. రాజుగారు ఇంతగా నచ్చజెప్పినా కుస్తీ మానుకోక పోతే నీకు పుట్టగతులుండవు"అని మేనేజరు, భటులు అతన్ని బెదిరించారు.

"మీపైన ఒట్టుదొరా!" మీ ఆజ్ఞయే తరువాయి మహారాజా "కుస్తీ పట్టనివ్వండి దొరా, లేకపోతే ఇక్కడే ఈ రాతికి తలబద్దలు గొట్టుకుని చస్తాను" చేతులు జోడించి వేడుకున్నాడు. గుంపులో కలవరం మొదలయింది. పంజాబు పహిల్వాన్‌ల దళం కోపంతో లుట్టన్‌పైన తిట్ల వర్షాన్ని కురిపించసాగింది. ప్రేక్షకుల్లో ఉత్సాహం పెరిగింది. వాళ్ళల్లో కొందరు లుట్టన్ తరపున కేకలు వేస్తూ అతన్ని కుస్తీ పట్టనివ్వండి అని అరిచారు.

చాంద్‌సింగ్ ఒక్కడే మైదానంలో నవ్వుకుంటూ నిలబడ్డారు. మొదటి పట్టులోనే తన ప్రత్యర్థి శక్తి ఎంతో అతనికి అర్థమయింది.

రాజుగారు గత్యంతరం లేక ఆజ్ఞ జారిచేశారు. "సరే కుస్తీ పట్టండి."

డోలు మోగటం మొదలయింది. ప్రేక్షకుల్లో మళ్లీ ఉత్సాహం పెరిగింది. గుంపులో కోలాహాలం ప్రారంభమయింది.

జాతరలోని దుకాణదారులందరూ దుకాణాలను మూసివేసి "చాంద్‌సింగ్‌కి సమ ఉజ్జీ దొరికాడు. కుస్తీ జరుగుతూంది" అని పరిగెత్తుకుంటూ వచ్చారు.

"చట్‌థా, గిడ్‌థా, చట్‌థా...గిడ్‌థా..." అని ఇంతవరకూ మూగబోయిన డోలు

పెద్దశబ్దంతో పలికింది.

"డాక్ డినా, డాక్‌డినా డాక్‌డినా" అంటే వాహ్, భలే భలే, "శబ్దం చేస్తూ డోలు మోగింది."

చాంద్‌సింగ్ లుట్టన్ సింగ్‌ను గట్టిగా నొక్కి పట్టాడు.

"అయిపోయే! లుట్టన్ సింగ్ బజ్జీ అయిపోయే! సింహం పిల్లతో ఢీకొనడం నవ్వులాటామరి" అని ప్రేక్షకులు చప్పట్లు గొట్టారు.

ఛట్‌గిడ్‌ధా, ఛట్‌గిడ్‌ధా, థట్‌గిడ్‌ధా, (భయపడద్దు, భయపడద్దు, భయపడద్దు) అంటూ డోలు మారుమ్రోగింది.

లుట్టన్‌మెడపైన మోచేతిని ఆనించి నేలపడేసే ప్రయత్నంలో చాంద్‌సింగ్ ఉన్నాడు.

అక్కడే పడెయ్యి, అంటూ బాదల్‌సింగ్ తన శిష్యుణ్ణి ఉత్సాహపరిచాడు.

లుట్టన్ కన్నులు బయటకొచ్చాయి. ఉశ్వాసనిశ్వాసలు ఎక్కువయ్యాయి. గుంపులోని ఎక్కువమంది జనం చాంద్‌సింగ్ పక్షం చేరి అతన్ని ఉత్సాహపరుస్తున్నారు. లుట్టన్ పక్షాన డోలు మాత్రం మోగుతూంది. డోలుమ్రోత ప్రకారం అతను తన ఉత్సాహాన్ని పెంపొందించు కుంటూ తలపడుతున్నాడు. ఉన్నట్టుండి డోలు నెమ్మదిగా మోగసాగింది.

"డక్‌డినా-తిర్‌కట్‌తినా, డక్‌డినా తిర్కట్‌తినా" అంటే పోటీ విరమించుకో, బయట కొచ్చేసేయి. పోటీ విరమించుకో, బయటి కొచ్చేసేయి అని లుట్టన్ సింగ్‌కు డోలు చేసిన ఈ శబ్దాలు వినపడ్డాయి. ఉన్నట్టుండి లుట్టన్ పట్టునుండి జారుగొని బయటికొచ్చి వెంటనే చాంద్‌సింగ్‌పైకి ఉరికి మెడ పట్టేసాడు.

"శభాష్, భలే ! మట్టిలో మాణిక్యంరా!"

"సరే, ఆహా! బయటికొచ్చాడా?" అందువల్లనే కదా జనం లుట్టన్‌వైపు మొగ్గారు.

"ఛటాక్ ఛట్-థా, చటాక్ ఛట్-థా" (ఎత్తి పడెయ్యి,ఎత్తి పడెయ్యి) అని గట్టిగా డోలు మోగింది.

లుట్టన్ చాలా చలాకీగా ఎత్తుకు పై ఎత్తు వేసి చాంద్‌సింగ్‌ను కిందపడేసాడు.

థిగ్ థినా, థిగ్ థినా (వెళ్ళకిలా పడెయ్యి, వెల్లకిలా పడెయ్యి) అని డోలు మోగింది.

లుట్టన్‌సింగ్ శక్తినంతా బిగపట్టి చాంద్‌సింగ్‌ను వెల్లకిలా పడేసి ఓడించాడు.

థాగిడ్‌గిడ్, థాగిడ్‌గిడ్, థాగిడ్‌గిడ్ (శభాష్ పహిల్మాన్, శభాష్ పహిల్మాన్, శభాష్ పహిల్మాన్) అని డోలు మోగింది.

ప్రేక్షకులు ఎవరికి జేజేలు పలకాలో తెలియని స్థితిలో ఉన్నారు. వాళ్లవాళ్ల ఇష్టాను సారం కొంతమంది దుర్గామాతకు జై అంటే మరికొందరు మహా వీరునికి జై పలికారు. మరి కొందరు శ్యామానంద మహా రాజుకు జై పలికారు. ఆఖరికి సామూహంగా జేజేలతో ఆకాశం మారుమ్రోగింది.

విజయోత్సాహంతో లుట్టన్ ఎగురుతూ గంతులేస్తూ, తొడలు చరుస్తూ అందరికంటే ముందు వాద్యగాళ్ల వద్దకు పరుగున వెళ్ళి భక్తిపూర్వకంగా డోలుకు నమస్కరించాడు. తర్వాత పరుగున వెళ్లి రాజుగారిని పైకెత్తుకున్నాడు. రాజుగారి విలువైన దుస్తులకు మట్టి అంటుకుంది. అరే,అరే ఏవిటిది? అని మేనేజరు గారు మందలించారు. రాజుగారు మాత్రం అతన్ని తన హృదయానికి హత్తుకొని ఆనందపారవశ్యంతో "వర్థిల్లు పహిల్మాన్, నీవు ఈ రాజ్య గౌరవాన్ని నిలబెట్టావు" అన్నారు.

పంజాబీ పహిల్వాన్‌లు చాంద్‌సింగ్ కన్నీళ్ళు తుడవసాగారు. రాజుగారు లుట్టన్‌సింగ్‌కు బహుమానాలు ఇవ్వటమేగాక అతన్ని ఆస్థానంలో నియమించుకున్నారు. అప్పటినుంచి లుట్టన్ రాజాస్థానంలో పహిల్మాన్ అయ్యాడు. రాజుగారు గౌరవంగా అతన్ని లుట్టన్‌సింగ్ అని పిలువసాగాడు. కాని మిగతా ఆస్థాన పండితులకు అది నచ్చలేదు. "ప్రభూ! వీడి జాతి ఏమిటి? వీడ్ని సింగ్ అని పిలవటం బాగులేదు" అన్నారు.

మేనేజరు క్షత్రియుడు. తన క్లీన్ షేవ్డ్‌ముఖాన్ని చిట్లిస్తూ ముక్కులోని వెంట్రుకలను లాగసాగాడు. క్షణంలో ఒక వెంట్రుకను లాగేసి దాన్ని నలుపుకొంటూ "అవును మహాప్రభూ, ఇది అన్యాయమే" అన్నాడు.

"అతడు క్షత్రియుడు చేయవలసిన పనే చేశాడు" రాజు చిరునవ్వుతో అన్నాడు.

ఆ రోజు నుంచే లుట్టన్ సింగ్ పహిల్మాన్ కీర్తి ప్రతిష్ఠలు దూర తీరాలకు వ్యాపించాయి. కొద్ది సంవత్సరములలోనే అతను పేరుగాంచిన పహిల్మాన్‌లను ఒక్కొక్కరినే మట్టికరిపించాడు.

అప్పుడు కాలాఖాన్ అనే మరో పేరు పొందిన పహిల్మాన్ ఉండేవాడు. కాలాఖాన్ లంగోటి బిగించి, ఆలే అని ప్రత్యర్థి పైకి ఉరికితే, ప్రత్యర్థికి వణుకు పుట్టేది అని ప్రతీతి. లుట్టన్‌సింగ్ అతన్ని గూడా ఓడించి వాళ్ల భ్రమలను తొలగిం

చాడు.

క్రమంగా అతను ప్రదర్శనశాలలోఒక వస్తువుగా తయారయ్యాడు. జంతు ప్రదర్శనశాలలో ఇనుపబోనును ఊపుతూ పులి గాండ్రించినట్లు అతను హాహూ - హాహూ అని అరిచేవాడు. అతని అరుపులు విని, రాజుగారి పులి అరుస్తూంది అనేవారు.

జాతరలో అతను మోకాళ్ళవరకు అంగీ వేసుకుని, చిందరవందరగా తల పాగా కట్టి, మదించిన ఏనుగుమల్లే పూగుతూ నడిచేవాడు. దుకాణదారులు తమ అంగడివద్దకు పిలిచి, "పహిల్మాన్ గారూ, వేడివేడి రసగుల్లాలు రడీగా ఉన్నాయి నాలుగైదు ఆరగించండి" అని వేళాకోళం చేసేవారు.

లుట్టన్‌సింగ్ పహిల్మాన్ చిన్నపిల్లల మాదిరి నవ్వుకుంటూ అరే నాలుగైదు తింటే ఏమవుతుంది! తీసుకురా ఒకటి, రెండు శేర్లు అని అక్కడే కూర్చునేవాడు.

రెండుశేర్ల రసగుల్లాలు తిని పదిపన్నెండు పాన్‌చిలకలు నోట్లో కుక్కుకుని, గడ్డానికి పాన్ రసాన్ని కార్చుకుంటూ జాతరలో తిరిగేవాడు. జాతర నుంచి రాజ దర్బారుకి తిరిగొచ్చేటప్పటికి అతని ఆకృతే మారిపోయేది. కండ్లకు రంగుల అభ్రకపు కళ్ళజోడు, చేతుల్లో నాట్యం చేసే బొమ్మ, నోట్లో ఇత్తడి పీకను ఊదు కుంటూ, నవ్వుకుంటూ తిరిగొచ్చేవాడు. శారీరక వృద్ధి శక్తిసామర్థ్యాలు పెంపొం దుతున్నాయి. గాని బుద్ధిమాత్రం క్షీణిస్తూ చిన్నపిల్లల స్థాయికి చేరుకుంది. కుస్తీ మైదానంలో డోలు శబ్దం వింటూనే తన స్థూలకాయాన్ని ప్రదర్శించటం ప్రారం భించేవాడు. అతనికి సమఉజ్జీ దొరికేవాడేకాదు. ఒకవేళ ఎవరైనా అతనితో పోటీ పడాలంటే రాజుగారు అనుమతిచ్చేవారు కాదు. అందువల్లే పాపం అతను నిరా శతో లంగోటా బిగించి దేహానికి మట్టిపూసుకుని, ఎగురుతూ గంతులేస్తూ ఉండే వాడు. తనను దున్నపోతూ, ఆంబోతుగా నిరూపించుకుంటూ తిరిగేవాడు. ముస లివాడైన రాజు అతన్ని చూసి మురిసిపోయేవాడు.

ఇలాగ పదునైదేండ్లు గడిచిపోయాయి. పహిల్మాన్ మాత్రం అజేయుడుగా నిలిచిపోయాడు. కుస్తీ మైదానంలోకి లుట్టన్‌సింగ్ తన ఇద్దరు కుమారులను తీసు కుని వచ్చేవాడు. పహిల్మాన్ అత్త ఎప్పుడో మరణించింది. ఇద్దరు పిల్ల పహి ల్మాన్‌లకు జన్మనిచ్చి కొద్దిరోజుల తర్వాత అతని భార్య పరమపదించింది. ఇద్దరు పిల్లలు తండ్రిని మించిన తనయులు అవుతారు అనేవారు.

ఇద్దరిని పిల్లవాండ్లుగా ఉన్నప్పుడే కాబోయే రాజమల్లులుగా ప్రకటించారు. అందువల్ల వారి పోషణభారమంతా రాజదర్బారే చూసేది. ప్రతి రోజు ప్రాతఃకా

లాన్నే పహిల్మాన్ స్వయంగా డోలు వాయిస్తూ పిల్లలచేత కసరత్తు చేయించేవాడు. మధ్యాహ్నంపూట విశ్రమిస్తూనే ఇద్దరికి ప్రపంచ జ్ఞానం బోధించేవాడు. "డోలు ధ్వనులపై దష్టిని కేంద్రీకరించండి. నాకు గురువు ఎవ్వరూ లేరు. ఈ డోలే నాగురువు. ఈడోలు ధ్వనులు ప్రభావం వల్లనే నేను పహిల్మాన్ కాగలిగాను. కుస్తీ మైదానంలో అడుగిడగానే డోలుకు నమస్కారం చేయాలి. తెలిసిందా." .... ఈమాదిరి ఎన్నో విషయాలు బోధించేవాడు. ఇవేకాకుండా రాజును ఏవిధంగా సంతోషపరిచాలి, ఎప్పుడు ఎలా ప్రవర్తించాలి మొదలైన విషయాలను వారికి బోధించేవాడు.

కానీ ఏం లాభం? అతని బోధనలన్ని వ్యర్థమయ్యాయి. రాజు స్వర్గస్థులయ్యారు. రాజకుమారుడు విదేశాలనుంచి తిరిగొచ్చి రాజ్యపరిపాలనా భారాన్ని తన చేతిలోనికి తీసుకున్నాడు. నాన్నగారి కాలంలోని వైఫల్యాలన్నీ తొలగించి కట్టుదిట్టాలు చేశాడు. కొన్ని నూతన మార్పులు చేశాడు. ఈ మార్పులు కారణంగా పహిల్మాన్ గిరి ఊడిపోయింది. కుస్తీ మైదానాన్ని గుర్రపు పందేల మైదానంగా మార్చారు.

పహిల్మాన్ కాబోయే రాజమల్లుల దినసరి భోజన ఖర్చు వివరాలు తెలియగానే 'టెరిబుల్' అన్నాడు క్రొత్తరాజు.

రాజాస్థానంలో ఇంకెంత మాత్రం పహిల్మాన్‌ల అవసరం లేదని స్పష్టంగా హుకుం జారీ చేశారు. పహిల్మాన్‌కు తన గోడు తెలుపుకొనే దానికి కూడా అవకాశం దొరకలేదు.

అదేరోజు డోలును మెడకు తగిలించుకుని కొడుకులను వెంటతీసుకుని పహిల్మాన్ తన ఊరు చేరుకున్నాడు. ఊరిలో ఒకమూల ఊరివారందరూ కలిసి ఒక గుడిసె వేయించి ఇచ్చారు. అక్కడే ఉంటూ ఊరిలోని యువకులకు పశువుల కాపర్లకు కుస్తీ నేర్పుతూ వచ్చాడు. తిండితిప్పలూ ఊరిలో వాళ్ళు చూసేవారు. ఉదయం, సాయంత్రం డోలు వాయిస్తూ శిష్యులకు, తనకొడుకులకు కుస్తీలోని పట్టువిడుపులు నేర్పేవాడు.

ఆ ఊరిలోని రైతుల పిల్లలకూ, వ్యవసాయకూలీలకు పిల్లలకూ సరియైన తిండిలేదు. ఇక కుస్తీ ఎలా నేర్చుగోగలరు? క్రమమక్రమంగా పహిల్మాన్ స్కూలు ఖాళీ అయింది. ఆఖరికి డోలు వాయిస్తూ తన ఇద్దరు కొడుకులకే కుస్తీలోని పట్టువిడుపులు నేర్పూతూ ఉండేవాడు. దినమంతా ఇద్దరు కొడుకులు కూలీనాలీ చేసి సంపాదించే సొమ్ముతో జీవితం గడిపేవారు.

ఉన్నట్లుండి ఆ ఊరికి ఆపద వచ్చిపడింది. అనావృష్టి, తిండిగింజలలేమి, దాని తర్వాత మలేరియా, కలరా రెండు కలిసి పల్లెను సర్వనాశనం చేయసాగాయి.

ఆ ఊరు ఒక విధంగా ఖాళీ అయింది. ఇండ్లకు ఇండ్లు ఖాళీ అయిపోయాయి. ప్రతి రోజూ ఇద్దరు ముగ్గురు శవాలుగా మారేవారు. పల్లెవాసుల్లో కలవరం మొదలయింది. రోజంతా కలవరం, వ్యాకులత, హృదయాన్ని కరిగించే ఏడ్పులతో గడిచిపోగా, ప్రజల ముఖాల్లో సూర్యుని వెలుగుతో పాటు కొంచెం వెలుగు కనపడేది. సూర్యోదయం అవుతూనే ఏడుస్తూ, మొత్తుకుంటూ తమ ఇండ్లనుంచి బయటికొచ్చి ఇరుగుపొరుగు వారితో, బంధువులతో కలిసి పరస్పరం ధైర్యం చెప్పుకొనేవారు.

"ఇప్పుడు ఏడ్చి ఏమిలాభం కోడలా, పోయనవాడు పోయాడు. వాడు నీవాడు కాదనుకో. ముందు జరగవలసిన దానిని గురించి ఆలోచించుకో," అని.

"తమ్ముడూ! ఇంట్లో శవాన్ని పెట్టుకొని ఎంతకాలం ఏడుస్తావు? శవంపై కప్పే దానికి గుడ్డ కావాలంటావా, దాని అవసరం ఏవిటి? శవాన్ని నదిలో కలిపేసి రారాదా" అనే మాటలు ఊరంతా వినిపించేవి.

సూర్యాస్తమయం అవుతూనే ఊరివారంతా తమతమ గుడిసెలలో దూరి నిశ్శబ్దంగా పడివుంటారు. మాట్లాడే శక్తి కూడా అప్పుడు వాళ్ళకు ఉండదు. తల్లి పక్కనే ప్రాణాలు కోల్పోతున్న కొడుకును, కొడుకా అని పిలిచే ధైర్యం కూడా తల్లులకుండదు.

రాత్రి భీకర నీరవస్తబ్దతను పహిల్వాన్ డోలు మాత్రమే గట్టిగా మోగుతూ చాలెంజ్ చేస్తూంది. సాయంకాలం నుండి ఉదయం వరకు డోలు ఏదోవిధంగా మోగుతూ ఆ పల్లెలో చావటానికి సిద్ధంగా ఉన్నవాండ్లకూ, మందులు మాకులూ లేక తిండితిప్పలు లేని మనుషులకు సంజీవిని శక్తిగా పనికొచ్చేది. పిల్లల యువకుల, వృద్ధుల శుష్కించిన నేత్రాలలో అప్పుడప్పుడూ కుస్తీ మైదానంలోని దృశ్యాలు తాండవిస్తాయి. స్పందన, శక్తిలేని నరాల్లో విద్యుత్తు ప్రవహిస్తుంది. ఆపే శక్తి లేకపోవచ్చు కాని చనిపోయేవాళ్లు కళ్లుమూసే సమయంలో వాళ్లకు ఏలాంటి కష్టాన్ని కలిగించకుండా, మృత్యుకూపంలోకి పోయేటప్పుడు ఏలాంటి భయం కలుగకుండా డోలు శబ్దాలు పనికొచ్చేవి.

పహిల్వాన్ కొడుకులు యముని పాశంలో చిక్కుకొని భరించలేని బాధతో కొట్టుమిట్టాడుతూ "నాన్నా, ఎత్తి పడేయి" అన్న తాళాన్ని వాయించండి అన్నారు.

"చటాక్-చట్‌థా, చటాక్-చట్‌థా" తాళాన్ని రాత్రంతా డోలుపైన పహిల్మా న్‌వాయిస్తున్నాడు. మధ్యమధ్యలో పహిల్మాన్‌ల భాషలో వీరులారా ప్రత్యర్థిని ఓడించండి అంటూ ఉత్సాహపరుస్తున్నాడు.

తెల్లవారేసరికి ఇద్దరి కొడుకులను అపస్మారక స్థితిలో నేలపై పడివుండటం చూశాడు. ఇద్దరూ బోర్లాపడివున్నారు. ఒకడు మట్టిలో కూరుకుపోయి వున్నాడు. దీర్ఘ ఉచ్ఛ్వాస తీసుకొని నవ్వే ప్రయత్నంలో పహిల్మాన్ "ఇద్దరు వీరులూ మట్టి కరిచారా!" అన్నాడు.

ఆ రోజు పహిల్మాన్ శ్యామానంద రాజుగారిచ్చిన పట్టు లంగోటా ధరించి వున్నాడు. శరీరమంతా మట్టిపులుముకొని కసరత్తు చేశాడు. తర్వాత ఇద్దరు కొడుకులను భుజాలపైన వేసుకొని నదిలో పారేసి వచ్చాడు. ఈ విషయంవిని పల్లెవాసులు ఆశ్చర్యచకితులయ్యారు. వాళ్లు భయభ్రాంతులయ్యారు.

ఇంత జరిగినప్పటికీ రోజూ ఆ పహిల్మాన్‌వి డోలు శబ్దాలు రోజూ మాదిరి వినపడసాగాయి. ప్రజల్లో ధైర్యం పుంజుకోసాగింది. "ఇద్దరు కొడుకులు గతించారు. అయినప్పటికి పహిల్మాన్ ధైర్యం చూడండి. ఈ తని గుండె నిబ్బరం చూడండి" తమ సంతానాన్ని పోగొట్టుకున్న తల్లిదండ్రులు అనుకున్నారు.

నాలుగైదు రోజుల తర్వాత ఒకనాటి రాత్రి డోలు శబ్దాలు వినపడలేదు. డోలు మూగపోయింది.

పహిల్మాన్‌ని రోగగ్రస్తులైన కొంతమంది శిష్యులు ఉదయాన్నే పోయిచూడగా పహిల్మాన్ శవం వెల్లకిలా పడివుంది. రాత్రి నక్కలు బలిష్ఠమైన అతని ఎడమ తొడ మాంసం తినేశాయి. కడుపును కూడా చీల్చాయి.

"నేను చనిపోతే చితిపైన నన్ను వెల్లకిలా పడుకోబెట్టండి. నేను జీవితంలో ఎప్పుడూ బోర్లా పడలేదు. చితికి నిప్పంటించేటప్పుడు డోలు వాయించండి" అని అంటూండే వారు మన గురువుగారు అని కన్నీళ్ళు తుడుచుకుంటూ అతని శిష్యుల్లో ఒకడన్నాడు.

పక్కనే డోలు దొర్లిపడివుంది. నక్కలు డోలును తినే వస్తువు అనుకొని దాని చర్మాన్ని చీల్చేసాయి.

(1944)

# పార్టీ - పిశాచి

"బెంబేలెత్తి పోతాను మిత్రులెవరైనా కనబడితే
అడుగుతారేమోనని మీరే పార్టీ వారని."

ఎండి కట్టె అయిపోయాను. కళ్ళు లోతుకు పీక్కుపోయాయి. జుట్టు పెరిగి పోయింది. పైజామా చిరిగి పోయింది. చెప్పులు తెగిపోయాయి ముఖం ప్రేమపిచ్చాడి మాదిరి తయారయింది. పగలు ఏమి స్ఫురించదు. రాత్రిళ్లు నిద్రరాదు. ఒకవేళ నిద్ర వచ్చినా దుస్వప్నాల వల్ల ఉలిక్కిపడి లేస్తాను. ఇది ఒక రోగమని మీరనుకోవచ్చు. కాదు రోగమయివుంటే సోమరిలాగా వుంటూ నయమయ్యేటంతవరకూ హాయిగా పడుకొనేవాడిని. ఇదేమో రాంచీకి (రాంచీలో పిచ్చాసుపత్రి వుంది) ప్రయాణం కట్టించే రోగంగా వున్నట్లుంది. రాంచీకి ప్రయాణం కట్టే రోజులు దగ్గరికొచ్చాయి కాబట్టి నేను నారోగాన్ని గురించి బట్టబయలు చేయడం నావిద్యుక్త ధర్మమనుకుంటున్నాను. ఎందువల్లనంటే తర్వాత "నీవెక్కడో, నేనెక్కడో" అనే దశరావచ్చు. అసలు విషయం ఏమిటంటే నాతలపైన పార్టీ-పిశాచి తాండవిస్తున్నది. ఇది నన్ను ఎందుకూ పనికిరాని వానిగా చేసేసింది. చిన్నతనంనుంచే నన్నది పట్టి పీడిస్తున్నది.

బడిలో చదువుకునే రోజులనుంచి నాకథ ప్రారంభిస్తాను.

ఒకరోజు నాన్నదగ్గర కూర్చుని "ఆమోదపాఠం" చదువుతున్నాను. బడిపంతులు వచ్చాడు. చాలాసేపటి వరకూ ఆమాటా, ఈమాటా మాట్లాడి అతను పండ్లికిలిస్తూ వినయంగా ఇలా అన్నాడు. "కక్షలూ, కార్పణ్యాలూ ఉంటే మీమధ్య ఉన్నాయి. దీంట్లో నాతప్పేముంది. మీరు - మీరేమో పెద్దమనుషులు. ఒక అడవిలో రెండు సింహాలు ఉన్నట్లు ఈ ఊరిలో మీరిద్దరూ సరేసరి. ఇదంతా దేవుడి మాయ. కానీ ఈ బడి అతనిది (మీప్రతి పక్ష పార్టీ అతనిది)" మాత్రం కాదు కదా. బడిలో నేను బడిపంతులిని. ఇతర పిల్లల మాదిరే నాకు మీపిల్లవాడు...

"మీకు తెలియదు పంతులూ" నాన్న, పంతుల మాట కద్దొచ్చి ఇలా అన్నారు, "బడీ ఆపార్టీ వాళ్ళదే. మాపిల్లవాని మాట అటుంచి ఊళ్లోని పిల్లలెవరూ బడికి వెళ్లకపోతే అది మాపార్టీకి అగౌరవం అంటారా?"

పంతులు పండ్లికిలిస్తూనే "అవును మరి అవును మరి నేనేమో...మీరు నామాటనమ్మండి...నేను మీసేవ చేయాలనుకుంటున్నాను" అని అన్నాడు. పంతులుగారు అటూయిటూ చూసి దగ్గి,గొంతు సరిచేసుకుంటూ నెమ్మదిగా ఏదో అన్నాడు. ఫలితంగా నాకూ, ఊళ్లోని మిగతా పిల్లవాళ్ళకు బడికి వెళ్లే అనుమతి లభించింది.

మరుసటిరోజు మిగతా మిత్రులతో పాటు నేను బడిలో అడుగుపెట్టాను. ఊరిలో ఇరుగుపొరుగు వాళ్లల్లో, వీధి వీధిల్లో, చుట్టపక్కాలలో అయినోళ్లల్లో, పోయినోళ్లల్లో, కోర్టులోని బార్ లైబ్రరీలో ఈ విషయం విద్యుత్తు మాదిరి వ్యాపించింది. రకరకాల ప్రశ్నలు మొదలయ్యాయి.

"అంటే ఇప్పుడు ఊళ్లో ఐకమత్యం వచ్చేసిందా?" అంటూ తప్పుడు సాక్ష్యాలిచ్చేవాళ్లు తమ తలలు కొట్టుకున్నారు.

"అంటే ఇప్పుడు ఈ ఇరువర్గాల్లో పెండ్లి-పేరంటాలు విందుభోజనాలు జరుగుతాయా?" బంధుమిత్రుల కడుపుల్లో ఉబలాటం మొదలయ్యింది.

"ఇప్పుడు కోర్టులో నడుస్తున్న క్రిమినల్ కేసులను ఉపసంహరించుకుంటారా?" అని వకీళ్లల్లో మొదలయ్యింది.

కానీ అవేమీ కాలేదు. మునుపటిలాగానే పార్టీలు పనిచేస్తూనే ఉన్నాయి. బడిలోగూడా రెండు పార్టీలేర్పడ్డాయి. సెలవుల తర్వాత రాళ్లు రువ్వుకోవడం, చిన్న చిన్న తగాదాలూ, కొట్లాటలూ మొదలయ్యాయి. పంతులుగారి బెత్తం దెబ్బకు పరిస్థితి కొద్దోగొప్పో సద్దుమనిగేది. ఈ కొట్లాటల్లో నేను జోక్యం చేసుకోకపోయినా, పంతులుగారి బెత్తపు దెబ్బలు నేను తినకపోయినా నేను మాత్రం లోలోపల నా పార్టీ విజయాన్ని కోరుకునేవాణ్ణి. సలహాలు గూడా ఇస్తూవుండేవాడిని. కాబట్టి మాపార్టీవాళ్లు నన్ను హీరోగా ఊహించుకొనేవారు.

పరిస్థితి ఇలా వుండగా ప్రత్యర్థి పార్టీకి చెందిన ఒకేఒక విద్యార్థిని 'చందూ'అనే అమ్మాయి బడిలో అడుగుపెట్టింది. అదేరోజున గిల్లికజ్జాలు, కొట్లాటలవల్ల ఏమి ప్రయోజనం ఉండదని నేను మాపార్టీ వాళ్లకు నచ్చజెప్పాను. ఆరోజునుంచి కొట్లాటలు, ఘర్షనలు బందయ్యాయి. ఆపార్టీ తరపునుంచే ఒకటి రెండుసార్లు కయ్యానికి కాలుదువ్వే ప్రయత్నాలు జరిగాయి. కానీ మాపార్టీ నిర్ణయాన్ని చూసి

హతోస్సాహులై ఆపార్టీవారు వూరుకున్నారు (ఆపార్టీవాళ్లు నిరుత్సాహం చెందారు! నీళ్ళుకారిపోయారు).

ఆ రోజుల్లో చందూపట్ల నేనెందుకు ఆకర్షితునయ్యానో, సెక్స్ విజ్ఞాన పుస్త కాలు చిదివిన తర్వాత ఇప్పుడు అర్థమౌతున్నది. లైలా-మజ్నూ కథ మాటెక్ట్స్ బుక్‌లో లేదనుకోండి, కానీ 'ఇతిహాస్ కథామాల'లో పృథ్వీరాజ్ - సంయుక్తగాథ నేను చదివాను. పృథ్వీరాజ్ మాదిరి నేను చందూను పొందాలని అనుకునేవాడి ఫి. ఒకరోజు ఏకాంతంగా చందూను కలిసి "చందూ! పృథ్వీరాజు-సంయుక్త కథ..."అని అన్నాను.

"నాతో మాట్లాడకు. నీవు ఆపార్టీవాడివి" అని నన్ను దబాయించింది.

"కాదు కాదు. నేనాపార్టీవాడినికాను" నేను వినయంగా చెప్పుకొన్నాను.

"అయితే?" ఆమె వెళ్ళబోతూ ఆగిపోయింది.

"నేను మీపార్టీవాడినె" అన్నాను.

"నిజంగానా?" ఆమె నావద్దకు వచ్చింది. నేను ఆమె చెయ్యిపట్టుకొని "నిజం గానే" అన్నాను.

అక్కడ చెట్లమధ్య కండపుష్టిగల మాపార్టీకిచెందిన 'రజన' అనే రౌడీ దాగి యున్నాడు. వాడు బయటికి వచ్చి పళ్ళు నూరుతూ, "మోసగాడా " అన్నాడు.

నాసంయుక్త - పృథ్వీరాజ్ కథ మధ్యలోనే ఆగిపోయింది. చందూ నాచే తులు విడిపించుకొని వెళ్ళిపోయింది. చరిత్రలో రాముడి కథ చదివేవాళ్లు కూడా పృథ్వీరాజ్ అనేదానికి బదులు నన్ను జయచంద్ అనటం మొదలుపెట్టారు.

హైస్కూలు-

ఊరిబడి చదువులు ముగించుకొని పట్నంవచ్చి హైస్కూలులో చేరాను. అదృష్టమో, దురదృష్టమో మానాన్నగారి వకీలు ఒక బెంగాలీ మొషాయ్ అక్క డుండేవాడు. నేను తన క్లైన్టు కొడుకును కాబట్టి నన్ను అతను ఎంతో ఉత్స త్సాహంగా తన ఇంట్లో ఉంచుకున్నాడు. బెంగాలీలతో అధిక సన్నిహితంగా కలి సిపోవటంతో పాటు బెంగాలీ భాష, బెంగాలీ సంగీతం పట్ల నేను ఆకర్షితుణ్ణి య్యాను. రెండు మూడు సంవత్సరాల తర్వాత నాకే ఆశ్చర్యమేసింది, "నేను నాన్-బెంగాలీనా అని," కొద్దిరోజుల తర్వాత బెంగాలీ, నాన్‌బెంగాలీ తగాదా అక్కడ ప్రారంభమయ్యింది. ఇరు పక్షాలనుండి తిట్లవర్షం మొదలయింది.

"బెంగాలీ జాతి పిరికిజాతి. నీచజాతి" అనేవాళ్లు నాన్-బెంగాలీలు.

"ఛాతూ ఖోర్ (సత్తూ * తినేవాళ్లు), పల్లెటూరి జనం" అని బెంగాలీలు జవాబు చెప్పేవారు.

నాన్-బెంగాలీలు కోపోద్రిక్తులయ్యేవారు. ఆతిట్లు విని నేను చాలా బాధపడే వాడిని. ఆఖరికి రవీంద్రుడు, జగదీష్‌చంద్రబోసు, శరత్, సుభాష్ వీరందరూ బెంగాలీలే కదా!

బెంగాలీలు మాత్రం తక్కువా, వీరొకటంటే వాళ్లు రెండంటారు. నాలోని 'నాన్-బెంగాలీ,' బెంగాలీలను దబాయించేవాడు.

బెంగాలీ మిత్రులు నన్ను గురించి ఈవిధంగా అభిప్రాయం వ్యక్తం చేసేవా రు.

"ఏది ఏమైనప్పటికి ఆఖరికి హిందూస్తానీ, హిందూస్తానీయే కదా!"

నాన్-బెంగాలీ మిత్రులు నావీపుపై గుచ్చుతూ "చూశాం గదా వీడి దోస్తీ ఎంత నమ్మకద్రోహి..." అనేవారు.

"నోరుముయ్యండిరా!" అని వాళ్లను గద్దించి నోరుమూయించేవాడిని.

ఇదాసంగతి అని నాన్-బెంగాలీలందరూ కలిసికట్టుగా నాపై విరుచుకుపడే వాళ్లు. "బెంగాలీల తిట్లంటే పర్వాలేదు. ఎందువల్లంటే వారు తమ ప్రాంతీయ అభిమానంతో అలా అంటారు. కానీ నాన్-బెంగాలీ అయివుండి కూడా బెంగాలీల పక్షం వహించేవాడు. మోసగాడు, నమ్మకద్రోహి మీర్‌జాఫర్ ఇటువంటి వ్యక్తితో మనం ఏలాంటి సంబంధం పెట్టుకోరాదు" అని తీర్మానం కూడా చేసుకున్నారు.

ఇక కాలేజి కథ కొంచెం పెద్దదే. అయినప్పటికి ఆసక్తికరమైంది.

స్కూల్‌నుంచి ఇలాంటి విశేషణాలు జోడించిన పేర్లతో కాలేజీలో ప్రవేశిం చాను. ప్రాంతీయ దురభిమానంలో పడరాదని ముందుగా నేను ప్రతిజ్ఞచేసుకు న్నాను.

ఫస్ట్‌ఇయర్ చూస్తూచూస్తూనే గడిచిపోయింది. సెకండియర్‌కు వచ్చిన తర్వాత వేషంలో మార్పు చేసుకోవాలనుకున్నాను. అంటే పెద్ద మార్పేమి కాదు. పంచ కట్టడం మానేసి పైజామా, కుర్తా వేసుకోవడం మొదలెట్టాను. మంచిరోజు చూసు కొని కొత్త దుస్తులు ధరించి జట్కాలో సినిమా థియేటరుకు వెళ్లాను. జట్కాలో నాతోపాటు వస్తున్న పెద్దమనిషి నాపేరు, ఊరు,చదువుతున్న కాలేజి, ఇయర్,

---

* వేయించిన శనిగల పొడిని సత్తూ అంటారు. బిహారులో నివసించే పేదవాండ్లు ఈసత్తూ తిని కడుపు నింపుకుంటారు.

గ్రూపు, హాస్టల్‌లో రూము నెంబరు అన్నీ వాకబు చేసికొన్నతర్వాత, "నీవు ఏపార్టీకి చెందిన వాడివి" అని అడిగాడు.

నేను కొంచెం గాబరాబడ్డాను.

"సి.పి. (కమ్యూనిస్టు పార్టీ)నా?" అంటూ నవ్వాడు.

అతనితో ఎక్కువ మాట్లాడటం ఇష్టంలేక "అవునండి" అన్నాను.

"ఐసీ..." అంటూ వికట నవ్వునవ్వి జోరుగా చెంపదెబ్బకొట్టాడు. నేను ఎగిరిపడ్డాను.

"మనం కామ్రేడ్స్‌ము. భయపడకు" అంటూ ఆయన నాభుజం మీద చెయ్యేసాడు.

ఆరోజు "హోటల్ కాశ్మీరీ క్యాంటిన్" బిల్లు అతనే చెల్లించి, ఫస్ట్‌క్లాస్ సినిమా టికెట్ కూడా కొన్నాడు.

మరుసటిరోజు క్లాస్‌లోకి వెళ్తూనే "భలే, పక్కా సోషలిస్టు మాదిరి కనపడుతున్నావంటూ" నాఅంతరంగ మిత్రుడు వినోద్ నవ్వాడు.

సరే. నీ ఇష్టం ఏమైనా అనుకో అన్నాను.

"ఏమైనా అనుకోవటం కాదు. నీవు అవ్వాలి" వినోద్ అన్నాడు.

ఆశ్చర్యంతో "ఏం అవ్వాలి?" అని అడిగాను.

"ఇంకేమిటి మెంబరు అవ్వాలి. నీకు పార్టీ పాలిటిక్సుతో సంబంధంలేదని నేననుకొన్నాను. కానీ నీవు సామాన్యుడివి కాదు" అని నవ్వాడు.

నాలోని ఏగుణాలను చూసి వినోద్ పార్టీ పాలిటిక్సుతో ఆసక్తి ఉన్నట్లు అనుకొన్నాడో ఇప్పటివరకూ నాకు బోధపడలేదు. ఏదీ ఏమైనా స్టూడెంట్ ఫెడరేషన్ (కమ్యూనిస్టు గ్రూపు) రిజిష్టరులో నాపేరు నమోదయిన నాడే నేను స్టూడెంట్ ఫెడరేషన్ (సోషలిష్టు గ్రూపు) వర్కింగు కమీటిలో మెంబరుగా నామినేట్ అయ్యానని కూడా వార్త అందింది.

పై రెండు పార్టీల వరకే పరిమితమయ్యుంటే ఎలాంటి ఇబ్బందీ ఉండేది కాదేమో. కాని ఒక రోజు మూడో పార్టీలో ఇరుక్కుపోయాను.

'కల్‌కటా కెఫే'లో కూర్చుని టీ తాగుతున్నాను. నాచేతిలో బెంగాలీ మాసపత్రిక ఉంది నాపక్కన నావయస్కుడే టీ తాగుతున్నాడు. అతను నావైపు నాచేతిలో వున్న పత్రిక వైపు తదేకంగా చూస్తున్నాడు. ఆఖరికి అడగనే అడిగాడు. మీరు బెంగాలీలా? 'ఛాతూ (సత్తూ) ఖోర్' బిరుదు రాకుండా చూసుకోవాలని అవునన్నాను.

"అలాగా! ఇక్కడ చదువుతున్నారా? ఏమి చదువుతున్నారు?"

"సెకండియర్ ఆర్ట్స్."

'వెరీగుడ్' అని ఒక మూల కూర్చొని ఏదో వాదించుకుంటున్న యువకులను పిల్చి, "ఓయ్, హాబు, ఖోలా, కాలూ, నీలూ, ఫేలా! మీరు ఆవేళ అన్నారు కదా, సెంకడియర్ ఆర్ట్సులో మన మెంబరు ఎవరూ లేరని. ఇదుగో ఇతనున్నాడు" అన్నాడు.

"ఒహో! సరేసరి మంచిది" అంటూ వారందరూ తమ చర్చ చాలించి పరిగెత్తుకుంటూ వచ్చి నాచుట్టూ కూర్చున్నారు. మరలా టీకి ఆర్డరిచ్చారు. మాటలు కొనసాగాయి. తర్వాత కలుసుకొని చర్చించుకొని, మరల కలుసుకోవాలని నిశ్చయించుకొన్నాము. ఆర్గనైజేషన్ ఏర్పరచుకోవాలని నిశ్చయించుకున్నాము. అన్నింటికంటే విచిత్రమైన విషయమేమిటంటే నేను వాళ్ల పార్టీ పేరు తెలుసుకోకుండానే అన్నింటికి తలవూపాను. వాళ్ళల్లో ఒక యువకుడు మేనేజరు వద్దకు వెళ్లి మాట్లాడి వచ్చి నాతో నెమ్మదిగా "ఈ వేళ నుంచే ఇక్కడ నీకు కన్సెషను దొరుకుతుంది. సరేనా! ఇది మన పార్టీకేఫ్... ఇతను మన పార్టీ మెంబరు తెలిసింది కదా" అని అన్నాడు.

ఆరోజు నుండి 'ఫార్‌వర్డ్ బ్లాక్' పేరుతో కల్‌కటా కెఫేలో కన్సెషన్ రేటుపైన నేను చాయ్, కట్‌లెట్‌లు పొందగలిగాను. ఆదివారం రూములో పడుకొని 'గోదాన్' నవల చదువుతుండగా వినోద్ ఉత్సాహంతో నావద్దకు వచ్చి "ఓ వర్కింగు కమిటీ మెంబరుగారు, ఈ రోజు కామ్రేడ్ రామ్‌ప్రతాప్ వస్తున్నారు. ఈ వేళ నాలుగు గంటలకు కమిటీ అర్జంటు మీటింగుంది తెలుసా. రేపు పార్కులో బహిరంగ సభ జరుగుతుంది...ఇదేమిటి, గోదాన్ చదువుతున్నావా? అరే సిల్లీథింగ్" అన్నాడు.

"ఎందుకని?" నేను ఆశ్చర్యంగా అడిగాను.

"ఇటీజ్ యే రియాక్షనరీబుక్!... సరే నాలుగు గంటలకు వస్తున్నావు గదా" అంటూ ఎలాగ వచ్చాడో అలాగే ఆదుర్దాగా ఆత్రుతతో వెళ్ళిపోయాడు. డిక్షనరీ తీసుకుని రియాక్షనరీకి అర్థమేమిటో చూడసాగాను.

సరిగ్గా 3½ గంటలకు తయారై నేను బయలుదేరాను. గేటువద్ద అందమైన అప్‌టుడేట్ యువతి ఒకావిడ తోటమాలితో ఏదో వాకబు చేస్తుంది. నేను ఎలాగున్నానో, ఎలా కనబడుతున్నానో అని నన్ను నేను క్రిందనుండి పైవరకూ చూసుకున్నాను. తోటమాలి నన్ను చూసి ఆమెతో 'వీరే' నన్నాడు. ఆమె నవ్వుతూ నావ

ద్దకు చేరి కమ్యూనిస్టుల మాదిరి నన్ను విష్‌చేసి ఒక ఉత్తరం నాచేతికి అందిస్తూ అర్జెంట్‌లెటర్ అన్నది. నేను కవరిప్పి చదువుకొన్నాను... "సోషలిస్టు లీడరు రామప్రతాప్ వస్తున్నారు. నాలుగుస్టేషన్లలో అతనికి నల్లజెండాలు చూపాలని మనపార్టీ తీర్మానం పాస్ చేసింది. మీరు 'మిస్ రోస్మా' వెంటవెంటనే బయలు దేరి వెళ్ళండి. రేపు ప్రొద్దుట నుంచే అక్కడి పార్టీ మెంబర్లను వెంటతీసుకొని ప్లాట్‌ఫారం మీద నిలబడండి. పంజాబ్ మెయిల్ వస్తూనే 'రామ్‌ప్రతాప్ ముర్దా బాద్' మున్నగు పార్టీ నినాదాలతో నల్లజెండాలు చూపించండి...సెక్రెటరీ." లెటర్ చదవడం పూర్తిచేసి ప్రత్యభివాదనం చేయాలని కళ్ళు పైకెత్తగా నాశరీరమంతా పులకరించింది. మిస్ రోస్మా లాంటి అందమైన యువతినాకొరకు కాంక్షతో చూస్తూం టుందని నాకు కలలోగూడా ఆలోచన రాలేదు. నెపోలియన్ మహా మేధావని అప్పుడు నాకర్థమైంది. నేను మరొకమారు ఆమెవైపు చూశాను. ఆమెనవ్వుతూ, "వస్తు న్నారు కదా" అని కలకండకంటే తియ్యనైన స్వరంతో పలికింది.

నేను ఉషారుగా, మత్తుగా 'పద' అన్నాను.

జట్కాలో కూర్చుని మేమిద్దరం స్టేషనుకుబయలుదేరాము. కొద్దిక్షణాల తర్వాత తేరుకొన్నాను - "నేను ఏమి చేయబోతున్నాను. నాహృదయాంతరాలలో శ్రద్ధా భక్తులున్న వ్యక్తిని అవమానపరచడమా? అదీ ఏకారణం లేకుండానే? వద్దు వద్దు నేనీ పనిచేయలేను."

"మీరు సిగరెట్ కాల్చరా?"

"మీరు సిగరెట్ కాల్చరా" రెండోమారు ఆమె అంది.

"ఆ...లేదు." తిరిగి నేను మామూలు స్థితికి చేరుకొన్నాను.

"ఆమె నాకళ్ళల్లో కళ్ళ పెట్టి ఏమాలోచిస్తున్నారు కామ్రేడ్‌గారూ?" అన్నది.

"నేను, నేనా...ఏమీ ఆలోచించటంలేదే" అంటూ తలదించుకొన్నాను.

"లేదు. నేన్నమ్మను. మీరు ఏదో ఆలోచిస్తున్నారు. మీమనసులోని మాట నాదగ్గరెందుకు దాస్తారు?"

"పోనిలెండి. మీరేమి ఆలోచిస్తే నాకేమి?... మీరు సిగరెట్...బొత్తిగా సిగరెట్ కాల్చరా?"

"అవును, బొత్తిగా అంటే అసలే కాదు. కాల్చే అలవాటులేదు. అంటే నేను హాబిట్యుయేటెడ్ కాదు."

"ఐతే సిగరెట్ కాల్చరాదా" అంటూ బ్రతిమాలినట్లు అడిగింది.

జట్కావాడు దిగి సిగరెట్‌టిన్ ఒకటి తెచ్చిచ్చాడు. టిన్ను మూత తెరిచి ఒక

సిగరెట్‌ప్రేమతో నాకందిస్తూ అగ్గిపుల్ల గీసి అంటించింది. సిగరెట్ కాలుస్తూ "మరి మీరో?" అన్నాను.

"నేను తాగను" ఏదో సినీ స్టార్ మాదిరి ఆమె వయ్యారంగా తల ఆడించింది. నేను నోరు తెరుచుకొని చూస్తూ ఉండిపోయాను.

"మీరెందుకు ఆశ్చర్యపోతున్నారో నాకు తెలుసు. కొన్ని వస్తువుల పట్ల నాకు కొన్ని నిశ్చిత అభిప్రాయాలున్నాయి." అంటూ వయ్యారంగా నవ్వింది. మీరడగండి చెప్తాను అన్నట్లుంది ఆమె నవ్వు.

"అంటే, ఉదాహరణకు?" నేను సిగరెట్ పొగ వదులుతూ అడిగాను.

"పొగ అటువైపు ఎందుకు వదులుతున్నారు?" అని ఆమె రెప్పిపాడిసింది.

"అంటే ఎటు వదలాలి?" "నావైపు వదలండి" చిలిపిగా అడిగింది.

"మీవైపా?"

"అవును నావైపే. నాకు కొన్ని నిశ్చిత అభిప్రాయాలున్నాయని ముందే చెప్పాను కదా! సిగరెట్ విషయమే తీసుకోండి. సిగరెట్ కాల్చని పురుషుని వాసన నాకు గిట్టదు. సిగరెట్ పురుషులు కాల్చే వస్తువు. దాని వాసన స్త్రీలకు రుచించాలి." ఈవిధంగా తన అభిప్రాయాలలో మొదటి అభిప్రాయాన్ని చాలా గంభీరంగా వ్యక్తం చేసింది. ఈ విడగారి సిగరెట్ ఫిలాసఫీ గురించి ఆలోచిస్తూ నేను ఈ ప్రపంచాన్నే మరిచిపోయాను. "నేను నా రెండవ అభిప్రాయం చెప్పను" చిలిపిగా నవ్వుతూ అంది. ఆనవ్వు, "నేను అలిగాను. నన్ను ప్రాధేయపడు ప్రియుడా" అన్నట్లు వుంది.

"చెప్పరాదూ?" నాకంఠస్వరంలో కూడా మత్తుగా మార్పు వచ్చింది.

"సరే ఇప్పుడు మీరేమి ఆలోచిస్తున్నారో ముందు నాకు చెప్పండి."

నేను...నేను...

"ఆ...ఆ...చెప్పండి."

"ఏమని చెప్పేది?"నేనామెవైపు చూసి చిన్నగా నవ్వాను. "మీరు భలేవారే. ఎవరో కొత్తమామూలు మెంబరు మాదిరి వ్యవహరిస్తున్నారే" "నేను ఏమనుకుంటు న్నానంటే నేను...మీ...మీరు."

"చాలు, నాకర్థమైంది. " అంటూ ఆమె కిలకిలా నవ్వింది. చాలాసేపటి తర్వాత ప్రపంచం, రోడ్డు వచ్చేపోయేవాళ్లు, అంగడి , జట్కావాలా గుర్తుకొచ్చేరు. నిశ్చేష్టుడనై నేను అటువైపు చూడసాగేను.

"అటువైపేంచేస్తున్నారు? ఇతరులను ఆట పట్టించటంలో మీరారితేరిన వారే.

నన్ను పరీక్షించాలనుకుంటున్నారా? నా రెండవ అభిప్రాయం పురుషుల గడ్డానికి సంబధించినది. నాకు డైలీ షేవ్... ప్రతిరోజు గడ్డం చేసుకోవటం పట్ల మక్కువలేదు. రోజు మార్చి రోజు గీచిన గడ్డమైతేనే..."

'సిగరెట్ పొగ ఫిలాసఫీ' కంటే ఈ గడ్డం ఫిలాసఫీ, నాకు గొప్పగా అనిపించలేదు. నాకు పైనుంచి కిందికి దమ్ అని దూకినట్లనిపించింది. 'మైగాడ్' నానోటి నుంచి వెలువడింది. మేము కమ్యూనిస్టులమన్న సంగతి గుర్తుకు రాగానే భగవంతుని దయవల్ల వెనువెంటనే 'రేజ్' అని వాక్యాన్ని పూర్తిచేశాను.

'మైగాడ్ రేజ్ అంటే?' ఆమె అడిగింది.

"గాడ్‌రేజ్!గాడ్‌రేజ్ నంబర్ వన్ చెవి ట్రేడ్‌మార్క్ స్వదేశీ వస్తువు...అంటే గాడ్‌రేజ్ చెవి స్టిక్" అని జవాబిచ్చి నాసమయస్ఫూర్తికి నన్ను నేనే మెచ్చుకొన్నాను.

"ఓహో, నాగడ్డాన్ని గురించిన అభిప్రాయం విని మీకు షేవింగు స్టిక్కు గుర్తొచ్చిందన్నమాట. మీరు గాడ్రేజ్ వాడుతారా?"

'అవును.' ముక్తసరిగా జవాబిచ్చాను.

'కానీ...'

జట్కా స్టేషను చేరుకుంది. బాబుగారు, బండి ప్లాట్‌ఫారమ్ పైకి వచ్చేసిందని మధ్యలో జోక్యం చేసుకున్నాడు ఆజట్కావాలా.

రైలుబండిలో కూర్చుని కూలీకి డబ్బులు ఇవ్వకముందే ఆమె సిగరెట్ టిన్ను నాచేతికి అందించింది. రైలుకూత కూసింది. నేను ఉఫ్‌ని సిగరెట్ పొగ కిటికీ ద్వారా బయటికి వదిలాను ఇంతలోనే నాతప్పును గుర్తించి క్షమించండి అన్నట్లు ఆమెమైపు చూచి నాలుగైదుమార్లు ఆమె ముఖంపైకి పొగ వదిలాను. సిగరెట్ పొగ ఘాటుకు ఆమె కళ్లుమూసుకుంది. కానీ ఆమె పొడవైన ముక్కు ఆనందపారవశ్యంతో సిగరెట్ సౌరభాన్ని పీల్చుకుంటూంది.

మరుసటి రోజు ఉదయం–

బండి ప్లాట్‌ఫారమ్ పైన ఆగింది. నేను మాపార్టీకి చెందిన రెండు డజన్ల మెంబర్ల (ఇందులో చాలామంది యువకిశోరాలు)తో కలసి రామ్ ప్రతాప్ ముర్దాబాద్ అని నినాదాలిచ్చాను. ప్లాట్‌ఫారమంతా నల్లజెండాలతో నిండిపోయింది.

'రామ్‌ప్రతాప్, కాంగ్రెసు పార్టీ తొత్తు' మిస్ రోస్పా గట్టిగా అరిచింది.

'రామ్‌ప్రతాప్, కాంగ్రెసు పార్టీతోక' అని నేను దానికి వ్యాఖ్య చేశాను.

నినాదాలు చేయడం, నల్లజెండాలు చూపటం వరకేకాక అప్పుడు మిస్

రోస్నా సంకేతాన్ని అందుకొని ఎవరి కుత్తుకునైనా పిసికేసేవాడిని. రకరకాల నినాదాలు మారుమ్రోగుతుండగా ఇంతలోనే ఒక కంపార్టుమెంటు వాకిలి తెరుచుకొంది. విశాలమైన నుదురు ఇతరులను ఆకట్టుకొనె వర్చస్సు కల ఒక వ్యక్తి వాకిలి దగ్గరికి వచ్చి చిరునవ్వు నవ్వుతూ నిలబడ్డాడు. ఆనవ్వు నిర్మలమనిపించింది.

'ఈయనే' అని రోస్నా అరచింది.

ఆహా...

'రామ్‌ప్రతాప్ ముర్దాబాద్' రోస్నా గట్టిగా నినాదం చేసింది.

'...' నేను వాళ్లతో గొంతు కలిపి ఏమని అరిచానో నాకే తెలియకుంది.

రైలుబండి వెళ్ళిపోయింది. ఆవ్యక్తి మాత్రం చిరునవ్వుతో ప్లాట్‌ఫారమ్ పై నిలబడి ఉన్నాడు.

'చూడు. ఆయన ముఖంలో కొంచెమయినా ఆందోళన'... అని నేను అంటూండగానే మధ్యలోనే అడ్డుతగిలి, "గాంధీ శిష్యుడు కదా! గాంధీ గుణాలనే వీరు నేర్చుకొన్నారు. చెప్పుదెబ్బలు తినికూడా చిరునవ్వు చిందించటం వీరికి అలవాటే. ఓ, వీరంతా గుంటనక్కలు. సోషలిస్టులాగా బయలుదేరి వచ్చారు. విప్లవం తెస్తారట విప్లవం... ధూర్తులు" అని రోస్నా అంది.

హోటలు చేరిన తర్వాత నేను రెండు విషయాల గురించి ఆలోచింపసాగేను. ఒకటి వినోద్‌తో స్నేహసంబంధం తెంచుకోవటం, రెండవది నిరర్థక నినాదాలతో నిండిన ఈ పార్టీనుండి నాపేరును తొలగించుకోవటం. ఈ రెండింటిలో ఏదో ఒకటి జరుగుతుందని నమ్మకంతో ఉన్నా. కాని ఏమి కాలేదు. నాగైర్ హాజరీపై కోపగించుకుంటూ వినోద్ వచ్చి విజయవంతంగా సాగిన సభను గురించి చెప్పుకుపోయాడు.

ఒకటి రెండు నెలలు ఇదే విధంగా సాగిపోయింది. కాలేజి చదువు చాలించి ఇంటికి వెళ్ళిపోదామని అప్పుడప్పుడూ అనుకొనేవాడిని. ఒకేసారి మూడు పార్టీల మెంబరైన వ్యక్తి తన గౌరవాన్ని ఎంత కాలం నిలుపుకోగలడు?

కల్‌కటాకేఫ్ కన్షెషను క్రెడిట్‌పైన దొరికే టిఫిను కారణంగా ఇతర పార్టీలతో సంబంధాలు తెంపుకోవాలంటే మిస్ రోస్నా కనుల ఆకర్షణ వల్ల అలా చేయలేక పోతున్నా. ఒకరోజు ఫార్వర్డ్ బ్లాక్ మెంబరు ఒకతను నన్ను ఓమూలకు తీసుకువెళ్లి నాచేతికి బెంగాలీ భాషలో వ్రాసిన ఒక కరపత్రం అందిస్తూ దానిని హిందీలో తర్జుమా చేసివ్వమన్నాడు. నేను తర్జుమా చేసిచ్చాను. అదే రాత్రి ఆ కరపత్రం హిందీలో ప్రింటు అయింది. మరుసటిరోజు ప్రొద్దున్నే నేను చౌరస్తానుండి తిరిగి

వస్తున్నా. దారిలో ఒకతను జట్కాబండి ఆపి దానిలోంచి రెండు బండిల్స్ నాకు రహస్యంగా అందచేశాడు. నేను ఈకరపత్రాలతో జట్కాబండిలో వెళ్లి వీటిని పంచేవారికి అందజేయాలట . పంచేవారు దొరక్కపోతే నేనే వీటినన్నింటిని పంచాలట. ఇది పార్టీ ఆజ్ఞ అట. పూర్వకాలంలో తల్లిదండ్రుల ఆజ్ఞ అంటే చాలా విలువైందిగా ఉండేది. తల్లిదండ్రుల ఆజ్ఞ మేరకు పిల్లలు అరణ్యవాసంకూడా చేసేవారు. కానీ ఈ వైజ్ఞానిక యుగంలో పార్టీ ఆజ్ఞే చాలా గొప్పది. తల్లిదండ్రుల ఆజ్ఞను ఉల్లంఘించటం విప్లకారుల ధర్మమయిపోయింది.ఈకరపత్రాలలో విప్లవానికి నాందిపలికే ఆటంబాంబు లాంటి ఉత్తేజకరమైన మాటలు ఉన్నాయి. అయినా వీటిని పంచాల్సిందే. జట్కా రెండవ చౌరస్తావరకూ చేరిందో లేదో ఒక మధురమైన కంఠధ్వని వినిపించింది...'కామ్రేడ్!'

మిస్‌రోస్సా. ఆవిడ తన జట్కాబండిని వదలి నాజట్కాబండిలోకి వచ్చేసింది. నాకోసం యోగినిలా అడవులన్నీ వెతుకుంటూ వచ్చిందానిలా. మేము విషయాలను విడమర్చి మాట్లాడుకోవాలనుకునేలోగా జట్కాను ఎవరో ఆపారు. ఆపిన అతను సి.ఐ.డి. ఇన్స్‌పెక్టరు. మమ్మలిద్దరినీ ఒకచోట చూసి చాలా సంతోషపడ్డాడాయన. అవసరానికంటే ఎక్కువ వినమ్రుడై ఆయన అన్నాడు... "క్షమించండి. మీదగ్గర ఏముందో నేను తనిఖీ చేయాలి."

దగ్గరలోనే పోలీసుస్టేషను ఉంది. అక్కడికి మమ్మల్ని తీసుకెళ్ళాడు. రూల్సు ప్రకారంగా మా తనిఖీ మొదలయ్యింది. మిస్‌రోస్సా హ్యాండ్‌బ్యాగ్ నుంచి కొన్ని ఉత్తరాలు బయట పడ్డాయి. నేను వాటిపైన ఒక కన్ను వేసి చూశాను. నారాజీ అనేమాట కంటపడింది. నాగుండె దడ ఎక్కువయింది. కండ్లు మబ్బులుగమ్మాయి.

బండిల్సు తనిఖీ మొదలవుతూనే నేను పోలీసు స్టేషనులో కుర్చీలో దబాలున కూలబడి పోయాను. బండిల్సు విప్పబడ్డాయి. పోలీసువాళ్ళు ఆనందంతో...'హియర్ యు ఆర్' అని అరిచారు.

"ఏమండీ దొరగారూ! ఈ బండిల్సులో చీరలు, శృంగార సామాగ్రి ఉంది కదూ! అయితే వీటిలోకి ఈకరపత్రాలు ఎలా వచ్చాయి?" ఇన్స్‌పెక్టరు నవ్వుతూ అడిగాడు. నేను ఊరుకుండిపోయాను. రోస్సాముఖంలో రక్తపు చుక్కలేదు. ఆమె కీచుగొంతుతో మెస్టివిక్ అని అరిచింది.

లోకల్ జైయిలుకు మమ్మల్ని పంపారు.

విప్లవకారిణి మిస్‌రోస్సా లేడిస్ వార్డుకు వెళ్తూవెక్కి వెక్కి ఏడ్చింది. జైలులో చేరినతర్వాత నాకు హాయని పించింది.

"స్టూడెంట్ ఫెడరేషన్ (కమ్యూనిస్టు గ్రూపు) మెంబరు కామ్రేడ్ పి. రాయ్, మిస్‌రోస్నా అభ్యంతరకరమైన కరపత్రాలతో పట్టుబడ్డారు." అన్న వార్త మరుసటి రోజు పత్రికల్లో వచ్చింది.

"స్టూడెంట్ ఫెడరేషన్ (సోషలిస్టుగ్రూపు) కార్యవర్గ సభ్యుడు కామ్రేడ్ ప్రఫుల్ అభ్యంతరకరమైన కరపత్రాలతో పట్టుబడ్డాడని మరొక పత్రిక పేర్కొంది."

అగ్రగామి దళంలో ప్రసిద్ధి చెందిన బెంగాలీ కార్యకర్త 'మిస్టర్ రాయ్' నిప్రభుత్వం జైలులో వేసిందని మూడో పత్రిక వార్తను ప్రచురించింది. వాస్తవంగా చూస్తే ప్రథమశ్రేణి రాజకీయ ఖైదీలకు తమ ఇళ్ళకంటే జైలులోనే ఎక్కువ విశ్రాంతి దొరుకుతుంది. తినటం, నిద్రపోవటం, చదువుకోవటం, రాసుకోవటం, చీకూచింతాలేని జీవనం. నిశ్చింతగా జీవితాన్ని గడపచ్చు. రోస్నానేమో రెండురోజుల తర్వాత విడదల చేశారు. నాకు కోర్టు మూడు సంవత్సరాల శిక్ష విధించింది. పార్టీపిశాచం బారీనుండి తప్పించుకున్నానులే అనుకొన్నాను. కానీ 1942లో దేశవ్యాప్తంగా క్విట్‌ఇండియా ఉద్యమం చెలరేగింది. జైళ్లన్నీ ఖైదీలతో నిండిపోయాయి. చూస్తుండగానే పార్టీల జబ్బుకూడా పెరిగిపోయింది. ఉచిత భోజనం, హాయిగా నిద్రపోవటం, గొంతుచించుకుంటూ వాగ్వివాదాలు చేసుకోవటం. జైళ్లలో కమ్యూనిస్టుల సంఖ్య నామమాత్రంగా ఉండేది. తమ పార్టీలప్రభావాన్ని ప్రజల్లో పెంపొందించటానికి చేసే ప్రయత్నాలు విఫలమయ్యాయి. గాంధీ తాతగారి భక్తకోటి రాట్నం వడకటమేకాక చదవటం, వ్రాయటంకూడా పార్టీకార్యక్రమంగా భావించేది. వాదోపవాదాలలో దలదూర్చటం అటుంచి జైళ్లలో అధికారుల దురంతాలను వేలెత్తి చూపటం గూడా వారు హింసాయుత కార్యంగా భావించేవారు. జైళ్లలో సోషలిస్టుల సంఖ్య ఎక్కువగా ఉండేది. అందువల్ల నన్ను నేను సోషలిస్టుగానే పరిగణించుకోవడం ఉత్తమం అనుకొనేవాడిని. కమ్యూనిస్టుపార్టీ వాళ్లు తమ పార్టీ సభ్యులను జైళ్ళనుంచి విడిపించే దానికి గట్టిప్రయత్నాలు చేస్తున్నారని కొద్దిరోజుల తర్వాత నాకు తెలిసింది. వాళ్లు చేసే ప్రయత్నాలను చూసి, విని వాళ్లు ఎలాగైనా తమ పార్టీ సభ్యులను తప్పక విడిపించుకోగలరనే నమ్మకం నాకు కలిగింది. అందువల్ల ఒకరోజు రహస్యంగా కమ్యూనిస్టుల వద్ద కెళ్లి నన్ను మరువవద్దని చెప్పివచ్చాను. నిజం చెప్పాలంటే జైలులో ఎలాంటి ఇబ్బందులులేవు. కాని రాత్రింబవళ్ళు నేను నావిముక్తి కోసం తన్నుకులాడేవాడిని. జైలునుంచి విముక్తి అంటే పార్టీ బురదనుంచి విముక్తి అని. పార్టీ బురదనుంచి బయటపడాలని ప్రయత్నించేకొద్దీ నేను దానిలో కూరుకుపోతూనే ఉన్నా

ను. పగలంతా భౌతికవాదాన్ని అధ్యయనం చేస్తూ భగవంతుని అస్తిత్వాన్నే రూపు మాపాలని అనుకొనేవాణ్ణి. మరి రాత్రవుతూనే దోమతెర లోపలికి వెళ్లి నాముక్తి కొరకు గంటల తరబడి ఏడుస్తూ భగవంతున్ని వేడుకొనేవాణ్ణి. భగవంతుడు నాలాంటి అనన్యభక్తుని మొర విన్నాడా అన్నట్లు నేను జైలులో జబ్బుపడ్డాను. నాజబ్బు తన ప్రభావం చూపెట్టింది. పనిగట్టుకొని వార్తాపత్రికలు ఒకటి తర్వాత ఒకటి నావిముక్తిని డిమాండుచేస్తూ రాయసాగాయి. ఈ విషయం ప్రభుత్వం దృష్టిలోకి వచ్చింది. తగిన చికిత్స నిమిత్తం నన్ను హాస్పిటలుకు పంపారు. చికిత్సమొదల యింది. నాబరువు పెరగసాగింది. జ్వరం తగ్గుముఖం పట్టింది. అన్నిటికంటే ముఖ్యమయిన విషయమేమిటంటే పార్టీపిశాచం నుంచి విముక్తి కలిగింది. ఎమ్. ఆర్.పి. ట్రైనింగు కొరకు వచ్చిన సుసంస్కారవంతులయిన బెంగాలీ నర్సులు నాకు ఉపచారం చేసేవాళ్ళు. వారందరూ నేనంటే పెద్దగా పట్టించుకొనేవాళ్లు కాదు. ఒకనాడు చలాకీగా దీనికి కారణమేమిటో తెలుసుకోవాలని ప్రయత్నించా ను. పంచతంత్రంలోని చక్రం కథ మాదిరి తలపైన పార్టీ చక్రం పరుగెత్తసాగిం ది. నేను గాంధీవాది ననుకొని వాళ్లునేనంటే ఇష్టపడేవాళ్లుకారు. గాంధీవాదులు సుభాష్చంద్రబోసుకు నమ్మకద్రోహం చేశారని వాళ్ల అభిప్రాయం. నేను ఏదో ఒక అజ్ఞాత ప్రేరణకు లోనై గాంధీ వాదులను కొద్దిగా నిందించాను. ఇంకేముం ది. వాళ్లు నాపై ప్రశ్నలవర్షం కురిపించి ఆఖరికి నేను ఫార్‌వర్డు బ్లాకిస్టునని తెలు సుకొన్నారు. ఇకచెప్పేదేముంది... 'నీవు లేక క్షణమొక యుగంగా గడిచేను ప్రియ తమా!' అనే లక్షణాలన్నీ వాళ్లల్లో ప్రకటితమయ్యాయి. నన్ను విడుదలజేసి ప్రభుత్వం ఒకమంచి పని చేసింది. లేకపోతే నేను మరొక క్రొత్త, జబ్బుకు బలై పోయే వాడిని.

జైలునుంచి బయటపడ్డ తర్వాత ఎక్కడన్నా ఏపార్టీ ప్రసక్తి వచ్చినా అక్కడి నుంచి తరలిపోవాలని ప్రతిజ్ఞ చేసుకున్నాను. పార్టీలనుండి దూరంగా ఉండాలని నేను ప్రయత్నం చేస్తూనే ఉన్నా. కానీ ఒకనాడు ఒకపార్టీ మెంబరు కలిశాడు. పరిచయస్తుడు కావున తప్పించుకోవటం వీలుపడలేదు. మాట్లాడుతూ మాట్లాడు తూనే తన పార్టీ కార్యక్రమాలన్నీ విడమర్చి చెప్పాడు. బొంబాయి పథకానికి విరుద్ధంగా రాయ్ పథకం ప్రకటన పత్రాన్ని నాచేతికి అందిస్తూ ఆయన ఇలా అన్నాడు. "ఇది రాయ్‌గారి పథకం. ఈ పథకాన్ని గురించి మాట్లాడితే ఆపార్టీలో ఇరుక్కొనే సందేహమేర్పడింది. పథకంపైన నా అభిప్రాయాన్ని వెళ్లబుచ్చకుంటే ఆమహాశయుడు నన్ను వదిలేటట్లు లేడు. ఆఖరికి నానోటినుంచి సరే అని అని

పించుకున్నాడు."

ఇంటికి వచ్చిన తర్వాత వార్తాపత్రిక ద్వారా తెలిసిందేమిటంటే, "క్రామేడ్ ప్రఫుల్ల విడుదలై బొంబాయి పథకాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ ఇది దోపిడిదారుల పథకం అన్నాడనీ." రాయ్‌గారి పథకానికి, వచ్చిన వార్తకు ఏలాంటి సంబంధం లేదు. సరిగదా రాయ్‌గారి పథకం వాస్తవంగా దళితులకు సంబంధించినది.

కాలేజీ చదువుకు ఎప్పుడో సున్నా చుట్టేశాను. మావారు నాపెండ్లిగురించి పదేపదే నాతో మాట్లాడేవారు. జైలుకు పోకముందు పిల్లనిచ్చేవాళ్ల క్యూ ఏర్పడేది. అప్పుడయితే వరకట్నం కూడా ఎక్కువగా వచ్చి ఉండేది. కానీ ఇప్పుడు నాలోటి జైలుశిక్ష అనుభవించి వచ్చినవాడికి పిల్లనివ్వటం అంటే పిల్లను బావిలో తోయటంతో సమానంగా అనుకుంటున్నారు. కానీ ఒక ధైర్యవంతుడైన తండ్రికి నాపైన నమ్మకము ఏర్పడింది. మా అమ్మనాన్నలు ఎంతో బతిమలాడగా ఆఖరికి నేను కూడా ఒప్పుకున్నాను. పెళ్లిచూపులకు ఏర్పాట్లుచేశారు. టిప్‌టాప్‌గా తయారయి ఒకరోజు వాళ్లింటికి వెళ్లాము. కాబోయే అల్లుడికి చేయవలసిన మర్యాదలన్నీ చేశారు. పిల్లతండ్రి ఈ కాలానికి అనుగుణమైన అభిప్రాయాలున్నవాడే. ప్రస్తుత ప్రపంచాన్ని గురించి ఆయనకు కొన్ని అభిప్రాయాలు ఉండేవి. పిల్లను చూపించిన తర్వాత ఆయన ప్రపంచ రాజకీయ పరిస్థితులపైన ఉపన్యాసాలివ్వటం మొదలుపెట్టాడు. ఆయన చెపుతూపోతూవుంటే నేను వింటూ కూర్చున్నాను. తెరవెనుక అటువైపు నిల్చుని కొందరు నా అభిప్రాయాలను కూడా వినాలనే ఉత్సాహంతో ఉన్నారని నాకన్పించింది. ప్రతిదానికి తలవూపే గంగిరెద్దు అనుకొని తిరస్కరిస్తారేమోనని నాకు సందేహం కలిగింది. కాబోయే భార్యను చూసి నేను నాకల్పనాలోకంలో క్రొత్త క్రొత్త డిజైన్లలో భవంతులు కట్టుకొన్నాను. ఆఖరికి పార్టీల గురించి మాట్లాడే అగత్యమేర్పడింది. క్విట్‌ఇండియా ఉద్యమం వరకూ చర్చలు కొనసాగాయి. నా కాబోయే మామగారి అభిప్రాయం నా అభిప్రాయానికి భిన్నంగా ఉంది. కాంగ్రెసు పార్టీ క్విట్‌ఇండియా ఉద్యమానికి తీర్మానం పాస్‌చేసి పెద్ద తప్పు చేసిందని అతనంటాడు. దీనిని నేను ప్రతిఘటించాను. వాదోపవాదాలు వేడెక్కాయి. తెరకు అటువైపు నుంచి కూడా తీవ్ర వాదోపవాదాలు మొదలయినట్టు నాకు తోచింది. నేను జోరుజోరుగా మాట్లాడటం మొదలెట్టాను. "ఇక మన లక్ష్యం ఎంతో దూరంలో లేదు. 1942 తర్వాత మన దేశానికి ..." అని అంటూ వుండగా నాకు కాబోయే బావమరిది తన రూములోనుంచే ఆపండి, ఆపండి అంటూ వచ్చాడు. అతడు యువకుడు. యువతరంపై నాకుండే

నమ్మకంతో అడిగాను; "నీవు చెప్పు మోహన్, నా అభిప్రాయాలు తప్పంటావా?"

అతను వచ్చికూర్చుని గొప్ప తత్వవేత్తగా ఇలా మాట్లాడసాగాడు - "చూడండి ప్రఫుల్ల రాయ్‌గారు, ఇంతవరకూ నేను కిమ్మనకుండా మీమాటలు వింటున్నాను. నాశక్తినంతా కూడ గట్టుకొని నాఅంతరాత్మను చంపుకొని ఇంతవరకూ నోరు మూసుకొని ఉన్నాను. మాటలు ఇంత వరకూ వచ్చిన తర్వాత ఇప్పుడు వూరికే కూర్చోవటమంటే నమ్మకద్రోహమే అవుతుంది."

"ఊ. ఊ, చెప్పండి. తప్పక మీ అభిప్రాయాలేమిటో చెప్పండి." నేను అధికోత్సాహంతో అడిగాను.

"ఆ ఖరిగా మీరు చెప్పిన చాలా విషయాలు సోషలిస్టు పార్టీకి సంబంధించినవి. అవి భారతరక్షణ చట్టంలోకి వస్తాయి. మీరు తమకర్తవ్యాన్ని గురించి దాని గొప్పతనాన్ని గురించి ఆలోచిస్తున్నారని తెలుస్తుంది. ఈ పరిస్థితులల్లో నేను నాకర్తవ్యాన్ని విస్మరిస్తే, అది నమ్మకద్రోహం కాక మరి ఏమౌతుంది!" అంటూ అతను వాళ్ల నాన్నగారి సిగరెట్‌కేస్ నుంచి సిగరెట్ తీసి వెలిగించాడు.

తన అభిప్రాయాలకు విఘాతం కలిగినందువల్ల మా అబ్బాయి ఎలా ప్రతిస్పందిస్తాడో అనేది నేను మొట్టమొదటి సారి చూస్తున్నా అంటూ చిరునవ్వుతో వాళ్ల నాన్న నావైపు చూశాడు.

తెరకు అటువైపు నుంచి ఆడగొంతు వినపడింది... "ఇలా మాట్లాడటానికి నోరెలా వచ్చింది? కొత్తగా ఇప్పుడే పిల్లవానికి ఉద్యోగం దొరికింది. ప్రమోషన్‌కి ప్రయత్నం చేసేదానికి బదులు కూర్చొబెట్టుకొని బాంబులు తయారుచేసేవాళ్లతో పెళ్లి సంబంధం ఏర్పరుచుకోబోతున్నారు. ఉన్న ఉద్యోగం కూడా ఊడగొట్టే ప్రయత్నం చేస్తున్నారు. నా పిల్లకు పెళ్లి కాకున్నా పర్వాలేదు. కన్నెగానే ఉండిపోతుంది. మనకి ఈ సంబంధం వద్దు."

ఇది మాకాబోయే అత్తగారి కోపంతో అన్నట్లుంది. కానీ దీని భావమేమిటో నాకు బోధపడలేదు. తర్వాత వాళ్లుచెప్పగా తెలిసిందేమిటంటే 1943లో మోహన్‌బాబుకు సి.ఐ.డి. డిపార్టుమెంటులో ఉద్యోగం దొరికిందనీ, నేను భారతరక్షణ చట్టం ప్రకారం నేరస్తుడనని కనీవినీ గూడా వదలివేయటం ఆయన ఉద్యోగ కాలంలో ఇది మొదటి పర్యాయం అని...అతను చేసిన ఉపకారమంతా ఏమిటంటే రెండు గంటల వరకూ నన్ను అరెస్టు చెయ్యకుండా ఉంచుకోవటమే.

నేను పావుగంటలోనే సర్దుకొని వాళ్ల ఇంటిని క్విట్ చేసి వచ్చాను. అదేవిధంగా పెండ్లి చేసుకోవాలనే కొద్దోగొప్పో ఆశను కూడా క్విట్ చేసి వచ్చాను.

వాళ్లమ్మాయి కిటికి దగ్గర నిల్చుని నావైపు ఎంతో దీనంగా చూస్తూ వుండిపో యింది. ఆమె విశాలనేత్రాలలో అశ్రువులు స్పష్టంగా కన్పించాయి. నిరాశతో తిరిగిపోవటం తప్ప మరి నేనేం చెయ్యగలను.

తర్వాత ఈ చిన్న ఊళ్లో పార్టీ పాలిటిక్సుల గొడవలు ఉండవనుకొని ఒక చిన్న ఉద్యోగంలో చేరాను. కొద్దిరోజులలోనే అసలు విషయం బయట పడింది. ఇక్కడేమో లెక్కలేనన్ని పార్టీలున్నాయి. ఈ పరిస్థితులలో ఏ పార్టీతోకూడా సంబంధం పెట్టుకోకుండా నడవడం కష్టమయ్యింది. 'క' మహాశయునితో కొంచెం నవ్వుతూ మాట్లాడితే మిస్టర్ 'ఖ' కు ఆగ్రహం కల్గేది. పంతులు 'గ' గారింటికి ట్యూషన్ చెప్పడానికి వెళ్తే మున్షీ 'ఘ' గారికి కోపమొచ్చేది. శ్రీ 'త' గారు ఒక మిల్లు యజ మాని. ఒకనాడు ఆయన ఆహ్వానిస్తే వాళ్లింటికి వెళ్లి కొంచెం పాయసం తిన్నా నొలేదో కార్ల్‌మార్క్స్ యొక్క 'కాపిటల్' అంతా కళంకితమైపోయిందట. తోపుడు బండ్లలో సరుకులు విక్రయించేవాళ్లలో కూడా పార్టీ పాలిటిక్సు వుంటే పెద్ద పెద్ద దుకాణదారుల గురించి ఏమి చెప్పాలి! ఒక రోజు దుకాణాలనుంచి ఉన్నట్లుండి సిగరెట్లు మాయమయ్యాయి. సిగరెట్ ప్రియులు హార్డ్‌వేర్ షాపుల్లో సిగరెట్టులు వెతకటం మొదలులెట్టారు. నాకు టీ, సిగరెట్లు సప్లైచేసే శ్రీ శివాజీని నీవు సిగ రెట్ ఎక్కడ తెస్తావని అడిగాను. "బాబుగారూ, మన పార్టీవాళ్ల కోసం ఇలాంటి సహాయం చేయకపోతే ఎలా...హె...హె... బ్లాక్‌మార్కెటునుంచి తెస్తున్నానని నీళ్లు నములుతూ అన్నాడు. అంటే నేను పలానా పార్టీవాడిని కాబట్టి నాకు సిగ రెట్లు దొరుకుతున్నాయి. నేను ఆదుకాణదారుడు ఒకే పార్టీకి చెందినవారమని అర్థమయింది."

కాంగ్రెసు పార్టీ ఎన్నికల్లో పోటీ చేయనున్నది అనే ప్రకటన వెలువడగానే పార్టీల కార్యకర్తల్లో అలజడి మొదలయ్యింది. బ్రిటిషు ప్రభుత్వంకు తలవంచి మేము ఏపార్టీకార్యక్రమాల్లోనూ పాల్గొనమని ప్రతిజ్ఞ చేసిన వాళ్లుకూడ 1942 ఉద్యమం తర్వాత పెట్టెల్లో ఏదో ఒక మూల పడేసివున్న గాంధీటోపీలను బయ టకు తీసి ధరించడం మొదలెట్టారు. అటూయిటూ చూడకుండా కాంగ్రెసు పదాన్ని ఉచ్చరించడానికి భయపడేవాళ్లు ఈ నాడు దారులు అడ్డగించి ఎన్నికల గురించి చర్చ ప్రారంభించారు. నేనుకూడా ఇప్పుడు ఏదో ఒక పార్టీకి చెందినవాడినని ప్రకటించుకోవచ్చు. కమ్యూనిష్టు పార్టీ అంటే నాకు ఒకవిధంగా అయిష్టత ఏర్ప డింది. ఎందుకంటే మిస్‌రోస్నా ఒక అమెరికా సైనికుణ్ణి పెళ్లాడి తన అంతర్జా తీయ సిద్ధాంతాన్ని కార్యరూపంలో నిరూపించింది. సోషలిస్టుల విజయంకొరకు

ప్రజలు భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు. ఫార్‌వర్డుబ్లాక్‌కి కాంగ్రెసు పార్టీతో ఇప్పు డేమి విభేదాలు లేవు నిర్విఘ్నంగా నేను మళ్లీ పార్టీలో చేరవచ్చు. కానీ పార్టీల పొత్తు ఎత్తు తూనే నాకు గుండె ఆగిపోయినట్లు అవుతుంది. తల తిరిగినట్లు ఉంటుంది. ఏదో ఒక నిర్ణయానికి వస్తామనుకుంటే వేలాదిప్రశ్నలు ఎదురౌతాయి.

"మిస్టర్ 'డ' మరియు 'ధ' ఈ దఫా కాంగ్రెసు టికెట్టు కోసం ప్రయత్ని స్తున్నారు. మీ అభిప్రాయంలో వీరిద్దరిలో ఎవరికి టికెట్టు ఇవ్వడం సమంజసంగా ఉంటుంది.?"

"మిష్టర్ 'మ' పార్టీ వ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొంటున్నాడని సంజాయిషీ నోటీసు ఇచ్చారుగదా?"

"అరే, రాజాసాహెబ్ కాంగ్రెసు పార్టీకి వ్యతిరేకంగా పోటీ చేస్తున్నారట గదా! నిజమేనా?"

"రాయ్‌గారూ! శ్రీ 'శ' గారూ హిందు సభ టికెట్టుపై పోటీచేయాలనుకుంటు న్నారట. ఆయన మీకు సన్నిహిత మిత్రుడుగాదా! మీరు ఆయనకు తప్పక సహాయం చేయాలి." వగైరా వగైరా...

ఇవన్నీ వింటూ నేను మౌనంగా ఉండిపోతాను. నామౌనాన్ని చూసి ప్రతి ఒక్కపార్టీవాళ్లు తమ పార్టీ వాడినని భావించి ప్రత్యర్థి పార్టీల రహస్యాలు తెలిసి నవాడ్ని అని అనుకొంటారు. అంతా గందరగోళంగా ఉంది. అన్ని పార్టీలు నావే. నేను ఏపార్టీకి చెందినవాడను కాను. ఏదో ఒకపార్టీలో చేరకుండా ఉండటం వీలు కాదు. కానీ ఏపార్టీలో చేరాలా అన్న ప్రశ్న తలెత్తి నపుడు తల తిరిగిపోతుంది. పగలు శాంతిలేదు. రాత్రిళ్ళు నిద్రరాదు. నిద్రవచ్చినా ఏవేవో చెడ్డకలలు వస్తా యి..."నేను రోడ్డుపైన పరుగెడుతున్నాను. ఊరిలోని పనీపాటాలేని పిల్లలు నావె నుక డబ్బా వాయిస్తూ నన్ను తరుముకుంటున్నారు. మీదే పార్టీ అని వెంటబడి అడుగుతున్నారు. నేను కోపగించుకొని వాళ్లను కొట్టడానికి పరుగెడతాను. పిల్లలు నాపైన రాళ్లు రువ్వుతారు. చప్పట్లు తట్టి హేళన చేస్తారు. రోడ్డు పైన పరుగె డుతూ ఉంటాను. ఒకదర్జీ బిగ్గరగా అరుస్తాడు...ఈ రోడ్డు పలానా పార్టీవాళ్లది అని. రోడ్డువదలి కాలిబాట చేరుకుంటాను. మంగలివాడు అరుస్తాడు-ఈకాలిబాట పలానా పార్టీదే అని. కాలిబాటను వదలి కాలువలో పడిపోతాను..." మంచంపై నుంచి కిందపడి నాకు మెలుకువ వచ్చింది. లేవాలి అనుకొంటాను కాని శక్తి ఉండదు. విషజ్వరంతో సతమతమవుతున్న నన్ను నానౌకరు 'బుద్దన్' ఎలాగో ఎత్తి మంచంపై కూర్చోబెడతాడు..."గాబరాపడద్దు బాబుగారూ, మీకు తొందరగా

నయమౌతుంది." అని నచ్చజెప్పుతూ మళ్లీ అందుకుంటాడు. "నేను మావూరికి వెళ్లి మాచిన్నాన్నను పిలుచుకువస్తాను అతను మంత్రించి మీకు తాయెత్తు కడతాడు. మీకు పట్టిన పిశాచాన్ని పారద్రోలుతాడు."

"ఏదో ఒక పిశాచి నన్ను పట్టి వేదిస్తున్నట్లు నాకు తోస్తుంది. పిశాచాలపైన భూతాలపైన నమ్మకంలేని వారికి నాదొక్కటే మనవి, "మీకు ఏపిశాచంపైనా నమ్మకం లేకున్నా పార్టీ పిశాచంపై నమ్మకం ఉంచుకోండి."

(1945)

# మెకానిక్కు రసూల్

కొద్దిపాటి కాలంలోనే ఈచిన్న పల్లెలాంటి పట్నంలో చాలా మార్పులు వచ్చాయి. ఆశించిన దానికంటే ఎక్కువగా అవసరానికి మించి.

ఎనిమిది సంవత్సరాల క్రితం రావిచెట్ల క్రింద జరిగే క్లాసులు వర్షాకాలంలో వెలిసే హాస్టళ్ల స్థానే ఏర్పడ్డ ఈదివ్యమైన భవనాలను చూసి ఎవరికైనా ఆశ్చర్యమేయక మానదు.

పట్నంలో చెత్తనంతా ఎక్కడ పారేసేవారో అదే స్థానంలో ఏర్పడ్డాయి ఇప్పుడు ఈ విశాలమైన టౌనుహాలు క్లబ్బులు మరియు గ్రంథాలయం.

'గఫూర్‌మియా' చర్మాల గొడౌన్ ఫోటో స్టూడియోగా మారిపోయింది. మును పటి రోజుల్లో పాకీ పనిచేసే 'భగియా' కూడా అటు వెళ్తూ తన పైట కొంగుతో ముక్కు మూసుకొనేది. కానీ ఇప్పుడు పరిశుభ్రతకు, పవిత్రతకు ప్రతిరూపమయిన 'మిస్‌ఛాయా' కూడా ఈ దారిన వెళ్తూ "మావీధులు మాకెంతో ప్రియమైనవంటూ" కూనిరాగాలు తీస్తూ వెళ్తూంది.

'ఖలీఫా ఫరీద్' గారి టక్‌టకా, టక్‌టకా శబ్దం చేసే 'సింగర్' మిషనుకు అతని కత్తెరకు కాలం చెల్లిపోయింది. 'లత్తుమాస్టరు' గారి "మాడరన్ కట్‌ఫిట్" వెలిసింది.

రెస్టారెంట్లు, టీస్టాల్ల సంఖ్య కూరగాయల దుకాణాలకంటే మించిపోయింది. ఒకవైపు యుద్ధం, మరొకవైపు ధరలు పెరిగినప్పటికీ కొత్త కొత్త స్కీములు తయారౌతున్నాయి. చెడిపోతున్నాయి పట్టణపు రూపురేఖలే మారిపోయాయి.

ఇన్ని మార్పులొచ్చినప్పటికి ఆపాత మర్రిచెట్టు ప్రక్కన సదరురోడ్డుపై వున్న 'మెకానిక్కు రసూల్' రిపేరు దుకాణం పూర్వంలానే వుంది. క్రొత్తగాలి దానికి తగులలేదు. ఏలాంటి మార్పులేదు. క్రొత్తదనం లేదు. చిరిగిపోయిన జంపఖానా మీద కూర్చుని మరమ్మత్తు పనుల్లో నిమగ్నులైవున్న రసూల్ అతని కొడుకు 'రహీమ్' ల్లో మార్పులేదు. వాళ్లు కూర్చునే స్థలాలు కూడా మారలేదు. చుట్టూ రిపేరుకు వచ్చిన వస్తువులు - సైకిళ్ల పాతచక్రాలు, ట్యూబులు, సీట్లు, ఫెడల్లు, చైన్‌లు, హాండిల్లు, బ్రేకులు, పెట్రోమాక్సు లైట్లు, స్టౌలు, హార్మోనియంలు, గ్రామ

ఫోనులు, చుట్టు ప్రక్కల చెల్లాచెదరై పడివున్న కిరముట్లు చిన్నాపెద్ద 'పేచీలు,' ఒక పాతచెక్క పెట్టెలో అన్ని సామాన్లులకు చెందిన పాతతుంటలు. 'రేంచి,' గరుకు కాగితం, ఉలి, సుత్తి, 'పేచికస్,' విరిగి పోయన స్ప్రింగులు వగైరాలున్నాయి. దగ్గరిలోనే ఒక పాత చిన్న అలమారిలో చెడిపోయిన పాత క్రొత్త డిజైనుల పెద్ద - చిన్న లైంపీసులు, డన్‌లప్ ట్యూబులు, రెండుమూడు ఖాళీ డబ్బాలు, ఎన్నో విరిగిపోయిన చిన్న - పెద్ద పాతవస్తువులు పడివున్నాయి. అలమారిపైన పాత గ్రామఫోను గొట్టం తలక్రిందులుగా పడి వుంది. డన్‌లప్, గుడ్‌ఇయర్ వాచికం పెనీ ప్రకటనలు గల 1934, 1936, 1938కు చెందిన క్యాలెండర్లు, చిరిగిపోయిన 'మిస్ కజ్జన్' రంగుల చిత్రం, రెండు గోడగడియారాలు - ఒకటి డైలు లేనిది, మరొకటి పెండ్యూలము లేనిది గోడకు తగిలించి ఉన్నాయి. పెండ్యూలము లేని గడియారం ఎంతో కాలంనుంచి మూడుగంటలనే చూపిస్తుంది. రెండవ గడియారం తన లోపలి భాగాలను చూపెడుతూంది. దాని స్ప్రింగు వద్దనే సాలీడు గూడు పెట్టుకొని ఉంది.

మరొక వైపు కూర్చొని రహీమ్ తన పని చేసుకొంటూ పోతున్నాడు. ఇనుప కుర్చీమీద కూర్చుని ఒక కస్టమర్ రిపేరవుతున్న తన చెడిపోయిన వస్తువును చూస్తున్నాడు. ఎదురుగావున్న మర్రిచెట్టు మొదలుకు రోజూ వ్రేలాడే క్రొత్త క్రొత్త దుకాణాల మందుల ప్రకటనలతో పాటు నేషనల్ వార్‌ఫ్రంటు నినాదాలతో నిండిన కరపత్రాలు, సినిమా పోస్టర్లు వ్రేలాడుతున్నాయి. వీటితోపాటు ఎప్పటినుంచో ఒకపాత ఇనుపరేకు కూడా వ్రేలాడుతుంది. దానిమీద గజిబిజి అక్షరాలతో 'మెకానిక్కు రసూల్ - ఇక్కడ మరమ్మత్తులు చేయబడును' అని రాసి వుంది.

ఈ సైను బోర్డును గురించి చదువుకొన్నవారెందరో ఎంతకాలం నుంచో వ్యాఖ్యలు చేస్తూ వ్యంగ్యంగా మాట్లాడుకుంటూ దాన్ని సరిదిద్దమని రసూల్‌మియాకు చెప్తూవచ్చారు. కానీ ఈనాటికి ఇనుపరేకు అలాగే వ్రేలాడుతూ వుంది. ఎవరో చిలిపి పిల్లవాడు ఆరేకుపైన ఇక్కడ మనుషులకు కూడా మరమ్మత్తులు చేయబడును అని వ్రాశాడు. ఆఖరికి దాన్ని తుడిచేయటం అవసరమని కూడా అతనికి తట్టలేదు.

మెకానిక్ రసూల్!

పొడుగూ పొట్టిగానీ ఆకృతి, పనిలో నేర్పరి, ఒమాదిరి శరీరం, పొడుగాటి ముఖంలో నల్లని తెల్లని వెంట్రుకలతో కూడిన గడ్డం, అరవై సంవత్సరాలు నిండినప్పటికి శరీరంలో ఏమాత్రం వృద్ధాప్యలక్షణాలు లేవు. పనిలో స్ఫూర్తి, వేగం

యువకులకన్నా మిన్న. తళుకుబెళుకులు లేని సామాన్యుడు. పైన ఒకచొక్కా, క్రింద ఒక లుంగీ టీ, పాన్, బీడీలకు దాసుడు. పనీపాటా లేకుండా ఊరికే కూర్చో వటం అంటే తెలియని వాడు. గొప్పలు కొట్టటంలో నేర్పరి. కానీ తన కర్తవ్యాన్ని ఎప్పుడూ విస్మరించడు. పనిచేస్తూనే ఎంతసేపైనా మాట్లాడుతూ ఉండగలడు.

టక్,టక్,టక్,టక్.

"స్వర్గమూ నరకమూ ఎక్కడో లేవు, ఇక్కడే వున్నాయి. మన మంచి చెడ్డ లకు అనుగుణంగా ఇక్కడే వాటి ఫలితాలు మనకు ప్రాప్తిస్తాయి. ఆబాబు 'రామ చందర్' కి ఏమయ్యిందో మీకు తెలుసు గదా..." అరే ఓ రహీమ్! కొంచెం ఆ పే చ్కస్ ఇటు పారేయ్... అరే. బాబు రామచందర్, అరే. అతని తమ్ముడు ఆఖరికి ఏమయ్యాడో తెలుసుగదా."

రహీమ్!

మెకానిక్కు రసూల్‌కి ఒక్కగానొక్కకొడుకు. దృఢమయిన నల్లని శరీరం తండ్రి ఆజ్ఞ జవదాటని తనయుడు. అవసరానికి మించి నమ్రత చూపేవాడు. తండ్రి ఎదుట అతను నోరెత్తగా ఎవ్వరూ చూడలేదు. ఎప్పుడైనా ఇద్దరూ ముగ్గురూ ఒకేసారి వస్తువులను తీసుకొస్తే, అతని ఓర్పుకి పరీక్ష ప్రారంభమవుతుంది. చిన్న మామూలు తప్పు జరిగిందంటే రసూల్‌మియా ఉగ్రుడై పోతాడు. నిరంతరం పనిచేస్తున్నప్పటికి తండ్రి అప్పుడప్పుడు అతనికి సోమరిని, పనిదొంగ, అజా గ్రత్తపరుడు, తిరుగుబోతు అనే బిరుదులిస్తూ వుంటాడు. రసూల్‌మియా తిడుతూ పోతూ వుంటే రహీమ్ మాత్రం వాటిని లెక్కచేయకుండా రిపేరుకొచ్చినవాళ్లకు "దీని స్ప్రింగు విరిగి పోయింది. హోల్డింగు నట్టుకూడా..." నచ్చచెపుతూంటే దీంట్లోకూడా రసూల్‌మియా జోక్యం చేసుకుంటాడు. "ఏది చూపించు ఏమయిందో!" అరే ఏం పిల్లోడివిరా, స్ప్రింగు వేద్దాము. హోల్డింగు నట్టుకూడా మారుద్దాములే. ఈ మిషను నడిపి రికార్డు స్థాపిస్తే అప్పుడు అసలయిన మెకానిక్కు అయ్యే ది...అరే గాడిదా... బ్యాలెన్సు ఎట్లా సరిఅవుతుంది?"

రహీమ్ తనలో తాను నవ్వు కుంటూ ముఖం క్రిందికి దించుకుంటాడు. పట్నానికి రెండుమైళ్ల దూరంలో తూర్పుదిశలో ఉన్న చిన్న ఊరిలో మెకానిక్కు ఇల్లుంది. మెకానిక్ పూర్వీకులు ముందెప్పుడో సంపన్న రైతులుగా ఉండేవారు. కానీ ఈనాడు మూడు గుడిసెలు, పశుధనం పేరిట కొన్ని మేకలు, కోళ్లు మాత్రమే మిగిలాయి. ఇప్పుడు అవే వాళ్ల ఆస్థి. రాబడి విషయం చెప్పనక్కర లేదు. దుకాణం బంద్ అయిన రోజు వాళ్లతిండికూడా బందే. ఆదాయం వస్తూంటే నెల్లో

ముప్పయ్ రోజులు కబాబ్,కైమా, హల్వా, సేమియాల వంటకాలు తయారవుతా యి. కొడుకు, కోడలు నోరెత్తరు. రసూల్‌మియా భార్య మాత్రం మొదటి నుంచి కూడా పొదుపు చేయాలని కొంతలో కొంత డబ్బులు కూడబెట్టాలని ప్రయత్నా లెన్నో చేసి ఓడిపోయింది. రసూల్‌మియాగారి ఉమర్ ఖయాం ఫిలాసఫీ ముందు ఆవిడగారి ఏతర్కమూ నిలువలేదు. ఆమె మాట అతను పట్టించుకోలేదు. అయి నప్పటికి ఆమె మాత్రం వాగుతూనే ఉంటుంది. రహీమ్ చేతిలో ఏదైనా పొట్లం కనబడితే వెంటనే అడిగేస్తుంది. "పొట్లంలో ఏముందిరా?" అని.

"గుండెకాయ" రహీమ్ మెల్లగా జవాబిస్తాడు.

"ఎంత? శేరా?... ధరెంత? అరే అల్లా. శేరు రెంౘ్రూపాయలా? ఏమి నాలుకరా? పాడు నాలుక. రెండు రూపాయలకు శేరు గుండెకాయా? అల్లా మియా మీకెప్పుడు బుద్ధి చెపుతాడురా? ఆముసలాడు తలపైన తిండిపోతు దయ్యం సవారి చేస్తూంది. వాడంటే సరే, వద్దని చెప్పేదానికి నీనోరు ఏమ య్యింది?" ముసల్ది తిండిని గురించి తిడుతూ వుంటే రహీమ్ అక్కడినుండి జారుకుంటాడు. ముసలిదాని ఒడిలో కూర్చుని వున్న మనుమడు గుండెకాయ పొట్లంకోసం మాటిమాటికి ఎగురుతూ ఉన్నాడు. ఆమె అతన్ని అడ్డుకొటూంది. "అబ్బా! ఈ పిల్లగాడితో ఎట్లా ఏగాలి? నాకేమి తెలియటం లేదు." ఆవిడ గంట లకొద్దీ గొణుగుతూ వుంటుంది. "ఈతండ్రీ కొడుకులకు ఎప్పుడు బుద్ధి వస్తుందో?" కాలాన్నిబట్టి నడుచుకోరు. తిండీతిప్పలకూ ఆస్తంతా హరించుకుపోయిన వాళ్లను ఉదాహరిస్తూ ఇలాంటి తిండిపోతులు సచ్చేనాటికి తమ శవాలపై కప్పేదానికి గుడ్డను కూడా మిగుల్చుకోలేరు. ఆమె తన దౌర్భాగ్యానికి చింతిస్తూ తలకొట్టు కుంటూంటే రసూల్‌మియా ఇంటికి తిరిగొస్తాడు. వచ్చీరాక ముందే ఆయనది ఒకటే ప్రశ్న "ఇంకా గుండెకాయ ఇట్లే వుందే?" ముసల్ది మూతి ముడుచుకొని కిమ్మనకుండా ఉంటుంది. రసూల్‌మియా లోపలికెళ్ళి చొక్కా విప్పి, వసారాలో దిట్టంగా కూర్చుంటాడు. మనమరాలు హుక్కా తెచ్చిపెడుతుంది. రెండేళ్ల అల్లరి మనవడు కరీమ్ అవ్వ ఒడిని తప్పించుకొని తాత ఒళ్లో కూర్చుంటాడు. అవ్వ వైపు వేలు చూపెడుతూ వచ్చీరాని భాషలో అవ్వపైన చాడీలు చెప్తాడు. "గొగే ముతిల్ది (గొణిగే ముసల్ది)" అంటూ తాతగారి నుండి లెమన్ చూస్, బిస్కట్లు బహుమానంగా తీసుకొని జోరుజోరుగా అవ్వను పిలుస్తూ హేళన చేస్తాడు. "ఓగొగి ముతల్ది" అని.

రసూల్మియా హుక్కా పీలుస్తూ సీరియస్ అయిపోయి ముసలిదానితో ఇలా

అంటాడు, "రహీమ్ అమ్మా, అఖరికి నీగొణుగుడెప్పుడు అంతమౌతుందే? ఎప్పుడు చూసినా నీదిదే గొడవ. ప్రతిసారి ఇది నీతో వచ్చిన ఇబ్బంది. అసలు నీకు సిగ్గూ శరమూ ఉందా లేదా?" "నోరు మూసుకో! సిగ్గూ శరమూ మాటెత్తకు" అని ముసల్ది గద్దిస్తుంది. "నువ్వెవరివే, నన్ను నోరు మూసుకోమనటానికి? వంద సార్లంటాను నీకు సిగ్గూశరమూ లేదని. అన్నింటికీ తెగించినావు. నీకే పెత్తన మిస్తే అందరినీ ఆకలితో చంపుతావు. ఎప్పుడైనా ఏదేనా తింటానికి తెస్తే గొణక్కుండా మమ్మల్ని తిననియ్యవు."

"గొగే ముతల్ది" కరీమ్ బిస్కటుతింటూ నవ్వుతూ అరుస్తాడు. పాపం ముసల్ది ఏడుస్తుంది. "అల్లా తాలా! నాకెప్పుడు చావొస్తుందో. బతికి నేనేం చేయాలి. ఈ ఇంట్లో నేనెవర్నిని? నేనెందుకు మాట్లాడాలి? మంచి చెప్పినా చెడ్డే నాకు సిగ్గూ శరమూ లేదట." మనుమరాలు గుండెకాయ పొట్లం తీసుకొని కోస్తుంటుంది. రహీమ్ గదుసెలోంచి బయటకి వెళ్ళిపోతాడు. ముసల్ది కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తూంటుంది.

రసూల్ కాకాగారూ ఇంట్లో ఉన్నారా? బయటినుంచి ఎవరో పిలుస్తారు.

"ఎవరూ? ఫక్రుద్దీనా? లోపలికిరా. ఏమిటి విశేషాలు?" రసూల్‌మియా నోట్లో నుండి హుక్కా గొట్టాన్ని తీస్తూ అంటాడు.

"కాకా. రషీదుకు ప్రొద్దుటనుంచి వాంతులు బేదులు, మందుమాకు తీసుకో లేదు. శరీరం కూడా చల్లబడింది."

"ప్రొద్దుట నుంచి ఏం చేస్తున్నారు?" అంటూ రసూల్‌మియా లేచి నిలబడతాడు. "పద చూద్దాం. ఏంకాదులే. భయపడొద్దు. ఆ పిల్ల పులుపు తీపూ ఎక్కువ తిని వుంటుంది. నయమవుతుందిలే" అంటూ మందుకోసంలోనికెళ్లాడు.

"ఫక్రూ, ఇస్మైలుకు ఎలా వుంది?" ముసల్ది అడుగుతుంది.

"నీదువావల్ల ఇప్పుడు బాగున్నాడు కాకీ. నీవేమో ఈ మధ్యరావటమే మానేశావు. కాకీ కి మనమంటే ఎందుకో కోపమంటూంది ఇస్మైల్ అమ్మ."

రసూల్‌మియా జేబులో కొన్ని చిన్న పెద్ద బాటిల్సు వేసుకొని బయటికొచ్చి 'పద' అన్నాడు. "కొంచెం బాగా చూడు. ఏమైనా మందు కావాల్సింటె పాట్నా నుంచి తెప్పించు" ముసల్ది జాలిగా అంది.

తాతగారు వెళ్లి పోయిన తర్వాత కరీమ్ నెమ్మది నెమ్మదిగా అవ్వవద్దకు వచ్చి కూర్చుని అవ్వను చూస్తూ నిష్కారణంగా నవ్వుతూ అవ్వతో సంధి చేసుకోవాలని తాపత్రయం చూపుతాడు. అవ్వతాను తిని మిగిల్చిన అర్థ బిస్కట్లు

తీసుకొని సంధి చేసుకున్నా వాడికి సమ్మతమే.

"పోరా. బడవా. మీతాత దగ్గరికిపో. బిస్కటులు ఎరచూపి బతిమాలడానికి వచ్చావు. నేను గొణిగే ముసలిదాన్ని కదా" అంటూ ఆమె తన కోపం చూపించింది. ఇటువంటి పరిస్థితుల్లో ఏం చేయాలో కరీమ్‌కు బాగా తెలుసు. జబర్దస్తీగా అవ్వ ఒడిలోచేరి, ఇప్పుడు తాతపైన చాడీలు చెప్పసాగాడు. "తాత తిందిపోతు, కోపిత్తి (తిండిపోతు, కోపిష్టి)" అవ్వ పెదవుల్లో దాగి ఉన్న నవ్వును వాడు గుర్తించి నవ్వుతూ ఏమేమో చెపుతూ అవ్వను సంతోషపరచాలని ప్రయత్నిస్తాడు. "అంటే తాతతో చేసుకొన్న క్షణిక దోస్తీ బిస్కట్లు కోసమనీ, చూశావా! తాతను మోసగించి బిస్కట్లు సంపాదించాను." దీన్నే రాజకీయం అంటారు.

గుండెకాయ కోస్తూ వాళ్లమ్మ. వాడివైపు చూస్తూ "మీ తాత రానీ, నీ మోసమంతా బట్టబయలు జేస్తాను" అంటుంది.

కరీమ్ అమ్మమాటను ఎలా సహించుతాడు. ఇంట్లో వున్న మనుషుల్లో అమ్మ మాటకు విలువలేదు. కరీమ్ అమ్మను ఇంతకుముందు ఎప్పుడూ పొగడలేదు. పొగడడు కూడా. అమ్మ నన్ను బెదిరిస్తుందా? ఆమెకు ఎన్ని గుండెలు? కొంతసేపు మౌనం పాటించి నవ్వుతున్న అమ్మను చూచి "ఊలుకో! ఎల్లిదానా" (ఊరుకో వెర్రిదానా) అని గద్దించాడు.

"రానిలే. తాతను," అని మళ్లీ అమ్మ బెదిరించింది. కరీమ్ అమ్మ మాట విని కోపంతో అవ్వ వడిలో నుంచి ఉన్నఫలంగా లేచి అమ్మపై ఆక్రమణ చేసేదానికి చుట్టూ చూచాడు. ఆయుధం ఏమైనా దొరుకుతుందేమోనని. అక్కడున్న లావుపాటి కర్రను ఎత్తలేక చేతులతోనే అమ్మపైకి ఆక్రమణకి దిగుతాడు. వెంట్రుకలు లాగుతాడు. "వదులురా వెధవా! వదులు, తాతతో చెప్పనులే" అంటూ అరుస్తుంది అమ్మ.

అవ్వ నవ్వుతూ వెళ్లి వాన్ని పట్టుకొని లాగుతుంది. కరీమ్ వచ్చీరాని మాటలతో "కోపిష్టి తాతను, నాన్నను, నిన్ను కొట్టి ఇంట్లోనుంచి బయటికి తోసేస్తాను" అని బెదిరిస్తాడు.

ఎప్పుడైనా సరే వాళ్లమ్మ కోపగించుకొంటే ఆమెను కొట్టడానికి ఉరుకుతాడు. కానీ ఇంతలోనే వాళ్ల అవ్వ వాన్ని వారిస్తుంది. పండ్లు నూరుతూ, ఏదో వాగుతూ కూర్చుంటాడు. అవ్వ, వాళ్ల అమ్మ వాడి చేష్టలను ముందే పసికడతారు. అప్పుడు "ఈరోజు పాలు తాగేటప్పుడు నిన్ను ఏడ్పించి తీరుతాడు చూడు" అని ముసల్ది అంటుంది.

ఈ మధ్య కరీమ్ ఒక కొత్త ఉపాయం కనిపెట్టాడు. పాలుతాగేటప్పుడు వాడు మధ్య మధ్యలో దీన్ని ప్రయోగిస్తాడు. "చంపినాడురా!" అని వాళ్లమ్మ గట్టిగా అరుస్తూంది. తన ఉపాయం సఫలీకృతమైనందుకు కరీమ్ కిలాకిలా నవ్వుతాడు.

వంటింట్లో కోడలు గుండెకాయ కూర చేస్తుంటే "కూరను చూడు, ఎక్కువ మాడ్చద్దు. లేకపోతే తినేటప్పుడు మీమామ పెద్దతుఫాను లేపుతాడు"అంటూ ముసల్ది బయటినుంచి అరుస్తుంది. ఉప్పుకారం, మసాలా ఎంత వెయ్యాలో మాటిమాటికి హెచ్చరిస్తూ ఆఖరికి స్వయంగా వంటింట్లోకి వస్తుంది. కరీమ్‌ను కోడలికి అప్పగిస్తూ, బయటికి వెళ్లండి. కూర నేను చూస్తాను అంటుంది. కోడలు నవ్వుకుంటూ బయటికొచ్చేస్తుంది. ఊరంతా చుట్టేసుకుని రహీమ్ ఇంటికి తిరిగొస్తాడు. ఇంటి యజమాని, ఇల్లాలు కొడుకూ, ముగ్గురూ కలిసి పాత జపాన్ గ్రామఫోనుపైన "అదాసే ఆయోకరో పన్ ఘట్‌పర్, జబ్‌తక్ రహే జిగర్‌మే దమ్" కమలార్ఝరియా పాటను వినటంలో నిమగ్నులైపోతారు.

ఇంటికి తిరిగి వస్తున్న రసూల్‌మియా చేతిలో కల్లుముంత ఉంటుంది. వరండాలో దస్తర్‌ఖాన్ పరుస్తారు. తూగుతున్న కరీమ్ కూడా లేచి కూచుంటాడు. కరీమ్ జోగాడుతూ చిన్న పళ్లెరము, గొట్టంగల చెంబు (బధనా), గ్లాసు తీసుకొని తాత దగ్గరికి పోతాడు. ముగ్గురూ కలిసి సంతృప్తిగా రొట్టె, గుండెకాయకూర తింటూ ఉంటారు. మధ్యమధ్యలో కల్లు సేవిస్తుంటారు. ముసల్ది ప్రక్కనే కూర్చుని వడ్డిస్తూ ఉంటుంది... "అబ్బా, కూరబలే బాగుంది."అనేమాట వింటూనే ముసల్ది ఉబ్బితబ్బిబ్బవుతుంది.

కరీమ్‌గూడా ఒకటి రెండు గుటకలు తాగి వూగుతాడు. ముంతలో మిగిలిన కల్లు ముసలిదాని కందిస్తూ "ఒక గ్లాసు మిగిలింది, కోడలికిచ్చేసేయి. ఈ మధ్య కోడలు చిక్కి శల్యమై పోతుంది. రోజూ ఒక గ్లాసు తాగితే, శరీరం చక్కబడుతుంది. ఇదికల్లు. బెల్లపు సారాయి కాదు. నీవెప్పుడూ తాగలేదు కదూ? నీకేం తెలుస్తుందిలే! అన్నాడు రసూల్‌మియా."

కొద్దిసేపట్లోనే ఆగుడిసెల్లోని వారంతా నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోతారు. అప్పుడప్పుడూ రాత్రిళ్లు రోగులను చూడడానికి రసూల్‌మియాకు వెళ్లే పనిబడుతుంది. అటువంటప్పుడు రాత్రంతా అతను రోగులతోనే గడుపుతాడు. ఉదయం నాస్తాతిని, అతను పట్నానికెళ్లిపోతాడు. మధ్యాహ్న భోజనం రహీమ్ తీసుకెళ్తాడు. ఇంటినుంచి మాత్రం రోజూ ముందుగా బయలుదేరి వెళ్ళినా అతని కంటే

ముందు రహీమ్ దుకాణం చేరుకుంటాడు. ఇంటినుంచి బయలుదేరి, వూరిలోని పెళ్ళి - పేరంటాలు, తంటా - తగాదాలు, రోగాలు - రొష్టులు, మందు -మాకు గురించి పల్లెవాసులకు సలహాలిస్తూ రసూల్‌మియాకు అక్కడే పన్నెండు గంటల వుతుంది. వూరి పొలిమేర దాటిన తర్వాత పొలాల్లో పనిచేసే వాళ్లతో సేద్యం గురించి రెండు మూడు మాటలు మాట్లాడందే అతని అడుగు ముందుకు సాగదు.

"ఒరే మహంగూ జాతరలో కొన్న నీదూడ ఏదిరా?"

"ఏంచెప్పను మామా, రెండురోజులయింది. గడ్డి తినడములేదు. నీళ్లు తాగటం లేదు. దీనికేమయిందో భగవంతునికే ఎరుక."

ఇంకేముంది. దూడను చూసి, దాని రోగాన్ని గుర్తించి ఫలానా వనమూలి కలు ఇమ్మంటాడు. ఇంతటితో ఆగడు. ఆవనమూలిక ఏతోటలో, ఏచెట్టుకింద దొరుకుతుందో కూడా చెప్పుతాడు. వీలైతే తానే స్వయంగా అక్కడికెళ్లి మూలిక తెచ్చి ఇసాడు కూడా.

దుకాణం చేరి తన స్థానంలో కూర్చుంటూ, "అరే! చాలా టయిం అయిపో యిందే!" అని గొణుక్కుంటాడు. కొద్ది నిముషాలు రహీమ్ చేసే పనిని చూసి, "అది ఇట్ల ఇయ్యి. దాని సంగతి నేను చూస్తాను గాని అంతవరకూ నీవు ఆ 'భోలా' గడియారాన్ని చూడు" అని అంటాడు.

విరిగి పోయిన కుర్చీమీద కూర్చున్న వ్యక్తి భోలా ఎవరని అడిగితే, పనిచే స్తూనే భోలా జీవిత చరిత్ర ఎత్తుకుంటాడు. "అరే! భోలా తెలియదా. ఆభోలానే. అదే కాంగ్రెసు భోలా నీకు తెలుసుగదా. అతనేనయ్యా జైలులో బి.ఎ. పాస్ అయి నాడు చూడు. ఏం పిల్లోడులే భోలా...ఇది చూడండి. ఈ గడియారం హియర్ స్ప్రింగు ఎంతో పాడయ్యిందో? అందుకే అంటారు. చౌక సరుకు చౌకే అని...భోలా పట్టినపట్టు విడిచేవాడు కాదు. నేను ఎంతో మంది పిల్లవాల్లను చూశాను కాని..."

వినేవాడు తనకు అపరిచితుడైన భోలాను గురించి చెప్పిన మాటలతో తిక మక పడి "అరే ఏ భోలా గురించి ఇంత మెచ్చుకుంటున్నావయ్యా...ఆపొడుగు పాటి వెంట్రుకల వాడా?" అని అడుగుతాడు.

'అరే సాహెబ్ అతనుగాదు' అంటూ రసూల్‌మియా చెప్పుకుపోతాడు. "పొడు గుపాటి వెంట్రుకలతను అవనీందర్. అవనీందర్ కూడా భోలా స్నేహితుడే. అతను విచిత్రమైన వ్యక్తి. అతను కవికూడా. మీకు తెలుసా? కవిత్వం వ్రాయటంలో ఆరి తేరినవాడు. గంగిగోవుమాదిరి సాధు స్వభావం కలవాడు. కానీ ఆకారం చూస్తే తిరుగుబోతులా ఉంటాడు."

"ఓ రసూల్‌కాకా! చూడు ఏం చేస్తున్నాడో?" అంటూ ఒక గొల్లపడుచు ఏడుస్తూ అతని ముందు నిలబడుతుంది. చూడు రసూల్‌కాకా, పాలకుండ పగులగొట్టి చేతులు పట్టుకొని లాగుతున్నాడు అంటుంది.

"అరే ఎవరూ? ఎవడువాడు?"

"సతీష్‌బాబు కొడుకు."

"సతీష్‌బాబుతో చెప్పలేదా?"

"చెప్పాను. ఏమి లాభం! ఫో, లంజముండా, అంటూ నన్ను కొట్టడానికి వచ్చాడు." రసూల్‌మియాకు కోపమొస్తుంది. "ఈ ధనవంతులున్నారే! అందరూ నంబరు వన్ దొంగలు. చూడు సుదమియా పోయి సౌదాగర్ సింగును కొంచెం పిలువు" అని పని వదిలేసి అంటాడు. గొల్లపిల్ల సుదమియా కళ్లనీళ్లు తుడుచు కుంటూ వెళ్లతుంది. రసూల్‌మియా వాక్కుంటున్నాడు. "పైసలుతో పొగరెక్కిం ది. అడదాని పై అత్యాచారానికి పాలుపడతారా! దొంగ వెధవలు."

"అరే మెకానిక్, ఈ ఆడపిల్లలను తక్కువగా అంచనా వేయకు. భలే ఆట పట్టిస్తారు. లేకపోతే యుక్తవయసులో ఉన్న ఈ పిల్ల పాలు అమ్మేదానికి ఎందుకొ చ్చినట్టు!"

"ఊరుకోండి. ఈపిల్ల నాకూతురుతో సమానం. పల్లెటూరి పిల్లలు అమాయ కులు. మీకు తెలియదేమో! మీపట్నం పిల్లలమాదిరి కాదు. పాలు అమ్మితేగాని పొట్ట గడవని చోట మిగతా కుటుంబసభ్యులంతా జబ్బుపట్టిపోతే డాక్టరును పిలు వడానికి, పాలు అమ్మేదానికి యుక్తవయసు లో ఉన్న ఈ పిల్ల రాకపోతే వాళ్ల గతేమిటో మీరే చెప్పండి. కష్టాల్లో చిక్కుకొని వున్న వాళ్ల ఆడపిల్లలపై అత్యా చారం చేయటమేనా ఈపెద్దమనుషుల ధర్మం!"

సౌదాగర్‌కాకాగారు ఇంట్లోలేరని సుదమియా వచ్చి చెపుతుంది. సుదమి యాను తీసుకొని రసూల్‌మియా ఒక్కడే వెళతాడు.

చాలాసేపటికి రసూల్‌మియా తిరిగి దుకాణానికి వస్తాడు. దుకాణంలో అడు గుపెడ్తూ గొణుక్కుంటాడు, "మొనగాడట, ఒకరోజు పద పల్లెటూరికి అందరి ఎదుట వీధిలో పడేసి తన్నకపోతే నాపేరు రసూల్‌మియా కాదు." దుకాణంలో ఒకమూల కూర్చుని ఉన్న కూరలమ్మిలను చూసి, "ఏమమ్మా! ఈరోజు చాలా ముందుగా వచ్చేసారే" అని అబ్దుల్ తల్లితో అంటాడు. "మేము ఎప్పుడో వచ్చే సామిక్కడికి. కొంచెం మాలెక్కలు చూసి చెప్పరాదా ముసలయ్యా" వారందరూ మూకుమ్మడిగా అడిగారు.

"ఉండండి, ఉండండి. ఒక్కొక్కరే చెప్పండి. హమీదన్, నీవు చెప్పు , కాక రకాయలెన్ని అమ్మావు?...పదమూడు శేర్లు. ఏ ధరకు అమ్మావు? నాలుగు అణాలా?...అంటే పదమూడు నాలుగులు యాభైరెండు. యాభైరెండు అణాలంటే మూడు రూపాయల నాలుగు అణాలు. పైసలేవి చూపు?...ఆ సరే, సరిగ్గా ఉన్నా యి. నీవు చెప్పు నీదొండకాయలెన్ని అమ్ముడుపోయాయి?... అటువైపు వున్న ఒక గ్రాహకున్ని సంబోధిస్తూ - బాబుగారూ చూస్తున్నారు గదా, ఇప్పుడు నాకు తీరిక లేదు. మీరు రహీమ్‌తో పనిచేయించుకోండి" అని అంటాడు.

వాళ్ల లెక్కలు జూస్తూ, రూపాయబిల్లలు చెల్లేవో, చెల్లనివో పరీక్షిస్తూనే సాయంత్రం అయిపోతుంది. పని బంద్‌జేసి రహీమ్ వెళ్లిపోవడానికి సిద్ధమవు తుంటాడు... "అరే రహీమ్, వీళ్లని నీవెంట తీసుకుపో. చీకటి అవుతుంది. నేను కొంచెం అలా వెళ్లివస్తాను. అంటూ రసూల్‌మియా అక్కడినుంచి వెళ్లిపోతాడు. కూరలమ్మలను వెంటతీసుకుని రహీమ్ బయలుదేరుతాడు. దారిలో ధేనుసాహు దుకాణం రాగానే కూరలమ్మలందరూ ఒకరొకరు రెండు పైసలకు బీడీలు, జిలే బిలు గంటలకొద్దీ కొంటూ ఉండిపోతారు. రహీమ్ మాత్రం రోడ్డుపై నిలబడి వాళ్ల కోసం నిరీక్షిస్తూ ఉంటాడు."

రసూల్ మెకానిక్ వద్ద రిపేరయిన వస్తువులు చాలా రోజులు మన్నుతాయి. రసూల్ మెకానిక్ వద్దనే అందరూ తమ సామాన్లు రిపేరు చేయించుకోవాలని ఇష్టపడతారు. "కానీ రసూల్‌మియాకు దుకాణంలో కాలు నిలువదు. ఒకవేళ కూర్చున్నా ఏదో సగం పనిచేసి మిగతాది కొడుకుపై రుద్దుతాడు" అని గ్రామస్తులు వాపోతా రు. ఆయన నమ్మకస్తుడు. ఏదేనా దాచుకోకుండా ఖరాకండిగా అనేస్తాడు. అందు వల్ల గ్రాహకులు తక్కువ వస్తారు. రఘు అనే వాడు మొదట రసూల్‌మియా దగ్గ రనే నౌకరుగా పనిజేసేవాడు. ఇప్పుడు వేరుగా తన సొంత దుకాణాన్ని నడుపు కుంటూ బాగా ధనవంతుడయ్యాడు. రసూల్‌మియా సంగతి ఎక్కడున్నావు గొంగళి అంటే వేసినచోటనే అన్నట్లుంది.

పది - పదకొండు సంవత్సరాల క్రిందటి మాట - స్టౌ రిపేరు చేయించుకొం దామని నేను రసూల్‌మియా దగ్గరికి వెళ్లాను. స్టౌవిప్పి చూస్తుండగానే ఓ పల్లెటూరి మధ్య వయస్కురాలు వచ్చి "నగలేమొతిరిగివ్వడు. వడ్డీ తీసుకురాపో అని దబా యిస్తున్నాడు" అని అక్కడకొచ్చి వాపోతే రసూల్‌మియా స్టౌరిపేరుచేసే పని వదిలేసి ఆమెతో పాటు వెళ్లడానికి నిలబడ్డాడు. 'నా స్టౌ' అని నేను అతన్ని వారిం చాను.

"రేపు తయారుజేస్తా."

"అయితే నాస్తా నేను తీసుకుపోతా" అని నేను కోపంగా అంటే... "తీసుకు పోవయ్యా" రసూల్‌మియా గర్జిస్తూ అన్నాడు..."ఇతరుల మానం పోతూంటే, ఈయనకు తన పని ముఖ్యమయింది. పాపం ఈవిడ కూతురికి ఈరాత్రికి శోభనం ఉంది. నగలేమో తాకట్టులో ఉన్నాయి. ఆసేటుగాడేమో నగలివ్వనంటున్నాడు..." నేను స్టౌ తీసుకొని ఎప్పుడూ వీడిదుకాణానికి రాకూడదు. నాకు తెలిసినవాళ్ళను కూడా వీడిదగ్గరికిరాకూడదని వారించాలి అని మనస్సులో ప్రతిజ్ఞ చేసి తిరిగొచ్చాను.

కాని ఇప్పుడు రసూల్‌మియాను పూర్తిగా అర్థము చేసుకోగలిగాను. బాల్యం నాటి ప్రతిజ్ఞ గుర్తుకువస్తే నాకు ఏదోలాగుంటుంది. ఒకసారి సైకిలు రిపేరుకిచ్చాను. 15 రోజులనుంచి రోజూ వస్తూనే ఉన్నాను. కానీ రసూల్‌మియా దుకాణంలో దొరకడు. రహీమ్‌ను అడిగితే వాళ్ల నాన్నే రిపేరు చేసిస్తాడు అని అంటాడు. ఎప్పుడైనా అదృష్టం కొద్ది రసూల్‌మియా కంటపడితే ఆయన అంటాడు. "సైకిలు రిపేరుకంటే కూడా చాలా ముఖ్యమయిన పని ఉంది బాబు. అనాథమహిళలకు వస్త్రాలు ఇప్పించాలి. ఏడురోజుల నుండి బట్టలకోసం వీళ్లు తిరుగుతూనే ఉన్నారు. బట్టలు పంచే చోట గుంపులో ఊపిరి ఆడక క్యూలో గంటల తరబడి నిలబడి కూడా ఖాళీగా తిరిగొస్తున్నారు."

మరొక దఫా విచారిస్తే...పల్లెలో మలేరియా వ్యాపించిందని, క్వైనైన్ మాత్రలు దొరకటం లేదని అందుచేత రసూల్ మెకానిక్కు వనమూలికల కషాయం చేసి రోజంతా ఊరిలో పంచుతున్నాడని తెలిసింది.

ప్రతిరోజు ఖాళీగానే తిరిగొస్తున్నాను. ఒకరోజు మర్రిచెట్టుకు వ్రేలాడుతున్న ఇనుపరేకు పైన రాసిన అక్షరాలు కంటపడ్డాయి..."మెకానిక్ రసూల్ - ఇక్కడ మరమ్మత్తులు చేయబడును."దాని ప్రక్కనే తుంటరివాడు జోడించి వ్రాసిన అక్షరాలు ఇక్కడ మనుషులకు కూడా మరమ్మత్తులు చేయబడును కంటబడ్డాయి. లోలోపల ఈ మాటను సమర్థించుకుంటూనే సైకిలు లేకపోతే నాకు చాలా కష్టంగా ఉందన్న విషయాన్ని కూడా మరిచిపోయాను.

(1946)

# మూడు చుక్కలు

గీతాలిదాస్ తనను స్వరజీవి అంటుంది. నాదం, స్వరం, తాళం మూలంగానే ఆమె ఇంతవరకూ ఎదగ గలిగింది. అందరూ ఆమె సాధన సఫలమైంది అంటారు...మనుష్యులు ఎంత అమాయకులు! సాధన సఫలమైంది, అసఫలమైందని చాటే వాళ్లను ఆమె ఒకటే ప్రశ్న అడుగుతుంది; "సఫలసాధనకు తాత్పర్యమేమిటి? ఎన్నో సంగీతేతర వాతావరణాలను గీతాలి తన సుమధుర స్వరంతో సుగమగీతాలతో సంగీతమయం చేసింది. నిజమే. ఈనాటికి కూడా సంగీత సమ్మేళనాల సాంస్కృతిక సంస్థల నిర్వాహకులు గీతాలి పేరు చెప్పి గాన - సంగీత ప్రియులను ఆకట్టుకుంటారు...కానీ ఇంకెన్నాళ్ళు? 'మీతాలి' సఫల సాధన పరిణతి ఏమైంది? గీతాలి తన అక్క మీతాలి తప్పిదాలను చూచి పాఠం నేర్చుకుంది."

విశుద్ధ 'ఠుమరీ' గాయిక మీతాలి గారి 24 నెలల సఫల జీవనసరళి ముందట సాంప్రదాయానికి విరుద్ధంగా గడిపిన తన స్వర జీవితపు పుటలను నెమ్మనెమ్మదిగా తిరగేసు కుంటుంది గీతాలి. ఒకటి రెండేళ్లు కాదు. తొమ్మిదేండ్లు! నూటాఎనిమిది నెలలు అంటే తక్కువ సమయమేమి కాదు...

గీతాలి ఇప్పుడు తరచుగా తన మదిలో ఉద్భవించే సహకారనాదలను గురించి ఆలోచిస్తుంది...సహకారనాదం. దీన్నే 'ఓవర్ టూన్' అంటారు. నాదం ఎప్పుడూ ఒంటరిగా ఉత్పన్నం కాదు. ఒక నాదంతో పాటు ఇతర నాదాలు కూడా పుట్టుకొస్తాయి. ఈ ఇతర  నాదాలను వినగలిగినా, వినలేక పోయినా మూలనాదంతో ఉద్భవించిన ఈ నాదాలు సహకారి నాదాలని పిలువబడుతాయి. వాటంతట అవే పుట్టటం వలన వీటిని 'స్వయం భూనాదాలు' అంటారు. గీతాలి ఈనాదాల సహకారంతోనే సిద్ధి, ప్రసిద్ధి పొందగలిగింది. నిత్యం ప్రార్థన స్వరాలతో ప్రతిక్షణం నినాదింపబడుతున్న జీవన స్వర తాళాల హద్దులను మీరి అవిదెపుడూ బయటకి రాలేదు. కానీ హద్దులను విస్తరింప జేసిన మాట నిజం...కానీ ఈ మధ్య కొద్దిరోజుల నుంచి ఆమెకు ఒకవిధమైన భయం పట్టుకొంది. గేయాలు ఆలపించేటప్పుడు ఒకటి రెండుసార్లు స్వరాలు తడబడ్డాయి...

"హూ,హూ, హోహో...ప్రార్థనాగీతం మల్లే జీవితం మారెగా!"

గీతాలి తన జీవితంలో కొన్ని ఘట్టాలను కత్తిరించుకొంటుంది. తునాతునకలు చేస్తుంది. నలిపేస్తుంది. తర్వాత ఈ నలిపివేయబడ్డ క్షణాల స్వరకణికలను సహకార నాదాల సహాయంతో పరీక్షిస్తుంది...'డాట్ డాట్ డాట్!' గీతాలి ఈ చిరు బిందువులను కళ్ల ముంగటి శూన్యంలో ప్రత్యక్షమయ్యే చిన్న నక్షత్రాలను ఎప్పుడూ ఇష్టమైన దృష్టితో చూస్తుంది. ఈ శుభ సంకేతాలని గుర్తిస్తుంది...

గీతాలి స్వరజీవే అయినప్పటికి ఆమె సాహిత్య జగత్తులోని సాధన, దానిప్రగతిని గురించి కూడా ఎరుగును. ఆమె బావగారు తానొకనాడు ప్రసిద్ధి పొందగలనని, విమర్శకుడు కాగలనని ఆ అవకాశానికై ఎదురుచూస్తూ ఉంటాడు. టైంబాంబు!...టైంబాంబుకాదు. ఆలుబాంబు! (ఆలుబోండా) వేడివేడి బంగాళదుంపల బోండాల ప్లేటు తీసుకొని గీతాలి బావగారి రూములోకి వెళ్లింది.

సుదర్శనా, ఆదర్శనా కూడా వెంట వెళ్లారు. వికట నవ్వును తమాయించుకొని గంభీరంగా ఉండటానికి ప్రయత్నిస్తూ. "చూడండి బావగారూ, ఇది ఆలుబోండా అంటే బాంబు. దీనిలో బంగాళాదుంపలు పచ్చిశనగ గింజలు బంధించబడి వున్నాయి...స్వచ్ఛమైన నెయ్యితో చేయబడిన ఈ అవిస్ఫోటక బాంబు పగలదు. కాని జోడించే అవకాశాన్ని కలిగిస్తుంది...ఇంతవరకూ ఇది కూడా బంగాళాదుంప మాదిరే అవకాశంకొరకు ఎదురుచూస్తు కూర్చుని వుంది."

చిలిపి సుదర్శన "కాదు కాదు. బంగాళదుంపలనవద్దు. బావగారూ అవకాశం దొరుకుతూనే పైకి దూకే క్రూరమృగం కాగలడు. లేడిపిల్ల కనబడిందంటే చాలు" మూతిని తిప్పుతూ అంది. 'హ,హ,హ,' బావగారు కూడా నవ్వారు. కానీ అక్కయ్య బాధపడింది...ఏది ఏమైనా, బావగారి పుస్తకాలు కొనే విచిత్రపు అలవాటు కారణంగా గీతాలి ఆమె స్నేహితురాండ్లు సుదర్శనా ఆదర్శనలకు బాగా లాభం కలిగింది. కథాసాహిత్యానికి సంబంధించిన అనేక మంచీ చెడు పుస్తకాలు వాళ్లకు చదవటానికి దొరికేవి.

ఆధునిక కథా సాహిత్యంలో ఒక వర్గం ఉంది. అదే డాట్‌వాదుల వర్గం. డాట్ డాట్ డాట్. ఇప్పుడు ఇది పెద్ద సమస్యగా తల ఎత్తలేదుగాని, ముందు ముందు ఈ ప్రశ్న తల ఎత్తవచ్చు. "ఈ డాట్ వాదుల బుర్రల్లో ఉండేది డాట్ డాట్ డాట్ మాత్రమేనా! మెదడు స్థానంలో చాపగుడ్ల సంచి ఏమైనా ఉందా?...ఈ విధంగా ఎక్కువ సంఖ్యలో చుక్కలు, డాట్‌లు ఉన్నా రచనలను సాధారణ పాఠకులు మంచి దృష్టితో చూడరు. పుస్తకమంతటా పేజీల్లో, పంక్తుల్లో అక్కడక్కడా ఆవగింజలమాదిరి చెల్లాచెదురై ఉన్న ఈ బిందువుల ఆధిక్యత చదువరుల కండ్లల్లో

నలుసుల్లా మెదులుతాయి."

గీతాలి ఈ బిందువులను వేరే జగత్తుకు కిటికీ అనుకొంటుంది. మూడు గుండ్రని ఎర్రటి అద్దపు కిటికీల మాదిరి లోపల వెలుతురు ఉంటుంది. విచిత్ర జగత్తులో కార్యకలాపాలు మొదలవుతాయి...

ఈ మూడు బిందువుల సహాయంతో అసందర్భ ప్రసంగాలకూ, సంబంధం లేని ముహూర్తాలకు రూపకల్పన చేయగల మరోలోకపు దీప్తిని చూపించగలిగిన, ఉల్లిపాయల పై పొట్టు ఒలిచేటట్లు శబ్దాలనూ ఒలిచేసే రచయిత ఎవరైనా ఎదురైతే గీతాలి అతనితో తప్పక ఇలాగంటుంది, "మీరు నమ్మండి. నమ్మకపోండి. ఇవి సహకార నాదాలే. ఈ ఓవర్ టూన్ లేక సహకార నాదాల సృష్టి స్వతహాగ జరగటంలేదా? మనసు యొక్క లెక్కలేనన్ని కిటికీల నుండి తొంగిచూసే ముఖాలు మాట్లాడటంలేదా?... మాట్లాడేది, మరల కాలదన్నేది, మాటల రహస్యాలు విప్పేది...ఎవరో రచనా శిల్పి జవాబు చెప్తున్నట్లు గీతాలి మానసిక వనంలో ఏదో పక్షి నిరంతరం కూస్తూనే ఉంది."

గీతాలికి ఉన్నట్లుండి వాద్యయంత్రాలు రిపేరు చేసే యంత్రకారుడు (మెకానిక్) 'హారాధన్' గుర్తుకొచ్చాడు. ఎన్నో ముఖాలు స్ఫురణకొచ్చి లుప్తమయిన తర్వాత...డాట్ డాట్ డాట్. తర్వాత యంత్రకారుడు హారాధన్ యొక్క తైల వర్ణ చిత్రం ఆమె మనోఫలకంపైన వ్రేలాడుతుంది...

ఇప్పుడు ఆ యంత్రకారుడు ఎక్కడున్నాడో! తన రెండు చేతులను జోడించి, శూన్యంలో గీతాలి నమస్కరించింది.

జీవితానికి చుట్టుప్రక్కల మారుమ్రోగే సహకార నాదాల ప్రథమ పరిచయం హారాధన్ యంత్రకారుని వల్లే కలిగింది ఆమెకు. హారాధన్ వాద్య సంగీతకారుని, ఆమె మెకానిక్కుగా కాదు, తన గురువుగా గుర్తిస్తుంది. వాద్యసంగీతకారుని మంత్ర బలంవల్లనే గీతాలికి సంగీతంపైపిచ్చి వ్యామోహం కలిగింది. "ఆరితేరిన వేటగాడుగా తయారవాలంటే మనిషికి రకరకాల వేటగాళ్ళవద్ద తర్ఫీదు పొందాల్సి ఉంటుంది. సింహం, ఎలుగుబంట్లను వేటాడే వేటగాళ్ళను మొదలుకొని పులి, పిట్టలను, పాములను పట్టే వాళ్ల సాంగత్యం కూడా చేయవలసి వస్తూంది. వాద్య సంగీత కారుడు, మెకానిక్, పనివాడు నన్ను ఏరీతిగానైనా పిలువు. నీవు నామనవరాలి వయస్సు దానివి, తాతమాట వింటావా?...వాద్య యంత్రాలను మీటుతూ సహకారనాదాలను, ఆందోళనాభరితమైన అయిదువేల ధ్వనులను పుట్టించవచ్చు. ఈ సూక్ష్మాలను నీవు గ్రహించగలవు. నిరంతరం ధ్వనిస్తున్న తెలిసీతెలి

యని స్వరాలతో నీ జీవితపు ప్రతికణం ప్రస్ఫుటించగలదు."

ఇప్పుడు ఆ పదిసంవత్సరాల పూర్వపు మాటలు గుర్తుకు వస్తున్నాయి...

ఆ స్వరమందిరపు మేనేజరును చీవాట్లు పెట్టవలసిన అవసరం ఏర్పడింది గీతాలికి...

నగరంలో అన్నింటికంటే పాతదైన, నమ్మకమైన వాద్యయంత్రాల దుకాణాల పరిస్థితి ఇలా తయారయ్యింది. ఏమిటి? ఒక వారంలోనే మూడు మార్లు తంబూరాను రిపేరు చేయించుకొని వచ్చాను, కానీ మునపటిలాగానే అయ్యింది. పాటపాడేటప్పుడు మధ్యలోనే తంబూరా ధ్వని ఆగిపోతుంది...దీనికి పట్టిన రోగమేమిటో తెలుసుకొనే నిపుణులు మీవద్ద ఎవరూ లేరా? దీన్ని స్వరమందిర్ అనాలా లేక అస్వరమందిర్ అనాలా. ప్రాణంలేని మైకు మాదిరి మేనేజరు నోరు తెరిచింది తెరిచినట్లే ఉండిపోయింది. కానీ అతనేమీ జవాబివ్వలేదు. తంబూరా తీసుకొని మరెప్పుడూ అక్కడకి రాకూడదని ప్రతిజ్ఞ చేసుకొంటూ మెట్లనుండి దిగివచ్చేసింది గీతాలి. ఒకటి రెండు మూడు...

ఏమండీ అక్కగారూ! వినండి, వినండి. కొంచెం దూరమెళ్లిన తర్వాత వెనుకవైపు నుంచి వస్తున్న పిలుపును విని గీతాలి తిరిగి చూసింది. ఒక బొద్దుగా, పొట్టిగా ఉన్న పిల్లవాడొకడు గంతులేస్తూ ఫుట్‌పాత్ పైనుంచి వస్తున్నాడు. "ఎవడు వీడు? ఛీ, ఏలాగున్నాడు?" దగ్గరిగొచ్చి పిల్లవాడు "మీరు గీతాలి అక్కగారా? అవును గదూ...ఈ తంబూరా ఏమయ్యింది? స్వరమందిరంలో వాద్యయంత్రాల కుత్తుకలను ఇదేవిధంగా నలిపేస్తారు. 'మెకానిక్ హారాధన్ వాద్యకారుడు స్వర మందిరానికి నమస్కారంచేసి వెళ్లిపోయిన తర్వాత అక్కడ మిగిలినవారు అందరూ అసురులే.' ఈ మాట మీరు బహుచక్కా చెప్పారు గీతాలి అక్కగారూ" అని నమస్కరించి అన్నాడు.

పిల్లవాని బుద్ధి పరిపక్వమయిందే కానీ ఏదో ఒక గ్రంధి ఏర్పడినట్లుంది. అంత పొట్టిగానూ లేదు. ఇంకా మీసాలు రాలేదు. తన పేరు 'ఘుఘలు' అని చెప్పాడు. అస్సాంలో ఎక్కడో పుట్టాడట. వాద్యసంగీతకారుడు హారాధన్ వద్ద గత పదిహేను సంవత్సరాలనుంచి ఉంటున్నాడట. అతనితో పాటు కలకత్తాలో ఏడెనిమిది సంవత్సరాలు, రెండు మూడేండ్లు అక్కడ -ఇక్కడ . ఇక్కడ ఉండబట్టి ఐదారేండ్లు అయిందట. "వాద్యసంగీతకారుడు హారాధన్ ఇప్పుడు ఏదుకాణంలో పనిచేయటంలేదు. తన వీధిని వదలి బయటికి పోడు. వీధేమిటి తన రూము వదలి బయట అడుగు పెట్టాలన్నా అతనికి అవకాశం దొరకటం లేదు."

అని ఘుఘలు అన్నాడు. ఎందరో పాత కొత్త వాద్య యంత్రకారుల పేర్లు లెక్క పెడ్తూ వాడు గీతాలీతో "ఎవరిదైనా వాద్యయంత్రాన్ని సరిజేయించుకోవాలంటే వాళ్లు హారాధన్‌ను వెతుకుంటూ అతని ఇంటికొస్తారు. ఒక చోట నుంచి ఏమిటి, కలకత్తా నుంచి, లక్నో నుంచి కాశీ నుంచి వస్తూ వుంటారు," అన్నాడు.

గీతాలి హారాధన్‌వద్దకు వెళ్లేదానికి ఒప్పుకొనింది. ఘుఘలు రిక్షావాణ్ణి పిలిచాడు. "ఏ రిక్షా, దూధ్ కూప్ మొహల్లా వస్తావా."

దూధ్‌కూప్ మొహల్లోలోని ఒక వీధి. అవీధిలో కొంచెం దూరం వెళ్లిన తర్వాత ఘుఘలు ఒక పెంకుటింటి ముందర ఆగాడు. మూసిన తలుపులలోని ఒక రంధ్రానికి కన్ను ఆనించి లోపల జరుగుతున్న వ్యవహారాన్ని గమనించాడు. గొళ్లాన్ని వూగించాడు. లోపలి నుంచి ఖంగుమనే శబ్దము, అన్యమనస్కుడై వున్న వ్యక్తిది మూసివున్న తలుపు రంధ్రాల ద్వారా బయటికి వినబడింది. లోపలి నుంచి అతను అడిగిన అన్ని ప్రశ్నలకు బయటి నుంచే జవాబిచ్చి ఘుఘలు అతన్ని సంతుష్ట పరిచాడు. అప్పటికిగాని తలుపులు తెరవబడలేదు. లోపలవున్న వ్యక్తి తనువున్నచోటు నుంచే ఏదో దారంతో గొలుసును లాగినట్లు శబ్దం అయింది. తలుపులు తెరుచుకున్నాయి. ఘుఘలు లోపలి కెళ్లాడు. "మరలా ఎవరిని పట్టుకొచ్చేవు? ఎక్కడి నుంచి? అని అతను ఘుఘలును కర్కశంగా అడిగాడు."

ఘుఘలు మాట్లాడే తీరును చూస్తే అతను చాలా ప్రాధేయపడుతున్నట్లుంది. "మాస్టారూ, కాదు అనకండి...ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరౌతుంది..." బయట నిల్చునివున్న గీతాలికి ఘుఘలు ఈవిధంగా బ్రతిమాలుకోవడం నచ్చలేదు. కానీ శృతిలేని వాద్య యంత్రంతో సాధన ఎలా చేయగలదు? ఆమెవూరుకుండిపోయింది. వికృత ఆకారంగల అమధ్య వయస్కుడు కోపంతో తలుపునుంచి బయటికి తొంగిచూసి అడిగాడు. "ఏమయింది?..." స్వరమందిరము వాళ్లు ఈవాద్యానికి ఏగతి పట్టించారు! ఇక్కడవుంచిపో. మూడురోజుల తర్వాత రా...వాహ్వా. దీని తొడుగు చాలా బావుందే. ఈవాద్యయంత్రాన్నెప్పుడైనా వాయిస్తావా? లేక...హారాధన్ మాటలు విని గీతాలి ఆశ్చర్య చకితురాలైంది. సుమధుర స్వరంలో ఎవరో కావాలని కర్ణకఠోర ధ్వనిని సృష్టిస్తున్నట్లు ఆమె కనిపించింది. ఆమె మౌనం పాటించింది. వాద్యసంగీతకారుడు గీతాలి ముద్రలను అర్థం చేసుకొనే ప్రయత్నం చేశాడు. "ఏమిటి? ఏ ఆలోచన్లో వూగిసలాడుతున్నావు?..." అతని స్వరంలో కోమలత్వం చోటుజేసుకుంది. "ఈ శృతి తప్పిన వాద్య యంత్రాన్ని సరిజేయటానికి పది నిమిషాలు కూడా అవసరంలేదు..." లోప

లికిరా.

హారాధన్ రూములో ప్రవేశించిన గీతాలి సంతుష్టురాలైంది. గోడలకు గ్రామ ఫోను రికార్డూ కంపెనీ ద్వారా ప్రచురింపబడిన ప్రసిద్ధ భారతీయ సంగీతకారుల ఫోటోలు వ్రేలాడుతున్నాయి. ప్రశస్తి పత్రాలు, సర్టిఫికేట్ల మాదిరి కొన్ని ఫ్రేముల్లో వ్రేలాడుతున్నాయి. నేలపైన రకరకాల వాద్యయంత్రాలు చెల్లాచెదురుగా పడు న్నాయి...రేడియోలో వాద్యసంగీత కార్యక్రమంలో సరోద్ సంగీతం వినబడు తుంది...'అకరామ్' భవిష్యత్తులో పైకి రాగల సరోద్ వాదకుడు. అకరామ్ తాను రూపొందించిన "ప్రార్థన పదాలను వాయిస్తున్నాడు. మధ్యమధ్యలో సరోద్ తంత్రుల నుండి శంఖము, గంటధ్వనులు ప్రతిధ్వనిస్తున్నాయి. హారాధన్ ఆపాత చిన్న రేడియో సెట్టును చూపిస్తూ, "వింటున్నావు గాదా? అకరామ్ ఏడు సంవత్స రాల నుంచి ఈ సరోద్‌ను వాయిస్తూ ఉన్నాడు. ఇప్పటికీ అది కొత్తదాని మాదిరి వుంది. వాద్యయంత్రాన్ని, వాడటం అంటే దాన్ని పూజించడం అన్నమాట" అని అన్నాడు.

హారాధన్ సితార, సరోద్, సుర్‌బహార్, దిల్‌రుబా, వీణ మున్నగు వాద్య యంత్రాలను వాయించే ప్రసిద్ధులైన సంగీత విద్వాంసులను గురించి చెప్పాడు. ఐదు నిమిషాల ఈ కొద్దిపాటి పరిచయంతో గీతాలికి వాద్యకారుని మాటలపైన విశ్వాసం కుదరలేదు. ఇది అతను గమనించాడు. తన సూటుకేసులోంచి ఏన్నో క్రొత్త పాత ఉత్తరాలను తీసి గీతాలికి చూపి చదవమన్నాడు. ప్రఖ్యాత సితార వాదకుడు ఉస్తాద్ ఖాదిర్ హుస్సేన్ ఐదు సంవత్సరాల క్రిందట కలకత్తానుంచి ఎంతో ఆప్యాయతతో వ్రాసిన ఉత్తరమది. "మిత్రమా హారాధన్, నిజంగానే నీవు మాకు హారధనుడవయ్యావు...నావాద్యయంత్రానికి ఏమో అయింది. కానీ దీని మరమ్మతు కొరకు ఎవరో ఒకరికి ఇవ్వాలంటే నాకు మనసొప్పలేదు. నీవు కలక త్తారావని నాకు తెలుసు. నేను నీవద్దకు వస్తున్నాను..."

రేడియోలో హేమంతరాగ ఆలాపనకు యోగేంద్ర సూరిగారు తన ఫిడే లును శృతి కలుపుతున్నాడు...వాద్యయంత్రాలను ప్రాణంలేనివని ఎవరనగలరు?

గీతాలి ముగ్ధురాలైంది. ఎందరో వాగ్గేయకారులు, పేరు గడించిన సంగీత విద్వాంసులు ప్రేమతో వ్రాసిన ఉత్తరాలు, అకరామ్‌ని ప్రార్థనాగీతం, యోగేంద్ర సూరిగారి ఫిడేలు సంగీతం, ఘుఘులు గురు భక్తి ఇవన్నీ కలిసి వాద్య సంగీత కారుడు హారాధన్ ఆత్మ యొక్క నిజమైన చిత్రపటాన్ని గీతాలి ముందు వుం చాయి.

ఘుఘులు స్టౌవెలిగించి టీ తయారుచేసే ప్రయత్నంలో వున్నాడు. బట్టలకు అస్తర్లు కట్టినట్లు మధ్యమధ్యలో ఉస్తాదుగారి మాటలకు తానుకూడా కొంత జోడిస్తూ ఉన్నాడు... 'మహదేవ్‌లాల్‌గారు' మామూలు మనిషిగాదు. ఆయన తబలా వాయిస్తూంటే ఏమి చెప్పాలిలే. ఖాన్‌సాబ్ దానకర్ణుడికి మల్లే జేబులోంచి పిడికెడు నోట్లు తీసి బహుమతిగా ఇచ్చేవాడు... సారంగ్ విద్వాంసుడు 'మున్నాజీ'కి ఆరోజు నుంచి నేనంటే మహా చెడ్డకోపం.

ఘుఘులు టీ తెచ్చిపెట్టాడు. ఒక గుటికెడు టీ తాగిన తరువాత హారాధన్ ఇలా చెప్పసాగాడు. "యంత్రకారుడు లేక వాద్యయంత్రాలు రిపేరు జేసే మెకానిక్కు ఏమని పిలిచినా అపస్వరముగలవాడని ఎవరూ పిలవరు..నాచేతులారా చేసుకొన్నాను కాబట్టి అనుభవిస్తున్నాను. నోరులేని కర్ర తీగలేకపోతే ఎండబెట్టిన చర్మాలపైన స్వరాలను పలికిస్తూ జీవితాన్ని గడపడమే తప్ప ఇప్పుడు వేరే గత్యంతరమేమి లేదు. శాపగ్రస్త జీవితాన్ని గడపటమే తప్ప ఇప్పుడువేరే గత్యంతరమేమి లేదు. శాపగ్రస్త జీవితాన్ని గడుపుతున్నాను..."

నీవు నామనుమరాలి ఈడుదానవు. ఒకానొకప్పుడు నేను గూడ పాడేవాణ్ణి నీవు ఈ మాటనమ్మగలవా? నాపాట విని లేళ్ల గుంపులు పరుగెత్తుకుంటూ వచ్చేవి..."

యంత్రకారుడు సూట్‌కేసు మూతను తెరిచాడు. ఏదో వెతుకుతూ అంటున్నాడు. నీవు నామాటలను నమ్మటం లేదని నాకు తెలుసు. విడ మరిచి చెప్పాల్సి వస్తున్నది...జీబచపూరు స్టేటు మహారాజు 'జీవత్స నారాయణ దేవజూ' పేరు నీవు విన్నావా? తన వేట అనుభవాలపై ఒక ప్రసిద్ధ ఉద్గ్రంథాన్ని ఇంగ్లీషులో రాశాడు. దాంట్లో చూడు...పబ్లిక్ లైబ్రరీలో వుందా పుస్తకం...దాంట్లో పుటల సంఖ్య పంద్రెండు, ఇరువది రెండు, నలభై, యాభై యైదులో నన్ను గురించి వ్రాసివుంది. ఆపుస్తకంలో అచ్చయిన గ్రూపు ఫోటోలో నన్నెవరూ ఇప్పుడూ గుర్తుపట్టలేరు...రాజాగారు వేటను గురించేకాక సంగీతాన్ని గురించి కూడా చర్చించేవాడు. ఆయన వేటకు వెళ్లేటప్పుడు తన వెంట జఫరీ కార్లాయిన్ 333 బోర్ రైఫిలు తోపాటు, సితారును కూడా తీసుకెళ్లేవాడు. నలుగురైదుగురు ఉస్తాదులు, డజన్ల కొద్దీ శిష్యులు కోట గుమ్మంవద్ద పోషింపబడేవారు. నాగురువుగారైన 'పండిట్ శివబాలక్‌ఝూ' వారి దర్బారులో గాయకుడుగా వుండేవారు. గీతాలి తన చేతి గడియారాన్ని చూసుకొంది. మరల టీచేసి గ్లాసులో పోసి "తన కథ చెప్పేటప్పుడు మా ఉస్తాద్‌గారు స్పెషల్ టీ తాగుతారు" అన్నాడు ఘుఘులు. జేబు

లోంచి మాసిన జేబురుమాలు తీసుకొని దాంతో గ్లాసుని పట్టుకొని యంత్రకారుడు గీతాలివైపు చూసి "గీతాలి, నీకు ఆలస్యమవుతుంది. లేళ్ల గుంపులు ఎలా పరుగెడుతూ వచ్చాయో మరెప్పుడైనా నీకు చెప్తాలే, నీవు వెళ్లు" అన్నాడు.

"కథ సగమే వింటే సగం తలనొప్పి వస్తుంది. అంటారు" గీతాలి నవ్వింది.

"వినే వాళ్లకా లేక చెప్పేవాళ్లకా? నాకేం పర్వాలేదులే. తలవుండే వాళ్లకి కదా తల నొప్పి వచ్చేది. మేము పొట్టగల వాళ్లము," అన్నాడు హారాధన్.

గీతాలి మళ్లీ నవ్వింది...గీతాలి నవ్వినప్పుడల్లా యంత్రకారుని కుడి చెవిదగ్గరి కణతి కదిలేది. ముడతలుపడిన వికృతమైన ముఖం మెరిసిపోయేది.

"అయితే విను..."

...అప్పుడు గురువుగారు తన కృపాదృష్టిని హారాధన్ వైపు సారించాడు. వేలాడేదళం వెంట రావాలని ఆజ్ఞాపించాడు. అడవుల్లో వేటాడుతూ గడిపిన ఎన్నో జ్ఞాపకాలను ఈ హారాధన్ వినిపించగలడు. రాయటం మొదలుపెడితే ఒక పెద్ద గ్రంథమే తయారవుతుంది...రాజుగారు అసలైన వేటగాడు. నేపాల్‌రాజ్యం లోయలోని 'మధుమారా' అడవిలో ఒక కిరాతసర్దారు చిరుతపులులను వేటాడి తన నైపుణ్యాన్ని చూపించాడు...లోయలోని అడవుల మధ్యలో వుండే కొద్దిపాటి ఖాళీ మైదానంలో తన నైపుణ్యాన్ని చూపించాడు. ఇటువంటి ఖాళీ మైదానాలను ఇంగ్లీషులో 'గ్లేడు' అంటారు. ఈ మైదానాల్లో వెన్నెల - టేకు చెట్ల చిటారు కొమ్మలమీద నిలువ కుండా పచ్చని, మృదువైన గడ్డిపైన పరుచుకుంటుంది. దగ్గరలోని కొండ చరియల్లో సెలయేరు ఎలాంటి శబ్దం లేకుండా ప్రవహిస్తుంది. గాలి గుసగుసలాడుతుంది...చైత్రమాసపు వెన్నెల, వెన్నెలలో ఒక మ్రోడు విస్మయంతో నిలబడింది. నీళ్లలో ఎవరో సంకేతాలతో ఏదో చెపుతున్నారు. లోతైన లోయలోని అడవుల్లో ఏదో బాధతో కూడిన పిలుపు పరిభ్రమిస్తున్నది... అది కామతృష్ణతో ఉన్న ఆడ జింక పిలుపు. నదిలోని చల్లని నీటితో తమ దప్పికను తీర్చుకుంటున్న చిరుత పులుల ప్రాణాలలో వేరొక దప్పిక ప్రజ్వరిల్లుతున్నది. ఆడజింక అప్పుడప్పుడూ అరుస్తున్నది...వెన్నెలలో మగ చిరుతపులుల గుంపు కనబడుతున్నది. ప్రతి చిరుతపులి శరీరంపైన వుండే పెద్ద గుండ్రని మచ్చలు స్పష్టంగా కనబడుతున్నాయి. వెన్నెలలో నిలబడి వున్న మ్రోడు విస్మయంతోనో లేక ఆవేశంతోనో అటూ ఇటూ కదులుతున్నది. నీళ్లలో మళ్లీ ఎవరో సైగ చేస్తారు - ఉస్ ఉస్ ఉస్ ! ...మళ్లీ వెన్నెల్లో నక్షత్రాల వెలుగు...దేదీప్యమానంగా...

తర్వాత చనిపోయిన ప్రేమికుల శవాల నుంచి తమ బాణాలను లాగేసుకొని

కిరాతకుల గుంపు నాట్యం చేయ మొదలెట్టింది. -హో,హి,హి ఒహో!

...ఒక ఆడలేడిని బాల్యదశ నుంచే పెంచి దానికి కృత్రిమ అరుపు నేర్పుతారు. దానికి క్రమంగా తర్ఫీదిస్తారు కిరాతకులు. ఉస్తాదు ఆ ఆడ జింక మెడ క్రింద వేళ్లతో నిమురుతూ వుంటే అది ఎప్పుడు కావాలంటే అప్పుడు ఎదకు వచ్చిన ఆడజింక మాదిరి అరుస్తూ ఉంటుంది.

ఈ వేట అనంతరం జీబఛపూర్ రాజు జబ్బుపడ్డాడు. ఈ పద్దతిలో రాజు మళ్లీ వేటాడేడో లేదో తెలియదుకాని హారధన్‌పై ఈ వేట ఒక గాఢముద్రవేసింది, ఈవిధంగా ఎదకు వచ్చిన జింకల అరుపులూ, ఏడుపులూ, కాళ్లు గిలాగిలా కొట్టుకుంటూ ప్రాణాలు విడవటం చూసి అతనిలో దాగివున్న కిరాతకుడు ఆనంద పరవశుడయ్యాడు...సంగీత సాధనను విడిచి హారాధన్ కిరాత సర్దారుని వెంట వెళ్లిపోయాడు.

ప్రతియేట చైత్రమాసపు వెన్నెల రాత్రుల్లో మూడు నాలుగుసార్లు వేట జరుగుతుంది. తర్ఫీదు పొందిన ఆడజింకతో పాటు దానికి తర్ఫీదునిచ్చిన గురువుకు కూడా పూజచేస్తారు కిరాతప్రజలు. తర్ఫీదు పొందిన ఆడజింక చాలా విలువయిన, అలభ్యమయిన సంపదగా భావిస్తారు. సంవత్సరం పొడుగునా జింకల మాంసాన్ని ఎండ బెట్టుకొని దాన్ని అగ్గిపైన కాల్చుకుని తింటూ ప్రతి కిరాతుడు "హా...హీరా" అంటూ ఆ ఆడజింకను స్మరించుకుంటాడు...ఆదఫా మూడు నాలుగు వేటల్లో హారాధన్ కిరాతుల వెంట ఉన్నాడు. సంవత్సరమంతా కిరాతులతోపాటు వుండికూడా అతను ఆడజింకలకు ఎలా తర్ఫీదిస్తారో, ఆ రహస్యాన్ని తెలుసుకోలేక పోయాడు. ఒకటవ నెంబరు పర్వతం దగ్గర కొండజాతులు వారు నివసించే ఎన్నో గ్రామాలున్నాయి. ఆ గ్రామాలన్నింటిలో ఒకేఒక్క తర్ఫీదు పొందిన ఆడ జింక వుంది. దాని యజమానికి ఆగ్రామాలన్నింటిలో మంచి పేరుంది. అతనికి వున్న మూలధనమంతా ఆ ఆడజింకే...

...కానీ ఈ మూలధనాన్ని హారాధన్ తన సాధనతో కైవసం చేసుకున్నాడు. ఇప్పుడు ఆడజింక అవసరమేముంది? హారాధన్ ఇప్పుడు ఎదకు వచ్చిన ఆడ జింకమాదిరి తనే అరవగలడు... కిరాతుల సర్దారు పరీక్షించేదానికి ఒకమారు వేట కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తానన్నాడు. "చైత్ర మాసపు వెన్నెల్లో దేనికి నీవు ఎప్పుడు ఇష్టపడితే అప్పుడు వేటకు ఏర్పాటు చెయ్యి. సంవత్సరంపొడవునా ఎప్పుడైనా సరే..." అన్నాడు హారాధన్.

...వెన్నెల రాత్రి! ఆఖరి జాము...బ్రహ్మమూర్తంలో హారాధన్ మొట్టమొదటి

సారి జింక అరవు అరిచాడు. అచ్చమైన ఆడజింక అరుపులాగా ఏలాంటి బేధం లేకుండా...కోసీ నది ఒడ్డున 'చతరాగద్ది' అనే చోట స్వచ్ఛమైన శ్యామల భూమి పైన డజన్లకొద్ది జింకలు పరుగెడుతూ వచ్చాయి...టఫ్,టఫ్ మంటూ...

...ఒకటోనెంబరు పర్వతంపైన హోరాధన్‌కి పూజలు మొదలయ్యాయి. ఆ ప్రాంతంలోని అతి రూప సుందరి అతని సపర్యలకు ఏర్పాటు చెయ్యబడింది... కిరాత సర్దారు అతనికి బద్ధశత్రువు అయినాడు...అపుడు ఓమారు భయంకర భూకంపం వచ్చింది, జనవరి 1934లో. మూడో రోజున ఈవిపత్తుకు కారణ మంతా హోరాధనే అని కిరాతులు అభిప్రాయడ్డారు.

...అమ్మవారి కరుణాకటాక్షం, భగవతీ కృపాదృష్టితో అతనికి ప్రాణాపాయం తప్పింది...మృగచర్మాన్ని సంకలో పెట్టుకొని అతను గురువుగారి సేవలో నిమగ్ను డయ్యాడు. గురువుగారి ఎదుట రాజుగారి తోటలో తన కంఠకళానైపుణ్యాన్ని ప్రదర్శించి ఒకకొత్త ఆపదను కొనితెచ్చుకొన్నాడతను..అపుడేమో జింకల వేట చూసి రాజుగారు మానసిక రోగానికి బలి అయ్యారు. ఎన్నోరోజుల తరబడి చికిత్స పొందిన తర్వాత అతని రోగం నయమవుతూంటే ఇంతలోనే హోరాధన్‌ని అరుపు (ఆడజింక అరుపు) వినబడింది. రాజుగారు మరలా జబ్బుపడ్డాడు...ఆరితేరిన వేటగాడు! అరుపు వింటూనే గట్టిగా కేకవేశాడు. అదే, అదే! ఆడజింక మోసగత్తె! ఆడ దయ్యం! స్పొటెడ్ డీర్, చిత్రవిచిత్రమైంది! ఎక్స్‌ప్రెస్ 500 రైఫిలు చేతి లోకి తీసుకొని రాజు శబ్దభేది గురితో ఫైర్ చేశాడు. హోరాధన్ అరుపు అరుస్తూం డగానే ప్రక్కనున్న తన గురువు పండిత్ శివబాలక్ ఝూ గారి గుండెలో 'స్పాట్ నొజ్డ్‌ఎక్స్‌పెడింగ్ బులెట్' దూసుకొని పోయింది. శిష్యుడు సమర్పించిన మృగ చర్మంపై గురువు ఆశీనుడై వున్నాడు. మృగచర్మంపైన ఇప్పటికీ రక్తపు మర కలున్నాయి...హోరాధన్ అక్కడినుంచి పారిపోయాడు. అతను ఎక్కడికి వెళ్లినా అక్కడ జరగరాని సంఘటనలు జరిగిపోయేవి.

చేతులతో చెవులు మూసుకొని హోరాధన్ కళ్లు మూసుకొన్నాడు-"అప్పటి నుంచే కంఠంలో కర్కశధ్వనులు ఉత్పన్నమైనాయి...నాకంఠస్వరాన్ని నేను కళం కితం చేసుకున్నాను. సరే..."

ఘుఘులు ఓపాత మృగచర్మాన్ని లోపలినుంచి తీసుకొచ్చాడు. "ఇది ఆచం చలమైన మగజింక చర్మం. ఈ జింక నాలుగేసి బాణాలు తన గుండెల్లో గుచ్చు కొన్నప్పటికీ నా అరుపు విని నాదగ్గరికి పరుగెత్తు వచ్చింది. నా ఎదుటే ఇది గిజ గిజా కాళ్ళు తన్నుకుంటూ ప్రాణాలు వదిలింది... గురువుగారు ఈ మృగచర్మం

పైనే కూర్చుని ఉన్నాడు అప్పుడు."

హారాధన్ ఆమృగచర్మాన్ని పైకెత్తి శ్రద్ధాభక్తులతో శిరసు వంచాడు. తర్వాత గీతాలి ముందు దాన్ని ఉంచి ఇలా అన్నాడు. "ఆ స్వర్ణమృగం పేరేమిటి? మారీచి కదా...సీతాదేవికి ఆ మృగచర్మం పైన కూర్చోవాలని అభిలాష లేక కోరిక ఎలా కలిగింది? రామాయణంలో ఎక్కడైనా దీన్ని గురించి వ్రాసి ఉందా? మృగచర్మం పైన కూర్చుని సాధన చేయాలనుకొంది కాబోలు! "

హారాధన్ నేపాల్ లోయలోని శ్యామలవన భూమి, అక్కడి పచ్చని సమ్మోహిత వాతావరణంలో తన కథను అల్లేదానికి ప్రయత్నిస్తూ "గీతాలి...నిన్ను మనుమరాలనే ఇక పిలుస్తాను నన్ను తాతగా భావిస్తావు కదూ! మంచిది. మంచిది. రేపు కూడా వస్తావు కదూ! మంచిది మరి..."

మరుసటిరోజు కూడా గీతాలి వచ్చింది. యంత్రకారుడు ఆమె కనిపించగానే ఆవిడ హస్తరేఖ చూస్తానన్నాడు. గీతాలి తన రెండు చేతులను అతని ముందుకు చాపింది. "హా హహా. మీ అక్క మీతాలి చెయ్యాజాలని పని నీవు చేస్తావు. తప్పక చేయగలుగుతావు. యంత్రకారునికి తనఅక్క సంగీతవిద్యకు సంబంధించిన అన్ని విషయాలే కాకుండా, ఆవిడ, వ్యక్తిగత జీవితానికి సంబంధించిన ప్రతి చిన్న విషయం తెలుసునని ఆమె గ్రహించింది." బిడ్డా, నేను చెప్పింది చెడ్డగా భావించకు. మీఅక్క ఆ టమాటర్ లాంటి వ్యక్తిని పెళ్లి చేసుకొని చాలా నష్టపోయింది...రక్తం తాగితాగి నల్లి ఎర్రగా, బొద్దుగా తయారవుతుంది కదూ! వాస్తవానికి అతను నల్లితో సమానమే. మీ అక్క సర్వస్వం పీల్చుకొన్నాడు...సాహిత్యకారుడట, వాడొక సాహిత్యకారుడా? వాడిబొంద...?"

మాటల మధ్యలో అప్పుడప్పుడూ యంత్రకారుడు అర్థం పర్థంలేని విషయాలు చెప్పసాగేడు. తన బావగారిని టమాటర్, నల్లితో పోల్చటం విని ఆవిడకు ఏలాంటి బాధ కలుగలేదు. ఆమె సమ్మతించినట్టులుగా తలూపింది-"సరిగ్గా చెప్పారు మీరు" అంది. అతను ఆవిడకు పీడగా దాపురించాడు. అక్కవాడితో వేగుతున్నది ఇప్పటికీ. కుళ్ళి కుళ్ళి నాశనమవుతుంది.

అకస్మాత్తుగా అదృశ్యమైన మీతాలి ప్రతిభకు ఎవరెవరో కారకులని సంగీత ప్రియులు భావిస్తారు. కొంతమంది ఆమెగురువే దీనికి కారకుడంటే మరికొంత మంది ఆమె తొందరలో తల్లి కావడమే దీనికి కారణమంటారు. కానీ ఎవరూ మీతాలి భర్తే కారకుడని అనరు...వాస్తవానికి తన అక్కజీవితంలో పుండు పెట్టింది అతనే...

అతనికి సాంప్రదాయం, పవిత్రత, శుద్ధతపైన భ్రమలుండేవి. ఎప్పుడూ ఇది అశుద్ధం, అది శుద్ధం, ఇది సాంప్రదాయానికి విరుద్ధం అంటూ ఉంటాడు... అక్క ఇప్పుడు బాత్‌రూములోనే పాడుకుంటుంది. చేతివ్రేళ్ల కొసలు ఎప్పుడూ నీళ్లల్లో మునిగి ఉండటం చేత వాటి చర్మం చివికి పోయి వుంటుంది...పొద్దస్తమానమూ బట్టలు ఉతుకుతూ ఉంటుంది...అక్క మీతాలిని ఘుఘులు కూడా ఎరుగునట. "మీతాలి సంగీతకార్యక్రమాలు జరిగేచోట ప్రతి కార్యక్రమంలో ఒకసారైనా గుంపును చెదరగొట్టేదానికి లాఠిచార్జి చేయాల్సి వచ్చేది." మీతాలిని పొగుడుతూ ఘుఘులు రహస్యోద్ఘాటన చేశాడు.

ఆమె భర్త సంగీతం వినే ముగ్ధుడయ్యాడు. సంగీతంలో కూడా 'ఠుమరీ' అతనికెంతో యిష్టం. మీతాలి ఠుమరీ పాడటంలో ఏదో అద్భుత ఆకర్షణమ వుండేది. అందువల్లనే ఆరోజుల్లో మీతాలి 'ఠుమరీ' అనే కొత్త సంప్రదాయం సంగీతంలో ప్రచారమైంది. పెళ్లి తర్వాత సర్వకళామర్మజ్ఞుడనుకునే భర్తగారు "మీతాలి రాణీ, నీవు ఠుమరీలనే పాడు. విశుద్ధమైన ఠుమరీ ఆలపించు" అని ప్రేమగా నచ్చజెప్పాడు.

పతిదేవుని కోరిక - ఇంకేముంది! అక్క క్రమక్రమంగా ఒకేరాగాన్ని పట్టుకొని సాధన చేయసాగింది. లక్నో, బెనారసీ సంప్రదాయానికి చెందిన ఠుమరీలనే కల్తీ లేకుండా వినిపించేది...గురువుగారు అడ్డుకొన్నారు. "ఠుమరీలకు ఇంత పేరు ప్రఖ్యాతులు వచ్చాయంటే దానికి కారణం జానపద సంగీతమే. ఠుమరీ ఖయాల్‌ను గుడ్డిగా అనుకరించదు. గ్రామీణ జానపద స్వరాల సమ్మేళనంతో ఠుమరీలు ఆలపిస్తూ వస్తాదు లెందరో పేరుప్రతిష్ఠలు సంపాదించారు" అంటూ గురువుగారు మీతాలి భర్తకు నచ్చజెప్పాలని ప్రయత్నించాడు..

"పెద్ద పెద్ద వస్తాదుల పెద్ద పెద్ద రాగాలను గురించి నాకు చెప్పకండి పంతులుగారు! నాకు ఠుమరీ చరిత్రంతా తెలుసు..." అంటాడతను.

మనకు కావాల్సింది కల్తీలేని విశుద్ధత. ఠుమరీ పేరుతో వర్ణ సంకర సంగీతం నేర్పించే వాళ్లు అసలు సంగీతకారులే కారు అని అతని వాదన.

మీతాలి నిలబడి గురువుగారి దురవస్థ చూస్తూ వుండిపోయింది. ఏమి మాట్లాడలేక పోయింది.

ఇంతవరకూ మీతాలి తన కాఫీ, లేక ఖమ్మాచి ఠుమరీలోని కీర్తనలు 'భటియాలి' లేకపోతే'పూర్విరాగాలను' మేళమించి పాడేది. ఆమెపేరు ప్రఖ్యాతులలో దాగి వున్న రహస్యమిదే! ప్రధానరాగంతో దోబూచులాడుతున్న చిన్నచిన్న జాన

పదరాగలు ఆలపిస్తూ శ్రోతలను సమ్మోహపరుస్తుంది...మీతాలి నిర్దాక్షిణ్యంగా వాటిని పరిత్యజించింది. భర్తపోరు పడలేక "ఏమిటిది! తెల్లవారుతూనే 'భాజా బంద్ ఖులీ ఖులీ జాయ్..' మీతాలి రాణీ, దయచేసి ఆపేయి తల్లీ...దుమరీ... బహు వేషధారి...! తన ప్రతిభాపాటవాలు వుదయించిన 'బేసెంటుహాలు' లోనే అవి అస్తమిస్తాయి. గీతాలి ఆరాత్రిని ఎలా మరువగలదు? ఆనాడు రాత్రి గీతాలి ఇంట్లో శోకం తాండవించింది. గురువుగారు వెక్కివెక్కి ఏడ్చారు. శారదోత్సవ సంగీత సమ్మేళనంలో మీతాలి తన ఆలాపాన్ని ఆరంభించి పూర్తి చేయక మునుపే హాలంతా పిల్లుల, కుక్కల అరుపులు ప్రతిధ్వనించాయి. రకరకాల ఎత్తి పొడుపులు, ఎగతాళులు- మెటర్నిటీ సెంటరుకి తీసుకువెళ్లండి...పనికిరాని సరుకు...తుక్కు..."

మూడురోజులనుండి అన్నపానాలు ముట్టకుండా ఓడిపోయినట్లు ముఖం వ్రేలాడేసుకొని వున్న గురువుగారి వద్ద గీతాలి ప్రతిజ్ఞచేసింది. ఆదేరోజు ఆమె గాన విద్యావ్రతాన్ని మొదలు పెట్టింది. సరళమైన, సహజమైన సుగమసంగీతానికి స్వతంత్ర ప్రతిపత్తి గౌరవం ఇప్పిస్తానంది...తన అక్క మీతాలి ద్వారా పరిత్యజించబడిన రాగాలకు ఔదార్యంతో ఆశ్రయమిస్తానంది.

రేడియోలో వార్తాప్రసారాలు మొదలు కావటంతో గీతాలికి టైం గుర్తుకొచ్చింది. ఆమె కిమ్మనకుండా కూర్చుని యంత్రకారుని పనిని చూస్తూవుంది. యంత్రకారుడు కళ్లు మూసుకుని కూర్చునివున్నాడు...వార్తలు వినేటప్పుడు అతను ఈమాదిరే పద్మాసనమేసుకుని కూర్చుంటాడు..."వార్తలు వినేటప్పుడు ఈ విశాల విశ్వయంత్రాన్ని స్పర్శిస్తున్నట్లు అతను అనుభూతిని పొందుతాడు! అర్థమైందా బిడ్డా..."

తర్వాత ఘుఘులు రేడియోను ఆపేశాడు. గీతాలి తంబూరాను తన ఒళ్లోకి తీసుకుని యంత్రకారుడు అన్నాడు-"చూశావు గదా దీనికి నాలుగు తంత్రులున్నాయి. ఈ నాలుగు తంత్రులనుంచే సప్త స్వరాలు ఉద్భవిస్తాయి...మీఅక్క సహకారి నాదాలను ఉపేక్షించింది. నీవు అలా చేయకు. అదృష్టంకొద్దీ నీవాద్యయంత్రం ఉత్తమమైంది."

తర్వాత యంత్రకారుడు గీతాలి తంబూరాలో నిమగ్నమయ్యాడు. "...ప, స్వరాన్ని పలికించే తంత్రి ద్వారా ధ,సి,రే, సహకార నాదాలు పలుకుతాయి. సా,రే,గ,ప ఎందుకు...నీవు ఈవాద్య యంత్రం తీసుకొని అఖిలభారతీయ స్వర సంగమ సమ్మేళనంలో పాల్గొనాలనుకున్నావా? రాధే, రాధే."

గీతాలికి రాధేశ్యామ్ గుర్తుకొచ్చాడు. గిటారిస్టు రాధే. ప్రతిభ వికాసాన్ని పొం

దక ముందే లుప్తమయితే దుఃఖం ఎవరికి కలగదు! ఐదురంగుల జాకెట్, బాకులాంటి మీసాలు, ఆరోజుల్లో రాధేశ్యామ్ గీతాలి ఇంటికి తరచుగా వస్తుండే వాడు. గీతాలి పాడిన ఎన్నో పాటలకు అతను వాద్యసహకారం అందించాడు...ఆ వేళ యంత్రకారునివద్ద నుండి తిరిగి వచ్చిన గీతాలికి రాధేశ్యామ్ తనకోసం ఎప్పటినుంచో నిరీక్షిస్తూ కూర్చుని వున్నాడని తెలిసింది. తల్లిగారు కీర్తనలు వినే టందుకు రామకృష్ణాశ్రమం వెళ్లింది...రాధేశ్యామ్! రాధేశ్యామ్ ముఖాన్ని ఆవిడ పరిశీలనగా చూసింది. ప్రతికళాకారుని ముఖమండలము చుట్టుప్రక్కలా స్వరల హరులు ప్రకంపిస్తూ వుంటాయని యంత్రకారుడంటాడు. 'సింఫనీ కన్‌సర్టు కండ క్టర్ మిస్టర్ ర్యాంకిన్'ను మొదటిసారి చూసినప్పుడు అతని ముఖం చుట్టూ స్వర లహరులను హారాధన్ యంత్రకారుడు చూశాడు.

"సీ మైనర్ సే ఈ ఫ్లాట్... పియానో, హార్ప్, ఓబో...క్లారెనేట్..."

రాధేశ్యామ్ ముఖమండలం దగ్గర స్వరలహరులు ఓలలాడుతున్నాయి. అతను పీకల వరకూ తాగియున్నాడు. గీతాలి మౌనాన్ని తప్పుగా అర్థంచేసుకొని "డార్లి...డా డా డి డి డి...గీ - టా - టాలి మై. గీటర అని తడబడుతూ పిలిచాడు...అకరామ్ వాద్యకారుని ప్రార్థనా గీతం, శంఖం, గంటధ్వనులు, ధూపనైవేధ్యవాసనలు... రాధేశ్యాముని అర్థంపర్థంలేని మాటలు, సారాయికంపు! గీతాలి ఆఖరి తమ్ము నికి సమవయస్కుడైన రాధేశ్యామ్!

వీడికి ఇంత ధైర్యమా! గీతాలి ఏమీ మాట్లాడకుండా లోపలికెళ్లిపోయింది...

రాధేశ్యాముని బారినుంచి తప్పించుకొని ముందుకు పోతుండగానే బావ గారి మిత్రుడొకడు దర్శనమిచ్చాడు. సంగీతకారుడు కూడా బావగారి శిష్యుడు కూడా...గీతాలి జీవితంలో పాడిన పాటలన్నింటిని కాంట్రాక్టుమీద తీసుకొంటానని ప్రపోజల్ పెట్టాడు.."నీవు ఊ అంటే రోజుకు ఐదు మధుర గీతాలను రాసేయగ లను. నీవు ప్రతిగీతంలోని పంక్తి పంక్తికి మధ్య మూడు బిందువులమాదిరి చెల్లా చెదురై ఉన్నావు. ప్రియులారా... ప్రియురాలా నీవు..."

రాధేశ్యాముడు ఒకటిరెండు సినిమాల ట్యూన్‌లతో తన కాలాన్ని వెల్లబు చ్చుతున్నాడు. బావగారి శిష్యుడైన ఈ పాటల రాయునికి ఎవరో ప్రియురాలు దొరికింది కాబోలు...

గీతాలి ఒక్కటే! పాటలల్లుతూ, స్వరాలు కల్పిస్తూ పాడుతూవుంది..."పదేళ్ల నుండి పాడుతూనే వుంది. యంత్రకారుడు మరొక మాట కూడా అన్నాడు. అదే మిటంటే పరిమళం. పాటల్లో పరిమళాలను పరివేష్టించగల సామర్థ్యాన్ని పొందు.

దీనికి తగిన సాధనచేయి..."

మూడోరోజు యంత్రకారుని మనసు ఒక మాదిరిగా ఉంది. ఘుఘులు బయటికి వెళ్ళాడు. గీతాలి ఏం మాట్లాడకుండా గదిలో ఒక మూల కూర్చుంది. అఖిల భారతీయ స్వరసంగమ సమ్మేళనం తారీఖులను ప్రకటించారు. నాకు ఆహ్వానమందించి నన్ను ఆశీర్వదించండి తాతగారూ అన్నాది గీతాలి.

ఘుఘులు ఒక దోనెలో 'ఛోలేబటోరే' తెచ్చాడు. వాటిని చూస్తూనే యంత్రకారుని మూడ్ వచ్చేసింది. లోపలనుంచి ఘుఘులు గీతాలి తంబూరా తెచ్చిపెట్టాడు. చాలా అందమైన ముసుగు తీసి తంబూరాను గీతాలికి అందిస్తూ "తీసుకో బాగయ్యింది. ఇది అందరినీ బాగుచేస్తుంది! దీన్ని గౌరవించు. దీనికి కావలసింది గౌరవము. పూజకాదు."

గీతాలి వేళ్లతో తీగలను తాకింది. హారాధన్ యంత్రకారుడు అటుఇటూ జూసి "నామనవి ఆలకిస్తావా? నీవ్రేళ్లను తాకనిస్తావా?...అన్నాడు. ఆహా... ముసలాడుకి ఈ బుద్దేమిటి? ఒకసారి హస్తరేఖలు చూడాలంటాడు. మరొకసారి వ్రేళ్లను తాకాలంటాడు అనుకుంది మనుమరాలు. గీతాలి వ్రేళ్లను తన తలపై గీరుకుంటూ "నీవు గోళ్లు కత్తిరించుకొనేవైనం తప్పుగా ఉందేమో అని నేను భయపడ్డాను అన్నాడు ఆమె వ్రేళ్లను పట్టుకొనే మనుమరాలా? " "ఏం మనస్సేమంటూంది. మనస్సులో ఏస్వరం మారుమ్రోగుతుంది" నవ్వుతూ అడిగాడు.

ఆ రోజు గీతాలి నవ్వుతూ జవాబిచ్చింది ఏలాంటి స్వరం పలకలేదని...కానీ ఈ వేళ...స్పష్టంగా ఒకరాగం వినబడుతూంది. కానీ దానిని ఆవిడ వశపర్చుకొనలేక పోతుంది...ఆమె యంత్రం ఓడిపోదు. కానీ ఆమె ఓడిపోతుంది...యంత్రకారుడెక్కడున్నాడు. ఉన్నాడా లేడా?...

ఆరోజు అఖిలభారతీయ సుర్ సంగమ సమ్మేళనంలో ప్రథమ బహుమతి పొందిన తర్వాతనే తాతగారైన హారాధన్ యంత్రకారునికి నమస్కారం చేయుటకు వెళ్లింది...ఘుఘులుతో సహా హారాధన్ యంత్రకారుడు అక్కడినుంచి పరారైనాడని తెలుసుకొని ఆశ్చర్య చకితురాలైంది. వాద్య యంత్రాలు, పరికరాలు మరెన్నో వస్తువులను దొంగలించుకొని వెళ్లిపోయారని స్వరమందిరము వాళ్లు పోలీసు స్టేషనులో రిపోర్టిచ్చారట...ఇది జరిగి పది సంవత్సరాలైంది. "తాతగారు" నేను మిమ్మల్ని 'నానాధన్' అని పిలుస్తాను...నానాధన్! మీరు నాకు మృగ చర్మాన్ని ఇవ్వండి. నేను దానిమీద కూర్చుని సాధన చేస్తాను..."

"చేస్తావా...నిజంగా సాధన చేస్తావా! భయపడవు గదా! ఈ. అమంగళకర

మైన మృగచర్మం వల్లనీకేమైనా హాని కలుగుతుందేమో..." మృగచర్మాన్ని తల కానించుకొని గీతాలి దాన్ని ఒకవైపు వుంచింది...దీనిపైన కూర్చొని ఆమె సాధన చేసింది...చిరుతపులి, చిత్ర విచిత్రమైన చందనంలాంటి మచ్చలు...రక్తపు మర కలు...డాట్ డాట్ డాట్!...

పదేళ్ల తర్వాత ఈ రోజు తాతగారైన హారాధన్ యంత్రకారున్ని స్మరించు కొనే సమయంలో మనస్సు పదవిన్యాసం చేయసాగింది...గీతాలి ఇప్పుడు తనను వాద్యయంత్రంగా వాయించుకుంటుంది. ఏవో అపరిచిత వ్రేళ్లు మాటిమాటికి ఆమెను మోగిస్తాయి. అవ్యక్త జగత్తులోని క్రియాకలాపాలు విఘ్నమౌతాయి. వెలు గుతున్న మూడు చుక్కలు ఆరిపోయాయి. పోస్ట్‌మాన్ వాకిలితట్టి ఉత్తరాలిచ్చిపో యాడు...కుమారి గీతాలి దాస్...'గీతామహల్'...

భగవంతుడా ఇదేమిటి? ఇదికలకాదుగదా...ఇది నిజమేనా? భారతావనిలో ప్రసిద్ధిచెందిన సితారవాదకుడు అకరామ్‌గారు పంపిన ప్రేమలేఖ అది...శంఖం గంటధ్వనులు...ధూపపు సువాసనలు, ప్రార్థనాగీతాలాపన!... లలితరాగంలో...వి లంభిత, ధృతతాళం...ఇది ఎలా సంభవం. పదిసంవత్సరాలనుంచి దాగివున్న ఈ విషయం బట్టబయలయింది...తల్లీ...

అకరామ్ ఉత్తరంలో స్వరాలున్నవి. పంక్తులు మారుమ్రోగుతున్నవి...శంఖ ధ్వనులు, గంటధ్వనుల మధ్య గీతాలికి అకరామ్ గారి కంఠస్వరం వినబడుతుంది. తన చిరకాలపు నేస్తం తంబూరాను సహాయంగా తీసుకుంటుంది. రెండుచేతు లతో దాన్ని గట్టిగా పట్టుకుంటుంది...నాలుగు తంత్రుల నుంచి అకరామ్ కంఠస్వ రాలు వినబడతాయి. "...గీతాలి గీతాలి...నేను అకరామ్‌ను. గత ఎనిమిది సంవ త్సరాలనుంచి నీగీతాల గంధాన్ని వింటున్నాను. వింటున్నానేమిటి? అనుభవిస్తు న్నాను...వడ్లు దంచుతున్న, తిరుగలిని తిప్పుతున్న, పశువులను మేపుతున్న, సుందర యువతుల శరీరపు చెమట వాసన, వరిపొలాల్లో, చెరువు గట్టుల్లో, నది ఒడ్డున, నీళ్ళునింపుతున్న యువతుల తడిబట్టల వాసన... ఏదో అడవిపూల సువా సన...సువాసనతో కూడన పాటల గాయకి నాఘ్రాణ శక్తిని ఉత్తేజపరిచింది...నేను గీత్‌గంధా, గీతాలిగంగా అనే రెండు గీతాలను రచించాను...ఆవేళ నీవు నామాట మన్నించలేదు. ఇలా చేయకు. ఇంతవరకూ నీకంఠం నుండి వెలువడని గీతా లను పాడిస్తాను. ఓ గీత్‌గంధా! నీతో ఉండిపోవడం నేను నామహాభాగ్యంగా భావిస్తాను. ఇది మరొక ఉత్తరం...ఎప్పుడో వెళ్లిపోయిన నానాధన్; హారాధన్ గారి ఉత్తరం. ఓ మనుమరాలా! శివుడు ప్రసన్నుడయ్యాడు. కళ్లు తెరువు...గత

వారం నీ సంగీతం విని మాష్టరుగారు మాయింటికి పరిగెత్తుకొచ్చారు. మీ మను మరాలుమనస్సు చిన్న బుచ్చుకుంటుదో లేక మనసు దొంగలిస్తుందో నాకు తెలియలేదు. కానీ మీసంగీత ప్రతిభా పాటవాలను తాను స్వంతం చేసుకుంది. వాగుతూ పోతున్నాడతను. ఈరోజు మీమనుమరాలు కోవిదార చెట్టు క్రింద పాత్రలో మధువు నింపుకొని కూర్చునుంది. పాటల పుస్తకంకూడా ప్రక్కనే వుంది...కానీ...ఏదో పాడుతుంది అస్పష్టంగా ఎందుకో. మనస్సులో తంత్రులు మ్రోగుతున్నాయి...బయట వసంతం? ఇదంతా స్వయం భూనాదాల చలువ! కులభేదాలా? కళాకారులకు జాతేమిటి?..."

మూడో ఉత్తరం. మూగది...గతమూడేళ్ల నుంచి పండుగ పర్వదినాల్లో కళాకారుడు ఆర్టిస్టిక్ కార్డులు పంపుతున్నాడు. రామకృష్ణ ఆశ్రమ వార్షికోత్సవానికి 'మనహర్‌రాయ్, మండపాన్ని, వేదికను సౌందర్యోపేతంగా అలంకరించి అందరి మనసులను ఆకట్టుకున్నాడు. వేదిక వద్ద గీతాలి గంటల కొద్దిమౌనంగా నిల్చుండిపోయింది...క్షమించు మనహర్. గీతాలి నీకెప్పుడూ ఋణపడివుంటుంది...నీవు సరే అంటే గీతాలి తన సర్వస్వాన్ని సమర్పించ గలదు... నీవు ఆక్షణాలను దురుపయోగం చేయలేదుకదా...మూడు సంవత్సరాలు రిక్తమైన మూడు...నిశ్శబ్దంగా గడిపావు. అన్ని రోజులు! కళాకారుడా!...గీతాలి స్వరజీవి. పదేళ్ల పూర్వమే ఆమె ఒకని స్వరంలో బంధింపబడింది...అయినప్పటికి నీవు నోరు విప్పివుంటే. ఇప్పుడుకూడా అకరామ్! ప్రియమైన అకరామ్...నీవు చాలా గొప్పవాడివి. అంతా నీవు ఎలా తెలుసుకోగలిగావు...సువాసన. ఇది నీకృపాఫలమే. ప్రార్థనాచరణాలు వినేటప్పుడు నాకు ధూపం యొక్క సుగంధం వచ్చింది. మొదటి మారు నీవే ఈ సుగంధాలను వెదజల్లావు. ఇదే నీవస్తువే. నీవస్తువు నీకే...నేను వాద్యయంత్రాన్ని తీసుకో! నన్ను మీటు, ధన్యురాలినిచెయ్యి. గీతాలి దగ్గరున్న తంబూరా తంత్రులను మీటింది. మూలనాదం నుంచి తొమ్మిది సహకారనాదాలు ఉచ్చస్వరంలో వినపడ్డాయి.'

...మీరు విన్నారు కదా. అకరామ్...నానాథన్...ఘుఘులు బ్యాండ్ దళం వాళ్ళువాయించే సంగీతాన్ని...మీరందరూ విన్నారు. అకరామ్ మెడలో గీతాలి గీతమాలిక వేసింది...ఎ, మైనరు-తీవ్రస్వరం...ఎఫ్.మేజరు మొక్క ఆనందోల్లాసం...పరమహంసదేవునికి గీతాలి నమస్కరించింది. పరమహంస దేవుని కథామృతం నుంచి "మానుషేర్ మన్‌జైసపరషేర్ పుటలి" అంటే...మానవుని మనస్సు ఆవాల పొట్లం లాంటిది" వినిపించింది.

గీతాలి కన్నుల నుండి కన్నీటి ధారలు వెలువడ్డాయి. ఒక అవ్యక్తరాగం కంఠాన్ని చీల్చుకుంటూ వెలువడింది.

అవ్యక్తజగత్తులో గీతాలి అకరామ్‌గారి కాళ్ల చప్పుడు వింటున్నది...

# రసప్రియ

మట్టిలో పడివున్న విలువైన రాయిని చూసి రత్నాల వర్తకుని కళ్లల్లో ఒక క్రొత్త కాంతి జిగేల్మంది, "అపురూప రూపం."

పశువుల కాపరి మోహనుని చూడగానే మృదంగ వాదకుడు 'పంచగొడి' అకస్మాత్తుగా అన్నాడు - "అపురూప రూపం...పొలాల్లో,మైదానాల్లో, తోపుల్లో, వనాల్లో ఆవులను, ఎద్దులను కాసే కాపరి మోహనుని సుందరరూపం అద్భుతం."

మృదంగ వాదకుని కన్నులు అశ్రుపూరితమయ్యాయి.

మోహనుడు నవ్వుతూ "మృదంగం వాయిస్తూ నీవేళ్లు వంకర్లు పోయాయి కదూ!" అన్నాడు.

ఓయ్! ముసలి మృదంగవాదకుడు ఉలిక్కిపడి, "మృదంగమా...అవును... కాదు నీవెక్కడ...ఎప్పుడు విన్నావురా?" అన్నాడు.

'బిడ్డా' అంటూ అతను ఆగాడు...'పరషూన్‌పూర్'లో ఒకనాడతను బ్రాహ్మణుని కొడుకును ప్రేమతో 'బిడ్డా' అన్నాడు. ఊరిలోని పిల్లలంతా కలిసి అతన్ని చుట్టు ముట్టి కొట్టడానికి ఉద్యుక్తులయ్యారు.

"అంటరానివాడవైయ్యుండి బ్రాహ్మణ బాలుని బిడ్డా అని పిలుస్తావా? ముసలోణ్ణి చుట్టు ముట్టి తగిన చాస్తి చేయండి! మృదంగాన్ని బద్దలు కొట్టండి."

మృదంగావాదకుడు, "ఈ మారు క్షమించండి. దేవరా! ఇకనుండి మిమ్మల్ని 'నాయనాలారా' అని పిలుస్తాను" అని అన్నాడు.

పిల్లవాళ్లు సంతోషపడ్డారు. నగ్నంగా వున్న రెండు మూడేళ్ల పిల్లవాని గడ్డం పట్టుకొని "సరే కదా నాయనా!" అన్నాడు.

పిల్లవాండ్లు హా,హా కారాలు చేశారు.

ఈ సంమఘటన తర్వాత అతడు ఏపిల్లవాణ్ణి బిడ్డా అని పిలిచే దానికి సాహసించలేదు. మోహనుని చూసి అతనికెందుకో మాటిమాటికి బిడ్డా అని పిలవాలని కోరిక కలుగుతుంది.

"రసప్రియ (మృదంగం వాయిస్తూ పాడే పదాలు) మాట నీకు ఎవరు

చెప్పారు?...చెప్పు బిడ్డా."

పదిపన్నేండేళ్ల వయసున్న మోహనునికి 'పంచకౌడికి సగం పిచ్చి వుందనీ' తెలుసు...వీడితో ఎందుకువచ్చిన పీడ! వాడు దూరంగా మైదానంలో మేస్తున్న తన ఎద్దులవైపు చూడసాగాడు.

మృదంగ వాదకుడు కమల్‌పూర్‌లోని షావుకారు వద్దకు పోతున్నాడు. కమల్ పూర్‌లోని నందబాబుగారి వంశీకులు మృదంగ వాదకుడంటే ఇప్పటికీ ఇష్టపడ తారు. రెండుమూడు పూటల భోజనం అక్కడ గడిచిపోతుంది. సంగీతానికి సంబం ధించిన రసభరితమైన చర్చలిక్కడే అతనప్పుడప్పుడూ వింటాడు. రెండు సంవ త్సరాల తర్వాత మళ్లీ అతను ఇప్పుడు అక్కడికి వస్తున్నాడు. ప్రపంచంలో చాలా తొందరగా మార్పులు వస్తున్నాయి...ఈరోజు ఉదయం శోభమిశ్ర గారి చిన్నబ్బాయి అన్నాడు కదా "మృదంగ వాదకుడా నీవు బ్రతికున్నావా లేక తైత క్కలాడుతున్నావా?"

అవును, ఈమాదిరి బ్రతకటం కూడా ఒక బ్రతుకేనా! సిగ్గులేకుండా, తైతక్క లాడటానికి కూడా ఒక హద్దు అంటూ ఉంటుంది...పదిహేను సంవత్సరాలనుండి తను మృదంగాన్ని మెడకు తగిలించుకొని ఊరూరు అడుక్కుతింటున్నాడు. కుడి చేతి మెలిక తిరిగిన వేలు మృదంగంపై ఆనటం లేదు. మృదంగం ఎలా వాయిం చగలడు. "ధాతింగ్, ధాతింగ్" కూడా చాలా కష్టం మీద వాయించగలుగుతున్నా డు...హద్దుమీరి గంజాయి (భంగు) సేవించటంతో కంఠస్వరం కూడా వికృతమై పోయింది. అయినప్పటికీ మృదంగాన్ని వాయిస్తూ విద్యాపతి పదాలను పాడా లనే తన ప్రయత్నం మాత్రం మానడు...చిరిగిపోయిన కొలిమి తిత్తినుంచి వెలు వడే గాలి మాదిరి 'సోయ్ సోయ్ స్ స్' అని అతని కంఠస్వరం పలుకుతుంది.

పది - ఇరవై సంవత్సరాల ముందు విద్యాపతి పదాలంటే ప్రజలకు ఇష్టముండేది. పెళ్లిపేరంటం, యజ్ఞం, ఉపనయనం, కేశఖండనం, కర్ణ చ్ఛేదనం మొదలగు శుభకార్యాలలో విద్యాపతి పదాలు పాడే గాయకుల బృందాలను పిలిపించేవారు. పంచగౌడి మృదంగ వాదకుని బృందం సహ రస, పూర్ణియా జిల్లాల్లో బాగా పేరు సంపాదించింది. పంచకౌడి మృదంగ వాదకుడంటే ఎవరికి తెలియదు, అందరికీ తెలుసు, అతనికి సగం పిచ్చి అనీ...పంచకౌడి మృదంగవాదకునికి కూడా ఒకనాడు మంచి పేరుండే దని పల్లెలోని ముసలి, ముతక అంటారు.

ఈకాలంలో కూడా అందమైన మంచి కంఠస్వరంగల మోహనుడున్నాడు.

"ఒక రసప్రియ గానాన్ని పాడు ఇప్పుడు," అంటాడు మోహనుడు.

"రసప్రియ వింటావా...సరే విను. కానీ నీతో ఈవిషయం ఎవరు చెప్పారో నాకు జెప్పు."

"హే,హే...అరే మోహనా! నీ పశువులు పారిపోతున్నాయి" ఒక కాపరి గట్టిగా అరిచాడు. "కర్మా, నీతోలు వలిచేస్తాడు."

"ఒరే నాయనా" అంటూ మోహనుడు పరుగెడతాడు.

నిన్ననే కర్మా వాడిని బాగా కొట్టాడు. రెండు ఎడ్లు పచ్చగా పెరిగిన జనప మొక్కల పొలాల్లోకి పరుగెత్తాయి...పుల్లగా తీయగా వుండే జనుము తినేదానికి.

"నేనిక్కడే చెట్టుక్రింద కూర్చుని వుంటాను. నీవు ఎడ్లను తోలుకుని తిరిగి రా. రసప్రియ విన్పిస్తాను. వింటావుకదూ" అంటూ పంచకౌడి మోహనున్ని పిలుస్తాడు.

మోహనుడు తిరిగి చూడకుండా పరగెడుతున్నాడు.

రసప్రియ!

విద్యాపతి నృత్యమండలిలోని వారు రసప్రియను పాడుతారు. సహరస జిల్లాలోని 'జోగేంద్ర ఝూ' ఒకమారు విద్యాపతి గారి పన్నెండు పదాలను పుస్తకరూపంలో ప్రచురించాడు. జాతరలో ఆపుస్తకం బాగా అమ్ముడు పోయింది. విద్యాపతి నృత్యమండలిలోని గాయకులు రసప్రియను పాడిపాడి జనప్రియంగా మార్చేస్తారు.

పొలం గట్టు మీద అల్లనేరేడు చెట్లనీడలో కూర్చుని పంచకౌడి మృదంగ వాదకుడు మోహనుని రాకకై ఎదురుచూస్తున్నాడు...జ్యేష్ఠమాసపు మధ్యాహ్నపు వేళల్లో పొలాల్లో పనిజేసే వాళ్లు కూడా ఇప్పుడు పాటలు పాడరు...కొద్ది రోజుల తర్వాత కోకిల కూడా కూయటం మరిచి పోతుందేమో. ఇలాంటి మధ్యాహ్నపు వేళల్లో కిమ్మనకుండా ఎలా పనిజేస్తారో! ఐదు సంవత్సరాల క్రితం వరకు ప్రజల్లో ఉల్లాసం ఉండేది...తొలి వర్షపు జల్లులు కురియగానే తడిసిన భూమిలో పెరుగుతున్న మొక్కలనుండి, ఒక రకమైన వాసన వెలువడుతుంది. మిట్టమధ్యాహ్నపు ఎండలో ఆర్థ్రతతో నిండిన కొమ్మలు కొవ్వొత్తిలా కరిగిపోతాయి. పల్లెప్రజలు బిరహా,చాంచర్, లగనీ మున్నగు పదాలు పాడే వాళ్లు. పొలాల్లో పనిచేస్తూ పాడే వారి పదాలు కూడా సమయానుకూలంగా వుంటాయి. జడివానలో బారామాస, కాల్చే ఎండలో బిరహా, చాంచర్, లగనీపదాలు.

"ఒరేయ్, పొలం దున్నే ఓరబ్బీ.

తొలిక తీసుకు వెళ్లండి ఓకూలీలు!"

ఈ మాదిరి ఎన్నో పదాలు పాడేవారు.

పొలాల్లో పనిచేసే కూలీలనూ మడక నడిపేవాళ్లనూ ఎవరో విరహాకుల యువకుడు దీనస్వరంతో అడుగుతున్నాడు - "తనతో అలిగి వెళ్లిపోయిన తన 'ధనీ' ఈ దారి వెంబడి పోతుండగా ఎవరైనా చూశారా అని?"

ఇప్పుడు మధ్యాహ్నపు వేళలు చాలా నీరసంగా గడిచిపోతాయి. ఎవరూ, ఏమీ మాట్లాడుకోరు. వాళ్లవద్ద మాట్లాడేదానికి భాషే లేనట్టు.

ఆకాశంలో చుట్టూ తిరుగుతున్న ఒక గద్ద అరిచింది ఖీన్ ఖీన్ మంటూ.

మృదంగవాదకుడు పాడుదయ్యమా పో, అని తిట్టాడు దానిని.

తనను వదలి మోహన్ చాలా దూరం పారిపోయాడు. వాడికోసం ఎంతో ఆశతో నిరీక్షిస్తున్నాడు. పరిగెడుతూ వాడి వద్దకు వెళ్లాలని మనసౌతుంది. ఎక్కడో దూరంలో మేస్తున్న గుంపులకేసి మాటి మాటికి చూడాలనుకున్నాడు...అంతా మబ్బుగా వుంది.

అతను తన సంచిలో వెదికాడు - మామిడికాయి, బొరుగులు వున్నాయి...అతనికి ఆకలిగా వుంది. ఎండిపోయిన మోహనుడి ముఖం గుర్తుకురాగానే ఆకలి చచ్చిపోయింది.

మోహనుడిలాంటి అందమైన సుశీలురైన పిల్లవాళ్లను వెతుకుతూనే అతను తన జీవితంలోని ఎన్నో దినాలను గడిపేశాడు...విద్యాపతి నృత్యంలో నటించగల నాట్యగాళ్ల అన్వేషణ అంటే మామూలు పనికాదు. ఉన్నత జాతుల వాళ్ళ ఇళ్ళల్లో కాదు గానీ నిమ్నజాతుల వారి ఇళ్లలో ఆడపిల్ల రూపం గల మోహనుడివంటి మగపిల్లవాళ్లు తరుచుగా పుడతారు. అప్పుడప్పుడూ వీళ్లు అవతరిస్తారు - అప్పుడప్పుడూ...

మైథిలీ బ్రాహ్మణుల్లోనూ కాయస్థులు, రాజపుత్రుల్లోనూ విద్యాపతి నృత్యం చేసేవాళ్ళకు చాలా గౌరవ మర్యాదలున్నాయి. తమ భాష మైథిలీలో నాట్యగాళ్ల నాలుక నుండి "జనమ అవథి హామ్ రూప్ నిహారల్" అని వారు ఉబ్బితబ్బిబ్బై పోతారు. అందువల్లనే ప్రతి బృందంలోని మూలపురుషుడు తన నాట్య చాతుర్యంతో ప్రేక్షకులను మెప్పించగల అందగాడైన పిల్లవానికోసం వూరూరు తిరుగుతాడు.

"సరిగ్గా బ్రాహ్మణ బాలిక మాదిరి అగుపిస్తున్నాడు కదూ?"

"మధుకాంత్ ఠాకూర్ కూతురి మాదిరి..."

"కాదు కాదు 'చిన్నచంపక' లాంటి ముఖ వర్చస్సు కలిగున్నాడు."

పంచకౌడి తన కళలో నేర్పరి. ఇతర బృందాలలో మూలపురుషునికి, మృదంగ వాదకుడుకి తరతమభేదాలున్నాయి. కానీ పంచకౌడి మృదంగవాదకుడు, మూల పురుషుడు కూడానూ. మెడలో మృదంగాన్ని వాయించుతూ, పాడుతూ నాట్యం జేస్తూ ఒక వారంలోనే క్రొత్త పిల్లవాణ్ణిరంగంలో ప్రవేశపెట్టి ప్రేక్షకులు మెచ్చుకో గలిగేటట్లు నాట్యం నేర్పుతాడు.

నాట్యం, గానం నేర్పటంలో అతనికెప్పుడు ఏలాంటి ఇబ్బంది కలుగలేదు. అతను మృదంగం వాయిస్తూ వుంటే మృదంగధ్వనికి అనుగుణంగా పిల్లవాళ్ల కాళ్లు తమంతటవే నృత్యం చేస్తాయి. పిల్లవాళ్ల మొండి తల్లి దండ్రులకు నచ్చజె ప్పటం కష్టమయ్యేది. వాళ్లకు శుద్ధమైన మైథిలీ భాషలో తేనె రంగరించిన మాటలతో వాళ్లను ఒప్పించగలుగుతాడు.

గోపాలకృష్ణుడు కూడా నాట్యం చేసేవాడు. నాట్యమంటే ఒక కళ. ఒకనైపు ణ్యం. సరే. యాచకుడను, పరిగడపలను ఆశ్రయించేవాడను. కళను నైపుణ్యాన్ని ప్రదర్శించి ప్రజలను సంతోషపరచి కడుపు గడుపుకోవటం; దొంగతనం, పోకి రితనం కంటే మంచిదే కదా. ఒకప్పుడు ఒకపిల్లవాన్ని దొంగిలించుకొని తేవలసి వచ్చింది...చాలా ముందుమాట. బాగా చితకబాదారు కూడా...చాలా పాత విష యంలే!

విషయం పాతదే కానీ వాస్తవమైనదే కదా!

"రసప్రియ పాట రాగాన్ని మృదంగంపై వాయిస్తూ నీవ్రేలు వంకర తిరిగి పోయింది. అవును కదూ?" ఎప్పుడొచ్చాడో మోహనుడు తిరిగొచ్చాడు.

మృదంగవాదకుని ముఖంలో ఆనందం తాండవించింది. అతను మోహను నికేసి తరేక దృష్టితో చూస్తున్నాడు. తేజస్సుగల పిల్లవాడు. పైకిరావలసిన వాడు. కానీ ఏం లాభం? ఎర్రని పెదవులు బీడి కాల్చటం వల్ల నల్లబడ్డాయి. ఏదో జబ్బు న్నట్లుంది...వీడికడుపులో తప్పక గుల్మం ఏర్పడింది.

మృదంగ వాదకుడు వైద్యం కూడా చేస్తాడు. వెళ్లిన చోటల్లా వైద్యం చేస్తూ రోగాలు నయంచేస్తాడు...తిరునాళ్ళు, జాతర సమయాల్లో అడ్డమైన పదార్థా లను తినటంవల్ల పిల్లలకు జబ్బులొస్తాయి. మృదంగవాదకుడు తన వెంట సులే మానీ ఉప్పు, జీర్ణశక్తిని పెంచే పొడరు, కునైన్ మాత్రలు ఎల్లప్పుడూ తన వద్ద వుంచుకుంటాడు...తన వద్ద వుండే పిల్లవాండ్లకు వేడి నీళ్ళతో పాటు, పసుపు పొడి తాగిస్తాడు. పిప్పళ్ల మిరియాలు, అల్లం వగైరాలు నెయ్యి వేయించి తేనెతోపాటు

రంగరించి నాకిస్తాడు...వేడినీళ్లు తాపుతాడు.

సంచిలోంచి బొరుగులు, మామిడికాయ బయటకు తీస్తూ "ఇవిగో వేడినీళ్లు. కడుపులో గుల్మం పెరిగింది. ఈ నీళ్లుతాగు" అన్నాడు.

"నీకెలా తెలుసు. నాకడుపులో గుల్మం పెరిగిపోయిందని. ఫార్‌బిస్‌గంజ్ లోని డాక్టరుకూడా ఇదేమాట అన్నాడు. మరి మందు..." ఇక చెప్పవలసిన అవసరంలేదు. మోహన్‌లాంటి పిల్లవాళ్ల కడుపులో పెరిగిపోయిన గుల్మం చితిపైన కాలినపుడే కరిగిపోతుంది. ఈ విషయం మృదంగవాదకునికి తెలుసు. మందూ మాకు ఎందుకు తీసుకోలేదని అడిగి ఏమిలాభం?

"ప్రతిరోజు పసుపు పొడి బొక్కలాడి వేడి నీళ్లు తాగితే కడుపులోని గుల్మం కరిగిపోతుందని మాఅమ్మకూడా అంటుంది."

"మీ అమ్మ మంచి తెలివైనదేనే" మృదంగవాదకుడు నవ్వుతూ అన్నాడు.

ఎండిన అరిటాకుపైన బొరుగులు, మామిడికాయ ముక్కలు పెట్టి "తీసుకో తిను." అని చాలా ఆప్యాయతతో అన్నాడు.

"వద్దు, నాకు ఆకలి వేయటం లేదు."

కానీ, బొరుగులు, మామిడిముక్క లను ఒకేసారి మింగాలన్నట్లు మోహనుడి కళ్లలోంచి ఎవరో తొంగిచూస్తున్నట్లు అన్పించింది...ఆకలితోనూ జబ్బుతోనూ వున్నాడు. ఈ పిల్లవాడు. ఓ భగవంతుడా!

"రా బిడ్డా, రా తిను...రసప్రియ. మృదంగం వినవా?"

తల్లి తప్ప ఇంతవరకూ ఎవరుగానీ భోజనం వడ్డించి ఇంత ఆప్యాయతతో పిలువలేదు. కానీ మిగతా పశువుల కాపర్లు చూస్తే అమ్మకు చెప్పరా...అడుక్కున్న అన్నం తిన్నావని చెప్పరా.

"వద్దు నాకు ఆకలిగా లేదు."

మృదంగవాదకుడు నిరాశ చెందాడు. కళ్లు చెమ్మగిల్లుతాయి. మృదంగ వాదకుడు మోహనుడి లాంటి ఎందరో పిల్లవాళ్ళకు సేవచేశాడు. తన స్వంతకొడుకుల పట్ల కూడా ఇంత ఆప్యాయత అతను చూపలేదు...తన కొడుకా, ఊ! ఎవరు తనవారు? ఎవరు పరాయివారు? అందరూ తనవారే అందరూ పరాయివారే.

"తీసుకో మోహనా."

"ఎవరైనా చూస్తేనో!"

"చూస్తే, ఏమిటంట."

అమ్మతో చెబుతారు. నీవు అడుక్కొని తింటావుకదా?

ఎవరు అడుక్కొని తినేది? మృదంగ వాదకుని ఆత్మాభిమానంపై ఈ పిల్ల వాడు ఏకారణం లేకుండానే దెబ్బకొట్టాడు. అతని మనసులో చుట్టచుట్టుకొని నిద్రపోతున్న సర్పం పడగవిప్పి బుసకొట్టింది. "ఒరే బడవా! తన్నేనంటే..."
"ఏయ్, తిడతావెందుకు" భయపడుతూ అన్నాడు మోహనుడు.

మోహనుడు లేచి నిలబడ్డాడు. పిచ్చివాళ్లపైన ఏమిభరోసా!

ఆకాశంపైన ఎగురుతున్న గద్ద అరిచింది ఖిస్ ఖిస్‌మని.

మోహన్! మృదంగవాదకుని గొంతు గంభీరంగా పలికింది. మోహనుడు కొంచెం దూరంగా వెళ్లి నిలబడ్డాడు.

"ఎవరు చెప్పారురా నీకు నేను అడుక్కు తింటానని? మృందగం వాయించుకుంటూ పదాలు పాడుకుంటూ ప్రజలను సంతోషపరుస్తూ కడుపుకోసం పైసలు సంపాదిస్తాను..అవును నీవు చేప్పేది నిజమేలే. ఇది అడుక్కున్న అన్నమే మరి. భిక్షాటన ఫలమే ఇది...సరే నీకిది పెట్టను...నీవు కూర్చో. నేను మృదంగంలో రసప్రియ విన్పిస్తాను."

మృదంగ వాదకుని ముఖం మెల్లమెల్లగా వికృతరూపం దాల్చసాగింది...ఆ కాశంలో ఎగిరే గద్ద వచ్చి చెట్టుకొమ్మపై వాలింది...మరల ఖిచ్, ఖిచ్ అంది.

మోహనుడు భయపడ్డాడు. మెల్లమెల్లగా రెండడు గులేసి పరుగు లంఘించి పారి పోయాడు.

ఒక ఎకరం దూరం పరుగెత్తి అక్కన్నుంచి అరవటం మొదలు పెట్టాడు. "దయ్యం బాణమేసి నీచేతి వ్రేలిని మెలిక తిప్పింది. మృదంగంలో రసప్రియ వాయించేటప్పుడు వ్రేలు మెలిక తిరిగిందని అబద్ధాలాడుతున్నావు..."

"అరే! ఎవడు వీడు. ఎవడీ మోహనుడు..దయ్యం బాణంవేసి నావ్రేలు వంకర చేసిందని రమపతియాకూడా అనేది."

"మోహనా!"

మోహనుడు పోతూపోతూ బిగ్గరగా అరిచాడు, "కాకరకాయ! ఓహో మృదంగవాదకుడు కాకరకాయ అంటే కోప్పడుతాడని మోహనునికి కూడా తెలుసన్న మాట...ఆఖరికి ఎవడీ పిల్లవాడు.?"

మృదంగవాదకుడు వ్యాకులత చెందాడు. అతని మనస్సులో ఏదో ఒక అజ్ఞాత భయం చోటు చేసుకుంది. అతను గజగజ వణకసాగాడు. కమల్ పుర్ షావుకారు దగ్గరికి వెళ్లాలనే ఉత్సాహం గూడా క్షీణింపసాగింది...పొద్దున్నే శోభామిశ్ర , కొడుకు అనింది నిజమేనన్నమాట.

కళ్ళనుంచి నీళ్లు కురవసాగాయి.

పోతూపోతూ మోహన్ కాటేశాడు. అతని శిష్యుల్లో చాలామంది ఇదేమాదిరి ప్రవర్తించారు. తనవద్ద నాట్యం నేర్చుకొని ఏదో ఒక సాకుతో తనను విడచి పారి పోయిన శిష్యుల మాటలు ఒక్కొక్కటి అతనికి గుర్తుకొచ్చాయి.

సోంగ్మా అనే శిష్యుడైతే "గురువట ఈ దొంగముండా కొడుకు!" అంటూ తిట్టేసి పారిపోయాడు.

రమపతియా ఆకాశంవైపు చేతులెత్తి ఏడుస్తూ "ఓ దివాకరుడా! నీవే సాక్షి. ఈ మృందగవాదకుడు నన్ను మభ్యపెట్టి నాశనం చేశాడు. నామనసులో ఎప్పుడూ ఏలాంటి దుర్బుద్ధి లేదు. ఓ సూర్య భగవానుడా! పది గడపలు అడుక్కునే ఈ కుక్క అవయవాలు చెల్లా చెదురై పోవుగాక!" అని వేడుకొంది.

మృదంగవాదకుడు తన వంకర పోయిన వ్రేలిని తిప్పుతూ నిట్టూర్చాడు...రమపతియా? జోధన్ గురువుగారి కూతురు. తాను జోధన్ గురువుగారి బృందంలో ప్రవేశించిన నాడు రమపతియా పన్నెండో ఏట అడుగిడింది...బాల వితంతువు అయిన రమపతియాకు విద్యాపతి పదాల అర్థం బోధ పడసాగింది. ఆమె పనీ పాటా చేస్తూ "నవ అనురాగాని రాధ బాధంటే ఎరుగదు పాపం" అంటూ కూనిరాగాలు తీసేది...మృదంగవాదకుడు 'మూలగైనీ' నాట్యం నేర్చుకోవాలని గురువు దగ్గరికి వెళ్తే గురువుగారేమో అతనికి మృదంగం నేర్పారు...ఎనిమిదేళ్ల తర్ఫీదు పొందిన తర్వాత గురువు గారు తనను సజాతి వాడుగా భావించి రమపతియాను పెండ్లి చేసుకొంటావా అని అడిగితే మృదంగ వాదకుని లయ తప్పిపోయింది. తాను తబ్బిబ్బైపోయాడు. గురువుగారి వద్ద తన జాతిని దాచాడు. రమపతియా పట్ల అతను ఉత్తుత్తి, ప్రేమ చూపాడు. గురువుగారి బృందాన్ని వదలి రాత్రికిరాత్రే పారిపోయాడు. తన ఊరికి తిరిగొచ్చి సొంత సంగీత బృందాన్ని స్థాపించి పిల్లలకు సంగీతం నేర్పుతూ కాస్తాకూస్తో ఆర్జిస్తూ దాంతో పొట్టనింపుకోసాగాడు... కానీ అతను మూలగైనీ కాలేకపోయాడు. కాలమంతా మృదంగ వాదకుడుగా వుండిపోయాడు...జోధన్ గురువుగారు మరణించిన తర్వాత, ఒకసారి 'గులాబ్ బాగ్' ఉత్సవంలో రమపతియాని కలుసుకున్నాడు. రమపతియా అతన్ని కలవడానికే వచ్చింది. కపటప్రేమ ప్రదర్శించటానికి వచ్చావా? అని నిర్మొహమాటంగా పంచకౌడి అడిగాడు. కమల్‌పూర్ నందబాబు దగ్గరికి పోరాదా నాదగ్గరికెందుకు వచ్చావు? మోసగించేదానికా? నందబాబుగారి గుర్రం రాత్రి పన్నెండు గంటలకు...ఇదివిని "పాంచూ" నోరుముయ్యి అని బిగ్గరగా అరిచింది రమపతియా.

అదేరోజు రాత్రి మృదంగంపైన రసప్రియ పదం వాయించేటప్పుడు అతని వ్రేలు వంకరపోయింది. మృదంగంపైన ముక్తాయింపు చేసి పరభేస్ తాళం వాయించసాగాడు. నాట్యగాడు లయ తప్పిన ఒకటిన్నర తాళంతో ప్రవేశించగానే అతని తల తిరిగిపోయింది. పరభేస్ తాళం తర్వాత "నీచెంపలు వాయిస్తానురా గాడిదా" అని నటుని అన్నాడు...రసప్రియ తాళం ఆదిలోనే హంసపాదయ్యింది. తాళాన్ని సరిదిద్దాలని మృదంగ వాదకుడు ఎంతో ప్రయత్నించాడు. ఎండిన మృదంగ చర్మం ఖంగున మ్రోగింది. ఎడమ మృదంగపు కరిని పగిలినందున తాళమేస్తూ వేస్తూ అతని చేతివ్రేలు వంకరపోయింది...పంచకొడి బృందం చెదిరిపోయింది. క్రమంగా ఆప్రాంతంలో విద్యాపతి నాట్యం గూడా కనుమరుగైపోయింది. ఇప్పుడెవరూ అక్కడ విద్యాపతిని గూర్చి అనుకొనేవాళ్లు లేరు...వాస్తవానికి ఎండా, వానా తెలియకుండా పంచకొడి జీవితం చల్లని వేదికలపైనే గడిచిపోయింది...ఉద్యోగం సద్యోగం లేరతనికి. మృదంగం ఎంతో సహకరించింది.

ఎంతో కాలంగా మృదంగాన్ని మెడకేసుకొని అడుక్కు తింటున్నాడు...తక థిమ్ తోమ్ అంటూ.

మామిడి ముక్క తీసుకొని చప్పరించ సాగాడు. కానీ కానీ... మోహనునికి దయ్యం మాట ఎలా తెలిసిపోయిందో!

వ్రేలు వంకర తిరిగిన విషయం తెలుసుకొని రమపతియా పరుగెడుతూ వచ్చింది. ఆవ్రేలు పట్టుకొని గంటలకొద్దీ ఏడువసాగింది. "ఓ దివాకరుడా! ఈ దుస్థితి ఎవరు కలిగించారు? వాడు పాడైపోను...ఓ భగవంతుడా నాతప్పులు క్షమించు. కోపంతో అన్న మాటలను లెక్కచేయకు. పాంచూ, నేనేమీ నిన్ను మోసగించలేదు. తప్పక ఏదో దయ్యం బాణమేసి నీ వ్రేలు వంకరజేసింది. మృదంగవాదకుడు కళ్లనీళ్లు తుడుచుకుంటూ అస్తమిస్తున్న సూర్యుని వైపు చూశాడు... ఈ మృదంగాన్నే తన గుండెలకదుముకొని రమపతియా ఎన్నో రాత్రులు గడిపింది...మృదంగాన్ని అతను తన గుండెల కానించుకున్నాడు."

చెట్టు కొమ్మపై నుంచి ఎగిరిపోతూ గద్ద అరిచింది ఖిచ్ ఖిచ్ అని.

'సైతాన్' అంటూ గద్దను తిట్టాడు. పొగాకు నలుపుకొని నోటిలో వేసుకున్నాడు. మృదంగపైన వ్రేళ్లు నాట్యం చేయసాగాయి. ధిర్‌నాగా,ధిర్‌నాగా,ధిర్‌నాగా,ధిన్ తా.

తాళం పూర్తిచేయలేక పోయాడు. మధ్యలోనే తాళం ఆగిపోయింది.

ఓహో,ఓహో...

గంగిరేగు చెట్ల అడవికి అటువైపు మంచి మధుర కంఠంతో ఆనందోత్సాహాలతో ఎవరో రసప్రియ గీతాన్ని ఆలాపించారు.

"న - వ. వృందా - వన్, న-వ-న-వ-త రు-గ-న, న-వ-నవ వికసిత ఫూల్..." మృదంగ వాదకుని శరీరం పులకరించింది. వాటంతటవే మృదంగంపై వ్రేళ్లు నాట్యమాడసాగాయి. ఆలమందలు గుంపులు గుంపులుగా చేరసాగాయి. "పిచ్చివాడు ఎక్కడ ఇష్టపడితే అక్కడ కూర్చొని మృదంగం వాయిస్తాడు" అని పొలాల్లో పనిచేసే వాళ్లు అన్నారు.

"చాలా రోజుల తర్వాత తిరిగొచ్చాడు."

"ఎక్కడో చచ్చాడనుకొన్నామే మనం!"

మధురమైన రసప్రియ గీతం లయ వద్ద తెగిపోయింది. మృదంగ వాదకుడు చిర్రెత్తిపోయాడు. లేచి పరుగెత్తసాగాడు. గంగిరేగుచెట్ల పొదలకటువేపు ఎవరబ్బా గీతాన్ని ఇంత మధురంగా పాడుతూంది...? ఈ కాలంలో కూడా రసప్రియ రసికులున్నారా? అనుకుంటూ పొదల్లో దాక్కొని మృదంగవాదకుడు చూస్తున్నాడు. మోహనుడు తన్మయుడై రెండో పదాన్ని ఎత్తుకున్నాడు. కూనిరాగంతో మొదలై గొంతు సవరించుకొని పాడసాగాడు. మోహనుని గొంతుకలో రాధ ఆవేశించింది. ఏమిటీ మధురాలాపన!

"న-దీ బహు నయనక్ పీర్

ఆహో... పలటీ బహయే తాహి తీర్."

మోహన్ తన్మయత్వంతో పాడుతున్నాడు. మృదంగ తాళలయలో లీనమై పాడసాగాడు. మృదంగ వాదకుడు తదేక దృష్టితో అతన్ని చూస్తున్నాడు. అతని వ్రేళ్లులయ బద్ధంగా నాట్యమాడసాగాయి. ఎన్నో ఏండ్ల తరువాత; 40 ఏళ్ల ఆ పిచ్చివాడు భావావేశంతో నాట్యం చేయసాగాడు. ఉండి ఉండి తన వికృత స్వరంతో పద పంక్తులను జోడిస్తూ.

ధీర్ నాగి - ధిమ్‌తా...

"దుహుంరస...మా...య తను గుణే నహి నోర్.

లాగుల దుహుంక న భాంగయ జోర్."

సగం ఎఱుపు, సగం నలుపు రంగు గల మోహను పెదవులపై చిరునవ్వు నాట్యమాడింది.

పదాలపని ముగించి "భలే! వంకర వ్రేలికి కూడా ఇంత ప్రావీణ్యమా!" అని మోహను డన్నాడు. మోహనుడి గుండె వేగంగా కొట్టుకోసాగింది.

ఉఫ్. మృదంగ వాదకుడు దబీమని నేలపై కూర్చున్నాడు. వాహ్! శభాష్ ఎవరి వద్ద నేర్చుకొన్నావు? ఈ పదాలు ఎక్కడ నేర్చుకున్నావు. నీ గురువెవరు? ఎక్కడ నేర్చుకుంటాను. అమ్మ రోజూ పాడుతూ వుంటుంది. ప్రాతఃకాలం పాడే పాట నాకు బాగా వస్తుంది. కానీ ఇప్పుడు ఇది పాడే సమయం కాదు కదా! మోహన్ నవ్వుతూ జవాబిచ్చాడు.

"అవును బిడ్డా. తప్పుడు తాళంతో ఎప్పుడూ పాట పాడొద్దు. అలాచేస్తే వచ్చిన విద్య కూడా పోతుంది... ఏపాట ఏ సమయంలో పాడాలో ఇదికూడా గుర్తుంచుకోవాలి. సరే ఇప్పుడు మామిడి ముక్క తిను."

మోహన్ ఇప్పుడు నిస్సంకోచంగా మామిడిముక్క తినసాగాడు.

"ఇంకోటి తీసుకో" మోహన్ మూడు మామిడి ముక్కలను తిన్నాడు. మృదంగ వాదకుని కోరిక మేరకు రెండు పిడికిళ్లు బొరుగులు కూడా బొక్కలాడాడు.

'సరే' ఒకమాట అడుగుతా జవాబు చేస్తావా? మీ అమ్మ నాన్న ఏమి చేస్తారు?

"నాన్నలేరు. అమ్మవుంది. సావుకార్ల ఇళ్లలో దంచటం, విసరటం పనులు చేస్తుంది."

"మరి నీవు నౌకరువా. ఎవరివద్ద?"

'కమలపూర్‌లోని నందబాబుగారి వద్ద.'

"నందబాబుగారి వద్దనా!"

వాళ్ళ ఇల్లు సహరసలో వున్నదనీ, మూడేళ్లనాడు కోసీనదికి వరదొచ్చి వూరు కొట్టుకుపోయిందనీ వాళ్లమ్మ తనను తీసుకొని మామగారి వూరైన కమలపూర్ వచ్చిందని చెప్పాడు.

కమలపూర్‌లో మీ అమ్మగారి మామగారున్నారా?

మృదంగ వాదకుడు కొంతసేపు మౌనంగా సూర్యునిపైపు చూశాడు...నందబాబు - మోహన్ - మోహన్ తల్లి!

దయ్యం మాట, అంటే దయ్యం బాణం వేసి నాభ్రేలు వంకర తిరిగిందన్న మాట. మీ అమ్మ చెప్పిందా.

"అజోధాదాస్."

అజోధాదాసా?

పాపం. ముసలి అజోధాదాస్ మాటకారి మనిషి కాదు...బృందంలో సామాన్లు మోసే వాడు జీతం భత్యంలేని నౌకరు.

"మీ అమ్మ చాల తెలవిగలది" ఒకనిట్టూర్పు విడచి సంచిలోనుంచి పర్సుతీ

శాడు. రంగు రంగుల గుడ్డ పేలికలలోంచి ఒక కాగితపు పొట్లాన్ని బయటకు తీశాడు. మోహన్ అది నోటు అని తెలుసుకున్నాడు. "ఇది నోటా?"

'అవును నోటే.'

ఎన్నిరూపాయలది? ఐదు రూపాయలదా? లేక పది రూపాయలదా? నన్ను దాన్ని పట్టుకోనిస్తావా? ఎక్కడ నుంచి తెచ్చావు అని గుక్క తిప్పుకోకుండా మోహన్ అడిగాడు. ఇవన్నీ పది రూపాయల నోట్లేనా?

అవును, ఇవన్నీ కలిసి నలువది రూపాయలు. మృదంగ వాదకుడు నాలుగు వైపులా జూసి మెల్లగా ఇలా అన్నాడు. బిడ్డా మోహన్ ఫార్‌బిస్‌గంజ్ డాక్టరు బాబుకు ఈ డబ్బిచ్చి మంచి మందు రాపించుకో...పులుపు తీపి తినకుండా పత్యముండు...వేడినీళ్లు తప్పక తాగుతూ వుండు.

నాకు ఈ రూపాయలు ఎందుకిస్తున్నావు?

తొందరగా తీసుకో, లేకపోతే ఎవరన్నా చూస్తారు?

మోహన్ కూడా నాలుగు వేపులా తేరిపార జూశాడు. వాడి పెదవులపైన నలుపు రంగు మరింత నలుపెక్కింది.

"బీడీ, పొగాకు తాగుతావు కదూ ఇకముందు తాగొద్దు జాగ్రత్త" మృదంగ వాదకుడు హెచ్చరించాడు.

"అతను లేచి నిలబడ్డాడు."

మోహన్ నోట్లు తీసుకున్నాడు.

"బాగా గట్టిగా మూట గట్టుకో. మీ అమ్మతో ఏమీ చెప్పకు."

ఇటు చూడు. అడుక్కొని సంపాదించిన డబ్బులు కావివి. ఇది నాసంపాదన. నేను కష్టపడి సంపాదించినవి.

మృదంగ వాదకుడు అక్కణ్ణుంచి వెళ్లి పోతుండగా "మా అమ్మ పొలాల్లో గడ్డికోస్తూ వుంది. నా వెంట రారాదూ" అని మోహన్ అన్నాడు.

మృదంగ వాదకుడు ఆగిపోయాడు. ఏదో ఆలోచించుకుంటూ.

"వద్దు. మోహనా!" నీలాంటి గుణవంతుడైన కొడుకును కన్న మీ అమ్మ మహారాణి లాంటిది, నేనేమో అడుక్కు తినేవాన్ని. పది గడపలు తిరిగేవాన్ని. యాచకున్ని, ఫకీరును...మందు కొనిన తర్వాత మిగిలిన పైసలతో పాలు తాగు అన్నాడు.

మోహనుని పెద్ద పెద్ద కళ్లు చాలా అందంగా అచ్చంగా కమలపుర్ నంద బాబుగారి కళ్ల మాదిరి వున్నాయి.

"అరేయ్ మో-హ-నా! ఎడ్లు ఎక్కడున్నాయిరా?"

"మీ అమ్మ గదా అరిచింది!"

అవును. నీ వెట్లా కనుక్కొన్నావు.

'అరేయ్ మో-హ-నా. ఒరేయ్ మో-హ-నా.'

స్వరంలో స్వరం కలుపుతూ ఆవుకూడా తన దూడను పిలిచింది.

ఆలమందలు తిరిగి ఇంటికొచ్చే సమయం అయింది. వాళ్లమ్మ ఎడ్లను తోలుకుని వస్తూ వుంది. ఊరికే తనను పిలుస్తుంది. అని మోహనుడికి తెలుసు.

"పో, మీ అమ్మ పిలుస్తోంది. ఇకనుంచి నేను పదాలు గాని రసప్రియ గీతాలు కాని పాడను. నిర్గుణ భక్తి పదాలు పాడ్తాను. చూడు నా వంకర తిరిగిన వ్రేలు చక్కగా వచ్చింది. ఈ కాలంలో అసలైన రసప్రియ పదాల్ని ఎవరూ పాడ లేరు."

"పద, పదవే, ఓమనసా - అత్తోరింటికి పద

ఓ రామా!

ఓ! రోరీ రామా."

పొలాల్లోని కాలిబాట గంగిరేగి వనంలోంచి పోతుంది. నిర్గుణ భక్తి పదాలు పాడుకుంటూ గంగిరేగి పొదల్లో మృదంగ వాదకుడు దాక్కున్నాడు.

"ఏమిరా ఇక్కడ ఒంటరిగా నిల్చుని ఏమి చేస్తున్నావు? మృదంగం వాయించిందెవరు?" తలపైన గడ్డి మోపు మోస్తూ వున్న మోహనుని అమ్మ అడిగింది...

"మృదంగ వాదకుడు పంచకొడి."

"ఆ...ఏమన్నావు? వాడొచ్చాడా? వచ్చాడావాడు" అంటూ తలపై నున్న గడ్డి మోపు కింద పారేసింది.

"నేను అతని మృదంగ తాంళంపైనే రసప్రియ పదాన్ని పాడాను. నాపాటవిని ఇంత స్వచ్ఛమైన రసప్రియ పదాన్ని ఇప్పుడెవరూ పాడలేరు అన్నాడు...అతని వంకర తిరిగిన వ్రేలిప్పుడు బాగా వుంది." అన్నాడు మోహనుడు.

ఆనంద పారవశ్యంతో రోగిష్టి అయిన మోహనున్ని తన గుండెలకు హత్తుకొంది వాళ్లమ్మ.

"కానీ నీవేమో ఎల్లప్పుడూ అతని గురించి చెడ్డగా చెప్పేదానివి గదా. నమ్మకద్రోహి అని, గురుద్రోహి అని దొంగ అని."

"అది మాత్రం నిజమే. ఇటువంటి వాళ్లతో స్నేహం చేయకూడదు. వాడి వెంట మరొక మారు వెళ్లావంటే నీ భరతం పడతా జాగ్రత్త. పది గడపలు ఆడు

క్కుతినే వాళ్లతో సంబంధం పెట్టుకొంటే మనకు నష్టమే. సరే పద. గడ్డిమోపు ఎత్తుకో."

"ఏమయినప్పటికీ మంచి నైపుణ్యం గలవాడు. అతని మృదంగం తాళంలో రసప్రియ పాడటం అంటే..." మోత ఎత్తుకుంటూ మోహన్ అన్నాడు.

"నోరు మూసుకో! రసప్రియ మాటెత్తకు."

"నీది మరీ విచిత్రం. కోపంవస్తే పులి అవుతావు. సంతోషం కలిగితే ఆవు మాదిరి పరుగెత్తూ వచ్చి నన్ను అక్కున చేర్చుకుంటావు. క్షణంలో సంతోషం. క్షణంలో కోపం..."

ఎక్కడి నుంచో మృదంగం పలికింది - "ధాతింగ్ - ధా - తింగ్."

మోహన్ తల్లి పొలాల్లో ఎత్తు తగ్గులున్న గెనాలపైన నడుస్తూ వుంది. కాలు జారి కింద పడిపోతూ సంభాలించుకుంది. తల పైనున్న గడ్డిమోపు కిందపడి విచ్చుకుపోయింది. మోహన్ వెంబడి నెమ్మదిగా తల్లి వెనుకపోతూ వున్నాడు.

"ఏమయిందమ్మా?"

"ఏమి కాలేదులే!"

"-ధా-తి-గ్, ధా-తింగ్."

మోహన్ తల్లి గట్టుపైన కూర్చుంది. జ్యేష్ఠమాసం సాయంకాలానికి ముందు వేసే తూర్పుగాలి జోరుగా వేయసాగింది. మట్టిలోని సుగంధపు వాసనే గాలిలో క్రమంగా కలిసి పోసాగింది.

"ధా - తింగ్, ధా -తింగ్."

"మృదంగ వాదకుడు మరేమన్నా అన్నాడా బిడ్డా?" ఎందుకో తర్వాత మాట పొసగలేదు.

"నీలాంటి గుణవంతుడైన కొడుకును కన్న నీ తల్లి మహారాణి లాంటిది. నేనేమో పది గడపలు అడుక్కొనే వాడిని" అని అన్నాడు.

"అబద్దాల కోరు. నమ్మకద్రోహి," కళ్లనీళ్లు తుడుచుకుంటూ మోహనుని అమ్మ అంది. "ఇలాంటి వాళ్ల సాంగత్యం ఎప్పుడూ చేయరాదు."

మోహనుడు అమ్మను చూస్తూ కిమ్మనకుండా నిల్చున్నాడు.

(1955)

# మూడో ఒట్టు

బండితోలే హిరామన్‌కు వీపులో చక్కిలిగింతలుగా ఉంది...!

గత ఇరవై ఏండ్లగా బండితోలుతున్నాడు. హిరామన్ - అదే ఎడ్లబండి. దేశ సరిహద్దుకు అవతలున్న నేపాల్ రాజ్యంలోని మోరంగ్ నుంచి ధాన్యం, కట్టెలూ తోలాడు. కంట్రోళ్ల కాలంలో చీకటి బజారు వస్తువులను ఇటునుండి అటు, అటు నుండి ఇటు చేర వేశాడు. కానీ, ఎన్నడూ ఈ మాదిరి చక్కిలి గింతలు కలుగలేదు...!

కంట్రోళ్ళ కాలం. ఆకాలాన్ని హిరామన్ మరువగలడా? ఒకసారి నాలుగు బస్తాల సిమెంటు, బట్టల బేళ్లు జోగ్‌బని నుంచి విరాట్ నగరు కు చేరవేసాడు, ఆ తర్వాత హిరామన్ గుండె దిటవుచేసుకొన్నాడు. ఫార్‌బిస్ గంజ్‌లోని ప్రతి దొంగ వ్యాపారికి హిరామన్ గొప్పతనం తెలుసు. అతని ఎడ్లను పెద్ద సేఠ్‌జీ కూడా తన పరిభాషలో పొగిడేవాడు...

ఐదో సారి బండి పట్టుబడింది. సరిహద్దుకు ఇవతలిలోయలో, హిరామన్ బండ్లో కోమటి గుమస్తా బేళ్ల మధ్య గుంత కూర్చొని దాక్కున్నాడు. పోలీసు ఇన్‌స్పెక్టరు చేతిలోని మూరెడు టార్చిలైటు కాంతి ఎంత దూరం పోతుందో హిరామన్‌కు బాగా తెలుసు. ఒక్క క్షణం ఆలైటు కళ్ళ మీద పడినా, గంటసేపటివరకు కళ్లు కనిపించవు. కాంతితో పాటు "రేయ్! బండి ఆపు.లేక పోతే గుండు పేలుస్తా. దొంగ నా...!" అనే గర్జన కూడా వినవచ్చింది.

ఇరవై బండ్లూ ఒక్కసారిగా ఆగి పొయ్యాయి. హిరామన్ ముందే చెప్పాడు, ఇరవై బండ్లూ పట్టు బడతాయని. హిరామన్ బండి లోకి లైటు వేసి ఇన్‌స్పెక్టరు వికటాట్ట హాసం చేశాడు. దాక్కున్న గుమస్తా అతని కళ్ళను కప్పలేక పోయాడు. "హ...హ...హ...గుమస్తా...ఆ...ఆ...హి...హి...హి...రేయ్...ఎవడ్రా బండి వాడు... గ్రుడ్లు మిటకరించి ఏం చూస్తావురా...ఈ సంచి మీద ఉన్న కంబళి తీసెయ్." చేతిలోని కఱ్ఱతో గుమస్తా పొట్టలో పొడుస్తూ,

'ఈ సంచి మీది కంబళిరా...దొంగలంజ!...'అన్నాడు.

గుమస్తాకు, ఇన్‌స్పెక్టరు సాబ్‌కు పాతవైషమ్యం ఉండి ఉండాలి. కాక పోతే

అంత డబ్బు ఎర చూపినా చెక్కు చెదర కుండా ఉంటాడా? బండిలో కూర్చునే నాలుగు వేలు ఇస్తున్నాడు గుమస్తా. లాఠీతో రెండో సారి పొట్టలో పొడిచాడు. ఇన్‌స్పెక్టరు...ఐదువేలు...మరో సారి పొడిచి "ముందు దిగూ" అన్నాడు.

గుమస్తాను బండి దింపి అతని కళ్లపై లైటువేశాడు. ఇన్‌స్పెక్టరు. ఇద్దరి పోలీసుల సాయంతో గుమస్తాను దగ్గరలోనున్న పొద దగ్గరికి తీసుకెళ్లాడు. ప్రతి బండి దగ్గరా తుపాకులు పట్టుకొనిపోలీసులు కాపలా ఉన్నారు...ఈసారి బయట పడటం కష్టం అనుకున్నాడు హిరామన్...జైలు...హిరామన్‌కు జైలంటే భయం లేదు. కానీ వాడి ఎద్దు? నీళ్లూ,మేతా లేకుండా పోలీసుస్టేషన్ ముందు పడి ఉండాలో ఏమో! ఆ తర్వాత వేలం పాడుతారు. అన్నా వదినలకు హిరామన్ తన మొహమెలా చూపించగలడు? వేలం పాట ఇప్పుడే చెవుల్లో గింగురుమంటోంది... ఒకటి...రెండు...మూడు...గుమస్తాకూ, ఇన్‌స్పెక్టరుకూ ఇంకా ఒప్పందం కుదిరినట్టులేదు.

హిరామన్ బండి దగ్గర పహారా ఇస్తున్న పోలీసు రెండోపోలిసోడితో గుస గుసలాడాడు. ఏందయ్యా? యవారం బెడిసినట్టుండాదే...పొగాకు కాద ఇచ్చే నెపంతో ఆ పోలీసుకు దగ్గరగావెళ్లాడు.

ఒకటి, రెండు, మూడు. మూడు, నాలుగు బండ్లు అడ్డం ఉన్నాయి. హిరామన్ ఒక నిర్ణయానికి వచ్చాడు. నెమ్మదిగా ఎద్లమెడకున్న త్రాడు విప్పేశాడు. బండ్లో కూర్చొనే రెండింటినీ ఒకటిగా కట్టాడు. ఇప్పుడేం చెయ్యాలో ఎద్లకు అర్థమయింది. హిరామన్ బండి దిగి, మెడపై నుండి కాడి తీసి దాని క్రింది వెదురు కఱ్ఱ అడ్డుగా పెట్టాడు. రెండు ఎద్ల మెడపై మెల్లగా తట్టి "పదండ్రా...బ్రతికుంటే ఇటువంటి బండ్లు చాలా దొరుకుతాయి." అన్నాడు. "ఒకటీ, రెండూ, మూడూ... పరుగుపెట్టండిక."

బండ్ల చాటున ఉన్న రోడ్డుకు ఇరువైపులా పెద్దపెద్దపొదలున్నాయి. ఊపిరి బిగపట్టి ఆ మూడు ప్రాణులూ పొదలను సవ్వడి లేకుండా దాటేశాయి. తర్వాత నెమ్మదిగా నడక సాగించాయి. రెండు ఎద్లూ దారి వాసన చూసుకుంటూ, అడవిదారి పట్టాయి. అన్ని అడ్డంకులూ దాటుకుంటూ, తోకలెత్తుకు పరుగెత్తసాగాయి. వాటి వెనకే హిరామన్. ఈ ముగ్గురూ రాత్రంతా పరుగెత్తుతూనే ఉన్నారు.

ఇంటికెళ్లి రెండు రోజులు ఒంటిపై తెలివిలేకుండా పడుకొన్నాడు హిరామన్. తెలివి రాగానే జన్మలో ఇటువంటి వస్తువులు బండిలో ఎక్కించుకోకూడదని లెంపలు వేసుకొన్నాడు. చీకటి బజారు వస్తువులు...బుద్ధివుంటే వాటి జోలికి

పోకూడదు. గుమస్తాగతి ఏమయిందో తెలియదు...బండి సంగతి భగవంతునికే ఎరుక...బండి మాత్రం ఉక్కులాంటిది...! ఒక చక్రం సరికొత్తది కూడా. బండికి కట్టిన రంగుల కుచ్చులు ఎంత బాగుండేవో!

హిరామన్ రెండు ఒట్లు పెట్టు కొన్నాడు. ఒకటి, చీకటి బజారు వస్తువులు తోలకూడదు. రెండు, వెదుర్లు బండిలో ఎక్కించుకోకూడదు. బండిమాట్లాడు కొనే వారితో ముందే తేల్చుకొంటాడు. "చీకటి బజారు వస్తువులు కాదుగదా! వెదుర్లు కూడా కాదు. వెదుర్లు వేసుకోవటానికి యాభై రూపాయలిచ్చినా సరే... హిరామన్ బండి దొరకదు...! ఇంకెవరి బండయినా చూసుకోవల్సిందే."

వెదుర్లు వేసుకున్న బండి...బండి ముందుకు నాలుగు బారలు. వెనుక నాలుగు బారల వరకు వెదుర్లు ఉంటాయి. బండి అదుపులోనే ఉండదు. ఇక దానితో ఇబ్బందులు చెప్పలేము. ఆ అనుభవము అయింది. ఒకసారి పట్టణంలో ఓ షావు కారికి వెదుర్లు వేసుకొని వెళ్తున్నాడు హిరామన్. బండికి ముందు ఆ షావుకారి నౌకరు నడుస్తున్నాడు. దారిలో ఆడ పిల్లల స్కూలు రాగానే అతను ఆవేపు చూడ సాగాడు. ఆమలుపు దగ్గరే గుర్రపు బండికి వెదుర్లు కొట్టుకున్నాయి. హిరామన్ బండి ఆపే లోపుగానే వెదుర్లు గుఱ్ఱపు బండి టాపులోనుండి చొచ్చుకు పోయాయి. ఆ బండివాడు తన వీపు చదును చేసి చెడామడాతిట్టాడు...

దీంతో హిరామన్ వెదుర్లే కాకుండా పట్టణానికి సామాన్లు తోలడం కూడా మాను కున్నాడు. తర్వాత ఫార్ బిస్ గంజ్ నుండి మోరంగ్‌కు బండి కట్టే సరికి బండే పోయింది... చాలా ఏండ్లగా హిరామన్ ఎడ్లను కిరాయికి తీసుకొనేవాడు. వచ్చిన బాడుగలో సగం బండి వాడికి, మరోసగం ఎడ్లవాడికి పొయేది. తనకు బండి తోలిన శ్రమ మాత్రం మిగిలేది. సగం బాడుగతో ఎడ్లకడుపు కూడా నిండేది కాదు. నిరుడే హిరామన్ బండితయారు చేయించుకొన్నాడు.

అదికూడా ఆ సర్కస్ కంపెనీ పులి పుణ్యం. నిరుడు పులి బోను లాక్కెళ్లే గుఱ్ఱాలు రెండు చచ్చిపోయాయి. చంపానగర్ నుండి ఫారబిస్ గంజ్ తిరునాళ్లకు సర్కస్ వచ్చే ముందు, సర్కస్ కంపెనీ మేనేజరు బండ్ల వాళ్లను నూరు రూపాయల బాడుగకు బండి కట్టమని అడిగాడు. ఒకరిద్దరు ఒప్పుకున్నా వాళ్ళ ఎద్దులు పులి బోనును అంత దూరంలో చూడగానే బెదిరి పోయాయి. "అంబా..." అంటూ త్రాళ్లు తెంపుకొని పరుగు బెట్టాయి. హిరామన్ తన ఎద్దుల వీపులు నిమురుతూ వాటికి నచ్చజెప్పాడు. "ఈ అవకాశం మళ్లీ దొరికేదికాదు. చూడండి

అన్నలారా! సొంత బండి చేయించు కోవచ్చు. ఇప్పుడు కుదరకపోతే మరలా సగం బాడుగ తతంగమే. పులి బోనులో ఉండగా భయమెందుకు? మోరంగ్‌లోయల్లో తిరిగే పులులను చూశారుగా...మీవెనుక నేనులేను... భయమెందుకు?..."

బండ్ల వాళ్లందరూ చప్పట్లు చరిచారు. హిరామన్ ఎద్దు అందరి పరువూ నిలబెట్టాయి. పులిబోను దాకా వెళ్ళాయి. పులి బోనును బండిలో పెట్టగానే దాప డెద్దు కుండెడు మూత్రం పోసేసింది. రెండు రోజుల వరకు హిరామన్ ముక్కు దగ్గర నుండి గుడ్డ తీయలేక పోయాడు. లేక పోతే ఆ పులి బోను లోని వాసన భరించటం ఎవరికి సాధ్యం?

...పులి బోనుకూడా తోలాడు హిరామన్. అప్పుడై నా వీపులో ఈ మాదిరి చక్కిలిగింతలు కాలేదు. ఉండి ఉండి తన బండిలో పొగడపూలు విచ్చుకుంటు న్నాయి. వీపులో చక్కిలిగింతలు ఎక్కువయ్యేకొద్దీ అంగవస్త్రంతో దులుపుగొన్నా డు హిరామన్.

రెండేండ్లగా చంపానగర్ అమ్మవారు హిరామన్‌ను చల్లగా చూస్తున్నట్లుం ది. నిరుడు పులిబండితోలే అవకాశం, నూరు రూపాయల బాడుగతో పాటు టీ, బిస్కట్లు దొరికాయి. దారిపొడుగునా కోతుల, భల్లూకాల, జోకర్ల తమాషాలు చూశాడు.

ఈ సారి ఆడవాళ్ల సవారి దొరికింది. బండిలో ఉన్నది. ఆడమనిషా లేక సంపంగి పువ్వా? ఈ బండిలో కూర్చున్నప్పటి నుండి బండి సువాసనలు వెద జల్లుతుంది.

గతుకుల బాటలో బండి కుదిపిన కుదుపుకు బండిలోనుండి 'ఇస్' అనే శబ్దం వినవచ్చింది. హిరామన్ దాపటెద్దును కొడ్తూ "ఏమనుకుంటున్నావు? బండిలో వున్నది బస్తాలు కాదని గుర్తుంచుకో" అన్నాడు.

"ఉహు, కొట్టకు."

తాను చూడని స్త్రీ కంఠం హిరామన్‌ను ఆశ్చర్యంలో ముంచింది. పసి పాపల మాటల్లా ముద్దు ముద్దుగా...తియ్యతియ్యగా ఉన్నాయాపలుకులు.

'మథురామోహన్' నౌటంకీ కంపెనీలో లైలా వేషం వేసే 'హీరాబాయ్' గురించి ఎవరు వినివుండరు? కానీ హీరామన్ సంగతివేరు. ఏడేండ్లగా అతను తిరునాళ్ళ సామాన్లుతోలాడు గానీ ఎన్నడూ నౌటంకీ గానీ సినిమాగానీ చూసి ఎరుగడు. లైలా పేరుగానీ, హిరాబాయ్ పేరుగానీ అసలు వినలేదు. ఇక చూసే దెక్కడా? తిరునాళ్ళు పూర్తి అవటానికి ఇంకా పదిహేను రోజులుందనగా అర్థ రాత్రి వేళ నల్లదుప్పటి ముసుగువేసుకొని ఒంటరిగా వచ్చిన ఆడదాన్ని చూడ

గానే హిరామన్ మనస్సు ఏదో సంశయం కలిగింది. బండిలో పెట్టె పెట్టిన నౌకరు బేర మాడబోతే ఆమె వద్దని తలవూపింది. హిరామన్ బండితోలబోతూ నౌకరును అడిగాడు. ఈ పెట్టెలో దొంగ సామానేమిలేదు కదా! వాడేమి మాట్లాడకుండా బండిపోనిమ్మని సైగ చేసి చీకట్లో జారుకుపోయాడు. తిరునాళ్లలో పొగాకు అమ్మే నల్ల చీరముసల్ది గుర్తొచ్చింది హిరామన్‌కు...

ఈ పరిస్థితిలో బండెలా నడపటం?

ఒక ప్రక్క వీపులో చక్కిలిగింతలు మరోప్రక్క బండిలో నుండి వస్తున్న సంపంగిపూలవాసన, ఎద్దులను అదిలిస్తే "ఇస్తూ, బిస్సూ" వారించే సవారీ - అతని సవారీ. ఒంటరిగా వున్న ఈ స్త్రీ పొగాకు అమ్మేముసల్ది మాత్రం కాదు. హిరామన్ వెనక్కి చూసి వీపును అంగ వస్త్రంతో రుద్దు కోసాగాడు... ఈ సారి వాడి అదృష్టం ఎలాగుందో భగవంతుడికే తెలియాలి. బండితూర్పు తిరగ్గానే వెన్నెల బండి లోపలపడింది. ఆ స్త్రీ ముక్కు పుడక తళుక్కు మంది. అతని కంతా అయోమయంగా వుంది. తన ఎదురుగా 'చంపానగర్' నుంచి సింధియా గ్రామం వరకూవున్న మైదానం కన్పిస్తూంది...ఇదేదో శాకినీ, డాకినీ కాదుగదా!

బండిలో ప్రయాణం చేస్తున్న స్త్రీ ప్రక్కకు తిరిగింది. వెన్నెల ఆమె మొహం మీద పూర్తిగా పడింది. "బాప్ రే...మనిషికాదు...అప్సరస."

అ అప్సరస కళ్లు తెరిచింది. హిరామన్ దారికేసి చూస్తూ ఎద్దులను అదలించాడు. 'చ్చొ...చ్చొ...'వాడి నాలుక ఎండి పోయినట్లుంది.

"నీ పేరేమి?"

నిజంగా మధురమైన కంఠమే. హిరామన్ రోమాలు నిక్కపొడుచుకున్నాయి. నోట్లోనుండి మాటే రాలేదు. అతని ఎద్దులు కూడా చెవులు నిక్క పొడుచుకు వింటున్నాయి.

"నా పేరు అండీ...నాపేరు హిరామన్."

ఆమె చిరునవ్వు నవ్వింది...ఆనవ్వులోను సువాసనుంది.

"అయితే నిన్ను 'మీతా' అని పిలుస్తాను...నాపేరు కూడా హీరానే."

'ఇస్.' ఆడామగా పేర్లలో తేడా ఉంటుందని హిరామన్‌కు తెలియదు.

"అవును. నాపేరు హీరాబాయే."

ఎక్కడ హిరామన్...ఎక్కడ హీరాబాయ్! ఇద్దరికీ చాలాతేడావుంది.

హిరామన్ ఎద్దను అదిలించాడు. "చెవులు నిక్కబొడుచుకు వింటూంటే ముప్పైకోసుల దూరం ఎప్పుడు వెళ్లేటట్లు? ఈ ఎలపటి దాని కడుపులో సైతాన్ దూరిం

దేమో" అంటూ దాన్ని కఱ్ఱతో బాదాడు.

"వాటినికొట్టొద్దు. మెల్లగా పోనీ, తొందరేముంది?"

హిరామన్‌కు పెద్దసమస్యే వచ్చిపడింది. హీరాబాయ్‌తో ఏం మాటలు పెట్టుకోవాలో తెలియలేదు. ఆమెను "నీవు" అనాలా. "మీరు" అనాలా? వాడు గొప్ప వాళ్లను "మీరు" అనే అంటుంటాడు. నాగరిక భాషలో రెండు మూడు మాటలు సాగచ్చు కానీ హృదయ మిప్పి మాట్లాడాలంటే పల్లెటూరి భాషలోనే మాట్లాడాలి.

శరదృతువులో తెల్లవారు ఝూమున కురిసే మంచు అంటే హిరామన్‌కు పాత విరోధముంది. ఎన్నోసార్లు దారి తప్పాడు. కానీ ఈ రోజు మంచు ఎక్కువగా ఉన్నప్పటికి భలే ధీమాగా వెళ్తున్నాడు. నది ఒడ్డున పొలాల నుండి పంటల సువాసన వస్తూంది. పండుగపబ్బాలప్పుడు పల్లెల్లో ఈ వాసనలే వస్తూంటాయి. తన బండిలో సంపంగి పూలు వికసిస్తున్నాయి. ఆపూలల్లో ఒక అప్సరస కూర్చునివుంది...జై! భగవతీ.

హిరామన్ ఓర కంటితో ఆమెను చూశాడు...మీతా...హీరాబాయి కళ్ళు గుచ్చి గుచ్చి తననే చూస్తున్నాయి. హిరామన్ మనసులో ఏదో తెలియని అను భూతి. దేహమంతా గగుర్పాటు. "ఎద్దులను కొత్తే మీకు కష్టంగా వుంటుందా?" అని అడిగాడు.

హిరామన్ నిజంగా వజ్రమే (హీ రాయే)నని హీ రాబాయ్ తెలుసుకొంది.

నలభై ఏండ్లవాడు...పల్లెటూరివాడు...నల్లగా దృఢంగా ఉన్న యువకుడు... తన బండీ...తనఎద్లూ...అదే తన ప్రపంచం. ఇతరవిషయాల్లో ఎటువంటి ఆసక్తి లేదు. అన్నయ్య వ్యవసాయం చేస్తున్నాడు. పిల్లలు గలవాడు. అన్నయ్య కంటే, వదినె అంటేనే హిరామన్‌కు ఎంతో గౌరవం. ఆమెకు భయపడ్తాడుకూడా. హిరామన్‌పెళ్లి చిన్న తనంలోనే అయింది. అయితే పెళ్లి కూతురు కాపురానికి రాక ముందే చనిపోయింది. పెళ్లి కూతురు ముఖం ఎలావుంటుందో కూడా హిరామన్‌కు గుర్తులేదు...రెండో పెళ్లి? రెండో పెళ్ళి చేసుకోక పోటానికి ఎన్నో కారణాలున్నాయి. పెద్దమనిషికాని పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యాలని వదిన పట్టుదల. పెద్ద మనిషి కాని పిల్లంటే...నాలుగయిదేండ్ల పిల్ల అన్న మాట. శారదా చట్టాన్ని ఎవరు లెక్క పెడుతున్నారు? ఆడపిల్ల గలవారు విధి లేక పోతే గాని రెండో పెళ్లి వానికి పిల్ల నివ్వరు. వదిన మంకు పట్టు వదిలేటట్టు లేదు. వదిన ముందు అన్నయ్య మాట కూడా చెల్లదు...అందుకే పెళ్ళిచేసుకో కూడదని హిరామన్ నిర్ణయించు

కొన్నాడు. పెళ్ళి చేసుకోవడం అంటే ఆపదను కొని తెచ్చుకోవడమన్న మాట. పెళ్ళి చేసుకొన్ని తర్వాత బండి తోలగలడా? ఏదైనా వదులు కో గలడు గాని హిరామన్ బండితోలడం మాత్రం వదులుకోలేడు.

హిరామన్ వంటి అమాయకుణ్ణి హీరాబాయ్ ఎన్నడూ చూడలేదు. "మీ ఊరు ఏ జిల్లాలో ఉంది?" అని హిరామన్ ఆమెనడిగాడు. "కాన్‌పూర్." పేరు వినగానే అతను గట్టిగా నవ్వడం, ఎద్దులు పరుగులంకించుకోవడం ఒక్కసారే జరిగింది. నవ్వేటప్పుడు హిరామన్ తల వంచుతాడు. నవ్వాపి "వహ్వా" "కాన్‌పూర్" అట. "నాక్‌పూర్" కూడా ఉందేమిటి? అన్నాడు. "నాక్ పూర్" కూడా ఉందని హీరా బాయ్ అనడంతో అతని నవ్వు కట్టలు తెంచుకొంది.

'వరెవా!' ఏం ప్రపంచమో ఏమో! ఎటువంటి పేర్లుంటాయోకదా! కాన్‌పూ ర్...నాక్ పూర్ హీరాబాయ్ చెవిదగ్గఉనున్న పువ్వుమీద అతని దృష్టి పడింది. 'రక్తపుబొట్టు' లా కన్పించే ఆమె ముక్కు పుడకను చూసి వణికిపోయాడు.

హీరాబాయ్ పేరు హిరామన్ ఎన్నడు వినలేదు. నౌటంకీలలో పని చేసే స్త్రీ లంటే అతనికంత గౌరవంలేదు..కంపెనీలలో పనిచేసే చాలా మంది స్త్రీలను అతను చూశాడు. సర్కసుకంపెనీ యజమాని భార్య తన ఇద్దరు కూతుళ్లను వెంట బెట్టుకొని పులిబోను దగ్గరికొచ్చి, దానికి తిండిపెట్టేది. ముద్దులాడేది. ఆమె పెద్ద కూతురు హిరామన్ ఎద్లకు రొట్టె,బిస్కట్లు పెట్టేది. హిరామన్ చాలా చురు కయినవాడు. మంచు తొలగగానే తనదుప్పటి బండిగూడుకు కట్టి పరదా తయారు చేశాడు. "రెండు గంటలు.. ఆతర్వాత దారి అంతా బాగుండదు. కార్తీక మాసం ఎండ మీరు భరించలేరు. కజరీనది ఒడ్డున తేగ్‌చిమా వద్ద బండి ఆపుతాను. మధ్యాహ్నం గడిపి..." ఎదురుగావచ్చే బండిని చూసి ప్రక్కకు తప్పుకున్నాడు.

"తిరునాళ్ళ ముగింపుకువచ్చిందా తమ్ముడా?" అని ఎదుటి బండివాడు అడిగాడు.

తిరునాళ్ళను గురించి తనకేమి తెలియదనీ హిరామన్ జవాబిచ్చాడు. తన బండిలో 'విదాగీ' (అత్తవారింటికి వెళ్తున్న అమ్మాయి) వుందట. ఏదో ఊరిపేరు కూడా చెప్పాడు.

"ఛత్తాపూర్ - పచీరా ఎక్కడుంది?"

"ఎక్కడో ఉంది. దానితో నీకేంపని?" తన చమత్కారానికి తనకే నవ్వొచ్చిం ది... పరదా వేసినప్పటికి తనకు చక్కిలిగింతలు గానే ఉంది.

పరదా సందులోంచి హిరామన్ వెనక్కి చూశాడు. అగ్గిపెట్టె అంత ఉన్న

అద్దంలో హీరాబాయ్ తన పండ్లు చూసుకొంటూంది... ఒకసారి మథన్‌పూర్ తిరునాళ్లలో ఎడ్లకు గవ్వలదండలు కొన్నాడు హిరామన్. బుల్లి బుల్లి గవ్వలు చిన్నగా, ముద్దుగా ఉన్న గవ్వలవరుస.

తేగ్‌చియాలోని మూడు చెట్లు దూరం నుంచే కన్పిస్తాయి. పరదాకొంచెం తొలగించి ఆమెతో అన్నాడు. "చూడండీ, దీన్నే తేగ్‌చియా అంటారు. ఆ ఊడలున్నవి రెండు మఱ్ఱిచెట్లు. మూడోది - దాని పూలకు ఏదో పేరుంది. మీకుర్తా మీదున్నాయే...ఆపూల లాగేఉంటాయి. ఆ వాసన భలేగా ఉంటుంది.రెండు కోసుల వరకూ ఆపూలగుభాలింపు వస్తూఉంటుంది. ఆపువ్వును ఖమీరా - పొగాకులో కూడా వేసుకు పీలుస్తూ ఉంటారు."

"అక్కడ ఆ మామిడి చెట్టు చాటున కన్పిస్తున్నది ఊరా, మందిరమా?"

హిరామన్ బీడీవెలిగించే ముందు ఆమెనడిగాడు. "బీడి తాగొచ్చా? మీకు ఈ వాసన పడుతుందా? అదినామ్ లగర్ దేవిడీ. ఆరాజు తిరునాళ్ళ నుండే మనం వస్తున్నాము. దిమాది - గోతియా అతనిదే. అయినా ఆకాలం పోయింది."

"ఆ కాలం పోయింది. అంటూ హిరామన్ సంభాషణను రసపట్టులోకి తెచ్చాడు. హీరాబాయ్ పరదా పక్కకు తొలగించింది...హా...హీరాబాయ్ పలు వరుస!

"ఏ కాలం?" గడ్డం మీద చేయి పెట్టుకొని కుతూహలంగా అడిగింది.

"అదే నామ్ లగర్ దేవిడీ వారి కాలం. ఎలా ఉండేదీ! ఏస్థితికి వచ్చింది.!"

ఈ విషయాలన్నీ ఎలా రసవత్తరం చేయాలో హిరామన్‌కు తెలుసు.

"ఆ కాలం నువ్వు చూశావేమిటి?" అని హీరాబాయ్ అడిగింది.

"చూడలేదు. విన్నాను...రాజు ఎలా పోయాడో...అతని సంపద ఎలా పోయిందో అదంతా పెద్ద కథ. వాళ్ళింట్లో దేవత పుట్టిందని అనే వారు. మీరే చెప్పండి. ఎంతయినాదేవత దేవతేగా! అవునా? కాదా? దేవలోకం వదిలి మనుష్యలోకానికి వస్తే ఆమె తేజస్సును ఎవరు భరించగలరు? పొద్దు తిరుగుడు పువ్వులా ఆమె నుదురు తేజోమయంగా విచ్చుకొని ఉండేది. కానీ ఆమెను ఎవరూ గుర్తించలేదు. ఒకసారి ఒకదొరా, దొరసానీ విమానంలో వచ్చారు. దొరకాదు గానీ, దొరసాని గుర్తించి అన్నది. "రాజా గారూ! వినండి. ఈమె మా మూలు మనిషి కాదు - దేవత."

దొరసాని సంగతి చెప్పేటప్పుడు హిరామన్ అచ్చం ఆమె లాగే నటించాడు. హీరాబాయ్ మనసారా నవ్వింది...నవ్వేటపుడు ఆమె శరీరమంతా కదిలింది.

హీరాబాయ్ తనపైట సరిచేసుకొంది. అప్పుడు హిరామన్‌కు అన్పించిం

ది...అన్పించింది...

"అప్పుడు? ఆ తర్వాత ఏమయింది మీతా?"

"ఇస్, కథ వినాలంటే భలే ఉత్సాహంగా ఉన్నట్టుందే మీకు...కానీ నల్లటోడు రాజైనా, మహారాజైనా నల్లటోడే. దొరగారి తెలివి తేటలు ఎక్కడినుంచి వస్తాయి? ఇద్దరూ నవ్వి ఊరుకున్నారు. అప్పటి నుండి తరచూ రాణీకి దేవత కలలోకి వచ్చేది. 'నాసేవ చెయ్య లేక పోయారు. ఇక మీఇంట్లో నేనుండను' దీని తర్వాత దేవతాలీల ప్రారంభమయింది. అందరి కంటె ముందు ఏనుగులు చచ్చాయి. ఆ తర్వాత గుఱ్ఱాలు, తర్వాత పట పటాంగ్."

"పట పటాంగ్ ఏమిటి?"

హిరామన్ మనసు క్షణం క్షణానికీ మారుతూ వుంది. ఏదో రంగులకల...తన బండిలో ఎవరో దేవతా స్త్రీ కూర్చొని ఉంది. ఎంతయినా దేవత దేవతే.

"పట పటాంగ్ అంటే ధనమూ, ధాన్యమూ, నగలూ, నాణేలు...అన్నీ తుడిచి పెట్టుకుపోయాయి. దేవత దేవలోకానికి వెళ్ళిపోయింది." కనుమరుగవుతున్న మంది రాన్ని చూసి హీరాబాయ్ దీర్ఘంగా నిట్టూర్చింది.

దేవత వెళ్ళిపోతూ "ఈ రాజ్యంలో ఒకరికంటే ఎక్కువ మంది పిల్లలు పుట్టరు" అని శాప మిచ్చింది. "ధనాన్ని నాతోనే తీసు కెళ్తాను. గుణ - సంపద మాత్రం ఇక్కడ ఉంటుంది." అంది. ఆదేవతతో పాటు అందరు దేవుళ్ళూ వెళ్ళి పోయా రు. సరస్వతీదేవీ మాత్రం ఉండి పోయింది. ఆమెదే ఈ మందిరం...

దేశవాళీ గుఱ్ఱాలపై జనపనార సంచులు వేసుకొని వస్తున్న కోమట్లును చూడ గానే హిరామన్ పరదా వేసేశాడు. ఎద్దులను అదిలిస్తూ ఒక నృత్యగీతం పాడసా గాడు - "జైమైయాసరో సతీ, అర్జీ కరత్ బాణీ, హమారా, పరాహోఖా సహాయీ జైమైయ్యా, హమరాపర్ హోఖా సహాయి" (జైమాతే! సరస్వతీ! నా విన్నపమిదే వాణీ, మము కరుణించమ్మా తల్లీ మముకరుణించమ్మా).

"నారధర ఎలా ఉంది" ...అని కోమట్లను హిరామన్ అడిగాడు. కుంటిగుఱ్ఱం తోలు కొస్తున్న కోమటి సమాధానమిచ్చాడు. "క్రిందది ఇరవై ఏడు - ఇరవై ఎని మిది. పైది ముప్పయ్. సరకును పట్టి ధర."

"తిరనాళ్ళ ఎలా జరుగుతోంది తమ్ముడూ! ఏ నౌటంకీ కంపెనీ వాళ్ళు ఆడుతున్నారు? రీతా కంపెనీ వాళ్ళా లేక...లేక మధురమోహన్ వాళ్ళా?" అని కోమటి యువకుడు అడిగాడు.

"తిరనాళ్ళ సంగతి తిరనాళ్ళ వాళ్లకే తెలియాలి" అంటూ హిరామన్ మళ్ళీ

ఛత్తాపూర్ పచీరా పేరెత్తాడు.

సూర్యుడు రెండు బారలుపైకొచ్చాడు. హిరామన్ తన ఎడ్లతో కబుర్లు పెట్టు కొన్నాడు. "మరొక కోసుదూరం ఉంది. కాస్త త్వరగా నడవండి. మీకు దాహం వేస్తోందా? అప్పుడు తేగ్ఛియా దగ్గర సర్కస్ కంపెనీ జోకర్‌కూ, కోతిని ఆడించే మనిషి కీ జరిగిన దెబ్బలాట గుర్తుందా? ఆనాడు జోకర్ కూడా కోతిలా పండ్లు బయట పెట్టాడు...ఏఏ దేశాలనుండి ఈ మనుషులొస్తారో..."

హిరామన్ వెనక్కి తిరిగి పరదా సందులో నుంచి చూశాడు. హీరాబాయ్ ఏదో కాగితాన్ని చూస్తూంది. ఇవాళ హిరామన్ మనసు చాలా తేలిగ్గా ఉంది. ఎన్నో పాటలు గుర్తుకు వస్తున్నాయి. ఇరవై, ఇరవై ఐదేండ్ల క్రితం, బిదేషియా, బల్ వాహీ,ఛోక్రానృత్యం చేసే వాళ్ళు ఒకరిని మించి ఒకరు గజల్లు పాడేవారు. ఇప్పుడు అలా పాడే వాళ్లు ఎక్కడున్నారు? కాలం మారి పోయింది. హిరామ న్‌కు పడుచు నృత్యం పాట జ్ఞాపకం వచ్చింది...

"సజనావాదైరీ హోగయె హమారో సజనవా...
అసె, చిరియాహోతో సబ్‌కోయీ బాంచే చిరియాహోతో..."
హాయ్, కరమహ, హోయ్, కరమవా...
కోయిన బాంచే హమారీ, సజనవా హోకరమవా...
(ప్రియుడేమో, నాప్రియుడేమో దూరమాయెనే
లేఖైనారాయడాయెనే, లేఖవస్తే ఎవరైనా
చదివి చెప్పే వారే, కానీ లేఖైనారాదాయెనే
నాకీ గతి ఏలపట్టెనే, నాకీ కర్మ ఏలదాపరించేనే.)

బండి చెక్కలపై వ్రేళ్లతో తాళం వేస్తున్న హిరామన్ పాట ఆపేశాడు. నాట్యం చేసే ఆవిడ మొహంకూడా హీరాబాయ్ ముఖంలా ఉండేది...ఆకాలం ఎక్కడికి పోయింది.? ప్రతి నెల నాట్యమాడటానికి వారు గ్రామానికి వచ్చేవారు. హిరామన్ నాట్యానికి వెళ్తూ తన వదినెను అనుమతి అడిగాడు. "నాట్యం సమ యంలో చేసే ఆహాస్యాలగురించి విన్నాను. ఆనాట్యం చూడటానికి వెళ్తే మళ్లీ ఇంటికి రావద్దన్నారు. మీఅన్నయ్య" అంది వదిన.

ఈ రోజు సరస్వతీ మాత హిరామన్‌ను కటాక్షించినట్లుంది.

"ఎంత బాగా పాడుతున్నావు!" అంది హీరాబాయ్.

హిరామన్ ముఖం ఎఱ్ఱబడింది. వాడు తలవంచి నవ్వుకున్నాడు.

ఈరోజు తేగ్ఛియాలోని మహావీర స్వామి కూడా హిరామన్‌కు సహాయంగా

ఉన్నాడు. తేగ్‌ఛియాలో ఒక బండికూడా లేదు. ఎప్పుడూ బండ్లూ, బండ్ల వాళ్లూ బిలబిలలాడుతూ ఉండేవారు. ఈ రోజు ఒక సైకిలు వాడు మాత్రం కూర్చొని కునికి పాట్లు పడుతున్నాడు. మహావీర్ స్వామిని స్మరించుకొంటూ హిరామన్ బండి ఆపాడు. హీరాబాయ్ పరదా తొలగించింది. మొదటి సారిగా హిరామన్ హీరాబాయ్‌తో కళ్ళతో మాట్లాడాడు.

“సైకిలు వాడు ఇటే చూస్తున్నాడు.”

ఎడ్లను విప్పేముందు హిరామన్, వెదురు కఱ్ఱనొగల కింద అడ్డంగా పెట్టిబండి ఆపాడు. సైకిలు వాడిని గుర్రుమని చూస్తూ “ఎక్కడికి వెళ్ళాలి? తిరునాళ్ళకా? ఎక్కడి నుంచి వస్తున్నావు? బిసన్‌పూర్ నుంచా? ఇంత దూరానికే అలిసి పోయావా?...నీతస్సదియ్యా” అన్నాడు.

సైకిలు వాడు సన్నగా, బక్కచిక్కి ఉన్నాడు. ఏదో గొణిగి, బీడీ వెలిగించి లేచి నిల్చున్నాడు.

ప్రపంచం దృష్టినుంచి హీరాబాయ్‌ని దాచాలని హిరామన్ తాపత్రయ పడు తున్నాడు. నాలుగువైపులా పరికించి చూశాడు. ఎక్కడా బండికాని, గుఱ్ఱంగాని లేదు.

కజరీనదీ ప్రవాహం తేగ్‌ఛియా దాకా వచ్చి తూర్పుదిక్కుకు మళ్లింది. నీళ్లలో కూర్చున్న గేదెలను, వాటి పై వాలిన కొంగలను చూస్తూ ఉంది హీరాబాయ్.

“వెళ్ళండి. వెళ్ళి అఘాటులో మొహమూ, చేతులూ, కాళ్ళూ కడుక్కు రండి” అని హిరామన్ ఆమెను ఆజ్ఞాపించాడు.

హీరాబాయ్ బండి దిగింది. హిరామన్ గుండె దడదడ లాడింది...

ఉహు...కాళ్ళు వంకరగాలేవు...సరిగ్గానే ఉన్నాయి. కాని అరికాళ్ళు ఇంత ఎఱ్ఱగా ఎందుకున్నాయి? హీరా బాయ్ ఘాట్‌కేసి తలవంచుకొని నెమ్మదిగా నడ వసాగింది. ఈ స్త్రీ కంపెనీలో పని చేస్తుందని ఎవరను కోగలరు? స్త్రీ కాదు అమ్మాయి. బహుశా పెళ్ళి కాని పిల్లేమో!

హిరామన్ బండిలో కూర్చున్నాడు. బండిగూడులోకి తొంగి చూశాడు. ఒక సారి ఇటూ, అటూ చూసి హీరాబాయ్ తలగడపై ముందుకు వంగాడు. సువాసన అతని శరీరాన్ని అలముకుంది. తలగడమీదున్న పూలను తీసికొని వాసన చూశా డు...బాపురే బాప్!...ఇంత సువాసనా! ఒక్క సారిగా ఐదు చిలుంల గంజాయి పీల్చి నట్లయింది. చిన్న అద్దంలో తన మొహం చూసుగొన్నాడు. తన కళ్ళెందు కింత ఎఱ్ఱగా ఉన్నాయి?

హీరాబాయ్ రాగానే నవ్వుతూ "మీరిప్పుడు బండికి కాపలా ఉండండి. నేను అలా వెళ్ళి ఇపుడే వస్తాను" అన్నాడు.

హిరామన్ తన సంచిలోనుండి జాగ్రత్తగా దాచుకొన్న బనియను తీశాడు. బక్కెట్టు చేతిలో పట్టుకొని బయలుదేరాడు. ఎద్లు ఒకదాని తర్వాత ఒకటి బుస కొడ్తూ ఏదో చెప్పాయి. వెళ్తున్న వాడు వెనక్కి తిరిగి, "అవునవును అందరికీ దాహంగానే ఉంది. ఇప్పుడే వచ్చి మేతవేస్తాను. గొడవచేయకండి" అన్నాడు.

ఎద్దులు చెవులాడించాయి.

స్నానం చేసి హిరామన్ ఎప్పుడు వచ్చాడో, హీరాబాయ్‌కి తెలియదు. కజరీ నదీ ప్రవాహం చూస్తుండగానే నిద్రపట్టేసింది. హిరామన్ దగ్గరలో నున్న పల్లెనుండి పెరుగు, అటుకులు, పంచదార తెచ్చాడు.

"లేవండీ, రెండు పిడికిళ్ళ అటుకులు ఫలహారం చేద్దురు గానీ."

హీరాబాయ్ కళ్ళు తెరిచి చూసి ఆశ్చర్యపోయింది. ఒక చేతిలో క్రొత్త ముంత లో పెరుగూ, అరటి ఆకులు, మరోచేతిలో బక్కెట్టు నిండా నీళ్ళు...కళ్ళల్లో ఆ త్మీయతతో కూడిన అభ్యర్థన...

"ఇన్ని వస్తువులు ఎక్కడి నుంచి తెచ్చావు?"

"ఈ ఊరు పెరుగుకు పెట్టిందే పేరు...ఫారబిస్ గంజ్‌కు వెళ్ళాక చాయ్ తాగుదాము."

హిరామన్‌కు మరలా చక్కిలిగింత మొదలయింది. హీరాబాయ్ అంది: "నీవు కూడా విస్తరివేసుకో... ఏం? నీవు తినవా? నీవుతినక పోతే నేను తినను. ఇదంతా నీసంచిలోనే పెట్టుకో."

"ఇస్" హిరామన్ సిగ్గు పడ్డాడు. "సరే, ముందు మీరు కానివ్వండి."

"ముందూ వెనుకా ఏమిటి? నీవుకూర్చో."

హిరామన్‌కు చాలా సంతోషమయింది. హీరాబాయ్ స్వయంగా విస్తరి వేసింది. నీళ్ళు చల్లింది. అటుకులు పెట్టింది. ఇస్...తను ధన్యుడై పోయాడు. ధన్యుడు. స్వయంగా భగవతీ మాత వడ్డిస్తున్నట్టుంది, హిరామన్‌కు. ఎఱ్ఱటి పెదవులకు పెరుగు అంటుకొని ఉంది. అడవి చిలుకలు పాలు, అన్నం తినడం ఎక్కడైనా చూశారా?

పొద్దు వాలింది.

బండి గూడులో పడుకొన్న హీరాబాయ్‌కి, క్రింద కంబళి మీద పడుకొన్న హిరామన్‌కు ఒకే సారి మెలుకువ వచ్చింది. తిరనాళ్ళకు వెళ్తున బండ్లు తేగ్

ఛియా వద్ద ఆగాయి. పిల్లలు ఇటూ, అటూ తిరుగుతున్నారు.

హిరామన్ గాభరాగా లేచాడు. గూడులో తలపెట్టి ప్రొద్దు గ్రుంకిందని సైగతో చెప్పాడు. ఎడ్లను బండికి కట్టూ, ఇతర బండ్ల వారి ప్రశ్నలకేమి సమాధాన మివ్వ లేదు. బండిని తోలుతూ చెప్పాడు. "సిర్‌పూర్ బజార్ ఆస్పత్రి డాక్టరమ్మగారు! రోగిని చూడటానికి 'కుడుమా' గ్రామానికి వెళ్తున్నారు."

హీరాబాయ్ ఛత్తాపూర్ - పచీరా పేరే మరచిపోయింది. బండి కొంచెం ముందుకు సాగాక అడిగింది: "పత్తాపూర్ ఛపీరా సంగతి ఏమిటి?"

నవ్వి - నవ్వి హిరామన్ కడుపుబ్బిపోయింది. పత్తాపూర్ ఛపీరా.. హా... హా...హా...ఈ బండ్ల వాళ్ళందరూ ఛత్తాపూర్ పచీరా వాళ్ళే. వారితో ఆపేరు ఎలా చెప్పగలడు? హి...హి...

హీ రాబాయ్ నవ్వుతూ పల్లెవైపు చూడసాగింది.

బండి తేగ్‌ఛియా గ్రామం మధ్యనుంచి పోతోంది. గ్రామంలోని పిల్లలు పరదా ఉన్న ఈ బండిని చూసి చప్పట్లు చరుస్తూ ఇలా పాడారు-

"లాలీ...లాలీ డోలియామే

లాలీరే దుల్ హనియా...

పాన్‌ఖాయే..."

("ఎఱ్ఱ ఎఱ్ఱటి పల్లకిలో ఎఱ్ఱటి వధువే ఉందోయీ. ఆకూ...వక్క నమిలిన...")

హిరామన్ నవ్వాడు...పెళ్ళి కూతురు...ఎఱ్ఱటి పల్లకి... తాంబూలం నమిలిన వధువు, పెళ్ళి కొడుకు తలపాగాతో పెదవులు తుడుచుకొంటుంది. "ఓ పెళ్ళి కూతురా! తేగ్‌ఛియా పిల్లలను జ్ఞాపకముంచుకో. తిరిగి వచ్చేటప్పుడు బెల్లపు లడ్డూలు తీసుకురా. లక్ష సంవత్సరాలు నీ పెళ్ళి కొడుకు జీవించు గాక..."

ఎన్నాళ్ళ కోరిక తీరింది! ఇటు వంటి స్వప్నాలు తనెన్ని చూశాడు...తను వధువును తీసుకొని వస్తున్నాడు. ప్రతి గ్రామం లోనూ పిల్లలు చప్పట్లు చరుస్తూ పాటలు పాడు తున్నారు. ప్రతి ఇంటి ముందూ స్త్రీలు తొంగి చూస్తున్నారు. "ఎక్కడి నుంచి? ఎక్కడకు వెళ్తున్నారు?" అని మగవాళ్ళు అడుగు తున్నారు. అతని వధువు పల్లకి పరదా కొంచెం తొలగించి చూస్తోంది...ఇంకా ఎన్ని స్వప్నా లో...

పల్లెదాటి వచ్చాక బండిలోపలికి చూశాడు హిరామన్. హీరాబాయ్ ఏదో ఆలో చిస్తోంది. హిరామన్ కూడా ఏదో ఆలో చనలో పడిపోయాడు. కొంచెం సేపటికి పాట మొదలు బెట్టాడు.

"సజన్ రే! ఝూఠ్ మత్ బోలో -

ఖుదాకే పాస్ జానాహై, నహీ హాథీ, నహీ ఘోడా, నహీ గాడీ- వహాఁ,

పైదల్ హీ జానాహై సజనరే!..."

(మానవుడా అబద్ధమాడకు, భగవంతున్ని చేరాలి. ఏనుగులూ, గుఱ్ఱాలూ, బండ్లూ నీవెంట రావు. అక్కడికి నడిచే వెళ్ళాలి మానవుడా...)

"మీతా! మీ భాషలో పాటలు లేవూ?" అని హీరాబాయ్ అడిగింది.

హిరామన్ ఇప్పుడు నిస్సంకోచంగా హీరాబాయ్ కళ్లలో కళ్ళుపెట్టి మాట్లా డగలుగు తున్నాడు. కంపెనీ స్త్రీ కూడా ఈ విధంగా ఉంటుందా? సర్కస్ కంపెనీ యజమానురాలు ఈ దొరసాని...కాని హీరాబాయ్ పల్లె పదాలు వినాలం టోంది. వాడు మనసారా నవ్వాడు.

"పల్లె పదాలు మీకు అర్థమవుతాయా?"

"హాఁ,హాఁ," అంటూ హీరాబాయ్ తల ఆడించింది. ఆమె చెవికున్న జుంకాలు ఊగాయి.

కొంచెం సేపు మౌనంగా హిరామన్ ఎడ్లను తోలుతున్నాడు. తర్వాత అన్నాడు: "పాట తప్పకుండా వినాలా? వినకుండా ఉండలేరా? ఇస్...పల్లె పదాలంటేమీకు ఇష్టమేనా? ఐతే, ఇంకో దారి పట్టాల్సిందే. అందరూ వచ్చి పోయే దారిలో అటువంటి పాటలు ఎవరైనా పాడుతారా?" ఎలపటెద్దు త్రాడు లాగి బండికుడివై పుకు తిప్పాడు. "అయితే హరిపూర్ మీదు గా వెళ్ళలేము."

వెనుక వస్తున్న బండివాడు హిరామన్ క్రొత్తబాట పట్టటం చూసి "ఏమ య్యోవ్...దారి తప్పుతున్నట్లున్నావు" అన్నాడు.

హిరామన్ చల్‌కోడీ గాలిలో ఊపుతూ "దారెక్కడ తప్పాను? ఆ దారి ననన్ పూరుకు వెళ్ళరుకదా" అంటూ తనలో తాను గొణుక్కున్నాడు. "ఈ దేశం వాళ్ళకు ఇదే రోగం. దారిలో వెళ్ళేటప్పుడు సవాలక్ష ప్రశ్నలు వేస్తారు. మీకు వెళ్ళాలని వుంటే వెళ్ళరాదా! ముచ్చువెధవలు."

ననన్ పూర్ బాటపైకి బండిని తీసుకొచ్చి ఎడ్ల త్రాళ్ళు వదులు చేశాడు. ఎడ్లు పరుగు మానేసి నెమ్మదిగా నడుస్తున్నాయి.

నిజంగానే ననన్‌పూర్ బాట నిర్మానుష్యంగా ఉందని హిరాబాయ్ గ్రహిం చింది. హిరామన్ ఆమె కళ్ళ భాషను తెలుసు కొన్నాడు. "భయపడవలసి అవ సరం లేదు. ఈ బాట కూడా ఫార్‌బిస్ గంజ్ వెళ్తుంది. రాయ్ ఘాట్ ప్రజలు చాలా మంచి వాళ్ళు. రాత్రి మొదటి ఝూముకే మనం పోగలం."

ఫార్‌బిస్ గంజ్ త్వరగా చేరాలనే తొందర హీరాబాయ్‌కి లేదు. హిరామన్ మీద ఉన్న విశ్వాసంతో భయం ప్రసక్తే లేదు. హిరామన్ మనసారా నవ్వాడు. నేను ఏం పాట పాడాలి? హీరాబాయ్‌కి పాటలన్నా, కథలన్నా చాలా ఇష్టం. ఇస్'మహువా ఘట వారిన్?' "సరే మీకింత ఇష్టంగా వుంది గనుక మహువా ఘట వారిన్ పాట వినండి. దీనిలో పాటతో పాటు కథకూడా ఉంది..." ఎన్నిరోజుల తర్వాత భగవతీ మాత తన కోరిక తీర్చింది? జైభగవతీ! ఈ రోజు హిరామన్ తనివిదీరా పాడగలడు. హీరాబాయ్ చాటుగా నవ్వుకోవటం అతను చూశాడు.

"వినండి. ఇప్పటికీ పరమాన్ నదిలో మహువాఘట వారిన్‌కు చెందిన చాలా ఘాట్ లున్నాయి. మహువా ఈ దేశస్థురాలే. వృత్తేమోరేవు దగ్గఱ కూలిచేసుకోవ టం. అంతటి పుణ్య స్త్రీనూటికి ఒక్కరుంటారేమో! ఆమె తండ్రి కల్లు, సారాయి త్రాగి ఒళ్ళంతా వంటి మీద తెలివి లేకుండా పడి ఉండేవాడు. ఆమె సవతి తల్లి రాక్షసికి మరో రూపం. ఆమె చూపులు ఎంత దూరానికైనా పాకేవి. రాత్రిళ్ళు గంజాయి, కల్లు, నల్లమందు చాటుగా అమ్మేవాళ్ళు. మొదటనుండి రకరకాల మనుష్యులతో ఆమెకు పరిచయముంది. అందరితో నూ గాఢ సంబంధం ఉంది. మహువా కన్నెపిల్ల. కానీ పనిచేసి, చేసి, ఆపిల్ల ఎముకలన్నీ బయట పడ్డాయి. ఆమె యువతి అయ్యింది. ఇంట్లో పెళ్ళి మాటైనా తలపెట్టలేదు. ఒక రాత్రి సంగతి వినండి..."

హిరామన్ నెమ్మదిగా గొంతు సవరించుకొన్నాడు. "హే...అ...అ...సావనా... బాదరవాకే...ఉమడల్ నదియా-గేయే-యోం, ఓ,ఓ,ఓ మయ్యా గౌరిని భయా వని హే...ఏ...ఏ...తడకా-తడ్కో ధడకే కరేజు ఆ...ఆ...మోరాకి ఆపహుం జే బారీనకి హీ, రే...ఏ...ఏ..."

"ఓ మాతా! శ్రావణ భాద్రపద మాసాల్లో పొంగేనది...భయంకరమైన రాత్రి... మెరుపులు మెరుస్తున్నాయి. నేను పెళ్ళికాని చిన్న పిల్లను. నాగుండె అదురు తోంది. ఒంటరిగా ఘాట్‌కు ఎలా వెళ్ళను? నవతి తల్లి తలుపువేసేసింది. ఆకా శంలో మబ్బులు క్రమ్ముకున్నాయి. వర్షం మొదలయింది. మహువా తన తల్లిని తలచుకొని ఏడవటం మొదలు పెట్టింది. తన తల్లే బ్రతికుంటే ఇటు వంటి సమ యంలో తనమహువాను గుండెల్లో దాచుకునేది కాదా!" అమ్మా... ఈ రోజు కోస మేనా, నన్ను కన్నావు? మహువాకు తల్లి మీద చాలా కోపమొచ్చింది. తనెం దుకు ఒంటరిగా చావాలి? మనసారా తల్లిని తిట్టుకొంది...

హీరాబాయ్ పాటలో నిమగ్నురాలయి ఉందని హిరామన్ గమనించాడు...

ఆలోచనలో మునిగిన ఆ ముఖం ఎంత అందంగా ఉంది!

హిరామన్ గొంతులో కరుణ స్రవించింది.

"హూం-ఊం-ఊం-రేడాహినియం బైయోం మోరీ - ఈ...ఈ...నోన్వాచ
ఛాయీ కాహేనాహి
మారాలి సాంరీ ఘర్ - అ - ఆయెహి
దినవాం ఖాతిర్ ఛిన్రో ఘియా
తేంహు పోస్లికి నేనూ - దూధ్ - ఉటపన్..."

హిరామన్ పాట ఆపి అడిగాడు. "కేవలం పాటే వింటు న్నారా, భాష కూడా అర్థమవుతోందా?"

"అర్థమవుతోంది. ఉటగన్ అంటే నలుగు శరీరానికి పెట్టుకుంటారు..."

హిరామన్కు ఆశ్చర్యం కలిగింది. ఇస్..."ఏడిస్తే లాభంలేదు. మహువాను కొనుక్కున్న వాడు వెలపూర్తిగా చెల్లించాడు. జుట్టుపట్టుకొని ఈడ్చుకొంటూ నావ ఎక్కి, పడవ వానితో పడవ పోనివ్వమన్నాడు. నావ రెక్కలు విప్పుకొన్న పక్షిలా ముందుకు సాగింది. రాత్రంతా మహువా ఏడుస్తూనే ఉంది. ఆవ్యాపారస్తుని నౌకర్లు ఎంతో భయపెట్టారు, బెదిరించారు. "నోరుమూసుకో లేకపోతే నీళ్లలోకి తోసేస్తాం" అన్నారు. మహువాకు ఈ మాటల్లో ఏదో సూచన దొరికింది. తెల్లవారు ఝామున చుక్కమేఘాల చాటునుండి తొంగి చూసింది. అప్పుడే మహువా నీటిలోకి గెంతిం ది... వ్యాపారస్తుని నౌకరొకడు మహువాను చూడగానే ప్రేమించాడు. మహువా వెనుకే వాడూ నీటిలోకి దూకాడు. ఎదురు ప్రవాహంలో ఈదడం ఆటకాదు. అదీ భాద్రపద మాసపు రోజుల్లో మహువా సిసలైన ఘట వారిన్కూతురు. చేపలు నీళ్ళలో ఎన్నడయినా అలసిపోతాయా! చేపలా నీటిని చీలుస్తూ మహువా ముందుకు సాగిపోతోంది. వెనుక వ్యాపారస్తుని నౌకరు కేకలు వేస్తున్నాడు. "

"మహువా కొంచెం ఆగు. నిన్ను పట్టుకొవటానికి రావటంలేదు. నేను నీవాడిని. జీవితాంతం కలిసి ఉందాం." కాని...

హిరామన్కు ఈ పాటంటే చాలా యిష్టం. మహువాఘటవారిన్ పాట పాడేట ప్పుడు అతని కళ్ళముందు శ్రావణ భాద్రపదాలలో నది పొంగే తీరు, అమావా స్యరాత్రి, మబ్బులు, మెరుపులు కదలాడుతాయి. ఆమెరుపులలోనే అలలతో పోరా డుతున్న మహువా కుమారి కనబడుతూఉంటుంది. వాడికి అనిపిస్తుంది...తనే స్వయంగా వ్యాపారస్తుని నౌకరయినట్లు. మహువా ఎవరి మాటా వినదు. నమ్మదు. వెనక్కి తిరిగి చూడదు. ఈదుతూ, ఈదుతూ వాడు అలసిపోయాడు.

ఈ సారి మహువా స్వయంగా పట్టు బడింది. అతడు మహువాను అందుకున్నాడు. అతని అలసటంతా దూరమయింది...పదిహేను ఏండ్లగా ప్రవాహానికి ఎదురీదుతున్న తనకు ఈ రోజు ఒక ఒడ్డు దొరికింది... ఆనంద భాష్పాలు...ఇక ఆగవు.

అతను తన చెమ్మగిల్లిన కండ్లను హీరాబాయ్ నుండి దాచాలని ప్రయత్నించాడు. కాని హీరా అతని మనసులోనే కూర్చుని ఎప్పటి నుంచో తనను చూస్తోంది. హిరామన్ కంపిస్తున్న తన స్వరాన్ని అదుపులోకి తెచ్చుకొని ఎడ్లను అదిలించాడు - ఈ పాటలో ఏముందో గాని వింటున్న ఇద్దరూ చేష్టారహితులయ్యారు. ఎవరో వంద మణుగుల బరువు గుండెల్లో పెట్టారనిపిస్తోంది.

హీరాబాయ్ దీర్ఘంగా నిట్టూర్చింది. హిరామన్ అంగాంగాలలో క్రొత్త ఉత్సాహం ఉరక లేస్తోంది.

"మీతా? నీవు గొప్ప గాయకుడివి."

"ఇస్..."

ఆశ్వయుజ - కార్తిక మాసాల్లో సూర్యుడు త్వరగా వాలిపోతాడు. సూర్యుడు అస్తమించటానికి ముందే ననన్ పూర్ చేరుకోవాలి. హిరామన్ ఎడ్లను ప్రోత్సహించాడు. "అడుగులు తొందరగా వెయ్యండి...హె... హె...చ్చో...చ్చో...ముందుకు సాగండోయ్... లే...లే...ఏహేయ్...య..."

ననన్ పూర్ వెళ్ళే దాకా హిరామన్ ఎడ్లను తొందర పెడ్తూనే ఉన్నాడు. మధ్యమధ్య గడ చిన సంగతులన్నీ వాటికి గుర్తు చేస్తున్నాడు. "చౌదరి గారి కూతురి పెళ్ళిలో ఎన్ని బండ్లు వచ్చాయో గుర్తుందా? వాటన్నింటినీ ఓడించారు కదూ! అలాగే ఇప్పుడు పరుగెత్తాలి. లే...లే...లే..." ననన్‌పూర్ నుండి ఫార్‌బిస్ గంజ్ మూడు కోసులే ఉంది. ఇంకో రెండు గంటలప్రయాణం.

ఇప్పుడు ననన్‌పూర్ ఘాట్‌వద్ద చాయ్ కూడా అమ్ముతున్నారు. హిరామన్ చెంబు నిండా చాయ్ తెచ్చాడు...కంపెని వాళ్ళు రోజంతా గడియ, గడియకు చాయ్‌తాగుతుంటారు. అది 'చాయ్‌కాదు, వాళ్ళకు, ప్రాణం లాంటిది?

హీరాబాయ్ పడీ, పడీ నవ్వింది. "అరే నీకు ఎవరు చెప్పారు. పెళ్ళికాని మగవాడు చాయ్ త్రాగకూడదని?"

హిరామన్ సిగ్గుపడ్డాడు. ఎలా చెప్పడం...సిగ్గువేస్తుంది. ఒకసారి అనుభవమయింది. సర్కస్ దొరసాని తన చేతులతో ఇచ్చిన "చాయ్" త్రాగి చూశాడు. ఆవేడి చాయ్ ప్రభావం...

త్రాగవోయ్ గురుడా! హీరా నవ్వింది.

"ఇస్..."

ననన్‌పూర్ ఘాట్‌లో దీపాలు పెట్టేశారు. హిరామన్ ఒక లాంతరు వెలిగించి బండి వెనుక వేలాడ దీశాడు...పట్టణానికి ఐదు కోసుల దూరంలో ఉన్న గ్రామ స్తులు కూడా పట్టణవాసులమనే అనుకొంటున్నారు. లైటులేని బండిని పట్టుకొని జుల్మానా వేస్తారు. అంతా ఆడంబరమే.

"నన్ను మీరు గురూ అనకండి."

"నీవు నాకు గురువే." ఒక అక్షరం నేర్పిన వాడైనా గురువేనని శాస్త్రాలలో ఉంది. ఒక పాట నేర్పేవాడు కూడా గురువే.

"ఇస్...మీకు శాస్త్రాలు, పురాణాలు కూడా తెలుసా? నేను..."

హీరాబాయ్ నవ్వుతూ అతను నేర్పిన పదం పాడసాగింది..."హే...అ...అ...అ.... సావనా...భాదవాకే...ద..." హిరామన్‌కు ఆశ్చర్యమేసింది. నోటమాట రాలేదు. "ఇస్...ఇంత త్వరగా వచ్చేసిందా?"...నిజంగానే...ఆమహువా ఘటవారిన్...

బండిసీతాధార్ వద్ద ఎండిన కాలువదాటుతూ గడగడ శబ్దం చేసుకుంటూ క్రిందకి దిగింది. హీరాబాయ్, హిరామన్ భుజాన్ని పట్టుకొంది. చాలాసేపు అలాగే ఆమెవ్రేళ్ళు అతని భుజంపై ఉన్నాయి. వెనక్కి తిరిగి తన భుజాన్ని చూసుకుం దామని హిరామన్ ఎంతో ప్రయత్నించాడు. బండిపైకి ఎక్కుతున్నప్పుడు ఆవ్రేళ్లు హిరామన్ భుజాన్ని మరింత గట్టిగా పట్టుకొన్నాయి.

ఎదురుగా ఫార్‌బిస్ గంజ్ దీపాల వెలుగు కన్పిస్తూంది. ఊరికి దూరంగా తిరునాళ్ళ దీపాల వెలుగుకూడా ఉంది...బండి గూడుకు కట్టిన లాంతరు నాట్యం చేస్తున్నట్లుంది...నీళ్ళు నిండిన కళ్ళకు ప్రతి వెలుగు ప్రొద్దు తిరుగుడు పువ్వు లాగే కన్పిస్తుంది.

ఫార్‌బిస్ గంజ్ హిరామన్‌కు మరో ఇల్లు లాంటిది.

ఎన్నిసార్లు ఫార్‌బిస్‌గంజ్ వచ్చాడో లెక్కేలేదు. తిరనాళ్ళకు వస్తువులు బండిలో తెచ్చాడు. ఎప్పుడైనా ఏస్త్రీ తో నైనా వచ్చాడా? ఆ - ఒక్కసారి. తన వదిన ఇంటికి వచ్చిన సంవత్సరం...ఇలాగే నాలుగువైపులా బండికి పరదా కట్టాడు.

హిరామన్ తనబండికి టార్పాలిన్ కప్పాడు. తెల్లవార గానే రీతా నౌటంకీ కంపెనీ మేనేజరుతో మాట్లాడి ఆకంపెనీలో చేరిపోతుంది హీరాబాయ్. ఎల్లుండి తిరునాళ్ళ ప్రారంభం. ఈ సారి తిరునాళ్ళు చాలా బాగుండొచ్చు - ఇంకొక్క రాత్రి గడిస్తే చాలు. ఈ రాత్రంతా హిరామన్ బండిలోనే ఉంటుంది. హీరాబా

య్...హిరామన్ బండిలో కాదు...హిరామన్ ఇంట్లో.

"ఈ బండి ఎక్కడిదీ?...ఎవరు...హిరామనా? ఏతిరునాళ్ళ నుండి వచ్చాడు? ఏ సామాను వేసుకొచ్చాడు...?"

బండి వాళ్ళందరూ ఒకరినొకరు వెదుక్కొని అన్ని బండ్లు దగ్గర - దగ్గర గా నిలబెట్టుకొని ఎడ్లకు మేత వేస్తారు. తన ఊరినుండి వచ్చిన లాల్ మొహర్, ధున్నీరాయ్, పలట్‌దాస్ వగైరా బండి వాళ్ళను చూసి హిరామన్ విస్తుపోయాడు. అక్కడ పలట్ దాస్ అప్పుడే బండిగూడులోకి తొంగి చూస్తున్నాడు, ఏదో పులిని చూస్తున్నట్లు. సైగతో హిరామన్ అందరి నోళ్లు కట్టేశాడు. బండి వైపు చూస్తూ గొణిగాడు. "ఊర్కోండి. కంపెనీ స్త్రీ...నౌటంకి కంపెనీలో పనిచేసే స్త్రీ..."

"కంపెనీ...ఈ...ఈ..."

ఒకరు కాదు. ఇప్పుడు నలుగురు హిరామన్లు ఉన్నారు. నలుగురూ ఒకరి మొఖాలు ఒకరు చూసుకొన్నారు...కంపెనీ పేరులోనే ఏదో ప్రభావం ఉంది. హిరామన్ సైగ చెయ్యటంతో ముగ్గురూ ఒక్కసారిగా నోరు మూసుకున్నారు.

లాల్‌మొహర్ కొంచెం దూరం జరిగి ఏదో మాట్లాడాలని సైగ చేశాడు. హిరామన్ బండి గూడు వైపు తిరిగి "ఇప్పుడు ఏ హోటళ్ళూ తెరిచి ఉండవు. మిఠాయిదుకాణానికి వెళ్ళి ఏదేనా తెద్దాం" అన్నాడు.

"హిరామన్! చూడు. నేనిప్పుడేమీ తినను. నీవు వెళ్ళి తినిరా ఇవిగో..."

"ఏమిటిది డబ్బులా? ఇస్." షార్‌బిస్ గంజ్‌లో హిరామన్ ఎప్పుడూ డబ్బిలిచ్చి ఏమీ తినలేదు. ఈ గ్రామంలో ఉన్న బండి వాళ్ళు ఎందుకున్నట్లు? హిరామన్ డబ్బుముట్టడు. అతను హీరాబాయ్ తో అన్నాడు. "అనవసరంగా ఈ బజార్లో నా పరువుతియ్యకండి. డబ్బులు మీ దగ్గరే పెట్టుకోండి." అదను చూసుకొని లాల్‌మొహర్ బండి దగ్గరకు వచ్చాడు. సలాం చేస్తూ "నలుగురికున్న అన్నంలో మరో ఇద్దరు తింటే కొరతేమీ ఉండదు. పొయ్యి మీద బియ్యం ఉడుకుతున్నాయి. హె...హె...మేమంతా ఒకే ఊరివాళ్ళం. ఒకే ఊరి వాళ్ళు ఉన్నప్పుడు హోటళ్ళకు హల్వాదుకాణాలకు వెళ్ళి హిరామన్ తింటాడా?"

లాల్ మొహర్ చేతిని లాగుతూ "ఏమిటా అనవసరపు మాటలు" అన్నాడు హిరామన్.

బండికి నాలుగు గజాల దూరం వెళ్ళగానే దున్నీరామ్ ఊరుకోలేక పోయాడు. "అప్పుడు కంపెనీ పులిని, ఇప్పుడు కంపెనీ స్త్రీని, నీవు బలే వాడివి హిరామన్..."

హిరామన్ నెమ్మదిగా అన్నాడు: చూడండ్రా మీ వాగుడంతా విని సహించ టానికి మనవైపు ఆవిడ కాదు. ఈమె పడమటి నుండి వచ్చింది. అంతే గాక కంపెనీలో పనిచేస్తోంది.

"కానీ కంపెనీలో భోగం వాళ్ళు ఉంటారని విన్నానే" అని ధున్నీరామ్ సంశయం ప్రకటించాడు.

"ధూత్" అంటూ అందరూవాడిని కోప్పడ్డారు. "ఏం మనిషివిరా! భోగం వాళ్లు ఉంటారా? అందులోనూ కంపెనీలో...చూడండ్రా వీని తెలివి... విన్నావు గాని చూడలేదుకదా!"

ధున్నీరామ్ తన తప్పు ఒప్పుకున్నాడు. "హిరామన్ భాయీ! ఈమె ఒక్కతే ఉంటుందా బండ్లో ఏమయినా ఆడది ఆడదే గదా! ఎప్పుడైనా, ఏదేనా అవసరం పడితేనో..."అనిపలట్‌దాస్ అన్నాడు.

ఈ మాట అందరికీ నచ్చింది. "మంచి మాటే పలట్! నువ్వు వెళ్ళి బండి దగ్గరే ఉండు. ఏదైనా మాట్లాడాలను కుంటే జాగ్రత్తగా మాట్లాడు. సరేనా? " అన్నాడు. హిరామన్.

...హిరామన్ నుండి గులాబ్ అత్తరు వాసన వస్తోంది. హిరామన్ ఎద్దులా పని చేస్తాడు. అప్పుడు నెలల తరబడి అతని శరీరం నుండి దుర్గంధం వస్తుంది. ఇప్పుడు...లాల్‌మోహర్ హిరామన్ అంగ వస్త్రం వాసన చూసి "ఏహే" అన్నా డు.

హిరామన్ వెళ్తున్నవాడు ఆగాడు. "ఏమి చెయ్యమంటావు లాల్ మోహర్ భాయ్! నౌటంకి నేను తప్పక చూడాలని ఆమె పట్టు పట్టోంది."

"డబ్బులేకుండానే?" ఈ విషయం మన పల్లెదాక పాకితే?

"వద్దు బాబూ వద్దు! ఒక రాత్రి నౌటంకీ చూసి బతి కున్నన్నాళ్ళు అప హాస్యం పాలవటమెందుకు? ఊరికోడికి దొరసాని నడకా?" అన్నాడు హిరామన్.

"ఊరికే చూసినా మీ వదిన నిన్ను కోప్పడుతుందా?" అని ధున్నీరామ్ అడి గాడు.

లాల్‌మోహర్ వంటచేస్తున్న దగ్గరే కట్టెల దుకాణంలో కట్టెలు వేసి వచ్చిన బండ్ల వాళ్ళుకూడా వండుకుంటున్నారు. మిథియాజాన్ హుక్కాత్రాగుతూ "మీ నాబజారులో సామాను ఎవరు దింపారు?" అని అడిగాడు.

మీనాబజార్! మీనాబజారంటే భోగం కొంపలున్న స్థలం...ఈ ముసలాడు ఎలా మాట్లాడు తున్నాడు. లాల్‌మోహర్ హిరామన్ చెవిలో గొణిగాడు. "నీ దగ్గర

గుప్పున వాసనొస్తోంది."

లహసన్ వా లాల్ మొహరు నౌకరు. బండితోలేది వాడే. వయస్సులో అంద రికన్నా చిన్న. మొదటిసారి వస్తే ఏమయింది.? గొప్పోళ్ళ ఇండ్లలో చిన్నప్పటి నుండి నౌకరీ చేస్తూనే ఉన్నాడు. వాడు ఉండి-ఉండీ ముక్కు పైకెత్తి వాసన చూస్తున్నాడు. లహసన్ వా మొహం ఎఱ్ఱబడటం హిరామన్ చూశాడు... "ఆచ ప్పుడుచేసుకుంటూ వచ్చేదెవరు?" ఎవరూ? పలట్ దాసా? "ఏమిటి సంగతి?"

పలట్ దాస్ మౌనంగా నిలబడ్డాడు. అతని మొహం ఎఱ్ఱబడి ఉంది. "ఏమయింది? మాట్లాడవేం? అని హిరామన్ అడిగాడు."

పలట్దాస్ ఏమి జవాబివ్వగలడు? ఆమెతో జాగ్రత్తగా మాట్లాడమని హిరా మన్ ముందే హెచ్చరించాడు. అతను మాట్లాడకుండా హిరామన్ కూర్చునే చోటే బండినొగల్లో కూర్చున్నాడు. "నీవు కూడా హిరామన్ స్నేహితుడివా?" అని అడిగింది హీరాబాయ్. పలట్దాస్ అవునని ఊపాడు. హీరాబాయ్ మరలాప డుకొంది.

ఆమె మొహం..ఆమెమాట...ఆమెతీరు...చూసి పలట్ దాస్ గుండె దడదడ లాడింది. అవును. రామలీలలో సుకుమారి సీత ఇలాగే అలసి పడుకొని ఉండే ది...జై సీతా రామ చంద్రులకూ, జై! ...పలట్ దాస్ మనసులో జయ జయ నినాదాలు విన్పిస్తున్నాయి. దాస్ వైష్ణవుడు. కీర్తనలు పాడగలడు. అలసిన సీతా దేవి పాదాలు నొక్కాలనే కోరిక కలిగింది...హార్మోనియం వాయిస్తున్నట్లు వ్రేళ్ళతో ఆమె పాదాలు తాకాడు. హీరాబాయ్ ఉలికి పడిలేచి కూర్చుంది. "నీకేమైనా పిచ్చా? కదులు ఇక్కడి నుంచి" అనికోప్పడింది.

కోపం వచ్చిన కంపెనీ స్త్రీ కళ్ళు నిప్పులు కుర్తుస్తున్నట్లు అనిపించింది. అతనికి. పలట్ దాస్ ఒకే దౌడు తీశాడు.

పలట్దాస్ జవాబేమివ్వగలడు? తిరనాళ్ళనుండే పారిపోవటానికి ఉపాయం ఆలోచిస్తున్నాడు. పైకి మాత్రం "ఏం లేదు. నాకొక వ్యాపారస్తుడు దొరికాడు. ఇప్పుడే స్టేషన్కు వెళ్ళి బండిలో సామాను నింపుకోవాలి? అన్నాడు.అన్నం తయారవడానికి ఇంకా ఆలస్యం ఉంది. ఇంతలో వచ్చేస్తాను" అన్నాడు.

భోజనాల సమయంలో ధున్నీరామ్, లహసన్ వా, ఇద్దరూ పలట్ దాస్ను నిందించారు. "నీచుడు. తక్కువబుద్ధులు. పైసపైసకూ లెక్క కట్టాడు." అన్నం తిని, వాళ్ళు పొయ్యి ఆర్పేశారు. ధున్నీ, లహసన్వా లిద్దరూ హీరామన్ బండి నిలిపిన చోటుకు బండ్లు కట్టుకొని బయలుదేరారు. హిరామన్ వెళ్ళే వాడల్లా ఆగి

లాల్ మొహర్‌తో అన్నాడు: "నా భుజం కాస్త వాసన చూడు...ఒక సారి వాసన చూడు."

లాల్ మొహర్ వాసన పీల్చి కళ్లుమూసుకొన్నాడు. అస్పష్టమైన 'ఎహే' శబ్దం వినపడింది.

"కొంచెం చేయి తగలగానే ఎంతసువాసనో... అర్థమయిందా?" అన్నాడు. హిరామన్.

లాల్‌మొహర్ హిరామన్ చేయిపట్టుకొని "భుజం పైన చేయిపెట్టిందా? నిజంగా నేనా? హిరామన్! నౌటంకీ చూసే అవకాశం మళ్ళీ దొరకదు" అన్నాడు.

"నీవు చూస్తావా?"

లాల్‌మొహర్ మొహం దీపకాంతితో మెరిసింది.

హిరామన్ బండినిలిపిన స్థలానికి రాగానే, బండిగూడు దగ్గర నిల్చుని ఎవరో హీరాబాయ్‌తో మాట్లాడటం కన్పించింది. ధున్నీ, లహసన్‌వా, ఇద్దరూ ఒక్కసారిగా అరిచారు: "ఎక్కడుండిపోయావు? నీ కోసం చాలా సేపటి నుండీ కంపెనీ వాళ్ళు వెతుకు తున్నారు."

హిరామన్ బండి దగ్గరగా వెళ్ళి చూశాడు-అరెవీడు వాడేనే! చంపానగర్ తిరునాళ్ళలో హీరాబాయ్‌ని బండిలో కూర్చోబెట్టిన నౌకరే.

"వచ్చావా హిరామన్! ఇలారా. ఇదిగో నీకిరాయి. ఇదిగో నీకు బక్షీష్. ఇరవై ఐదు, ఇరవై ఐదు - మొత్తం యాభై."

ఎవరో ఆకాశంనుండి భూమిపైకి తనను తోసివేసి నట్లయింది. హిరామన్‌కు. ఎవరో ఎందుకు? వీడే...పెట్టె బండిలో పెట్టిన నౌకరే. వీడు ఎక్కడి నుండి వచ్చాడు?...హిరామన్ నోట్లోని మాట నోట్లోనే ఉండి పోయింది. ...ఇస్...బక్షీషా?...ఏం మాట్లాడకుండా నిలుచున్నాడు.

హీరాబాయ్ అంది "తీసుకో రేపు...ఉదయం రీతా కంపెనీకి వచ్చినన్ను కలుసుకో. నీకు 'పాస్' చేయించి ఇస్తాను...ఏమి మాట్లాడవెందుకు?"

"అమ్మగారు డబ్బు ఇస్తున్నారు. బక్షీషు ఇస్తున్నారు. తీసుకో హిరామన్" అన్నాడు లాల్‌మొహర్.

హిరామన్‌కు కోపం వచ్చింది...ఈ వెధవకు మాట్లాడే తీరు కూడా తెలియదు.

"బండి, ఎడ్లు వదిలి పెట్టి, ఏ బండి వాడైనా నౌటంకీ ఎలా చూస్తాడు?" ధున్నీరామ్ స్వగతంగా అనుకుంటున్నమాటలు హీరాబాయ్‌తో సహా అంతా విన్నా

రు.

హిరామన్ డబ్బు తీసుకొంటూ "ఏం చెప్పమంటారు?" అని, నవ్వడానికి ప్రయత్నించాడు...కంపెనీ స్త్రీ కంపెనీకి వెళ్తుంది. హిరామన్‌ది ఏం పోయింది? పెట్టి పెట్టిన నౌకరు "ఇటూ, ఇటు" అని దారి చూపిస్తున్నాడు. హీరాబాయ్ వెళ్తు న్నదల్లా ఆగి హిరామన్ ఎడ్లనుద్దేశించి "ఇక వస్తాను భయ్యేన్" అంది.

"భయ్యేన్" శబ్దం విని ఎడ్లు చెవులాడించాయి.

"సోదరులారా! ఈ రాత్రి రీతా సంగీత్ నౌటంకీ కంపెనీ రంగం మీద గుల్ బదన్‌ను చూడండి. మధురామోహన్ కంపెనీలో పేరొందిన నటి, తన అభిన యంతో ప్రేక్షకులను ముగ్ధులను చేసే మిస్ హీరాదేవి...ఈ సారి మాకంపెనీలో నటిస్తుందని తెలియజేయటానికి మేమెంతో గర్విస్తున్నాము. మరువకండి...నేడే చూడండి...గుల్‌బదన్...హీరాదేవి...ధన్...ధన్,ధన్...ధడామ్..."

నౌటంకీ వాళ్లు చేస్తున్న ప్రకటన తిరునాళ్ళలో సంచలనం కలిగించింది... హీరాబాయ్? మిస్ హీరాదేవి? లైలా, గుల్‌బదన్...? సినిమాతారలు ఆమెముందు బలాదూర్..."నీ సొంపుసొంపులకు దాసున్ని...నాప్రేమ ఎలా వ్యక్తం జేయగలను? నీచూపులతో నను కరుణించు...నాప్రాణమా! నాహృదయమా! నిన్ను మనసారా చూడనీ...కిర్,కిర్,కిర్...కడ్,కడ్,కడ్...ధన్,ధడామ్."

ప్రతి మగవాడి మనసు ఉరకలేసింది.

లాల్‌మొహర్ ఆయాసపడ్తూ, పరిగెత్తుకుంటూ హిరామన్ దగ్గరకు వచ్చాడు. "ఒరే...హిరామన్ ఇక్కడే కూర్చున్నావా? అలా వెళ్ళి చూడు...జయజయ నినా దాలు ఎలా విన్పిస్తున్నాయో, తాళమేళాలతో, బాజాబజంత్రీలతో హీరాబాయ్‌కి జైకొడ్తున్నారు."

హిరామన్ హడావుడిగా లేచాడు. "ధున్నీ బాబాయ్! నీవిక్కడే ఉండు. నేను కూడా వెళ్ళి చూసొస్తాను" అని లహసన్‌వా అన్నాడు. ధున్నీ మాట ఎవరు వింటారు? ముగ్గురూ ఆ నౌటంకీ వాళ్ళ ప్రకటన-బండి వెంట పడ్డారు. ప్రతి మలుపు దగ్గరా ఆగి, డప్పులాపి ప్రకటన చేసేవారు. ప్రకటనలోని ప్రతి శబ్దానికీ హిరామన్ పులకిస్తున్నాడు. హీరాబాయ్‌పేరు, పేరుతో బాటు ఆమె అభినయం గురించి వర్ణనవింటూ హిరామన్ లాల్ మొహర్ వీపుబాదాడు. "ధన్యురాలు, ధన్యురాలు, అవునా? కాదా?"

"ఇప్పుడు చెప్పు. ఇప్పుడు కూడా నౌటంకీ చూడవా?" అని లాల్ మొహర్ అన్నాడు. ఉదయం నుండి ధున్నీరామ్ లాల్‌మొహర్ ఇద్దరూ ప్రాధేయపడి ఓడి

పోయారు. "కంపెనీకి వెళ్లి ఆమెను కలసిరా. వెళ్తూ వెళ్తూ చెప్పి వెళ్ళింది కూడా" అన్నాడు. కాని హిరామన్ తన పట్టు విడువలేదు. ధూత్, ఆమెను కలుసుకోవడానికి ఎవరు వెళ్తారు. కంపెనీ స్త్రీ కంపెనీకి వెళ్ళింది. ఆమెతో నాకేం పని? ఆమెగుర్తు పట్టదు కూడా."

వాడి అంత రాంత రాలలో అలుకగా ఉంది. ప్రకటన విన్నాక "లాల్‌మొహర్, నౌటంకీ చూసి తీరాలా?" అన్నాడు.

ఇద్దరూ ఏదో మాట్లాడు కొని రీతా కంపెనీకి వెళ్లారు. డేరావద్దకువెళ్లి హిరామన్ లాల్ మొహర్‌కు ఏదో సైగ చేశాడు. వివరాలను కనుక్కొనే బాధ్యత లాల్ మొహర్‌ది. లాల్ మొహరుకు వాళ్ళ భాష తెల్సు. ఒక నల్లకోటు వాడితో "బాబుగారూ మాట" అన్నాడు లాల్ మొహర్.

నల్లకోటు ఆసామి మొహంచిట్లించి "ఏంపని?" అన్నాడు. లాల్ మొహరు కచరాహీ భాషలో తడబడ్డాడు. "గుల్,బుల్..కాదు...కాదు...బుల్ బుల్...ఉహు..."

హిరామన్ అందుకున్నాడు. "హీరాదేవి ఎక్కడుంటారో చెప్పండి."

ఆ వ్యక్తి కళ్ళు ఎఱ్ఱబడ్డాయి. ఎదురుగా నిల్చున్న గూర్ఖాని పిల్చి "వీళ్ళను ఇక్కడి కెందుకు రానిచ్చావు" అన్నాడు.

"హిరామన్" ఆమధుర కంఠం ఎక్కడి నుంచి వినవచ్చిందీ? డేరా పరదా తొలగించి హీరాబాయ్ పిలిచింది. "ఇక్కడికిరా...లోపలికి...చూడు బహదూర్...ఇతన్ని గుర్తు పెట్టుకో, ఇతను నా హిరామన్. అర్థమయిందా?"

గూర్ఖా హిరామన్‌ను లోనికి పంపి ముసిముసిగా నవ్వి వెళ్ళిపోయాడు. నల్లకోటు వ్యక్తితో "హీరాబాయ్ మనిషి, ఆ పొద్దని చెప్పింది" అన్నాడు. లాల్ మొహర్ బయటికి వెళ్ళి కిళ్ళీలు పట్టుకొచ్చి గూర్ఖాకు ఇచ్చి "తీసుకోండి" అన్నాడు.

"ఇస్...ఒకటికాదు. అయిదు పాసులు నాలుగు ఎనిమిదణాలవి..."తిరనాళ్ళలో ఉన్నంత కాలం ప్రతి రాత్రి చూడాలి సరేనా? అన్నది. ఆమెకు అందరూ గుర్తున్నారు. "నీకింకాస్నేహితులున్నారుగా. అందరికీ పాస్‌లు తీసుకెళ్ళు అంది." కంపెనీ స్త్రీ లమాటే వేరు. అవునా?

లాల్ మొహర్ ఎఱ్ఱ కాగితం ముక్కలు తాకి చూసి "పాస్‌లు...బలే హిరామన్ భాయీ...ఐదు పాస్‌లు ఎందుకు? పలట్‌దాస్ ఇంకా తిరిగి రాలేదుగా" అన్నాడు.

"ఆ అభాగ్యుని సంగతి వదిలెయ్. అదృష్టంలో లేనప్పుడు ఏం చేద్దాం?...

అందరూ గురువు మీద ప్రమాణం చేయాలి. ఊర్లో ఒక పిట్టకు కూడా ఈ సంగతి తెలీకూడదు."

"ఊరుకెళ్ళి ఏవెధవ చెప్తే వాడిని ఈ సారి మన వెంట తీసుకురాకూడ దంతే" అన్నాడు లాల్ మొహర్.

హిరామన్ తన డబ్బుల సంచినీ ఇవాళ హీరాబాయ్‌కి అప్పజెప్పాడు. "మేళాలో ఏమవు తుందో చెప్పలేం, రకరకాల మనుషులు...జేబులు గొట్టే వారు కూడా ఉంటారు. స్నేహితులని వెంటవచ్చిన వాళ్ళను కూడా నమ్మకూడదు." హీరా బాయ్ ఒప్పుకుంది... అతని నల్లగుడ్డ సంచి తనతోలు పెట్టెలో పెట్టు కుంది. ఆమె పెట్టెకు పైన ఒక గుడ్డ కవరుంది... లోపలంతా సిల్కు గుడ్డ.

లాల్‌మొహర్, ధున్నీ రామ్ ఇద్దరూ హిరామన్‌ను ప్రశంసించారు. అతని అదృష్టాన్ని మెచ్చారు. అతని అన్నా, వదినెలను లోలోపల నిందించారు. హిరా మన్ లాంటి వజ్రం వాళ్ళన్నకు లభించాడు. ఇంకెవరయినా అయి ఉంటే...

లహసన్ వా మొహం వేలాడేసుకున్నాడు. అప్రకటన వింటూ, వింటూ ఎక్క డికి వెళ్ళాడోగాని, చీకటి పడ్డ తర్వాత వచ్చాడు. లాల్‌మొహర్ యజమానిలా కో ప్పడ్డాడు. "పోకిరి వెధవా" అన్నాడు.

ధున్నీ రామ్ కిచడీ చేస్తున్నాడు. "బండి దగ్గర ఎవరుంటారో ముందు తేల్చుకోండి."

"ఎవరుంటారు? ఈ లహసన్‌వా ఎక్కడికి వెళ్తాడేమిటి?" లహసన్‌వా ఏడుపు మొదలు బెట్టాడు. "అయ్యా, అయ్యా మీకు దండం పెడతా. కొంచెంసేపు... కొంచంసేపు...అది చూడ నీయండి దొరా..."

హిరామన్ ఉదారంగా అన్నాడు. "కొంచెం సేపెందుకు? ఒక గంట పూర్తిగా చూడు. నేను వచ్చేస్తాను."

నౌటంకీ ఆరంభించేందుకు రెండు గంటల ముందు నుంచే డప్పులు మొద లయ్యాయి. డప్పుల మోతకు ప్రజలు గాలి పటాల్లా ఎగురుకొంటూ వస్తున్నారు. టికెట్లు అమ్మేచోట ఆగుంపును చూసి హిరరామన్‌కు నవ్వువచ్చింది.

"లాల్‌మొహర్ అలా చూడు. ఎలా విరగబడుతున్నారో."

"హిరామన్‌భయ్యా."

"ఎవరూ? పలట్ దాసా? ఎక్కడ సామాను దింపి వస్తున్నావు? ఎవరో పరాయి వాడితో మాట్లాడు తున్నట్లు లాల్‌మొహర్ అడిగాడు.

పలట్‌దాస్ చేతులు నులుముకొంటూ క్షమార్పణలు చెప్పుకున్నాడు." "తప్పయి

పోయింది. మీరు ఏశిక్ష విధించినా సిద్ధంగా ఉన్నాను. నిజం చెప్పనా? సుకు మారి సీత..."

హిరామన్ మనసు డప్పుల మోతకు ఉరకలు వేసింది.

"చూడు పలటా...మన పల్లెటూరి రకం కాదు. నీకు కూడా ఒక పాస్ ఇచ్చింది పాస్...తీసుకో నౌటంకీ చూడు."

లాల్ మొహరన్నాడు. "అయితే ఒక షరతు, మధ్య మధ్య లహసన్‌వా..."

పలట్‌దాస్ కు అంతా అర్థమయింది... వాడప్పుడే లహసన్‌వాతో మాట్లాడి వస్తున్నాడు.

లాల్‌మొహర్ మరో షరతు పెట్టాడు. "పల్లెలో ఎవరికైనా తెలిసిందీ అంటే..."

"రామ...రామ" అని నాలుక కొరుక్కున్నాడు పలట్‌దాసు.

"ఎనిమిదణాల గేటు ఇక్కడుంది. అని చూపించాడు." పలట్ దాస్. ఆగేటు దగ్గరున్న మనిషి వీళ్ళ చేతిలోంచి పాస్‌లు తీసుకొని వీళ్ళ మొహాలు పరికించి చూసి "ఇవి మీకెక్కడివి?" అని అడిగాడు.

లాల్ మొహర్ తన కచరాహీ భాషలో వాదన మొదలు పెట్టాడు. వాడి మాట తీరూ, మొహమూ చూసి గేటు దగ్గరి మనిషి గాబరా పట్టాడు. "ఎక్కడివి? మీ కంపెనీ వాళ్ళనే అడుగు ఎక్కడవో. మాదగ్గర నాలుగే కాదు, ఇంకో పాస్ కూడా ఉంది." అంటూ ఐదో పాస్ తీసి చూపించాడు లాల్‌మొహర్.

రూపాయి గేటు వద్ద నున్న గూర్ఖాను చూచి - "సిపాయ్‌బాబూ" అంటూ హిరామన్ అతన్ని పిలిచాడు. "ప్రొద్దున్నే పరిచయమయింది. అప్పుడే మరిచి పోయూరా?"

గూర్ఖా, గేటు వానితో అన్నాడు. "వీళ్ళందరూ హీరాబాయ్ మనుషులు. లోపలికి వెళ్ళనీ, పాస్ ఉండగా ఆపడమెందుకు?"

ఎనిమిదణాల తరగతి.

ముగ్గురూ మొదటి సారిగా లోపలికి వెళ్ళారు. అన్ని వైపులా పరికించి చూశారు...ముందు వరుసలన్నీ కుర్చీలు, బెంచీల తరగతులు, తెరపైన రాముని వనవాస చిత్రం. పలట్ దాస్ చేతులు జోడించి సీతా రాములకు జేజేలు కొట్టాడు. పలట్ దాస్ కళ్ళలో నీళ్ళల్లో నిండాయి.

"లాల్‌మొహర్! వేషాలు వేసే వాళ్ళందరూ ఇంకా బయటే ఉన్నారా? లోపలకు వచ్చారా? అని హిరామన్ అడిగాడు."

తన ప్రక్కన ఉన్న వాళ్ళను లాల్ మొహర్ అప్పటికే పరిచయం చేసుకొ

న్నాడు. ఆట మొదలవటానికి ఇంకాలైముంది... అం దరూ ఇప్పుడిప్పుడే గుమి గూడుతున్నారు. అన్నారు వారు.

పలట్‌దాస్‌కు డోలు వాయించడం వచ్చు. లోపల మోగుతున్నడప్పులకను గుణంగా అతడు తల తిప్పుతూ అగ్గి పెట్టెపైన వ్రేళ్ళు ఆడిస్తున్నాడు. చుట్టూ ఉన్న వాళ్ళకు బీడీలిచ్చి హిరామన్‌కూడా ఇద్దరి, ముగ్గురిని పరిచయం చేసుకొన్నాడు.

లాల్‌మొహర్‌కు పరిచయమయిన వాడు ఒంటినిండా దుప్పటి కప్పుకొన్నాడు. "ఆట మొదలు పెట్టటానికి ఇంకా ఆలస్యమయ్యే ట్లుంది. అప్పటిలోగా ఒక కునుకు తీయొచ్చు." అని కళ్ళు మూసుకొన్నాడు. ఎనిమిదణాల తరగతే అన్నింటికన్నా బాగుంటుంది. వెనక్కా, ఎత్తుగా బాగుంది. క్రింద పరచిన ఊకవెచ్చగా ఉంది. కుర్చీలమీద, బెంచీల మీద కూర్చున్నోళ్ళందరూ చలికి తాళలేక టీ తాగటానికి వెళ్తుంటారు.

అతనే తన బంధువుతో "ఆట మొదలు పెట్టగానే నన్ను లేపు...కాదు....కాదు హిరియా రాగానే లేపు" అన్నాడు.

హిరామన్‌కు కొంచెం కోపమొచ్చింది. 'హిరియా' అట...వాగుడు కాయలా ఉన్నాడు. లాల్‌మొహర్‌కు కన్నుగీటి, "వీడితో మాట్లాడ నవసరం లేదు" అని సైగ చేశాడు.

ధన్...ధన్...ధన్.ధడామ్ తెర ఎత్తారు. హె...ఏ... ఏ...హీరాబాయ్ మొదట్లోనే రంగం మీద కొచ్చింది. డేరాలో జనం క్రిక్కిరిసి ఉన్నారు. హిరామన్ నోరు తెరుచుకుచూస్తున్నాడు. లాల్ మొహర్ కు ఎందుకో ఒకే నవ్వువస్తోంది. హీరాబాయ్ పాడుతున్నప్పుడంతా వాడు నవ్వుతూనే ఉన్నాడు...మూర్ఖుడు...

గుల్‌బదన్ దర్బారు...సింహాసన్నాన్ని వెయ్యిరేకుల గులాబీ పువ్వులా తయారు చేసిన వాడికి కోరినబహుమతి లభిస్తుందట...ఆవిధంగా తయారుచేయగల పనివాడెవడయినా ఉన్నాడా?...ఉంటే ముందుకురండి...ఈ సింహా సనాన్ని వెయ్యి రేకుల గులాభీలాతయారు చేయండి...కిర్,కిర్..నాట్యం ప్రారంభమయింది....ఎంత చక్కా పాడుతుందో! ఎవరో అన్నారు. హీరాబాయ్ పాన్‌బీడా, పొగాకు తినదని...నిజమే, పేరున్నభోగంది...భోగందని ఎవరంటారు? పళ్ళుగారపట్టిలేవే! పొడరుతో పళ్ళు తోముకుంటున్నదేమో. అలా ఎప్పటికీ కాదు...ఎవరామనిషి? అనవసరంగా వాగుతున్నాడు. కంపెనీ స్త్రీని భోగందని అంటున్నాడే! అలా అంటే నీకేం? ఎవడురా వీడు. దాని ప్రియుడు మాదిరి అడ్డొస్తున్నాడు...తన్నండి...ఆవెధవ నాగన్నను తన్నండి.

ఆ గోల మధ్య హిరామన్ కంఠం గట్టిగా వినిపిస్తోంది. "రండి...రాండిరా! ఒక్కొక్కరి తల నరికేస్తాం."

లాల్ మొహర్ ముందు వరుసలోని వాళ్ళను కమ్మీతో కొట్టున్నాడు. పలట్ దాస్ ఒకని రొమ్ముమీద కూర్చున్నాడు. "దొంగవెధవా...సుకుమారి సీతను తిడ్తు న్నావా? ముసల్మానువయీ తిడ్తున్నావా?"

ధున్నీరామ్ మొదటినుండి మౌనంగానే ఉన్నాడు. ఈ రగడ ప్రారంభం కాగానే బయటపడ్డాడు.

నల్లకోటు వేసుకొన్న నౌటంకీ మేనేజరు గూర్ఖాను వెంట బెట్టుకొని పరుగె త్తుకు వచ్చాడు. పోలీసు ఇన్స్పెక్టరు అందరినీ హంటరుతో చితక బాదుతున్నా డు. లాల్‌మొహరు కూ దెబ్బలు తగిలాయి. కచరాహీ భాషలో ఉపన్యాసం మొదలెట్టాడు. "ఇన్‌స్పెక్టరుగారూ కొడ్తున్నారా? కొట్టండి, నాకేమినష్టం లేదు. కానీ ఈ పాస్ చూడండి. ఇంకో పాస్ జేబులో కూడా ఉంది. కనిపిస్తోందా, దొరా...టిక్కెట్లు కాదు...పాస్‌దొరా...కంపెనీ స్త్రీ గురించి ఎవరైనా చెడ్డగా మాట్లా డితే మాకు కోపం రాకుండా ఉంటుందా?"

కంపెనీ మేనే జరుకు అంతా అర్థమయింది. ఇన్‌స్పెక్టరు గారికి నచ్చజె ప్పాడు. "హుజూర్‌నాకు అర్థమయింది... ఇదంతా ఆ మధురామోహన్ కంపెనీ వాళ్లు చేయించారు. ఈ నౌటంకీ సమయంలో కొట్లాటలు జరిపించి కంపెనీకి చెడ్డపేరు తీసుకురావాలని వాళ్ళ ఉద్దేశ్యం...వీళ్ళని వదిలెయ్యండి హూ జూర్... వీళ్ళు హీరాబాయ్ మనుషులు. ఆమె ప్రమాదంలో ఉంది. మీకు చెప్పాను కదా..."

హీరాబాయ్ పేరు వినగానే ఇన్‌స్పెక్టరు ముగ్గురినీ వదిలేశాడు. వాళ్ళదగ్గ రున్న కమ్మీలు లాగేసుకున్నాడు. మేనేజరు వాళ్ళు ముగ్గురినీ రూపాయ తరగ తిలో కుర్చీల మీద కూర్చోబెట్టాడు...మీరిక్కడే కూర్చోండి. పాస్‌పంపుతాను." డేరా అంతానిశబ్ధం. హీరాబాయ్ తిరిగి స్టేజ్ మీదకు వచ్చింది.

డప్పులు మళ్లీ మొదలు బెట్టారు.

కొంచెంసేపయ్యాక వాళ్ళ ముగ్గురికీ ధున్నీరామ్ గుర్తొచ్చాడు. "అరెధున్నీ ఏడీ?" అనుకొన్నారు.

"దొరా, ఓదొరా!" లహసన్‌వా బయటనుండి కేక లేస్తున్నాడు. "ఓలాల్ మొహ ర్‌దొరా..."

లాల్‌మొహర్ గట్టిగా జవాబిచ్చాడు. "ఒరే ఇక్కడ రా... ఇక్కడ రూపాయిగే

ట్లొంచిరా." అందరూ లాల్ మొహర్‌ను చూశారు. గుర్ఖా లహసన్‌వాను లాల్‌మొహర్ దగ్గరకు తీసుకొచ్చాడు. లాల్‌మొహర్ జేబులోనుండి పాస్ తీసి చూపించాడు. లహసన్ వా రాగానే అడిగాడు. "దొరా, ఎవడు ఏం కూశాడో చెప్పండి. వాడెవరో చూపించండి."

ప్రేక్షకులు లహసన్ వా విశాలవక్షాన్ని, ధృడశరీరాన్ని చూశారు. చలికాలంలో కూడా పైన ఏ బట్టాలేదు...వీళ్ళంతా ముఠాలాగుంది...

లాల్‌మొహర్ లహసన్ వాను శాంతపరిచాడు.

ఆ ముగ్గురినీ, నలుగురినీ నౌటంకీలో ఏం చూశారని అడగొద్దు. ఏది ఏమిటో ఎలా గుర్తుంటుంది? హీరాబాయ్ మొదటి నుంచి కూడా తననే చూస్తూ నాట్యం చేసి పాట పాడుతున్నట్లు హిరామన్ భావించాడు. లాల్ మొహర్‌కేమో, హీరాబాయ్ తనను చూస్తున్నట్లుంది... హిరామన్ కన్నా తనుశక్తిగలవాడని హీరాబాయ్ గ్రహించి ఉంటుంది. పలట్‌దాస్‌కు నౌటంకీ బోధపడుతోంది...నౌటంకీ లో మాత్రం ఏముంది? రామాయణమేగా! అదే రాముడు, అదే సీత, అదే లక్ష్మణుడు. రావణుడూ వాడే. సుకుమారి సీతను పొందటానికి రావణుడు ఎన్నో వేషాలలో వస్తాడు. రాముడు, సీత కూడా రూపాలు మార్చుకొంటారు. ఇక్కడ సింహాసనాన్ని వేయి రేకుల గులాబిపువ్వుగా చేసే తోట మాలి కొడుకు రాముడే. వానిస్నేహితుడు లక్ష్మణుడే... గుల్‌బదన్ సుకుమారి సీత...ఆసుల్తాను రావణుడు. ధున్నీ రామ్‌కు జ్వరం. లహసన్‌వాకు జోకరు బాగా నచ్చాడు. వాడి పాట నచ్చింది. వాడితో స్నేహంచేసుకోవాలను కొంటున్నాడు. "నాతో స్నేహం చేసుకోవా జోకర్ సాబ్" అని పదే పదే అనుకొంటున్నాడు.

హిరామన్‌కు ఒకపాటలోని పంక్తి బాగా గుర్తుంది. "మారేగయే గుల్‌ఫామ్" ఎవరా భగ్నప్రేమికుడు? హీరాబాయ్ ఏడుస్తూ పాడు తోంది. "అజిహా, మారే గయే గుల్‌ఫామ్...టి,డి,డి,టి..."పాపంగుల్‌ఫామ్.

ముగ్గురి కమ్మీలు తిరిగి ఇచ్చేస్తూ "లారీలు, కమ్మీలు తీసుకొని నౌటంకీలు చూడటానికి వస్తారా?" అని పోలీసు అడిగాడు.

రెండోరోజు తిరనాళ్ళలో ఈ విషయం పొక్కింది- "మధురా మోహన్ కంపెనీ నుండి హీరాబాయ్ పారిపోయి వచ్చిందని అందుకే మధురామోహన్ కంపెనీ ఈ ఏడాది ఆట ఆడే దానికి రాలేదు. వాళ్ళ గూండాలు వచ్చారు. హీరాబాయ్ తక్కువదా? భలేకిలాడి. పదమూడు మందిని, వస్తాదులను పోషిస్తోంది. ఎవడైనా పల్లెత్తు మాట అనగలడా?"

పదిరోజులు...రాత్రింబవళ్ళు...

పగలంతా బండి బాడుగకు తోల్తాడు హిరామన్. సాయంత్రమవగానే నౌటంకీ వద్ద డప్పులమోత...హీరాబాయ్ పిలుపు చెవుల్లో గింగురు మంటూ ఉంటుంది. "భయ్యా, మీతా...హిరామన్...ఉస్తాద్, గురుజీ" రోజంతా ఏదో ఒక వాయిద్యం తనలో వినిపిస్తూ వుంటుంది. ఒకసారి హార్మోనియం, మరొకసారి డప్పులు. ఇంకొకసారి డోలు. ఒక్కోసారి హీరాబాయ్ పాట. ఈ వాయిద్యాల మేళ వింపు తోనే హిరామన్ కూర్చుంటాడు. నడుస్తాడు. తిరుగుతాడు. నౌటంకీ కంపెనీ మేనేజరు నుండి కర్తనులాగే వాడి వరకూ అందరూ అతన్ని హీరాబాయ్ మనిషిగా గుర్తిస్తారు. ప్రతిరోజు నౌటంకీ ప్రారంభం అయ్యేటప్పుడు పలట్‌దాస్ శ్రద్ధగా రెండు చేతు లెత్తి స్టేజికి నమస్కరించేవాడు. ఒకసారి లాల్‌మొహర్ హీరాబాయ్‌కి తన కచరాహీ భాష విన్పించటానికి వెళ్ళాడు. ఆమెవాడిని గుర్తించనే లేదు. అప్పటి నుంచి అతని కెలాగో ఉంది. తన నౌకరు లహసన్ వా తన చేయి జారి పోయాడు. కంపెనీలో చేరి పోయాడు. జోకర్‌తో వానికి స్నేహం కుదిరింది. రోజంతా నీళ్ళు మోస్తాడు. బట్టలుతుకుతాడు. "పల్లెలో ఏముందని వెళ్ళాలి?" అంటాడు. లాల్ మొహర్ విచారంగా ఉంటున్నాడు. జ్వరంపడి ధున్నీరామ్ ఇంటికి వెళ్ళి పోయాడు.

ఉదయం నుంచి మూడు సార్లు సామాన్లుతోలి హిరామన్ స్టేషను చేరుకున్నాడు. ఈ రోజెందుకో అతనికి తనవదిన గుర్తొస్తుంది...ధున్నీరామ్ జ్వర తీవ్రతలో అక్కడేమైనా చెప్పలేదు గాదా. ఇక్కడే జ్వరంలో ఏదో వాగే వాడు...గుల్ బదన్. సింహాసనం...వేయిరేకులు అంటూ...లహసన్‌వా చాలా హుషారుగా ఉన్నాడు. రోజంతా హీరాబాయ్‌ని చూస్తాడు. తనతో నిన్న అంటున్నాడు. "మీదయవల్ల...సంతోషంగా ఉన్నాదొరా. హీరాబాయ్ చీర ఉతికాక ఆ నీళ్ళుగులాబి అత్తరు వాసనొస్తాయి. ఆ నీళ్లలో నా పై పంచవేస్తుంటాను. చూడు దొరా...వాసన చూడు."

ప్రతిరాత్రి ఎవరో ఒకరు అంటూ ఉంటారు. "హీరాబాయ్ భోగంది అని" తను ఎందరితో పోట్లాడ గలడు? ఏమీ చూడ కూండానే ప్రజలు ఎంతెంత మాటలంటారు! రాజుని గురించి కూడా ప్రజలు అతని వెనుక ఎన్ని మాటలంటారు... ఈరోజుతను హీరాబాయ్‌ని కలుసుకొని చెప్పాలి. "నౌటంకీ కంపెనీలో ఉంటే ప్రజలు చాలా నీచంగా మాట్లాడ తారు. సర్కస్ కంపెనీలో చేరండి" అని అందరి ఎదుట ఆమె నాట్యం చేస్తున్నపుడు హిరామన్ మనసు చాలా బాధపడుతుంది... సర్కస్ కంపెనీలో అయితే...పులిదగ్గరకు వెళ్ళడానికి ఎవరైనా సాహసం చేయ

గలరా? అక్కడ హీరాబాయ్ సురక్షితంగా ఉంటుంది...అరే,ఈబండి ఎక్కడ నుంచి వస్తోందో!

"హిరామన్, హిరామన్ భాయీ" లాల్‌మొహర్‌మాట విని హిరామన్ వెనక్కితిరిగి చూశాడు. "ఏసామాను తోలుకొచ్చావు లాల్‌మొహర్?"

"నిన్ను స్టేషనులో హీరాబాయ్ వెతుకుతూవుంది. ఆమె వెళ్ళి పోతుందట. తన బండ్లోనే తిరనాళ్ళనుండి స్టేషను దాకా వెళ్ళిందట."

"వెళ్ళి పోతుందా? ఎక్కడికీ? రైలు బండిలో వెళ్ళి పోతుందా లాల్ మొహర్?"

హిరామన్ బండి విప్పిగిడ్డంగి చౌకి దారుతో "భయా! ఈ బండిని, ఎడ్లను చూస్తూఉండు. నేనిప్పుడే వస్తాను" అన్నాడు.

"గురూజీ" ఆడవాళ్ళ విశ్రాంతి గది గుమ్మం దగ్గర హీరాబాయ్ దుపట్టాకప్పుకొని నిలబడి ఉంది. సంచీ అతని చేతికిస్తూ "తీసుకో...భగవాన్.. ఎలాగైతేనేం కలుసుకోగలిగాను...కలుసు కోలేనేమోననుకున్నాను. నేను వెళ్తున్నాను గురూజీ... "

హీరాబాయ్ సామాన్లు పెట్టేవ్యక్తి ఈ రోజు కోటు, ఫ్యాంటువేసుకొని దొరబాబులా ఉన్నాడు. కూలీల మీద అజమాయిషీ చేస్తున్నాడు. "ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కించండి ఈ సామాన్లు."

సంచీ చేతిలో పట్టుకొని హిరామన్ మౌనంగా నిలబడ్డాడు. ఆమె తన కుర్తాలో నుండీ ఈ సంచి తీసిచ్చింది...పిట్టశరీరం ఉన్నంత వెచ్చగా ఉంది ఈ సంచి.

"బండి వస్తూంది" సామాన్లు పెట్టేవ్యక్తి హెచ్చరించాడు. "పెట్టె ఇంత బరువుం దేమిటి" అన్నట్టుంది వాడి మొహంలోని భావం.

హీరాబాయ్ కొంచెం హడావుడిగా కన్పించింది "హిరామన్ ఇలారా లోపలికి. నేను తిరిగి మధురామోహన్ కంపెనీలోకి వెళ్ళిపోతున్నాను. మావైపువారిది ఆ కంపెనీ...బనేలీ తిరునాళ్ళకు వస్తావుకదూ."

హీరాబాయ్ హిరామన్ భుజం మీద చెయ్యి పెట్టింది...

ఈసారి కుడి భుజంపైన పెట్టింది. తన సంచిలో నుండి రూపాయలు తీసి "ఇదిగో వెచ్చగా ఒక శాలువాకొనుక్కో" అంది.

చాలాసేపటి తర్వాత హిరామన్ నోట్లో నుండి మాట వచ్చింది. "ఇస్" అస్తమానం రూపాయలు...పైసలు...మీ రూపాయలు మీ దగ్గరే ఉంచండి. శాలువా నాకెందుకు?"

హీరాబాయ్ చెయ్యి ఆగిపోయింది... హిరామన్ మొహాన్ని పరికించి చూసిం

ది. "నీ మనసు చాలా బాధ పడుతూందికదూ మీతా?...మహువాఘటవారిన్ని వ్యాపారస్థుడు కొనుకున్నాడు. కదూ! గురూజీ."

హీరాబాయ్ కంఠం గద్గదమైంది. కూలీవాడు బయట నుంచి కేకవేశాడు. "బండి వచ్చిందండీ." హిరామన్ ఇవతలి కొచ్చాడు. కూలివాడు నౌటెంకీ లో జోకర్‌లా మొహంపెట్టి "ప్లాట్‌ఫారమ్ నుండి పరుగెత్తు... టికెట్టు లేదని పట్టు కొంటే మూడు నెలలఖైదు..." అన్నాడు.

హిరామన్ మాట్లాడకుండా బయటకు వెళ్ళి గేటుదగ్గర నిలబడ్డాడు. స్టేషను వ్యవహారం, రైల్వే వాళ్ళరాజ్యం లేకపోతే కూలివాడి మొహం ఈ పాటికి తను చదును చేసే వాడే. హీరాబాయ్ ఎదురుగా ఉన్న పెట్టెలోకి ఎక్కింది. ఇస్... ఇంత బాధా? బండిలో కూర్చుని కూడా తననే చూస్తోంది, హీరాబాయ్. లాల్ మొహర్ కంట పడగానే కోపమొచ్చింది. ఎప్పుడూ వెంటపడతాడు వెధవా...అ న్నిట్లోనూ భాగానికి ఎగ బడతాడు.

బండి కూత వేసింది. తనహృదయంలో నుండి ఏదో ఒక పిలుపు. ఆకూతతో పాటు కలిసి పోయినట్లన్పించింది...కూ...ఉ...ఉ...ఇస్...ఛి...ఈ...చుక్-చుక్, బండి కదిలింది. హిరామన్ తన కుడికాలి బొటనవ్రేలును ఎడమకాలి మడమతో నొక్కు కున్నాడు. గుండెదడదడ తగ్గింది...హీరాబాయ్ వంగపూరంగు రుమాలుతో మొహం తుడుచుకొంది. ఆ రుమాలూపుతూ "ఇక వెళ్ళు అని సంజ్ఞచేసింది...ఆఖరి పెట్టెకూడా వెళ్ళి పోయింది...అంతా ఖాళీ...శూన్యం...గూడ్సు పెట్టెలు మాత్రం మిగిలాయి... ప్రపంచమే శూన్యమయినట్లుంది. హిరామన్ తనబండి దగ్గరకు తిరిగి వచ్చా డు."

"లాల్‌మొహర్ నువ్వు ఊరికెప్పుడెళ్తున్నావు?"

"ఇప్పుడే వెళ్ళి ఏం చెయ్యాలి. ఇక్కడైతే బాడుగతోలవచ్చు. హీరాబాయ్ వెళ్ళిపోయింది...ఇక తిరునాళ్ళ కూడా పూర్తికావచ్చు."

"సరే, సరే, మీ ఇంట్లో ఏమైనా చెప్పపంటావా?"

లాల్‌మొహర్ హిరామన్‌కు నచ్చచెప్ప టానికి ప్రయత్నించాడు. కానీ హిరా మన్ తన బండిని పల్లెదారి పట్టించాడు...ఇంకా తిరునాళ్ళలో ఏం మిగిలింది? శూన్యమైన తిరునాళ్ళ.

రైల్వేలైను ప్రక్కనే బండి బాటకూడా చాలా దూరం వరకు ఉంది. హిరా మన్ ఎప్పుడూ రైలు బండి ఎక్కలేదు. తనురైలు బండి ఎక్కాలని పాటలు పాడు కొంటూ జగన్నాథుని తీర్థస్థానానికి వెళ్ళాలని ఉన్న పాత కోరిక తిరిగి చిగురిం

చింది. వెనక్కి తిరిగి బండి గూడులోకి చూసేధైర్యం లేదు. వీపులో ఇప్పుడు చక్కిలిగింతగానే ఉంది. ఉండి ఉండి సంపంగి పుష్పాలవాసన వస్తోంది. ఏదేనా పాడాలన్నా ఒక పంక్తితోనే ఆగిపోతూంది...

వెనక్కితిరిగి చూశాడు. సంచులులేవు. వెదుర్లులేవు, పులిలేదు. అప్సరస... దేవి...మీత...హీరాదేవి... మహువా ఘటవారిన్ ఎవరూలేరు. గడచిన క్షణాల మూగ శబ్దాలు తనచుట్టూ ముద్దున్నాయి. హిరామన్ పెదవులు కదులుతున్నాయి. బహుశా తను మూడో ఒట్టు పెట్టుకుంటున్నాడు. కంపెనీ స్త్రీలను ఇక ముందు బండిలో ఎక్కించుకోకూడదని. హిరామన్ హఠాత్తుగా తన రెండు ఎడ్లను అదిలించాడు. కమ్చీతో కొడ్తూ "రైల్వే లైనువైపు ఎందుకలా తిరిగి తిరిగి చూస్తారు?" అన్నాడు. ఎడ్లను మందలిస్తూ. ఆ రెండు ఎడ్లు పరుగు మొదలుపెట్టాయి. హిరామన్ కూని రాగం తీస్తున్నాడు. "అ జీ హా...మారెగయే గుల్ఫామ్..."

# ఎర్ర పెదాల బేగం

"ఏమేవ్, బిర్జూ అమ్మా! ఆట చూడటానికి పోవా?"

బిర్జూఅమ్మ గెనుసు గడ్డలు వుడకబెట్టి ఇంటిముందు కూర్చుని లోలోపల బాధపడుతూ ఉంది. ఏడేళ్ళ కొడుకు బిర్జూ గెనుసుగడ్డల బదులు దెబ్బలుతిని ఇంటి ముందర మట్టిలో పొర్లాడుతున్నాడు. "చంపియా కూడా మాట వినటం లేదు. దానికి కూడా దయ్యం పట్టింది...బెల్లం తెచ్చే దానికి మధ్యాహ్నం అంగ డికి పోయినపిల్ల ఇంకా తిరిగి రాలేదు : దీపాలు పెట్టే వేళయింది. రానీ దాన్ని. మేక పిల్లకు వళ్లంతా పిడుదులు పట్టాయి. బాధకు తట్టుకోలేక అది ఎగురుతూ అరుస్తూ వుంది. బిర్జూ అమ్మ తనకోపాన్ని మేకపిల్లపైన చూపించాలని బయట కొచ్చింది. ఇంటి పెరట్లో పూలు పూసిన మిరపచెట్టు కాస్తా పాడైపోయింది... ఈ మేక పిల్ల తప్పఇంకే పశువు మిరపచెట్టును పాడుజేసి ఉండదు. మేకపిల్లను కొట్టాలని ఒక మట్టి పెళ్లను చేతిలోకి తీసుకుంటూ ఉండగానే పొరుగింటి 'మఖ్ని అత్త కేక వినబడింది- "ఏమేవ్- బిర్జూ అమ్మా! ఆట చూడటానికి పోవా?"

"బిర్జూ అమ్మకు ముందూ వెనుకా జంజాటంవుంది. తాడుబొంగరం లేనోళ్లకే ఆటచూసే అదృష్టం."

పక్కింటి అత్తకు ఈ మాట దెప్పిపొడుపుగా గుచ్చుకొంది. బిర్జూ అమ్మ చేతికి తీసుకున్న మట్టి పెళ్ళను పక్కన పారేసింది- "పాపం మేకపిల్లను పిడు దులు పీడిస్తున్నాయి. మే,మే, మేమే!"

బిర్జూ మట్టిలో పొర్లాడుతూనే మేకపిల్లపై కట్టె విసిరేశాడు. అదేకట్టె తీసుకొని బిర్జూను నాలుగు వాయించి వాడికి పట్టిన దయ్యాన్ని వదల గొట్టాలను కుంది. కానీ, వేపచెట్టు దగ్గర నీళ్ళు పట్టుకొనే ఆడవాళ్ళ నవ్వులు విని బిర్జూ అమ్మ ఆగిపోయింది. "ఉండు. మీ నాయన నిన్ను ఈ మాదిరి తీర్చిదిద్దాడు! ఎవరిపై నంటే వాళ్ళపైన కట్టెవిసురుతావా? ఉండు నీపని చెపుతా," అని అనింది.

మఖనీ అత్తవేపచెట్టు కాడ నడుంపై నుంచి కడవలు దింపి నీళ్ళు పట్టుకొనే ఆడవాళ్ళతో బిర్జూ అమ్మ అన్న మాటలను వల్లిస్తూ, "చూడండి, బిర్జూ అమ్మకు ఏమిపోయేకాలమొచ్చిందో! మీరైనా నాయంచెప్పండి! నాలుగు మణుగుల జన

పనార అమ్మిన పైసలు వచ్చాయి. విర్రవీగుతుంది. భూమిపై దీనికి కాలు నిల వటం లేదు. మీరే నాయం చెప్పండి. ఒక వారంరోజులు ముందు వీధి వీధి తిరు గుతూ ఆమె అందిరికీచెప్పుకుంది - ఈ సారి బిర్జూ నాయన ఎడ్లబండి మీద కూర్చోబెట్టుకొని బలరామ్‌పుర్‌లో జరిగే ఆటచూపిస్తాడని, కాడెద్దులు వుంటే ఎవ రైనా బండి అడిగితే ఇస్తారులే అని! ఆట చూసేదానికని ఊర్లోని ఆడవాళ్ళం దరూ తొందర తొందరగా అన్నాలు చేసుకొని తయారవుతున్నారు. నీవింకా తయారు కాలేదే, ఆట చూడను పోవా, అని అడిగాను అంతే నమ్మా. విన్నారా దీనికి బిర్జూ అమ్మా ఏమనిందో?"

మఖనీ అత్త తన బోసినోటి పెదాలను ఒకవైపు తిప్పుతూ దీర్ఘాలు తీస్తూ - "ముందూ వెనుకా జెంజాటం వుంది గదా. తాడూ బొంగరం లేనోళ్ళకే ఆట చూసే అదృష్టం" అంది.

'జంగీ కోడలికి' బిర్జూ అమ్మ అంటే భయంలేదు. "అత్తా, సర్వే సెటిల్ మెంటు చేసే దొర క్యాంపు వేసిన చోటికి నీవుకూడా చీటీ చీర కట్టుకొని పోయి లంచం ఇచ్చు కొని వుంటే నీపేరు మీద గూడా రెండు మూడు ఎకరాల భూమిరాసిచ్చే వాడు. అప్పుడు నీయింట్లో కూడా పది మణుగుల జనపనార డబ్బులు జమకూ డేవి. నీవు కూడ జోడెద్లను కొనగలిగే దానివి. అప్పుడు తాడు బొంగరంతో ఆడు కొనేదానివి." అని జంగీ కొడలు నోరారా అంది.

జంగీ కోడలు దాపరికం లేకుండా అన్నీ వదురుతుంది. రైల్వేస్టేషను కాడ పుట్టి పెరిగిన పిల్ల కదా! మూడెల్ల క్రిందటే 'కుర్మా' టోలీలోకి కొత్తకోడలై శోభ నాని కొచ్చింది. కుర్మాటోలీలో వున్న అగర గండపు అత్తలందరితో జగడాలేసు కుంది. దాని మామ జంగీ పేరుపడ్డదొంగ. దాని మొగుడు 'రంగీ' కుర్మాటోలిలో పేరు పడ్డగూండా. అందువల్లనే జంగీకోడలు "దారిని పోయే దొబ్బుల్లారా మాయింటి కాడికి రండి" అన్నట్లు అందరితో పోట్లాడుతూ ఉంటుంది.

జంగీకోడలు నోరారా అన్న మాటలు బిర్జూ అమ్మ ముంగిట్లో బాణాలు మాదిరి వచ్చి పడ్డాయి. బిర్జూ అమ్మ దెబ్బకు దెబ్బకొట్టాలని బయటకొచ్చింది. కానీ... మలంపైన రాయేస్తే అది పడేది మనపైనే గదా అనుకుని వూరుకుండి పోయింది.

నాలుక వరకు వచ్చినతిట్టును మింగేసి బిర్జూ అమ్మ, కూతురు కోసంకేకే సింది- "ఒసేయ్, చంపియా! రాయే ఇంటికి. నీనడుము లిరిచి పొయ్యిలో పెడ తాను. రోజురోజుకూ అతి అయిపోతున్నావు... ఊవురుకూడా అట్లే తయారయిం దిలే. థియేటరు, బయోస్కోపు పాటలు పాడే కోడళ్ళు దాపురించారు. ఈ పిల్ల

ఎక్కడో కూర్చుని ఎవరో పాట పాడుతూవుంటే పాట నేర్చుకుంటుందేమో- వాయించరా మురళీగోపాలా!" 'అంటూ ఒసేపిల్లా! ఎక్కడ సచ్చావే? అని కేకేసింది.

జంగీ కోడలు బిర్జూ అమ్మ కేకను విని, నీళ్ళ కడవను చంకను బెట్టుకొని కులుకుతూ, "పదక్కా పద, ఈ గల్లీలో ఒక బేగంగారున్నారు. రాత్రి ఎప్పడయిందో పగలెప్పుడయిందో తెలియకుండా ఎల్లప్పుడూ వాళ్ళింట్లో కరెంటు దీపాలు మిణుకు మిణుకు మని వెలుగుతూ ఉంటాయలే." అంది వెక్కిరించినట్టుగా.

మిణుకు మిణుకు కరెంటు దీపాల మాట వింటూనే అడ వాళ్ళందరూ ఎందుకో కిలకిలా నవ్వేశారు. బోసినోటి అవ్వఅంది, 'అది గయ్యాళి గంపలే,' అని.

ఎవరో కళ్లమీద టార్చిలైటు వేసినట్లు బిర్జూ అమ్మకు కళ్ళు భ్రమించాయి...మిణుకుమిణుకు మంటున్న కరెంటులైట్లు! మూడేళ్ళ క్రిందట సర్వే సెటిల్మెంట్ వాళ్ళక్యాంపు ముగిసిన తర్వాత వూరిలోని కుల్లుబోతు ఆడవాళ్లంతా కలిసి కథలల్లారు - "చంపియా అమ్మ ముంగింట్లో రాత్రంతా కరెంటు లైట్లు దేదీప్యమానంగా వెలుగుతాయి! చంపియా అమ్మ ముంగిట్లో టప్ టప్ మంటూ బూట్లశబ్దం విన్పిస్తుంది..."కుల్లు కొనే వాళ్లని కుళ్ళుకోనీ! చంపియా అమ్మ ముంగిట్లో వెండిపన్నెగల జనుమును చూసి కుళ్ళుకొనటమే గాక వాళ్ళ కళ్ళెంలో సోనాలి వడ్ల బస్తాలను చూసి వాళ్ళ కడుపులో చెప్పలేనంత మంటలు కూడా రేగుతాయి.

మట్టి కుండలో కారిపోతున్న తాజా బెల్లాన్ని వ్రేళ్ళతో నాక్కుంటూ వచ్చిన చంపియా అమ్మ చేత చెంపదెబ్బలుతిని, "నన్నేంటికి కొడ్తావు వూరికే! ఊ!ఊ!! ఆ కోమటామె తొందరగా సరుకులు ఇవ్వదు. ఊ!ఊ!!" అంటూ గట్టిగా ఏడ్చింది.

"ఆ కోమటామె తొందరగా సరుకు లియ్యకపోతే, అక్కడ్తే కూర్చుని ఏమిచేస్తా ఉన్నావే? దయ్యమా! ఆ కోమటి ఆమె అంగడేనా నీకు గురి. చెప్పు, ఇంతదాకా, ఎవరి దగ్గర కూర్చున్నావు. గొంతు మీదకాలేసి నులుముతా, ఇంకెప్పుడన్నా ఇలా చేశావంటే! స్టేషను కాడ వుండే ఆడవాళ్ళ దగ్గరికి పోతారి, దీనికేమిపుండు బుట్టిందో! పాటలు నేర్చుకోవాలట, పాటలు..."

బిర్జూ అమ్మ తనపిల్లను తిట్టిన తిట్లన్నీ జంగీగుడిసెవరకూ స్పష్టంగా వినపడివుంటాయి.

బిర్జూ, అమ్మ కొట్టిన దెబ్బలు మరిచిపోయి కొంత సేపటికి దుమ్ము దులుపుకుంటూ లేచి నిలబడి కుండలోంచి కారుతున్న బెల్లాన్ని ఆశతో చూడసాగాడు. అక్కతో పాటు తను కూడా అంగడికి వెళ్ళుంటే అక్క తనకు కూడా బెల్లం నాకిం

చేది. గెనుసు గడ్డల ఆశతో ఇంటి వద్దవుంటే అమ్మేమో గెనుసు గడ్డ బదులు దెబ్బలు...'ఓ అమ్మా! బెల్లం ఒక వేలితో నాకించవే. రవ్వయివ్వవే,' అంటూ బిర్జూ చెయ్యి చాపాడు.

"రవ్వే ఎందుకురా? అంతా తీసుకుందువులే. కుండను తీసుకుపోయి ఇంటి వెనకాలా పారేసి వస్తాను."అక్కడికి పోయి నాక్కో. తీపి రొట్టెను చెయ్యనుపో... ఎప్పుడైనా తీపి రొట్టె చేసుకుందామంటే వీళ్ళతో ఇదే పీడ అంటూ బిర్జూ అమ్మ వుడికించిన గెనుసు గడ్డలను చాటలో తీసుకొచ్చి ఏడుస్తున్న చంపియా ముందుంచుతూ, 'కూర్చుని తోలు తియ్యి, లేకపోతే నీతోలు వలుస్తా'...అంది.

గెనుసుగడ్డలతోలు వలిసేటప్పుడు ఏవో తప్పులు ఎంచుతూ పది మార్లన్న జుట్టు పట్టుకొని కుదిస్తాది. 'సిగ్గు లేకుండా ఇలా కాలు జాపి కూర్చున్నావేమిటే దొంగముండా!' అంటూ తిడుతుంది.

'అమ్మా! నేను కూడా కూర్చుని గెనుసుగడలు ఒలిచేదా' అమ్మను మభ్య పెట్టాలని, తన పబ్బం గడిపించు కోవాలని బిర్జూ ఆశతో అడిగాడు.

'వద్దుపోరా' అని మందలించింది. "ఒకటి వలుస్తావు మూడు కడుపులో వేసుకుంటావు. సిద్ధూ కోడలి దగ్గరికి పోయి మన బాండీ తీసుకురా. ఒక గంటకని తీసుకుపోయింది, తిరిగి ఇవ్వాలంటే దానికేమో తనగంటు పోయినట్టు ఉంటాది, పో, తొందరగా పోయి తీసుకురా' అని ఆదేశించింది.

నిరాశతో ఇంటి వాకిట్లోంచి బయటికి వెళ్తూ బిర్జూ గెనుసుగడ్డలూ, బెల్లం వైపు ఓరకంటితో చూశాడు. చంపియా విరబోసుకున్న వెంట్రుకలలోంచి అమ్మ వైపు చూసి ఆమెకు తెలియకుండా బిర్జూకు ఒక గెనుసు గడ్డ దాటేసింది. బిర్జూ దాన్ని తీసుకొని పరుగెత్తాడు.

సూర్యుడేమో కుంగి పోతున్నాడు. దీపాలు పెట్టేవేళయింది. ఇంతవరకూ బండి జాడలేదు...

"కొయరీటోలా లో ఎవరూ బండి ఇవ్వలేదంట అమ్మా. అన్ని పనులు ముగించుకొని తయారై ఉండమన్నాడు నాయన...బండికోసం మల్ దహియాటోలాలో వుండే మియా జాన్ దగ్గరికి వెళ్ళాడు." అని చంపియా అమ్మతో జెప్పింది.

ఇది వింటూనే బిర్జూ అమ్మదిగాలు పడింది. గుర్రం నుండి జీను జారిపడినట్లయింది. ఆమెస్థితి! కోయరీటోలాలో బండి దొరక లేదంటే ఇంక ఈ రోజు మీ నాయనకు బండిదొరికి నట్లే! మన వూరి వాళ్ళకే దయాదాక్షిణ్యాలు లేక పోతే మల్ దహియాటోలాలో వుండే మియాజాన్ బండి ఇస్తాడని ఏమి నమ్మకం. అత

నేమన్న మనకు అయినోడా పోయినాడా! గెనుసుగడ్డ ఒలచట మెందుకు? చాట తీసి అవతల పెట్టు...ఈ మగోడా, మనకు ఆట చూపించేది! ఎడ్లబండి మీద కూర్చొ బెట్టుకొని ఆట చూపించే దానికి తీసుకు పోతాడట. బండీ ఎక్కాను ఆటా చూశాను...నడిచిపోయినోళ్లే మో ఈపాటికి ఆడికి చేరుకొని వుంటారు.

బాండీ నేత్తిన బోర్లించుగొని తిరిగొస్తూ, 'అక్కా! చూడే నా మిల్టోర్ల టోపీ, దీనిపైన పది లాఠీ దెబ్బలు పడినా నాకేంకాదు.' అన్నాడు బిర్జూ.

చంపియా ఏం మాట్లాడకుండా గమ్మున కూర్చునుంది. కొంచెం కూడా నవ్వలేదు. అమ్మ కోపం ఇంకా తగ్గలేదని బిర్జూ అర్థం చేసుకున్నాడు.

రేపే పంచకౌడి కసాయివాడికి అమ్మేసి నీ పీడవిరుగుడు చేసుకుంటాను. అన్నింట్లో నోరుపెడతాది! నా పాలిట దయ్యం అని మేకపిల్లను తిడుతూ...చంపియా కట్టెయ్యి దీనిని. మెడకు కట్టిన గంట విప్పేసెయ్యి. పొదలస్తం గంట వాగుడు నాకు అదో మాదిరి వుంటాది అని మేక పిల్లను ఇంట్లోంచి బయటికి తరుముకుంటూ వచ్చింది బిర్జూ అమ్మ.

గంటవాగుడు మాట వింటూనే బిర్జూకి రోడ్డు వెంబడి వెళ్ళే ఎడ్లబండ్లు గుర్తుకొచ్చాయి. "ఇప్పుడిపుడే 'బబువాన్' టోలివాండ్ల బండ్లు బయలుదేరి వెళ్తున్నాయి - ఎడ్లమెడల్లో మోగుతున్న గంటల శబ్దం నీకు విన్పిస్తూందిగదూ... "

"నోరు మూసుకుని గమ్మునుండు" మేక మెడలోంచి గంట విప్పుతూ చంపియా అంది.

"ఓ చంపియా! పొయ్యి ఆర్పేసెయ్యి. మీ నాయనవస్తే విమానంలో ఎగిరి పోయి ఆట చూసిరమ్మను. నాకేమి ఆటచూడాలని లేదులే...నాకు తలనొప్పిగా వుంది. నేను పడుకుంటున్నాను. నన్ను ఎవరూ లేపొద్దు."

ఇంటి ముందు వసారాలో నిలబడి "ఏమే అక్కా, ఆటలో విమానాలు గూడా ఎగురుతాయా" అని బిర్జూ మెల్లగా అడిగాడు.

చాపపైన పడుకొని బొంతకప్పుకుంటూ, నాదగ్గరి కొచ్చికూర్చో. అమ్మతో తన్నులు తింటావులేక పోతే, అన్నట్లు చంపియా బిర్జూకి సైగ చేసింది.

బిర్జూ అక్క బొంతలో చేరి గుట్టుగా గుంత కూర్చున్నాడు. చలికాలంలో మోకాళ్ళపైన గడ్డ మానించుకొని గుంత కూర్చుంటే చలి బాధ తగ్గుతుంది. వాడు చంపియా చెవిదగ్గర "మనం ఆటచూడటానికి పోవటం లేదా? వూర్లో ఒక పిట్టకూడా లేదు. అందరూ వెళ్ళి పోయారు." అని అన్నాడు.

చంపియాకు ఆట చూసేదానికి పోతారనే ఆశ ఇసుమంతయినాలేదు. సంద

కాడ చుక్కకూడా కుంగి పోయింది. నాయనేమో బండితీసుకొని ఇంకా తిరిగి రాలేదు...అమ్మేమో నెలముందు నుంచే అంటూవుంది- "బలరామ్‌పూర్ లో ఆట జరిగేనాడు తీపిలడ్డూలు చేస్తానని, చంపియా చీట్ల చీరకట్టుకొని, బిర్జూ ఫ్యాంటు వేసుకొని ఎడ్లబండెక్కి..."

చంపియా చెమ్మగిల్లిన కళ్లనుంచి కన్నీటి చుక్కలు జారాయి.

బిర్జూకు కూడా బాధ కలిగింది. వాడు మనస్సులోనే చింత చెట్టుపై నుండే దేవునికి తాను నాటిన వంగచెట్టుకు కాసిన తొలివంకాయను సమర్పించు కొంటా నని మొక్కొన్నాడు...

'దేవుడా! తొందరగా మా నాయనను బండితోలుకుని వచ్చేట్లు చెయ్యి'అని వేడుకొన్నాడు.

గుడిసెలో చాపమీదపడుకొని బిర్జూ అమ్మ అటూ ఇటూ దొర్లుతూ వుంది...ముందుగానే ఏమేమో చేస్తామని ఎవరినీ ఆశ పెట్టగూడదు. భగవంతుని దయ మాపైనలేదు. భగవంతుడా! మా వల్ల పొరపాటేం జరిగింది? ఎందువల్ల మాకీపరిస్థితి దాపురించింది? తనకు తెలిసినంత వరకు తనేమో మొక్కుకున్న అన్ని మొక్కులు చెల్లిస్తూనే వుంది. ఏమొక్కుబడీ బాకీలేదు. సర్వేపార్టీ తనకు పొలాన్ని ఇవ్వాలని కోరుకున్న మొక్కుబడులన్ని ఆమె చెల్లించింది! మహావీర్ మహరాజుకు చెల్లించాల్సిన మొక్కుబడి ఒక్కటీ మిగిలిపోయింది...తప్పు మన్నిం చుమహావీర్ బాబు! నీకు రెండింతలు మొక్కుబడి చెల్లిస్తాను.

బిర్జూ అమ్మకు మాటి మాటికి జంగీ అన్న మాటలు ఈ టెల్లాగా గుచ్చుకుం టున్నాయి. "మిణుకు మిణుకు కరెంటు దీపాలు" దోపిడి, దొంగతనం చేసేవాని కోడలికి కడుపులో మంటెందుకో! బిర్జూ నాయన ఐదెకరాల పొలం ఏమని సంపా యించాడో గాని వూరిలోని అయినోళ్ళ-పోయినోళ్ళ కండ్లు కుట్టాయి. పొలంలో జనుంపైరు పెట్టుకుంటే వూళ్ళోళ్ళవాళ్ళ గుండెల్లో అగ్గి నింపుకున్నారు. జనుం బాగా పెరిగింది. వైశాఖమాసంలోని మేఘాల మాదిరిగా జనపనార మొక్కలు పైకెగుస్తున్నాయి. వూళ్లోవాళ్ల దిష్టి పొలానికి తగిలింది. ఇంత మంది దిష్టి పొలం ఎట్లా భరిస్తాది? పద్నాలుగు మణుగుల జనుంవస్తాదను కుంటే పదిమణుగులే జనుంతూగింది- 'రబ్బీ భగత్' దుకాణం కాంటాలో.

ఇంత దానికి వూళ్ళో వాళ్ళకి కడుపు మంట ఎందుకో? బిర్జూ నాన్న మొద ట్లోనే కుర్మీటోలిలోని ప్రతి ఒక్కరికి నచ్చజెప్పాడు గదా- "జీవిత మంతా కూలీ జేసుకుంటూ బతకటం ఒక బతుకేనా? సర్వే పార్టీ వస్తుంది. మీరు కూడా కిందా

మీదా పది రెండు, మూడెకరాలు సంపాదించుకోంది. కాని సర్వేపార్టీ వచ్చిన సమయానికి ఎవరైనా వాళ్ల వద్దకు పోతే గదా...బిర్జూ నాయన ఈ భూమి సంపాదించటానికి ఎంత కష్టపడ్డాడో. సర్వే పార్టీ అధికారి ఎన్ని తిప్పలు పెట్టాడో! ఆ అధికారి పెద్దకొడుకేమో ససేమిరా అన్నాడు. ఆఖరికి అధికారి చిన్నకొడుకు దయతలిచి ఈ భూమివాళ్ళకు ఇప్పించగలిగాడు."

"చంపియా! బిర్జూ నిద్రపోయాడా! రా బిర్జూ లోపలికిరా. నీవు కూడా రా చంపియా, రానీ ఆపెద్ద మనిషిని ఈ రోజు" అని పిలిచింది బిర్జూ అమ్మ.

బిర్జూతో పాటు చంపియా లోనికెళ్లింది.

"బుడ్డీ ఆర్పేసెయ్యి...మీ నాయన పిలిస్తే ఎవరూ పలుకొద్దు. తడికమూసేయి."

ఇతనూ ఒక పెద్ద మనిషేనా! ఈ మొనగాడి ముఖం చూడు...బిర్జూ అమ్మ పగలూరాత్రి సలపోరింది కాబట్టి ఈ పొలం దొరికింది. లేకపోతే దొరికేదేనా? రోజూ తలపట్టు కొని కూర్చుని, మనకు పొలమూ గిలమూ వద్దులే, కూలీనాలీ చేసుకొని బతుకుదాములే అని బిర్జూ అమ్మతో అనేవాడు. "బాగా ఆలోచించుకొని మాట్లాడు. పొలం సంపాదించాలని కోరికలేకపోతే సరే నీ ఇష్టం, పెండ్లాం, బిడ్డా, పాప, పొలం ఉన్న వాళ్లదే అసలైన బతుకు, అని అంటారుగదా" బిర్జూ అమ్మ అనేది.

బిర్జూ నాన్నకు తొందరగా కోపమొచ్చేది. ఒక సారి కోపమొచ్చిందంటే ఆగేది కాదు...ఎవరి నంటే ఏమి లాభంలే! బిర్జూ అమ్మ అదృష్టం ఇలాకాలింది! పనికి మాలిన భర్త తనకు దొరికాడు. ఆమె ఏకోరికలు తీర్చాడని ఈ మొగుడు? గానుగెద్దు మాదిరి ఈ ఇంట్లో తెల్లారు తుంది ఆమె బతుకు. ఎప్పుడైనా ఒక పైసా జిలేబి కొని ఇచ్చాడా? ఈ పెనిమిటి ఆమెకు...జనపనార అమ్మి భగత్ వచ్చిన డబ్బుతీసుకొని అక్కడి నుంచే వెళ్ళి ఎద్లు కొనుక్కొచ్చాడు...ఆరోజు నుంచే అందరి నోళ్లల్లో ఒకటేమాట- "బిర్జూ అమ్మ ఈ సారి ఎడ్ల బండి మీద కూర్చుని పోయి ఆట చూస్తుంది" నాబ్రతుకు ఆట చూసినట్లే వుంది. ఎవరి దోబండి తోలుకొస్తాడూ! నాకు ఆటా చూపిస్తాడు!

బిర్జూ అమ్మకు తనపైన కోపమొచ్చింది. తనుగూడా తక్కువది కాదుగదా. ఏ పూట ఎడ్లబండి ఎక్కి ఆట చూసేదానికి పోవాలని కోరుకుందో కాని, ఈ వేళ పొద్దున్నుంచి మధ్యాహ్నం వరకూ ఏదో సాకు కల్పించుకొని మేము ఎడ్ల బండెక్కి ఆట చూసేదానికి పోతున్నామని ఇరవయి సార్లయినా ఇరుగు పొరుగు వారితో

అని ఉంటుంది. ఏమి నోరోపాడు నోరు...చూడు బాగా చూడు ఆట...అబ్బా! ఏమి ఆటలే! బొంతకింద పండుకొని పట్టెపాన్పుపైన కలలు కన్నట్లుంది నాబతుకు! రేప్రొద్దన్నే నీళ్లు పట్టుకొనే దానికి బాయి దగ్గరికి పోతే ఆ రెండు నాల్కల పతురియా మొదలుకొని అమ్మలక్కలందరూ నవ్వులాట జేస్తారు...అందరికీ తనంటే ఈర్ష్యే. ఆ 'గడ్డపది' వుంది చూడు. ఇద్దరి బిడ్డల తల్లి అయినప్పటికీ దాని సోకు గీకు తగ్గలేదు. దాని భర్త అది చెప్పినట్లు వింటాడు. అది తలకు కొబ్బరి నూనే రాసుకుంటుంది. దానికి సొంత పొలముంది.. ఈ వూర్లో ఇంకెవరి కయినా పొలం వుందా ఇంత? మూడెకరాల్లో వరిపైరు పెట్టుకున్నాం అని అందరికీ కడుపులో మంట. మాపైరుకు అందరూ దిష్టి పెడతారు.

బయట ఎడ్ల, గంటల శబ్దం వినపడింది. ముగ్గురూ ఉలిక్కిపడ్డారు. చెవులు నిక్కబెట్టి గంటల శబ్దం వింటున్నారు.

"ఏమే చంపియా, ఆ గంటల శబ్దం మన ఎడ్లదేనా!"

"అవునవును." చంపియా, బిర్జూ ఒకే సారన్నారు.

"గప్‌చిప్‌గా ఉండండి. బండి గూడా ఉన్నట్లుంది రోయ్. బండి శబ్దం వస్తుంది గదూ!" బిర్జూ అమ్మ గుసగుస లాడింది.

చంపియా పిల్లిమాదిరి నెమ్మదిగా తడిక వద్దకు పోయి సందులోంచి తొంగి జూసి వచ్చి, "అవునమ్మో బండిగూడా వుంది," అంది.

చంపియా బొంతలో దూరుకున్నది.

బయట బండి నుంచి ఎడ్లను విప్పేశబ్దమయింది. ఆ...వచ్చేసాము. ఇంటికి తిరిగి రావాలంటే తగని ఉత్సాహం వీటికి. అంటూ ఎడ్లను బిర్జూ నాయన మంద లించాడు.

తడబడుతున్న అతని మాటలు విన్న బిర్జూఅమ్మకు మల్‌దహియాటోలిలో గంజాయి తాగొచ్చాడని అర్థమయిపోయింది.

ఓ చంపియా, ఎడ్లకు గడ్డెయ్యి. అంటూ బయటి నుంచే నాన్న అన్నాడు.

"లోపలి నుంచి ఎవరూ పలుకలేదు," చంపియా నాన్న లోపలి కొచ్చి చూస్తే అక్కడ వెలుతురు లేదు. దీపం లేదు. పొయ్యిలో అగ్గి కూడా కన్పించలేదు...ఇదే మిటబ్బా! ఆట చూడాలని ఉబలాటపడి, నడుచుకుంటూ వెళ్ళి పోయారేమిటి?

బిర్జూ గొంతులో దగ్గు పొడుచుకొస్తూంది. దగ్గు నాపుకోవాలని ఎంతో ప్రయ త్నించాడు. కానీ ఏమి లాభం మొదలైన దగ్గు ఐదు నిముషాల వరకూ ఆగనే లేదు.

"బిర్జూ! నాన్న బిరజూమోహన్, అమ్మకోపగించుకొని నిద్రపోయిందా?...ఇప్పుడిప్పుడే గదా ఆట చూసేదానికి అందరూ బయలుదేరి పోతున్నారు," బిర్జూ నాన్న బుజ్జగిస్తూ అన్నాడు.

'ఆటా-గీటా మాకేం చూడాలని లేదు. బండి వాళ్ళకు వాపసిచ్చిరా' అని నిక్కచ్చిగా చెప్పాలను కుంది బిర్జూ అమ్మ.

చంపియా, లే అమ్మా ఈ అయిదు వరివెన్నులు తీసిపెట్టు అంటూ నాన్న మిగతా వరి వెన్నులను వసారా లో దించి, దీపం వెలిగించమన్నాడు.

"అర్ధరాత్రి వేళ బండితోలుకొని వచ్చావు. ఈ పాటికి ఆట అంతా అయిపోయివుంటుంది," వసారాలోకి వస్తూ బిర్జూ అమ్మ అన్నది.

బుడ్డి వెలుగులో వరి వెన్నుల రంగు చూడగానే బిర్జూ అమ్మ మనసులోని కోపం పారిపోయింది. వడ్లగింజల రంగు రోమ రోమానికి వ్యాపించి ఆ సంరంతో ఆమె మనసు ఊగిసలాడింది.

"ఇప్పుడే ఆట మొదలు కాలేదు. ఇప్పపుడిప్పుడే బలరామ్‌పూర్ బాబుగారి కంపెనీ బండి మోహన్ హోటలు బంగ్లా నుండి హాకింసాబ్ గారిని తీసుకొచ్చేదానికి పోయింది. ఈ సంవత్సరానికి ఇది ఆఖరి ఆట...మన పొలంలో పండిన ఈ ఐదు వరి వెన్నులు తీసుకొని ఇంటిచూరులో గుచ్చు."

"మన పొలం లోనివా? బాగాగింజ కట్టిందా? సంతోషంతో బిర్జూ అమ్మ అడిగింది."

"అవును పదిరోజుల్లో అంగారక నక్షత్రం మొదలవుతుంది. అప్పటికి పంటంతా కోతకొస్తుంది... మల్‌దహియాటోలిపోతూ దారిలో మన పొలంలో పండిన వరి జూసి చెప్పలేనంత ఆనందం కలిగింది. ఈ ఐదు వరివెన్నులు తుంచేటపుడు కూడా నా వ్రేళ్ళు వణికాయి."

బిర్జూ వెన్ను నుండి వడ్లగింజ ఒకటి తీసుకొని నోట్లో వేసుకున్నాడు. "ఏం పాడు పిల్లోడురా వీడు. ఏమి మట్టూమర్యాదా లేకుండా పోతుంది వీడికి," అంటూ వాళ్లమ్మ గదమాయించింది.

"ఏమయింది? దేనికి వాడిని ఆమాదిరి గదమాయిస్తావు?"

"పొలంలో పండిన ఈ తొలివరి కంకుల్ని ఎంగిలి చేశాడు."

"సరేలే, పిల్లవాడు గదా! వీళ్ళు ఏమి జేసినా తప్పులేదులే."

చంపియా గూడా వరి వెన్ను లోంచి రెండు వడ్లగింజలను నోట్లో వేసుకొని నములుతూ, "ఓ అమ్మా ఎంత తీయగా ఉన్నాయే ఈ వడ్లగింజలు అన్నది."

"తీపేగారు భలే మంచి వాసన గూడా వుందికదా అక్కా" అంటూ బిర్జూ మరలా వడ్ల గింజలు నోట్లో వేసుకున్నాడు.

"రొట్టె-గిట్టె రడీగా ఉన్నాయిగదా," బిర్జూ నాన్న నవ్వుతూ అడిగాడు.

"లేదు పో...నీవు వచ్చేది లేనిది తెలియక పోయే! ఆట చూపుతావోలేదో అనీ తెలియక పోయే! రొట్టెలు తయారు చేస్తే గదా, రడీగా ఉండేది" కోపగించు కొన్నట్లు బిర్జూ అమ్మ అంది.

"ఆహా, అబ్బా. ఏం మనుషులు మీరు. ఎద్లున్నవాడు బండి అడిగితే ఎందుకు దొరకదు? బండివున్న వాళ్ళకు కూడా ఎద్లు వున్నవాళ్ళతోపని పడుతుంది గదా. కానీ తొందరగారొట్టెలు తయారు చెయ్యి."

"ఆలస్యం కాదా."

"తట్టెడు రొట్టెలు క్షణంలో చేసేనీకు ఐదు రొట్టెలు చెయ్యటానికి ఎంతటైం పడ్తుంది."

బిర్జూ అమ్మ పెదవులపైన నవ్వు తాండ వించసాగింది. ఓరచూపుతో అటు చూస్తే బిర్జూ నాన్న తనను కన్నార్పకుండా చూస్తున్నాడు. చంపియా, బిర్జూ అక్కడ లేకుంటే మనసులోని మాటలు వాళ్ళు విప్పిచెప్పుకొనేవారు. చంపి యా, బిర్జూ ఒకరి నొకరు చూసుకొని ఎంతో సంతోషపడ్డారు.

"అమ్మవూరకే కోప్పడింది గదూ!"

చంపి, పిట్టగోడమీదకెక్కి మఖనీ అత్తను పిలువు.

"ఓ అత్తా. ఓ మాట. అమ్మపిలుస్తూంది."

అత్త బదులు చెప్పకుండా గొణిగింది. "ఇప్పుడు అత్త జ్ఞాపక మొచ్చిందా! ఈ మొత్తం టోలీలో ఈ అత్త ఒకటేగదా తాడూ బొంగరం లేనిది."

"ఓ అత్తా నామాటకు కోపగించు కొన్నావా? తాడు బొంగరం వుండే వాళ్ళ వద్ద కొచ్చిచూడు. అర్ధరాత్రప్పుడు బండి తెచ్చాడు. రా అత్తా. తీపిరొట్టె చేసేది నాకు చేతగాదు," బిర్జూ అమ్మ నవ్వుతూ ఆమెను రమ్మనింది.

"నేను పొద్దుండగానే అడిగింది అందుకే- 'ఆటచూడటానికి పోవా!' అని. అప్పుడే ఆమాట చెప్పివుంటే నాకుంపటి ఇక్కడ్నే అంటించేదానిని గదా" దగ్గుతూ వచ్చి అన్నది అత్త.

ఇంట్లోగింజలు ఏమి లేవు. ఒక సాకుడు మేకపిల్లవుంది. నాలుగైదు బోలెబో కెలు న్నాయి. నీకు రాత్రికి సరిపోయేటంత పొగాకు ఇక్కడే వుంచి పోతాను. నీహుక్కా తెచ్చుకొన్నావుగదా, అంటూ అత్తకు బిర్జూ అమ్మకుంపటి చూపింది.

అత్తకు పొగాకు దొరికితేచాలు ఒకరాత్రేమిటి. ఐదురాత్రుళ్ళయినా మేల్కొని వుంటుంది. మబ్బులోనే తడిమి పొగాకు ఎంత ఉండేది తెలుసుకుంది... ఓహో, పొగాకు సుమారు గానే పెట్టిందే. ఆషావుకారి భార్యవుంది. దేనికి? ఆ రాత్రి నల్ల మందు మాత్రంత పొగాకు బెట్టి 'గులాబ్‌బాగ్' తిరనాళ్లచూసే దానికి పోయింది. డబ్బా నిండుకు పొగాకు పెట్టినా అంది, ఆగబ్బుముండ.

బిర్జూ అమ్మ పొయ్యి అంటించింది. చంపియా గెనుసు గడ్డలను నలిపి వుండలు చేసింది. బిర్జూ తలపై బాండీ బోర్లించుకొని- 'చూడు నాన్నా! నా మిల్ట్రీర్ల టోపి! దీనిపైన పదిలాఠీ దెబ్బలు పడినా ఏంకాదు' అన్నాడు.

అందరూ ఫక్కున నవ్వారు.

"అటకపైన రెండు మూడు పెద్దగెనుసుగడ్డలున్నాయి. చంపియా, బిర్జూకు ఇవ్వు. పాపం సాయంత్రం నుంచి వాడు..." నవ్వుతూనే అమ్మ అంది.

"పాపం అనగాకు అమ్మా! చాలాపుణ్యంచేశాడు!" అంటూ చంపియా కిలా కిలా నవ్వింది.

"నీకేం తెల్సులేవే! బొంత క్రింద దిగాలుగా పండుకొని ఏమేమో అంటున్నా డుగదా."

"హి,హి."

వూడిపోయినపండ్ల సందుల్లోంచి, "ఆహా ఎవరికీ తెలియకుండా నేను ఐదు గెనుసు గడ్డలు తిన్నాలే" అన్నాడు.

మళ్ళీ అందరూ ఫక్కున నవ్వారు. బిర్జూ అమ్మ అత్తతో ఆమెను కాస్త సంతోషపెట్టాలని- "ఒక శేరు బెల్లం ఇది. అంతా వెయ్యమంటావా?" అని అడిగింది.

"నీ ఇల్లు బంగారం గాని! గెనుసుగడ్డ అసలే తీపిగదా, అంత బెల్లమేస్తే ఎట్లా?" మురిసిపోతూ అత్త అన్నది.

ఎడ్లు రెండూ దానా, గడ్డి నిమ్మళంగా తిని ఒక దాన్నొకటి నాలుకతో నాక్కోవటం మొదలు పెట్టేప్పటికి బిర్జూ అమ్మ తయారయింది. చంపియా చీట్ల చీర కట్టుకొంది. బిర్జూ గుండీలు లేని కారణంగా ఫ్యాంటుపైన జనపనార తాడు కట్టుకొన్నాడు.

బిర్జూ అమ్మ ఇంటి ముంగిట్లోకి వచ్చి వూరివైపుచూస్తూ "ఈపాటికి కాలిన డకనవెళ్లే వాళ్ళందరూ వెళ్ళి పోయుంటారు." అంది.

పౌర్ణమినాటి చంద్రుడు తలపైకొచ్చాడు. బిర్జూ అమ్మ అసలైన వెండితో

చేసిన పాపిట బిళ్ళ ఈ వేళ తొలిసారిగా ధరించింది. బిర్జూ నాయనకు ఏమ యిందో బండిని తోలటంలేదు. భార్యవైపే కన్నార్పకుండా చూస్తున్నాడు. ఆ విడే ఆటలో డ్యాన్సు చేసే బేగం అయినట్లు.

బండిలో కూర్చుంటునే బిర్జూ అమ్మ వళ్ళు పులకరించింది.

"బండిలో చాలా చోటుంది కొంచెం కుడివైపు గళ్ళినుండి బండి తోలు కుపో" అంది.

ఎడ్లు పరుగెట్టసాగాయి. బండి చక్రాలు దడాదడా శబ్దంచేస్తూ బండిసాగి పోతుంటే "విమానం మాదిరి మనబండిని ఎగరేసుకుని పోవాలి నాన్నా!" అన్నాడు బిర్జూ ఆనందం పట్టలేక.

బండి జంగీ ఇంటి వెనుకకు వచ్చింది.

"జంగీని కనుక్కోండి అతని కోడలు ఆట చూసేదానికి పోయిందేమో!" అంది బిర్జూ అమ్మ.

బండి ఆగుతూనే జంగీ గుడిసెనుంచి ఎవరో ఏడుస్తున్నశబ్దం స్పష్టంగా వినపడింది, "అరే జంగీ భాయీ, ఏమిటి కథ? ఎవరేడుస్తున్నారు మీ ఇంటి ముందు?" అడిగాడు బిర్జూ నాన్న.

జంగీ చలికాచుకుంటూ, "ఏమని చెప్పేది? రంగీ ఏమో బలరామ్‌పూర్ నుంచి ఇంకా తిరిగి రాలేదాయె, కోడలు ఆట చూడ్నుపోవాలంటూంది. ఏమి జేయాలి? వాడు వస్తాడని ఇంతవరకూ చూస్తూ వుండి పోయింది. వూళ్ళోని ఆడ వాళ్లందరూ వెళ్ళిపోయారు" అని జవాబిచ్చాడు.

"ఊరుకో! ఏడ్చేదెందుకే? నీవు టౌను దానివిగదా! రా...రా...తొందరగా చీర కట్టుకొనిరా. బండి అంతాఖాళీగావుంది... పాపం పిల్లది. తొందరగారా" అంటూ బిర్జూ అమ్మపిల్చింది.

"చిన్నమ్మా బండ్లో జాగా వుందా, నేనూ వస్తాను" పక్కగుడిసెలోని రాధే కూతురు 'సునరీ' అడిగింది.

ఎదురు పొదలకు అటువైపు 'లరేనాఖవాస్' ఇల్లుంది. అతని కోడలు కూడా పోలేదు. గిల్టుజుముకీలు, కడియాలు ధరించి ఘల్లుఘల్లు మంటూ వస్తుంది.

"రాండి. ఎవరెవరు వున్నారో వాళ్ళంతా రాండి తొందరగా."

జంగీకోడలు. లరేనా భార్య, రాధేకూతురు సునరీ ముగ్గురూ బండిదగ్గరికొచ్చారు.

ఎద్దువెనుక కాలు జాడించింది. "ఏమే నీకు పొగరు? కాలుతో తన్ని కోడ

ళ్ళను కుంటివాళ్ళను చేయాలని వుందా" అని బిర్జూ నాన్న ఎద్దును తిట్టాడు.

అందరూ పెద్దగా నవ్వారు. బిర్జూ నాన్న ముసుగులో తలవంచుకుని వున్న ఇద్దరు కోడల్లను చూశాడు. అతనికి తన పొలంలో వంగిన వరి వెన్నులు గుర్తుకొచ్చాయి.

జంగీ కోడలుకు మూళ్ళెల్లక్రిందటే శోభనమయింది... శోభనపు రాత్రి కట్టిన చీరే ఇప్పుడు కట్టుకొని వచ్చింది. ఆ చీరెనుంచి. ఆవనూనె, కుంకుమ వాసన వస్తూంది. బిర్జూ అమ్మకు తన శోభనపు రాత్రి గుర్తు కొచ్చింది. ఆమె మూట లోంచి మూడు రొట్టెలు తీసి ఇస్తూ ముగ్గురూ తినండి ఒక టొకటి. ముందుంటే గవర్నమెంటోల్ల బావి దగ్గర నీల్లు తాగుదురు గానీ! అంది.

బండివూరిని వదిలి ఇప్పుడు వరి పొలాల పక్కనుండి వెళ్తూంది.

కార్తీక మాసపు వెన్నెల. పొలాల్లోంచి వరి వెన్నుల వాసన వస్తూంది. పక్క నున్న వెదురు పొదల్లో - తీగ పూలు పూసినట్లుంది. జంగీ కోడలు బీడీ కాల్చి బిర్జూ అమ్మకు ఇచ్చింది. చంపియా, సునరీ, లరేనా భార్య, జంగీ కోడలు - వీళ్లు నలుగురూ వూళ్ళో గ్రామఫోను పాటలు పాడతారు - అనే విషయం బిర్జూ అమ్మకు గుర్తుకొచ్చింది.

బండిపొలాల మధ్యలోంచి పోతూవుంది... నాలుగు వైపులనుండి శోభనపు రాత్రి కొత్త చీర శబ్దం చేసినట్లు శబ్దమొస్తూంది. బిర్జూ అమ్మపాపిట బిళ్ళపై వెన్నెల పడి మెరుస్తూంది.

"సరే. ఒక గ్రామఫోను పాట పాడు చంపియా...సిగ్గుదేనికే, పాడు. ఒక వేళ నీకు మధ్యమధ్యలో గుర్తురాక పోతే నీప్రక్కనే నీ టీచరుంది గదా చెప్తుందిలే" అంది బిర్జూ అమ్మ.

ఇద్దరు కోడళ్లుకిమ్మనకుండా వుంటే చంపియా, సునరీ ఇద్దరూ గొంతు సరి చేసుకుంటున్నారు.

బిర్జూ నాన్న ఎడ్లను అదిలిస్తూ తోలుతున్నాడు "పాడు, పాడమ్మా పాడు, జోరుగా పాడండి! పాడే చంపియా! పాడకపోతే ఎడ్లను కాస్త నెమ్మదిగా పొమ్మంటాను."

జంగీ కోడలు చంపియా చెవివద్ద తన ముసుగుంచి ఆపిల్ల చెవిలో ఏమో చెప్పింది. "వెన్నెల్లో చల్లని వెన్నెల్లో" అంటూ చంపియా నెమ్మదిగా మొదలు పెట్టింది.

బిర్జూను వడిలో పడుకోబెట్టుకున్న అమ్మకు కూడా గొంతు కలపాలన్పిం

చింది.

బిర్జూ అమ్మ జంగీ కోడలివైపు చూడగా ఆమెకూడా మెల్లమెల్లగా లోలోపల పాడుతున్నట్లు అనిపించింది. ఎంత అందంగా వుందో ఈ కోడలు పిల్ల! ఇది కట్టు కున్నశోభనపు రాత్రి చీరనుండి ఒకవిధమైన వాసనవస్తుంది. ఈ పిల్లది చెప్పిం దాంట్లో తప్పేముంది. బిర్జూ అమ్మ బేగం ఆటలో డ్యాన్సు చేసే బేగం. ఇదేం చెడ్డమాట కాదుగాదా! ఆ బేగం కంటే అందంలో తనేమి తీసిపోదుగదా!

బిర్జూ అమ్మ రెండు కండ్ల చూపులను తన ముక్కుపై కేంద్రీకరింపజేసి తన సౌందర్యాన్ని చూసుకోసాగింది. ఎర్రటి చీర, చీరకున్న జరీ అంచు, పాపిట బిళ్ళపైన చంద్రుడు, సంతోషంతో బిర్జూ అమ్మ తబ్బిబ్బై పోయింది. తనకు ఇక మరేమి కోరికలేదు. తనకు నిద్రవస్తూంది.

(1957)

# నేపథ్యంలోని నటుడు

ఇంతకు ముందు ఎన్నోమార్లు అతనిని నేను చూశాను కానీ ఆరోజు అతనిని చూసి కలవర పడి పోయాను. ఆశ్చర్య చకితుడనయ్యాను. అదనుగాని సమయంలో కాసిన పండో, పూసినపువ్వునో చూసినట్లు అన్పించింది. శ్రావణ భాద్రపద మాసాల్లో నిరంతరం వర్షం కురుస్తున్న ఈ చిత్తడి రోజుల్లో ఎక్కడినుంచి ఊడిపడ్డాడో, ఏమో?

నేనే కాదు, అతన్ని చూచిన ప్రతి ఒక్కరూ ఆశ్చర్య చకితులవుతున్నారు. కొంత మందైతే అతని టేబుల్ వద్దకు వెళ్లి ఏమో అడుగుతున్నారు. దానికి అతను మామూలుగా క్లుప్తంగా జవాబిస్తున్నాడు. 'ఫార్‌బిస్‌గంజ్' లోని ఈ చిన్నటీ కొట్టులో ఒక చెయ్యివిరిగినకుర్చీలో కూర్చున్న అతన్ని చూసి అందరూ ఆశ్చర్య చకితులవ్వటం నేను గమనిస్తున్నాను. ఎందుకో?

నేను కారణాన్ని వెతుక్కుంటూ ఆలోచించసాగాను - దాదాపు ముప్పయి ఏండ్ల క్రితం నేను మొట్టమొదటిగా ఈ వ్యక్తిని చూశాను - బహుశ అది 1929వ సంవత్సరం కావచ్చు. అదే సంవత్సరం ప్రప్రథమంగా 'గులాబ్‌బాగ్' ఉత్సవంలో చాలా క్రిందగా పోతున్న విమానాన్ని చూశాను. అందువల్లనే ఆ సంవత్సరం నాకిప్పటికీ గుర్తు. 1929 సంవత్సరం అంటే అప్పుడు నావయస్సు ఎనిమిది. తొమ్మిది సంవత్సరాలుంటుంది. ఆ సంవత్సరమే కలకత్తా నుండి పేరు పొందిన నాటక కంపెనీ గులాబ్ బాగ్ ఉత్సవానికి వచ్చింది. ఎక్కడ జూసినా జనమే - ఇసుకవేస్తే రాలనంత జనం! రంగస్థలం పైనే రైలుబండి వస్తూ పోతూవుంది. ఇంజను పొగవదులుతూ, విజిలేస్తూ నడుస్తుంది. రంగురంగుల కాంతుల్లో దేవకన్యలు నాట్యం చేశాయి...ఆహా!

జీవితంలో మొట్టమొదటసారి నాటకం జూసి ఎంత ఉత్తేజితుడైనానో - ఈ రోజుకూడా నాకాదృశ్యం కళ్లకు కట్టినట్టుంది. ఎంత అద్భుతం! ఎంత ఆశ్చర్యం!

స్కూలు తెరచిన తర్వాత నాతో పాటు చదువుకొనే 'బకుల్‌బెనర్జీ' తన మాటలతో నన్ను కించపరిచాడు. అతను కూడా 8-9 సంవత్సరాల వయసువాడు. కానీ చాలా చలాకీగా వుంటాడు. జన్మతః 'ఆర్ట్‌క్రిటిక్' గా ఉండేవాడు. అతనేమ

న్నాడంటే - 'పోయిన సంవత్సరం 'నాగేశర్‌బాగ్' తిరనాళ్ళకి వచ్చిన అసలైన నాటక కంపెనీ నుంచి వెళ్ల గొట్టబడిన వాళ్ళే ఈ నకిలీ కంపెనీలోకి వచ్చి చేరారు' అని! నేను చిన్నబుచ్చుకోవటం చూసి బకుల్ మళ్లా అందుకున్నాడు - "అయినా, ఈ కంపెనీలో ప్రత్యేకత ఉందిలే! ఈ కంపెనీ నాటకంలో రైల్వే పోర్టరుగా నటించినవాడు 'నాగేశర్‌బాగ్' తిరనాళ్ళకి వచ్చినకంపెనీలో గూడా ఇదే పాత్ర ధరించాడు. అంటే వెయిటింగ్ రూమ్ లో నిద్రపోతున్న అబ్బాయిని కత్తితో పొడుస్తాడు. ఇతన్ని నకిలి అనలేము!"

ఇప్పటికీ ఆనాటిమాటలు నాకు గుర్తున్నాయి - గులాబ్‌బాగ్ తిరనాళ, పంజాబ్‌మెయిల్ లోని రైల్వేపోర్టరు - హత్య - బకుల్‌మాటలన్నీ.

నాలుగైదు సంవత్సరాల తర్వాత 'సింహేశ్వర్' తిరనాళకి వచ్చిన 'ఉమాకాంత్ ఝూ' కంపెనీలో మరలా ఈ వ్యక్తిని చూడగలిగాను. 'బిల్వమంగళ' నాటకంలో చింతాబాయి బృందంలో బోథియా బాబా గారి వేషంలో - 'కాయాకా పింజరా డోలేరే, సాంస్‌కా పంచీ బొలే (శరీర పంజరంలో ఊగిసలాడెలే ఊపిరి పక్షి) అంటూ! చాలా మధురంగా పాడాడు. గులాబ్ బాగ్ తిరనాళలో ప్రదర్శించిన నాటకంలోని అమ్మాయిని హత్య చేసినవాడు, హంతకుని పాత్ర ధరించినవాడు, కాషాయ వస్త్రాలతో బాబాగా దర్శనమిచ్చాడు. కానీ అతను తనమాటల సరళిని చాలా సేపు దాచుకోలేక పోయాడు - అతని మాటలను బట్టి నేను అతన్ని కనుక్కోగలిగాను. ఫారిసీ నాటక కంపెనీలోని ఒక దృశ్యంలో కవిత్వం పాడుతున్నప్పుడు - మృదంగం "దిత్తె, అంటూంటే అందెలు ఎవరికి ఎవరికి?" అని మ్రోగుతుండగా అప్పుడు వేశ్య నాట్యం చేస్తూ, 'ఇతనికి ఇతనికి' అంటూ ఉంటే అప్పుడు నిస్సందేహంగా అతనే ఇతనని తెలిసిపోయింది... ఈ బాబా గారిని గుర్తుపట్టాను. గులాబ్ తిరునాళ్లలోని కంపెనీ నాటకంలో, వెయిటింగు రూంలో నిద్రపోతున్న అబ్బాయిని కత్తితో పొడుస్తున్నప్పుడు తన చెయ్యివణకటం చూసి పిచ్చి వాని మాదిరి గొణిగాడు - "ఏమిటి నాచేతులిలా వణుకుతున్నాయి? ఈ చేతులు యజమాని ఆజ్ఞ ప్రకారమే పని చేయాలిగదా! వణకకే నాకత్తీ! సమయాన్ని వృథా చేయకు. ఎవర్ని చంపాల్నో వాడు దుప్పటి కప్పుకొని నిద్ర పోతున్నాడు. నీపని నీవు చేసెయ్యి." ఇంతలోనే డోలుగట్టిగా మోగింది. అందరూ ఉలిక్కిపడ్డారు. అంతా క్షణంలో అయిపోయింది.

తర్వాత మూడవసారి ఆద్యాప్రసాదు నాటక కంపెనీలో "శ్రీమతి మంజరి" నాటకంలో ఇంగ్లీషు జడ్జి వేషం ధరించి టేబులుపై సుత్తిని కొడుతూ 'ఆర్డర్,

ఆర్డర్!' అంటూ వెల్, మంజరీ బాయి మేము నీకు 'శ్రీమటి మొంజరీ' అని బిరుదు ఇస్తాము. ఈ రోజు నుంచి నీకు శ్రీమటి మొంజరీ అని పిలుస్తాము. నేను పిలిస్తే అందరూ నిన్ను అలాగే పిలుస్తారు" అంటాడు. ఈ దృశ్యం ముగిసిన కొద్ది క్షణాలకు అతడే 'ఈ శరీర పంజరం వూగిసలాడెలే!' అని పాత టోనులో పాడుకుంటూ స్టేజిపైన కనపడతాడు.

అతన్ని గుర్తు పట్టడంలో నే నెక్కడాపొరబడలేదు. అన్నిచోట్లా అతన్ని పసిగట్టాను.

టీదుకాణంలో కుర్చీలో కూర్చుని వున్నాడు కాని, ఏదో ఎక్కడో ఆలోచిసస్తూ అన్యమనస్కుడై చాలా దిగాలుగా కూర్చున్నాడు. ఆకాశం పైన మేఘపంక్తిని కన్నార్పకుండా చూస్తున్నాడు- అతను పోర్దరు వేషంలోని హంతకుడు - బాబాగారు...ఇంగ్లీషు జడ్జీ - ఉపదేశికుడు - పోలీసు సిపాయి...గజదొంగ...గుర్థోడు...ఫకీరు మున్నగు వేషాలెన్నో ధరించిన ఏకైక వ్యక్తి!

కొద్దిసేపటికి నా దృష్టి అతను తొడుక్కున్న బుష్‌షర్ట్‌పై పడింది. రంగు వెలిసినబుష్ షర్టు మట్టి కొట్టుకు పోయివుంది. తెగిపోయిన కొత్త డిజైను చెప్పులు. అతను ఉన్నట్లుండి టీయిచ్చే వానివైపుచూసి, 'ఒక టీ యిక్కడ' గట్టిగా అరిచాడు, అతని అరుపువిని పోర్దరు వేషంలో వుండే హంతకుడు, కంపర గలిగించే గజదొంగ, పవర్‌ఫుల్ ఇంగ్లీషు జడ్జీ, ప్రశాంత చిత్తుడైన ఉపదేశికుడు గానటించిన అతను ఇప్పుడు ముసలివాడయినాడని స్పష్టంగా తెలిసిపోతుంది.

ఫార్‌బిస్‌గంజ్ తిరనాళ్ళలోని నాటక కంపెనీకి చెందిన నటుల వెనుక నేను నడుస్తున్నాను. ఒక కిళ్ళీ దుకాణం దగ్గర అందరూ నిలబడగా నేను వాళ్ళ వెనుక నిలబడ్డాను. నటులు చాలా మంది అక్కడ గుమిగూడి ఉన్నారు. లైలా, మజ్నూ, ఫర్ హాద్, రాజు, గజదొంగ భార్యనుండి రాజకుమారిని విడిపించిన రాజకుమారుడు, అవసరమొచ్చినప్పుడు ఉరి తీసే వాడి వేషం వేసేవాడు. వీరందరితో పాటు 'ఈ శరీరపంజరము ఊగిసలాడెలే' అని పాడే వాడు. నేను వాళ్ళవెనుక నడవటం చూసి "ఏమిరా! మా వెంట ఎందుకు పడుతున్నావు? జేబులు కొట్టాలని ఉన్నావా" అని అతను నన్ను గద్దించాడు.

అ చిన్న వయసులోకూడా అతని మాటలు నా ఆత్మాభిమానాన్ని దెబ్బగొట్టాయి. నాకు పౌరుషమొచ్చింది. "నీ జేబులో ఏముందనీ, నీ జేబుకొట్టేదానికి?" అని నేను అతన్ని ఎదిరించాను.

అతను గాబరాపడి 'నీకు ఎలా తెలుసురా, నాజేబు ఖాళీ అని' అన్నాడు.

ఆ రోజుల్లో మాస్కూల్ లో నేను ఫైనల్ క్లాసులో చదువుతూ వుండేవాడిని. మాటీచరు ఆజ్ఞమేరకు ప్రతి అపరిచితునితోనూ ఇంగ్లీషులో మాట్లాడేవాడిని, కానీ అతనికి నేను హిందీ లోనే జవాబిచ్చాను- 'నా కెందుకు తెలియదు. రాత్రి నీవు అడుక్కుంటూవున్నావు గదా,' 'బాబూ ధర్మంచెయ్యండి' అంటూ.

అందరూ బిగ్గరగా నవ్వి. "పర్వాలేదే ఈ పిల్లోడు!" అన్నారు.

అప్పుడు నేను ఇంగ్లీషులో మొదలుపెట్టాను - 'యూసీ మిష్టర్ - రైల్వేపోర్టరు ఆక్టరు - డోంటిసేమి పిల్లోడు, ఐయామ్ మెట్రిక్ స్టూడెంట్‌యూనో?'

"ఎన్నో ఏండ్ల క్రిందటి ఈ సంఘటన గుర్తుకు రాగానే నాకు నవ్వొచ్చింది. ఇప్పుడు ఇతను ఏకంపెనీ లో పని చేస్తున్నాడో? ఇప్పుడు కూడా అప్పటిమాదిరే బ్రహ్మండంగా డైలాగులు చెప్పగలడా? అదే మాదిరి వెయిటింగు రూంలో నిద్ర పోతున్న అబ్బాయిని కత్తితో పొడుస్తాడా? ముందు మాదిరే!" ఎన్నో ప్రశ్నలు నామదిలో మెదిలాయి.

నేను తేరుకొనే లోగానే అతను టీత్రాగేసి నాటేబులు వద్దకు వచ్చి నిలబడి "ఏం సేఠ్‌గారూ! నన్ను మీరు గుర్తు పట్టారా? అన్నాడు."

"నేను సేఠ్‌నుకాదు. మామూలు మనిషిని. ఇప్పుడు మీరు ఏ కంపెనీలో పని చేస్తున్నారు? నాటకాల సీజను గాని ఈ రోజుల్లో ఈ ప్రాంతంలో మిమ్మల్ని చూసి నాకు ఆశ్చర్యంగా వుంది" అంటూ అతని చేతులు పట్టుకొని కూర్చొబెట్టాను.

"బాబుగారూ! ఇప్పుడు ఎక్కడున్నాయి కంపెనీలు? ఎక్కడున్నాయి ఆ నాటకాలు? సినిమా అన్నింటినీ మింగేసింది," అంటూ పెదవి విరిచాడతను.

"మీరు ఎన్ని కంపెనీల్లో ఇంతవరకూ పనిచేశారు?"

"ఎన్ని కంపెనీలంటారా! పదునైదు కంపెనీలు," అతని వాలకం జూస్తే పాత సంగతులన్నీ దాచుకుంటూ ఉన్నట్లుంది. నిముషం ఆగి శూన్యం లోకి చూస్తూ మరల "తొమ్మిదేళ్ళ ప్రాయంలో తొలిసారి నాటకాల్లో ప్రవేశించాను బాలక్రిష్ణుని వేషంలో," అని అన్నాడు!

గడచిన కాలంలోని ఒక కాలఖండం నాముందర నిలబడ్డట్టు నాకన్పించింది- ఫారసీ నాటక కంపెనీకి చెందిన శిథిలమైన ఒక నటుడు! సిగరెట్టు అతని కందిస్తూ "అయితే ఇప్పుడేం చేస్తుంటావు," అన్నాను.

కొంతసేపు నన్ను చూస్తూ అతను వూరు కొన్నాడు. సిగరెట్టు వెలిగించుకొని చెప్పటం మొదలు పెట్టాడు, "ఏముంది చేసేదానికి బాబు గారు? ఎవరో ఒక కవి అన్నాడు చూడు, 'ప్రేమకోసమై వలలో పడెనే పాపం పసివాడు,' అన్నట్లు

నాటక కంపెనీలో పడి పాడైపోయాను. పదేళ్ళ తర్వాత ఈ ప్రాంతానికొచ్చాను. ఈ ప్రాంతాన్ని ఏమో అంటారట - ఆ! మిథిలాప్రదేశ్! బాబుగారూ! ఇక్కడ నాట కాలంటే మోజున్న వాళ్లున్నారుకదా...నేను సినిమాల్లో కూడా నటించాను. కానీ అక్కడ మన సొప్పలేదు." ఈ మాటలు చెప్పి అటూ యిటూ ఓరగన్నుతో పరి కించి తిరిగి నావైపు దీనంగా చూస్తూ నెమ్మదిగా అన్నాడు, "బాబుగారూ! ఎక్స్ క్యూజ్‌మి, ఫర్ లాస్ట్ టుడేస్ ఐయామ్ హంగ్రీ, వెరీ హంగ్రీ! ఎవరినైనా అడగా లంటే ధైర్యం చాలటం లేదు."

అతని ఈ ఇంగ్లీషు డైలాగు నాటకీయంగాలేదు. నేను మాట్లాడేలోపల్నే అతను నా ఆజ్ఞను శిరసావహిస్తున్నట్లు దీనంగా మొదలు పెట్టాడు - "మీ ఆజ్ఞ అయితే నా విద్యను మీముందు ప్రదర్శిస్తాను. ఇప్పుడు న్యా వద్ద మిగిలిందల్లా ఈ విద్య ఒక్కటే, అప్పుడప్పుడూ నాటకాలంటే అభిమానించే వాళ్ళు కనపడతారు. నాడై లాగ్స్ ప్రదర్శించి తృప్తిపడ్తాను. నాకు కొద్దో గొప్పో ఇస్తే..." అతను తన వాక్యాన్ని ముగించకుండానే ఓ మూల వుంచిన తన సూట్కేసు పరుగున వెళ్ళి తీసుకొ చ్చాడు. ఒక నల్లని లుంగీ బయటికి తీసి ముఖానికి కప్పుకున్నాడు. లుంగీ ముసుగు తొలగించగానే కోరమీసాలతో ఒక విచిత్రవేషం బయటపడింది. 'భగ్న ప్రేమికుడైన యువకుని డైలాగిది,' అని నెమ్మదిగా అంటూ గొంతు సవరించు కొని డైలాగు చెప్పసాగాడు, "నమ్మకద్రోహీ! చపలా!! నీకు తగునా ఇది. నీవు నాహృదయాన్ని వెయ్యి తుంటలుగా చీల్చి చెండాడావు! నమ్మకద్రోహీ! ఎంత అనర్థం చేశావే! చపలా...చపలా నన్ను వదలి వెళ్ళి పోయావటే! నన్ను దిక్కు లేని వానిగా జేసి వెళ్ళి పోవుట తగునా...!" తర్వాత వెక్కివెక్కి ఏడుస్తూ మరి కొన్ని డైలాగులు అతను వల్లె వేశాడు. అతను చెప్పిన డైలాగ్సును నేనిక్కడ వల్లించలేను.

టీకొట్టులో జనం మూగారు. నాలుగువైపుల నుంచి అందరూ తొంగి తొంగి చూస్తున్నారు. అందరి ముఖాల్లో ఏదో కుతూహలం! కాని అందరూస్తబ్ధులై తమషా చూసేవాళ్లే. బయటమేఘాలు గర్జిస్తున్నాయి. మరల అతను లుంగీతో తన ముఖాన్ని కప్పుకొన్నాడు. తను గ్రీను రూంలోకి ప్రవేశించి నట్లు. ఈ దఫా లుంగీని తొల గించుకొని పెద్ద పెద్ద గడ్డం, మీసాలుగల సర్దారు బయటికొచ్చాడు. లుంగీ క్రింద పడిన వెంటనే అతను గర్జించాడు. "ఏమిటిరా, దుర్మార్గుడా! రాకుమారుడెక్కడ? ఎక్కడున్నాడు ఆ నికృష్టుడు?"

భావావేశంతో చెప్పిన ఈ డైలాగువల్ల నోట్లోవున్న కట్టుడు పండ్లసెట్టువిరిగి

క్రింద పడింది.

ఈ విధంగా అతను ఎన్నో వేషాలేశాడు. ఎన్నో డైలాగ్స్ చెప్పాడు. ఆ ఖరులో తన టోపిని భిక్షాపాత్ర మాదిరి చాపి అందరి వద్దా "బాబూ దానం చేయండి. అణా, బేడా, పైసా - పరకో దానం చేయండి బాబు! మీకు పుణ్యం వుంటుంది" అని అడుక్కున్నాడు.

నాకు ఏదో లోకం నుంచి వూడిపడ్డట్లు అన్పించింది. ఈ మనిషి తన కళా నైపుణ్యంతో ఎన్నో సంవత్సరాలు వెనక్కు నన్ను తీసుకెళ్ళాడు. నేను మరల వర్తమానానికి తిరిగొచ్చాను. బకుల్ బెనర్జీ నా వైపు తదేక దృష్టితో చూస్తున్నాడు. లోలో పల నవ్వుకుంటూనే.

బకుల్ అతన్ని గద్దించి అడిగాడు- "ఏం యాక్టరు మహాశయా! నిన్న చాలా శ్రమపడి చందారూపంగా సంపాదించిన పైసలేమయ్యాయి? అన్నీ రాత్రి ఏ బట్టీలో కాల్చేశావు. భలే గొప్పోడివే!"

పుట్టుకతోనే ఆర్ట్ క్రిటిక్‌గా పేరుపొందిన నాసహాధ్యాయి బకుల్ బెనర్జీ ఇప్పటికీ కళను, కళాకారున్ని గుర్తించే పని చేస్తున్నాడు. మొదటి నుంచి ఇంతేవీడు. "ఏమోయ్! నీవు కూడా వీడి మాటలలో చిక్కుకొన్నావా! ఇతను నిన్ననాతో గూడా- ఫర్‌టు డేస్ ఐయామ్ హంగ్రీ అన్నాడు." బకుల్ నావైపు జూసి అన్నాడు.

ఎందుకో బకుల్ మాట నాకు అప్పుడు నచ్చలేదు. వాణ్ణి అడ్డుకొని అతని చెవిలో "బకుల్! వూగిసలాడే ఈ తని శరీరపంజరంలో వున్న పక్షి ఏమంటుందో వినగలవా? అదివిని నీకు ఏమనిపిస్తున్నదో నాకు స్పష్టంగా వివరించి చెప్పు" అని అన్నాను.

బకుల్ నిశ్చేష్టుడయ్యాడు. నిముషం సేపు వూరకుండి మరల ఇలా గన్నాడు, "ఏమీ అని పించకపోతే నిన్నంతా ఇతని వెంటతిరిగి భిక్షాటన ఎందుకు చేశాను? చందా అడగట మంటే భిక్ష మడగటమే గదా! ఒక నిట్టూర్పు వదలి మరల ఏమి చెప్పను? ఏమని పించిందని? నీతో, నీలాంటి ఇతర స్నేహితులతో కలిసి హాస్టలు నుంచి తప్పించుకొని పారిపోయి రాత్రంతా నాటకం చూసి నట్లు అన్పించింది?" అన్నాడు.

"నిజంగానే బకుల్ నాకూ అలాగే అన్పించింది" అని అన్నాను. ఇంతలో ఆముసలి నటుడు తన కిష్టమయిన పాత పాటలోని మొదటి పంక్తులను ఆలాపించడం ప్రారంభించాడు.

"తెల్లవారగానే చుక్కలన్నీ మటు మాయమయ్యాయి - అయిన వాళ్లంతా

నన్ను వదలి పోయారు!"

అకస్మాత్తుగా మరల మాస్మృతి పథంలో తిరనాళ్ల సంబరం మొదల సాగింది.

(1960)

# టేబుల్

మిస్ దుర్గాదాస్!

ఇప్పుడు కేవలం మిస్ దుర్గాదాస్ కాదు. 'మిస్ దుర్గాదాస్, అసిస్టెంటు బ్రాంచ్ మేనేజరు: కాంటి నెంటల్ కాస్మటిక్స్ అండే డ్రగ్స్ లిమిటెడ్, కలకత్తా- బొంబాయి- ఢిల్లీ- పాట్నా (బ్రాంచ్ పాట్నా).'

బ్రాంచ్ ఆఫీసులో ప్రతి సెక్షనులో గత ఏడు రోజుల నుంచి ఒకటే చర్చ: చర్చ అంతా దుర్గాదాస్ అదృష్టాన్ని గురించే, డిస్పాచ్ క్లర్క్‌గా కంపెనీలో చేరింది. తర్వాత హెడ్‌క్లర్క్, ఆ తర్వాత ఎనిమిది సంవత్సరాలకు అసిస్టెంటు బ్రాంచ్ మేనేజరు పదవి!

క్యాంటీను మెట్లపైన కూర్చుని జమాదార్ అభిలాఖ్రామ్ కొత్తగా చేరిన బేరర్ సిరామదాసుతో అంటున్నాడు- "ఈ మిస్‌ను నేనెప్పటి నుంచో ఎరుగుదును. ఈమె ఫ్రాక్ తొడుక్కొనే వయసు నుంచే నాకు తెలుసు. బాగా డబ్బుగల బెంగాలీబాబు కూతురు ఈ మిస్, బెంగాలీబాబుగారు చాలా నిక్కచ్చి మనిషి! ఒకరోజు ఇల్లు ఊడ్వక పోతే ఆరోజు జీతం కట్ జేసేవాడు. "డబ్బులు ఏమి వూరికే వస్తాయా? పని చేయకుండా వళ్ళు పెంచుకుంటే సరిపోతుందా." అని అనేవాడు.

"అంటే ఈ మిస్‌గారి వంశమే పిసినార్ల వంశం. నిన్న 'మేజర్‌బాగ్' లో గులాబీలుగొని చాలా జాగ్రత్తగా ఒక పూలచెండు తయారు జేశాను. ఎంతో సంతోషంతో యింటికి వెళ్ళి ఇచ్చాను. పూల చెండు చేతిలోకి తీసుకొని ఒక నవ్వు నవ్వింది అంతే...డబ్బులమాటదేవుడెరుగు!" తోటమాలి అన్నాడు.

జనరలు సెక్షన్‌లోని ప్యూన్ సింగేసర్ రాం ఎక్కడినుండో నవ్వుతూ వచ్చాడు. ఇక్కడ మేము ఆ మిస్‌గారి గురించే గప్పాలు కొడ్తున్నామని వాడు తెలుసుకున్నాడు. వస్తూనే "ఈ రోజు ఆఫీసులో పనంతా కంప్లీట్ అయింది కొత్త నేంప్లేట్ తగిలించి వచ్చాను" అన్నాడు.

"అంటే ఈ రోజు నుంచి మిస్ మీడిపార్టులో కూర్చోరా?"

"మాడిపార్ట్‌లో కూర్చుండే ఆయన గూడా వచ్చాడు...బొంబాయి నుంచి

ట్రాన్స్ ఫర్ అయివచ్చాడు."

సింగేసర్ క్యాంటీను వైపు వెళ్తుండగా 'ఫ్యూన్స్ యూని యన్' కు చందారా బట్టే ఫ్యూను జగవతీ ప్రసాద్ వాణ్ణి అడ్డగించి "ఏయ్, నేమ్‌ప్లేట్ తగిలించే వాడా ఎక్కడికి?...డిపార్ట్‌లో మిస్‌గారు టీ, గీ ఏమన్నా ఇచ్చిందా, లేక సున్నాయేనా!" అని అన్నాడు.

"అది ఆబెల్లంగాదు ఈగలు ముసిరేదానికి! తినేచేత్తో కాకి నైనా ఆదిలించ దు. తాను తినదూ, ఇతరులకు పెట్టదు: నవ్వుతూ అన్నాడు సింగేసర్."

నిజంగానే మిస్ దుర్బాదాస్ తింటూ ఇతరులకు పెడ్తూవుండగా ఎవరూ ఇంతవరకూ చూడలేదు.

జనరల్ సెక్షనులో దుర్బాదాస్ కూర్చుండే చోటు - ఈ రోజు చడీ చప్పు డులేదు. సెక్షనులో ఒక మూలకూర్చుండేది - మిస్‌దుర్బాదాస్ హెడ్‌క్లర్క్. ఆమూల నుంచి డిజైనులగల టేబుల్ ల్యాంపు వెలుగుతూ వుండేది...ఎనిమిదేళ్ళు ఆ టేబుల్ ల్యాంపు దుర్బాదాస్ రూపలావణ్యం మాదిరి వెలుగుతూ ఉండేది- ఉదయం పదినుంచి సాయంత్రం ఐదు వరకూ, అప్పుడప్పుడూ సాయంత్రం ఏడు వరకు కూడా.

రోజంతా రెండు మూడు మార్లే కాలింగ్ బెల్ మోగేది. రోజుకు రెండు సార్లు నీళ్లు తాగుతుంది... లంచ్‌టైములో పొడరు డబ్బాలాంటి చిన్నటిఫిను బాక్స్‌లోంచి ఒక బిస్కటు తీసి తింటుంది. చాలా తక్కువ మాట్లాడుతుంది. ఎప్పుడూ నగుమోము తో ఉంటుంది. ఈ నగుమోము వెనుక దుర్బాదాస్ ప్రమోషన్ల రహస్యం దాగుందని అంటారు కొందరు. ఈ సెక్షనుకి ఎక్కడెక్కడి నుంచో ఒకరికి మించిన ఒకరు గుమస్తాలొచ్చారు. దుర్బానగు మోమును తప్పుగా అర్థం చేసుకున్న వ్యక్తి పని అయినట్టే, త్రిపాఠి, సిన్హా, కుంటి ముఖర్జీ అందరూ ఈ తప్పే చేశారు వరసగా.

'నగీనాప్రసాద్' అనే అతనికి మాట్లాడేటప్పుడు వూరికే లెటర్‌లోని పుటలు తిప్పే అలవాటు, మాటిమాటికీ వ్రేళ్లు నాలుక్కు తాకించుకొని పుటలు తిప్పే అలవాటుండేది. మిస్‌దుర్బాదాస్ తన అలవాట్లు మార్చుకొమ్మని అతనికి లిఖిత పూర్వకంగా వార్నింగ్ ఇచ్చింది.

ఈ రోజు నగీనాప్రసాదు అమితోత్సాహంతో ఏమేమోవాగుతూ మాటి మాటికి ప్రతిరెండు పుటలు తిరగేసిన తర్వాత యంత్రం మాదిరి తన వ్రేళ్ళు నాలుకకు అద్దుకుంటున్నాడు- టప్‌టప్... "హెడ్‌క్లర్కు దొరగారి రూములో వున్నారా?"

"సరే, సరే నాకైతే హిందీ రాదు కదా! జందర్-వందర్ హిందీలో గడిబిడిగా వుంటుంది కదా. ఈ మిస్ దాస్‌ను, ఐమీన్ ఈ చిన్నదొరను ఏమనాలి? బడాసాబ్...చోటా మేమ్ అనవచ్చా" ట్రాన్స్ పోర్టు క్లర్కు సేన్ అడిగాడు.

అందరూ నవ్వారు.

హెడ్‌క్లర్కు మిస్‌దుర్బాదాస్, సేన్ తయారు చేసిన ట్రాన్సు పోర్టు లెక్కలను చెక్ జేసి లెక్కతప్పుగా వుంది అన్నది. సేన్ రోజంతా కూర్చుని లెక్కలు చెక్‌చేసుకున్నాడు. తాను చెక్‌చేసి ఇతరుల చేత కూడా చెక్ చేయించుకున్నాడు. పెట్రోలు కూపన్లు మొదలు కొని ఆటో మొబైల్ గ్యారేజి బిల్లులు అన్నీ రెండవ దఫా తిరగేసుకున్నాడు. ఆఖరికి సాయంత్రం 4.30 గంటలకు దాస్ దన అకౌంట్సును దుర్బాదాస్ వద్ద సబ్ మిట్ చేశాడు. అకౌంట్సును పైపైన చెక్‌జేసి బకిం చంద్రగార్రి శుద్ధమైన బెంగాలీ భాషలో, "దయజేసి ప్రతీ రోజూ, తమరు మీ తలను మేకనెయ్యితో మాలిష్ చేసుకొండి అని అంది."

పర్‌చేజ్‌సెక్షనులోని 'ఝా' సగంతాగి ఆర్పేసివుంచుకొన్న సిగరెట్‌ను మరల వెలిగించుకొని "ఇది చేయకూడని అపరాధం కదా" అన్నాడు.

"ఏది అపరాధం?"

"ఇదే ఆడ జాతి రాజ్యమేలటం! మగ జాతేమొ వాళ్ళ క్రింద..." మామైథిలీ భాషలో ఒక సామెతవుంది. 'జేఘర్ మైగీకైల్ ఘర్ బార్- సేఘర్ బూఝు భంటాడార్' (ఏ ఇంట్లో పెత్తనం ఆడదాని చేతిలో వుంటుందో ఆ ఇల్లు నాశనమే).

"ఝా బేటా! భానుసింగ్ పదాలు వల్లెవేస్తున్నావా?" అన్నాడు సేన్.

గుమస్తాలందరూ తనివి తీరా నవ్వారు. ఈ రోజు కొత్తహెడ్‌క్లర్కు డ్యూటీలో జాయినయింది గదా. అందరూ అదో మూడ్‌లో వున్నారు.

"హెడ్‌క్లర్కు ఇంకా పెద్దదొరగారి చేంబరులో వున్నారా? లేక చిన్న దొరగారి వద్దనా?"

ముఖమంతా నల్లటి మచ్చలున్న చాడీలు జెప్పే 'గుల్సన్ మెహతా' ముఖం పైన ఉత్సాహం పొంగింది. సందర్భానికి తగ్గట్టు చెప్పదానికి ఏదో కొత్త ఇంగ్లీషు పదాన్ని అర్థం చేసుకుంటున్నట్టున్నాడు. కానీ ఏదీ గుర్తు రానట్టుంది... హెడ్ క్లర్కు అదే కొత్తహెడ్ క్లర్కు: అనురంజన్ గుప్తా తన ఆఫీసులోకి తిరిగి వచ్చాడు, పెద్ద దొరగారి చేంబరులోంచి.

మెహతా అతని ముందుకెళ్లి స్వాగతం చెబుతూ నమస్కరించాడు. సీని

యారిటీ ప్రకారం తనతో పాటు పని జేసే, వాళ్ళందరినీ పరిచయం జేశాడు.

ఎప్పుడూ ఆఫీసుకు ఆలస్యంగా వస్తూ, అందరికీ నిత్యం సహాయంజేసే 'బిందామహరాజ్' ఈ వేళ కూడా ఆలస్యంగా వచ్చాడు. మిస్‌దాస్ లేటుగా ఎందుకొస్తావని బిందామహరాజును ఎప్పుడూ అడగలేదు. ముసలిబ్రాహ్మడు...అదృష్టంకొద్దీ ఈ వేళ కూడా ఆయనింట్లో పూజ వున్నది. నువ్వు పిండి స్వీటు తెచ్చాడు. హెడ్‌క్లర్కు భక్తి శ్రద్ధలతో ప్రసాదాన్ని తీసుకున్నాడు. బిందామహరాజ్ ధన్యుడయ్యాడు.

బిందామహరాజ్ తన పాత అక్కగారూ, ఇప్పటి క్రొత్త అసిస్టెంటు బ్రాంచ్ మేనేజరు అయిన మిస్ దుర్వాదాస్ గారి కొత్తరూములోకి వెళ్లాడు.

దుర్వాకు నువ్వు పిండి అంటే ఎంతో ఇష్టం. గయాజోన్‌లోని రిప్రజెంటేటివ్ 'మానసకుమార్' గారు ప్రతి యేడు మూడు మార్లు నువ్వుపిండి స్వీట్లు బుట్టతో తెస్తారు.

గుల్సన్‌మెహతా మిస్ దుర్వాదాస్ చేంబరులోకి వచ్చాడు. వస్తూనే హిందీలో 'నేమ్‌ప్లేటు' తయారు చేయించి నందుకు ధన్యవాదాలు తెలిపాడు. ఈ సీ.సీ. ఎమ్.డి (కాంటినెంటల్ కాస్మటిక్సు అండ్‌డ్రగ్సు)లో తనొక్కడే హిందీని సమర్థిస్తున్నట్లు! దుర్వాకళ్ళు పైకెత్త కుండానే అతని వైపు చూసింది.

నేమ్‌ప్లేటు చాలా బాగుంది. అని దాన్ని పొగడడం మొదలెట్టాడు.

"ఏంబాగుంది? పేరే తప్పురాశారు."

ఆ...మెహతా చేంబరునుంచి బయటకొచ్చి నేమ్‌ప్లేటును మరొకసారి చదివాడు. "ఎక్కడ? ఏంతప్పుపుంది? ఏమీ తప్పు కనబడడం లేదే!"

"దర్వాగాదు, నాపేరు దుర్వా."

మెహతాతప్పుతెలుసుకొని తననోటిని కోటుబటన్ హోల్‌మాదిరి వుంచి ఓహో! ఏం కాదులే. కడుపులో ఒక గీత గీస్తే సరిపోతుంది. (హిందీలోని'వ' అక్షరంలోని సున్న మధ్యలో ఒక గీత గీస్తే 'బ'అవుతుంది.)

మెహతా ఆమెపెద్దటేబుల్‌ను పొగుడుతూ "గ్రాండ్‌గా ఉంది" అన్నాడు.

దుర్వాకు హటాత్తుగా ఏదో గుర్తు వచ్చినట్లుంది...టేబుల్? "క్రొత్త హెడ్‌క్లర్కు ఆఫీసు కొచ్చాడా? ఎక్కడ కూర్చున్నాడు?"

"మరెక్కడ కూర్చుంటాడు? మీరెక్కడ కూర్చుంటున్నారో అక్కడే!" మెహతా జవాబిచ్చాడు.

దుర్వావున్నట్లుండి సీరియస్‌గా మారి పోవటం గమనించి మెహతా తల

గోక్కున్నాడు. తర్వాత నెమ్మదిగా చేంబరునుంచి బయటపడి...ఏమో? ఏమయిందో ఆదేవుడికే ఎరుక అనుకున్నాడు.

"క్రింగ్-క్రింగ్-క్రింగ్..." టెలిఫోను గంట మోగింది.

"హాలో! ఆ!ఎస్‌సార్! ఇప్పుడే వస్తున్నాను" అంటూ రిసీవర్ పెట్టి కాలింగ్ బెల్ బటన్ నొక్కింది.

"క్రింగ్!...బిస్నూసింగ్?...నిన్నే నాకు తగిలించారా? సరే చూడు- పర్‌చేజ్ సెక్షనులోని ఝూను రమ్మను - పెద్దదొరగారు పిలిచారని చెప్పు..."

దుర్గాబాదాస్ కూడా పెద్దదొరగారి చేంబరులోకి వెళ్ళింది. మరల వెంటనే బయటికొచ్చింది. అలవాటుకొద్దీ ఆమె కాళ్ళు జనరల్ సెక్షను వైపు కదిలాయి. కాని నవ్వుతున్న బిస్నూ సింగు దంతాలను జూసి తన చేంబరువైపు తిరిగింది.

దుర్గాబాదాస్‌కు హఠాత్తుగా వచ్చిన ఈ ప్రమోషన్ వల్ల బిస్నూసింగుకు పట్ట లేనంత ఆనందం కలిగింది. ఈమెగారి రూపసౌందర్యాన్ని గూర్చి ఎంత చెప్పుకున్నా తక్కువే. ఆమెను చూస్తే దృష్టి మరల్చు కోవడం కష్టం! స్త్రీ సౌందర్యం అంటే ఇది. భగవంతుడు బిస్నూ సింగు ప్రార్థన విన్నాడు. మనోవాంఛ తీర్చాడు. ఇన్ని రోజుల తర్వాత ఆమెకు సేవజేసే భాగ్యం కల్గించాడు.

దుర్గా తన చేంబరులోకి వచ్చింది.

...ఉహుఁ! ఏం బాగుండలేదు. మామూలుగా అయితే క్రొత్తఫర్నిచరు వాసన, వార్నీషువాసన అంటే దుర్గాకు ఇష్టమే. కానీ ఎందుకో ఈ వేళ అవిగిట్ట లేదు? వాంతి వచ్చినట్టుంది. ఎందుకో. ఆమె రెండు చేతులు వున్నట్టుండి లాగుతున్నాయి. టేబుల్‌డ్రాయర్లు ఏదో కొత్తగావున్నాయి. టేబులేమో అదో మాదిరిగా వుంది. కానీ ఈ టేబుల్ దుర్గాకు అంతగా నచ్చలేదు.

దుర్గా తన రెండు చేతులు టేబులుకు రెండు వైపులా సాచింది. టేబుల్‌ను ఆలింగనం చేసుకున్నట్లు. ఆమె టేబుల్‌పైన పరిచిన అద్దంపైన తన కుడి చెంపను ఆనించింది. వున్నట్టుండి కరెంటు షాకు కొట్టినట్లు వణికి పోయింది. వద్దు వద్దు. ఇది పనికి రాదు. కానీ?

...ఎనిమిదేళ్ల నుంచి తను పనిజేస్తూ వచ్చిన ఆటేబుల్ తప్పమరే టేబుల్ వద్దకూర్చునేదానికి ఆమెకు బొత్తిగా మనసొప్పలేదు. ఎవరో పరాయివాళ్ళ వద్ద కూర్చున్నట్టుంది. ఆమెకు...ఉహు! వద్దు!

'ట్రింగ్!'

"దొరా!"

"బిస్నూ సింగు, మెహతా బాబును..."

"సర్" అంటూ మెహతా వెంటనే వచ్చాడు.

మిస్టర్ మెహతా, హెడ్‌క్లర్క్...కొత్తహెడ్ క్లర్కు వచ్చేరా, ఆఫీసుకు? ఆటే బుల్‌పైన పని చేస్తున్నారా?

"టేబుల్‌పైన పని? అవును సార్. ఇప్పుడే సింగ్ సర్‌ను పిలిపించి సుత్తితో టేబుల్‌పైన ఏదో మేకు కొట్టిస్తున్నాడు."

"ఏమిటి? మేకా?"

మెహతా ముఖం మరింత నల్ల బడింది. ఆశ్చర్యంగా "అవునండి. మేకే... మేకు అంటే ములుకే."

దుర్బాకు వణుకొచ్చింది. పండ్లు బిగపట్టుకొని "సీసీస్" ఇంతలోనే సంభాళించుకకొని 'సరే మీరు వెళ్ళండి' అంది.

...వెళ్ళండా? మెహతాకు మరెవరో వేరొక దుర్బాదాస్‌ను చూస్తున్నట్లు అనిపించింది. ఇంతకు ముందెన్నడూ ఈ మాదిరి చాంచల్యం, ఉద్విగ్నత దుర్బాదాస్‌లో తను ఎప్పుడూ చూడలేదు. మేకు! ములుకు!!...గుల్సన్ మెహతా మనసులో వుండివుండి మేకులు గుచ్చుకుంటున్నాయి. ఎందుకోమరి!

మెహతా వెళ్ళిపోయాడు.

మరెట్లా? ఆటేబుల్ దుర్బాకు కావాలి. ఈ రోజే కావాలి. ఇప్పుడేకావాలి. అది లేకపోతే ఒక క్షణమయినా ఆమెశాంతంగా కూర్చోలేదు...కాదుకాదు. తన వల్ల ఏమీ కావటంలేదు. మెమోలపైన సంతకంకూడా చేయలేక పోతూంది. అక్కడేమో ఆగుప్తాటేబుల్‌పైన మేకు కొట్టడం మొదలెట్టాడు. టేబుల్‌పైన ఎక్కడ మేకుకొట్టిస్తున్నాడో? సీస్! తాను కావాలని కొట్టించిన మేకు కాదుగదా-పేపర్ చిట్స్‌ను తగిలించేదానికి అర్థమేకు దిగగొట్టించుకుంది! కానీ ఇది అన్యాయం, అపరాధం, క్రైమ్. అతను ఎందుకలా జేశాడు?

"ట్రింగ్!"

"రారా!"

బిస్నూ సింగు కొత్తహెడ్‌క్లర్కుకు కబురు జేశాడు. మిస్‌దాస్ దొరగారు పిలుస్తున్నారని! అందరూ ఈ క్షణంకోసం. ఈ పిలుపు కోసమే ఎదురు చూస్తున్నారా అన్నట్లుంది... అక్కడి పరిస్థితి. హెడ్‌క్లర్కు అనురంజన్ గుప్తాకూడా పిలుపుకొఅకు ఎదురు చూస్తున్నాడు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటున్నారు.

మెహతా నెమ్మదిగాలేచి అనురంజన్ దాస్‌గుప్తా దగ్గరికి వెళ్ళాడు. "హెడ్

క్లర్కు గారూ, ఈ టేబుల్ చాలా శుభకరమైంది " అని చెవిలో చెప్పాడు.

మెహతా ఎవరితోనేనా చాలా ఆత్మీయతతో మాట్లాడితే మొదటి వాక్యం తప్పక మగహీ భాషలో మొదలెడ్తాడు. "సార్, ఇల్లు దొరికిందా? లేక...?...సరే... ఎప్పుడైనా ఏదైనా అవసరం కలిగితే ఈ మెహతాను గుర్తుచేసుకోండి. ఇది నాడ్యూటి సార్, నేను పుట్టిందీ పెరిగింది ఈ పట్నంలోనే, ఈ సిటీ ఏరియాలో నేసార్. హిహి."

అనురంజన్ గుప్తా, ఏ.బీ.యమ్. చాంబరులోకి వెళ్ళాలని హాలులోంచి బయటికి వెళ్ళగానే సేన్, మెహతా తో, "సరే, సరే, మెటాభాయీ భలేవాడివి భాయీ నీవు. ఒకప్పుడేమో నీవు పలానా చోట పుట్టానంటావు. మరొకప్పుడు మరొకచోట. ఆరోజేమోపెద్ద దొరగారితో అంటివి గదా - పంజాబులో చాంది నీ చౌక్‌లో పుట్టాననీ! నీవు ఎన్నిచోట్లపుట్టావు మెటాబాయి" అన్నాడు.

హాలులో నవ్వులు ప్రతిధ్వనించాయి. మెహతా మునుపటి మాదిరే సేన్ మాటలను లెక్కజేయకుండా, "సమ్‌వేర్‌మైడియర్ ఫ్రెండ్స్!" ఎక్కడో ఒక చోట మేకు గుచ్చు కుంటూంది...పోయిన సంవత్సరం ఇద్దరూ కలకత్తాలో ఒకే సారి ట్రైనింగు పొందిన విషయం అందరికి తెలుసు. మిస్టర్ ఎ. గుప్తా అండ్ మిస్ దుర్భాదాస్. వీళ్ళల్లో ఒకరు సఫలీకృతులై ఏ.బీ.యమ్. అయితే మరొకరు హెడ్ క్లర్కు గానే ఉండి పోయారు - దేర్ ఫోర్ మన కొత్త హెడ్లక్లర్కు న్యూలీ ట్రైన్డు అన్నాడు.

మెహతా ఇచ్చిన ఈ లెక్చరు తర్వాత ఆఫీసులోని అందరూ తమతమప నుల్లో తలలు దూర్చారు. క్రొత్త హెడ్ క్లర్కు దృష్టిలో మెదటిరోజే తాము చెడ్డగా కన్పించరాదని అందరూ పనిలో నిమగ్నమయినట్లు బయటి ప్రపంచానికి కనబడుతున్నది.

టైప్‌రైటర్ల శబ్దం కాలింగ్ బెల్లుల ధ్వనులు, డ్రాయర్లను తెరవటం, మూయటం - మొత్తం వాతావరణంలో కపట నటనాచాతుర్యం!

"సింగేసర్ ఎక్కడున్నావు? కొంచెం మంచి నీళ్లివ్వు."

సింగేసర్‌కు అంతా తెలుసు. ఎందరెందరో గుమస్తాలకు వాడు నీళ్ళు తాగించాడు. అసలయిన దప్పిక, నకిలీ దప్పిక, చూపులదప్పిక అన్ని దప్పికలు వాడికి తెలుసు. ఒక క్లర్కు నీళ్లు కావాలన్నాడంటే మిగతా అందరిగుమస్తాల ఆత్మలకు దప్పికేస్తుంది.

సింగేసర్! అరే ఎక్కడికి పోయాడు? ఎవరైనా ఎక్కడికైనా పంపారా?

సింగేసర్ గొణుక్కుంటూ వచ్చాడు. "సార్, నీళ్ళుతాకిన చేత్తో ఫైలు తాకే దెట్లా? తడిసిన చేత్తో కాగితాన్ని పట్టుకొంటే...మిస్‌దొరగారు చాలా కోప్పడుతారు గదా!"

నెల ఆఖరు వారంలో కొంత మంది క్లర్కులకు సింగేసర్‌వద్ద నాలుగైదు రూపాయలు అప్పుజేసే అవసరమేర్పడుతుంది... అందు వల్లనే సింగేసర్‌కోప గించుకున్నా ఎవరూ ఏమనుకోరు. ఎవరైనా అతనికి విరుద్ధంగా ఇంగ్లీషులో గానీ మరేయితర భాషలోగానీ ఏమన్నా అంటే అతనికి అర్థమై పోతుంది. తనభా షమో అసలు సిసలైన భోజ్‌పురి. వేరే భాషనేర్చుకోవాలనే ఇష్టమతనికి కలుగ లేదు. బెంగాలీ బాబు బెనర్జీతో మాట్లాడినా, మరాఠీ మాట్లాడే ఘోంసలే గారితో మాట్లాడినా సింగేసర్ ఒకే విధంగా, జాతానీ - ఖాతానీ (పోతాను, తింటాను) అనే మాట్లాడుతాడు.

మెహతా మనసులో మేకు గుచ్చుకుంటూంది, ఏమిటో విశేషంలోపల? అత నికి తెలుసు కోవాలని వుంది. వూరికే కూర్చోలేక పోతున్నాడు. ఏదో ప్రశ్నిం చాలని ఉబలాటం. అతనికి సాకు దొరికి పోయింది. ఒక ఫైలు తీసుకొని ఏ.బీ.య మ్. చాంబరులోకి దూసుకు పోతూ, "మే ఐ కమిన్‌సార్..."అన్నాడు.

కానీ మిస్‌దుర్బాదాస్ తనహోదాకు తగ్గట్టు, "తర్వాత రాండి" అన్నది. క్రొత్త హెడ్‌క్లర్కు పెదవులపైన ముసిముసినవ్వు, దుర్బాదాస్ ముఖంపైన ఏదో విచారం తాండవిస్తున్నట్లు మెహతా కనుగొన్నాడు. అతని మనసులో కూడా రెండు మూడు సార్లు మేకు గుచ్చుకున్నట్లు అయింది... అయిష్టంగానే చేంబరునుంచి బయట పడ్డాడు.

మిస్ దాస్ తనమాటలు కొనసాగించింది.

"మీకు ఇల్లు దొరికిందా...గుడ్‌లక్. ఇల్లు దొరకటం చాలా ప్రాబ్లమ్ ఈ పాట్నాలో."

"ప్రతి చోటా ఇదే పరిస్థితి. నాకు తెలిసిన ఒకతను ఇక్కడ రైల్వేలో పని చేస్తున్నాడు. అతని సహకారం వల్లనే ఒక మంచి ఇల్లు దొరికింది...చిరైయా టాండ్ బ్రిడ్జిదగ్గర" అనురంజన్ బదులిచ్చాడు.

మిస్ దాస్ అంతర్యంలో కొంతసేపు ఘర్షణ జరిగింది. ఎదరుగా కూర్చున్న యువకునితో పరిచయం కావటం ఇది మొదటిరఫాకాదు. పోయిన సంవత్సరం ఇద్దరూ ఒకే చోట ట్రైనింగు పొందారు...అనురంజన్ రాసిచ్చిన నోట్స్ ఇప్పటికీ తనవద్ద ఉన్నాయి...అ ఇరువది ఐదు పుటలు - అతను రాసిన సొంతవ్యాసం.

ట్రైనింగులో సరళమైన, ఆకర్షణీయమైన సాహిత్య శైలిలో వ్యాసం రాయాలని ఒక బంధన వుండేది. తను అనురంజన్‌ను ప్రాధేయపడింది...టీ సెంటరులో కూర్చుని టీ తాగారు - ఎదురెదురు గా కూర్చొని, స్టార్ సినిమా హాలులో శంభు మిత్రగారి ఫిల్మ్ 'రక్తకరభి' ఇద్దరూ చూశారు - వేర్వేరు గా కూర్చొని. దక్షిణేశ్వ ర్, బేలూరు...వద్దు... వద్దు. ఆజ్ఞాపకాలను తుడిచేసుకోవాలి. చాక్‌పీసుతో రాసిన అతీత కాలపు క్షణాలను మనసులోంచి తుడిపి వేయాలి. మనసు ఒక నల్లని బోర్డు మాదిరిది.

అనురంజన్ గుప్తా తనను మొదటి నుంచే అదుపులో పెట్టుకుంటున్నాడు. ఇక్కడికి రాక ముందు అతని మనస్సులో పెద్దతుఫానే చెలరేగింది. దాన్ని అతను అధిగమించి వచ్చాడు. ఎక్జామినేషన్ బోర్డు తనని అసిస్టెంటు బ్రాంచ్ మేనే జరు పదవికి ఎన్నిక చేయలేదు. అతని దురదృష్టం. పాపం అతనేం చేస్తాడు! వెను వెంటనే - పాట్నా కు ట్రాన్స్‌ఫర్ ఆర్డరు చేతికందుతూనే తను ఉద్విగ్నుడ యిన మాట వాస్తవమే. ఇది కూడా ఒక మాదిరి శిక్షేమో! కానీ తాను ధృడచిత్తుడై తన కర్తవ్యాన్ని నెరవేర్చుకోవాలి. ఈ శిక్షను అధిగమించాలి. కానీ ఇప్పుడు కొద్ది క్షణాలక్రితం అతని మనసులో ఏదో ఆందోళన...ఆవిడ నమస్కారానికి ఏదో జంకు తూనే ప్రతినమస్కారం చేశాడు. చేతులెత్తే విధానం, చూపుల్లో కొత్తదనం ఇవన్నీ చూసి, విని, మిస్ దాస్ మనస్సులో ఏదో వుందని అతను తెలుసుకున్నాడు. అతను కుర్చీ నుంచి లేవబోయాడు.

"ఆగండి. మీతో మాట్లాడాలి..." దుర్గా అన్నది.

అనురంజన్ కుర్చీలో మరలా కూర్చున్నాడు. కొద్దిక్షణాల పాటు మౌనం వహించిన తర్వాత అనురంజన్ అన్నాడు- "ఏమండి, చెప్పండి."

"ఆటేబుల్...ఐమీన్ అదే ప్రస్తుతం మీరు పనిజేసే టేబుల్...నిన్నటి వరకు నేను అక్కడే ఆటేబుల్ వద్దే కూర్చునేదానిని."

"ఆ, అవును. కానీ, ఆటేబుల్ లో ఏముంది విశేషం?"

"అది నా టేబుల్..."

"కాదు. నేను ఎనిమిది సంవత్సరాలు దాని ముందు కూర్చుని పనిజేశాను."

"అవును. తెలుసును. కానీ ఇప్పుడు నాకు కొత్తకుర్చీ ఇచ్చారు గదా!"

దుర్గా సీరియస్ అయిపోయింది... అనురంజన్ ఈ విధంగా జవాబు చెప్పటం ఆమెకు అసభ్యకరంగా తోచింది. కొత్తకుర్చీ ప్రస్తావన ఎందుకు తీసుకొచ్చాడు? మొహమాటం విడచి పెట్టి, ఆవిడ "ఆటేబుల్ నాకు కావాలి...ఇక్కడ...నా చాంబ

రుకు పంపండి" అని అన్నది.

"ఇక్కడికి పంపాలా...మరి ఈ టేబుల్ అక్కడికి తీసుకెళ్ళాలా? కానీ అక్కడ ఇంతస్థల మెక్క డుంది?"

"కాదు. ఈ టేబులిక్కడే వుంటుంది. ఆ టేబుల్ ఇక్కడికొస్తుంది."

"మరయితే నేను అక్కడ ఏటేబుల్‌పైన...?"

"నేను స్టోరు క్లర్కును పిలిపిస్తాను. మీకు కొత్తటేబుల్ ఇప్పిస్తాను." వెంటనే బదులు చెప్పింది. దుర్బాదాస్.

"సరే, ముందు ఆకొత్తటేబుల్ రానివ్వండి, తర్వాత చూద్దాం!" అనురంజన్ ఆలోచించకుండా సమాధానమిచ్చాడు.

"ముందూ వెనుకా ఏమిటి? ఇప్పుడే నారూముకు పంపించెయ్ ఆటేబుల్" అని దుర్బాదాస్ ఆలోచనలో పడింది.

అనురంజన్ ఆమెబుగ్గలపైన వెను వెంటనే మారుతున్న రంగులను గమనించాడు. ఈ రూపంలో తను ఆమెను ఎక్కడా చూడలేదు - స్టార్ థియేటరులో గాని, ట్రామ్‌లోగాని, బేలూరులోగాని...

అనురంజన్ కుర్చీలోంచి లేచాడు. దుర్బాదాస్ ఆలోచనలనుంచి బయటపడింది. ఏదో మనస్సులో తర్కవితర్కంచేసుకుంటూనే మనసులోని మాట వెళ్ళగక్కింది- "ఆటేబుల్ లేకుండా నేనేమిపని చేయలేను. నాతో ఏపనీ సాగదు."

అనురంజన్ తన అసిస్టెంటు బ్రాంచ్ మేనేజరు చాంబరు నుండి బయటపడ్డాడు.

తను జనరల్ సెక్షనులోకి వస్తూనే అతనికి ఎదురైన దృశ్యం - సెక్షన్లోని ప్రతి టేబుల్ ముందు కూర్చున్న మానవాకృతిలో పొదిగియున్న నేత్ర గోళాల్లో కుతూహలం, జిజ్ఞాస, ఆశ్చర్యం ఈ మూడు కలిసి మిరమిట్లు గొల్పుతున్నాయి. పది జతల చిన్న బల్బులు వెలుగు తున్నట్లు ఆకళ్ళు!

ట్రాన్స్ పోర్ట్ సెక్షనులోని దులాల్‌సేన్‌ను ఆఫీసులోని అందరూ ట్రాన్స్‌పోర్టేషన్ అని పిలుస్తారు. సేన్ 'మురాద్' సిగరెట్టు తాగుతాడు. హెడ్‌క్లర్కుకు సిగరెట్టు ఆఫరు జేస్తూ "సర్, డిస్ట్రిబ్యూషన్ ఆఫ్ వర్కు గురించి ఏమి నిర్ణయం తీసుకున్నారు?" అని అడిగాడు.

అనురంజన్ 'మురాద్' సిగరెట్టు పీలుస్తూ దాని మజా తీసుకుంటున్నాడే గాని సేన్‌కు జవాబేమీ దొరకలేదు.

అందరి కళ్ళు హెడ్‌క్లర్కు ముఖంలో మారుతున్న భావాలను తమతమకో

ణాలనుండి పరికిస్తున్నాయి.

'భిందామహరాజ్' పాన్‌డబ్బీ ఇవ్వబోయాడు...హెడ్‌క్లర్కు సిగరెట్టు కాల్చే టప్పుడు పాన్‌తినడు.

"సార్ నిజంగానే మంచి పని చేస్తారు. పాన్‌నమిలేటవుడు సిగరెట్టుతాగే వాళ్ళ, సిగరెట్టు ఎఱ్ఱగా ఏదో వికారంగా తయారవుతుంది... " గుల్సన్ మెహతా వెంటనే హెడ్‌క్లర్కును సమర్థించాడు.

"అరే ఓ...హుజూర్!"

"నీ పేరేమన్నావు?"

."సింగేసర్‌రామ్" సింగే సర్‌తో పాటు గుమస్తాలందరూ అదే పేరును వంత పలికారు.

"చూడు సింగేసర్‌రామ్! ఈ టేబుల్ ఎ.బి.యమ్ అంటే మిస్‌దాస్ గారి చాంబరు లోకి వెళ్తుంది."

"మిస్‌దాస్‌గారి చాంబరులోకా?"

గుమస్తాలందరూ ఒకే స్వరంతో ప్రశ్నించారు - "ఎందుకు?"

"ఎందుకలా హుజూర్?" అందరి కంటే ఆఖరిలో సింగేసర్ అడిగాడు.

"ఆమె కావాలంటున్నది."

"ఏమన్నారు సార్?" మెహతా వుండబట్టలేక అడిగాడు. "సార్! మరి మీరు కూడా అక్కడే కూర్చుంటారా?"

అనురంజన్ మెహతావైపు అదోవిధంగా చూశాడు. "ఓహో! సరే, అర్థమ యింది సార్!" అని మరలా మెహతా అన్నాడు.

"దీంట్లో అర్థం పర్థం కావాల్సిందేముంది? ఆవిడమరే యితర టేబుల్ పైన పనిచేయలేదు" అనురంజన్ నచ్చచెప్పాడు.

"సరే, అయితే తన పెద్దటే బుల్‌ను ఇవ్వమనండి."

"అది కూడా ఇవ్వదట. రెండూ వుంచుకుంటుంది."

"స్టోరులో కొత్త టేబుళ్ళు లేవుకదా!"

"చూడు ఝూ స్టోరుకు టెలిఫోన్ జేసి వాకబుచెయ్యి."

"బెనర్జీ దాదా! స్టోరులో సెక్రటేరియట్ టేబుల్ ఏమన్నా...కొత్తటేబుల్స్ ఏమన్నా వున్నాయా? అరే తమాషాగాదు. హెడ్‌క్లర్కు గారికి కావాలి. లేవా?" మెహతా స్టోరుక్లర్కుతో టెలిఫోన్లో మాట్లాడుతున్నాడు.

మెహతా గాబరాపడి పోతున్నాడు. అతని ముఖంలో ఇది స్పష్టంగా కనబ

డుతూంది.

"బెనర్జీ దాదా ఏమంటున్నాడు?" సేన్ నవ్వుతూ అడిగాడు. "బెనర్జీ దాదా వట్టి పిచ్చోడు. ఏమంటున్నాడో తెలుసా. పోయి టేకు చెట్లు నరికించి, వాటిని రంపాలతో కోయించి, టేబుల్ తయారు చేపిస్తాడట. టేబుల్‌లు చెట్లకు పండవట."

"క్రింగ్, క్రింగ్, క్రింగ్..." టెలిపోను మ్రోగుతుంది...

"యా. ఎస్. గుప్తామాట్లాడుతున్నాను! ఆ?" అయితే నేనేటేబుల్‌పైన కూర్చోవాలి? స్టోరులో టేబుల్స్‌లేవట. అయితే ఆఖరికి నేను గూడా పని చేయాలిగదా. కానీ పెద్దదొరగారితో, నేనెట్లాచేప్పేది. మీరే చెప్పండి...ఐడోంట్‌థింక్..."

టెలిఫోన్‌లో జరుగుతున్న సంభాషణలని వింటున్నంతసేపు గుమస్తాల ముఖాలలో ఉద్వేగం, సంతోషం తాండవిస్తున్నాయి... ఆతర్వాత అందరూ తమకనుగుణంగా ముఖకవళికలను ఏర్పరుచుకున్నారు.

"ఆఖరికి ఈ టేబుల్‌లో ఏముంది?" బిందామహరాజ్ అన్నాడు.

దుర్బాదాస్ ఇప్పుడేతనను బెత్తంతో కొట్టినట్లు మెహతా ఫీలయినాడు. "కఱ్ఱతో జేసిన వస్తువును గురించి ఇంత మమకారామా? మనుషులను గురించిన చింత ఏమాత్రం లేదు," సేన్ అన్నాడు.

అనురంజన్ మౌనంగా ఉన్నాడు. నగీనాప్రసాదు వైపుచూపు మళ్ళించాడు. కాగితాలు తిప్పుతూ వ్రేళ్లను నాలుకకు అంటిస్తున్నాడు. పేజీలను తిప్పుతూనే, "చాలా స్వార్థపరులను చూశాను గాని ఇటువంటి వాళ్ళను నేనెక్కడా చూడలేదు," అన్నాడు.

స్టోరు క్లర్కు బెనర్జీ వచ్చిక్రొత్త హెడ్‌క్లర్కుతో పరిచయం చేసుకున్నాడు- మీరు మాకు హెడ్‌క్లర్కు. అంటే పెద బాబు గారు! కానీ వయస్సులో నేను మీకంటే పెద్ద, చూడండి, ఈ టేబుల్ మీరు ఏపరిస్థితులలోను ఇవ్వకండి."

"ఆమెది చాలా సంకుచితమైన మనసు."

"ఇసుమంతైనా హృదయంలో దయాదాక్షిణ్యాలులేవు."

"ఎవరి ఉద్యోగమైనా ఊడుతున్నప్పుడు కూడా ఈమె ముఖంలో నవ్వు తాండవిస్తుంది."

"ఇంతకూ మానవత్వమనేది అంటూ ఒకటి ఉండాలికదా."

"భగవంతుడు ఈ విడని ఆడదాన్ని ఎందుకు చేసిపంపాడో!"

"ఈవిడ రూపలావణ్యం అంతా వ్యర్థం."

అనురంజన్ ప్రతి ఒక్కరి మాటలువింటున్నాడు. ఎవరు దుర్బా నడతను

గురించి పల్లెత్తుమాట అనటంలేదు. స్వార్థపరురాలు, హృదయంలేనిది. కఠినా త్ముకాలు అని అంటున్నారు. కాని తనయవ్వనాన్ని అంద చందాలను పణంగా పెట్టి ప్రమోషన్ సంపాయించిందని ఎవరూ అనటం లేదు. ఎవరూ ఈ మాటలు అనజాలరు కూడా.

"ఈ విధంగా మొండి పట్టుపట్టకూడదు. సరే, లెట్‌మీసీ" అంటూ మెహతా ఆఫీసు నుంచి బయటికి వచ్చాడు.

"వీడు పోయాడు. ఏదో ఒక తీర్పుచెప్పేదానికి. వీడు మధ్యలో ఎందుకుపో వాల్నో" ఝూ, సేన్ చెవిలో అన్నాడు.

"ఇప్పుడుంది అసలు తమషా! ఆట ఇప్పుడు మొదలవుతుంది." కన్నుగొట్టి సేన్ అటువైపు చూశాడు.

మెహతా తిరిగొచ్చాడు. దుర్బాదాస్‌ను ఆ మాదిరి కోపావేశంలో ఉండటం ముందెప్పుడూ అతను చూడలేదు. మెహతాయే కాదు మరెవ్వరూ చూడలేదు. సౌందర్యోపాసకుడు బిస్నూసింగుప్యూను కూడా చూడలేదు.

గత ఏడు సంవత్సరాల నుండి పైసలు తీసుకోకుండానే మిస్ దాస్ గారి సేవలు చేసే దానికి అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు. ఇన్ని రోజుల తర్వాత ఇప్పుడు భగవంతుడు అవకాశాన్ని ప్రసాదించాడు. తను ఆఫీసులోనే కాక ఇంట్లో కూడా ఆవిడసేవలు చేస్తానని ఇవాళే మిస్ దాస్‌తో విన్నవించుకోవాలనుకున్నా డు. బిస్నూ సింగు అన్ని పనులు చేస్తాడు. కావాలంటే ఆవిడ కాళ్ళకు జోళ్లు కూడా తొడుతాడు. కానీ ఏంజేస్తాడు పాపం? ఈ వేళ మిస్‌దాస్ గారి మనసు కల తగా వుంది. క్షణమయినా శాంతంగా కూర్చో లేక పోతుంది. వచ్చే పౌర్ణమి నాడు పూజలు చేసేదానికి ఎవరైనా పురోహితులు కావాలేమో తెలుసుకుందా మని బిందా మహరాజ్ పెద్ద దొరవద్దకు వెళ్లాడు. లోపల పెద్ద దొర మిస్ దాస్‌తో మాట్లాడటం అతనువిన్నాడు..."వీళ్ళేదు! ఏమిటీ పిల్లలచేష్టలు? వాళ్ల మాదిరి మీరు మాట్లాడటం? మీరొక్కరే రెండు టేబుల్లు వుంచుకుంటే అతనెలా పని చేయాలి? నాకు తెలియక అడుగుతాను, ఇంతకూ ఆటేబుల్లో ఏముందని?"

"సార్, ఆటేబుల్ నాకు తప్పక కావాలి. ఎలాగైనాసరే నాకది ఇప్పించాలి, నేను నా కొత్తటేబుల్ ఇస్తానన్నాను కదా," మిస్ దుర్బా దాస్ ప్రాధేయపడింది.

మాట మారుస్తూ పెద్ద దొరగారు, "హు, ఆటేబుల్ ఎ.బి.యమ్.ది హెడ్‌గు మస్తా కివ్వటం కుదరదు. అది సరే. టేబుల్ ఇచ్చేదానికి, పుచ్చుకొనే దానికి మీరెవరూ? " అన్నారు.

పెద్దదొర కావాలనే కఠినంగా మాట్లాడేరు.

"సార్, ఆ టేబుల్ లేకపోతే నేనేమి పని చేయలేను."

దొరగారి ముఖంలో చిరాకు స్పష్టంగా కన్పించింది.

ఇంతకు ముందెన్నడూ దుర్బాదాస్‌ను ఆఫీసరు ఈ మాదిరి కోపగించుకోలేదు. ఆమె ఇలాంటి చిరాకును కూడా చూడలేదు.

"సార్, సెంటిమెంటల్ అనండి లేకపోతే నాపిచ్చి అనండి. నేను ఎవర్నీ ఆటేబుల్‌పై కూర్చో నివ్వను. ఇది మాత్రం ఖాయం." దుర్బాదాస్ అనింది.

"పెద్ద దొరగారు 'లెర్న్‌యువర్‌సైకాలజీ' అనే సంపుటాలకు చందాదారుడు. మిస్‌దాస్ మాటలను విన్నతర్వాత దీంట్లో ఏదో మానసిక సమస్య తప్పక ఉందని అతను గ్రహించారు. కొంత సేపాగి, "నా బుర్ర కేమి పాలు పోవటం లేదు. కానీ ఒక వేళ మీట్రాన్స్ఫర్ కలకత్తా కయితే, ఈ టేబుల్‌ను మీ వెంట కలకత్తాకు తీసు కెళ్తారా మరి...?" అన్నారు.

"అవును సార్ తప్పక తీసుకెళ్తాను."

"సరే, ఒక వేళ..."

"ఉద్యోగం నుంచి రిటైరై పోతే ఏమి చేస్తావని అంటారా? అప్పుడు ఈటే బుల్‌ను నాకమ్మమని కంపెనీ వాళ్ళను అడుగుతాను."

'టెర్రిబుల్...' సరే వెళ్ళి పోండి నేను హెడ్‌గుమస్తాతో మాట్లాడుతాను.

మీరే చెప్పండి నన్నేం చేయమంటారో? అని అడిగాడు అనురంజన్‌దాస్ పెద్దదొరను.

"మీరు అనవసరంగా ఈ స్వల్పవిషయాన్ని తీసుకొని సమస్యలోపెడుతు న్నారు. ఈ వేళ కొత్తపోస్టులో చేరటంతోనే అందరినీ ఇబ్బంది పెడుతున్నారు. పెద్దదొరగారు. టెలిఫోనులో మిస్‌దాస్‌తో అన్నాడు.

బిష్నూసింగు అను రంజన్ గుప్తాగారి వద్దకు వచ్చి మిస్ దుర్బా దాస్ గారు పిలుస్తున్నారని చెప్పాడు.

ఈ మారు దుర్బాదాస్ అందమైన ముఖంలో అనురంజన్ గుప్తా నారీ అస మర్థతను స్పష్టంగా చూశాడు. అలసటగా, చిరాకుగా, చిందరవందర దుస్తు లతో కూర్చున్న దుర్బాదాస్ ఎదురుగా కన్పించింది. తాముట్రైనింగు పొందేట ప్పుడు ఒక మారు దక్షిణేశ్వర్, బేలూరు నుంచి తిరిగి వచ్చే టపుడు ఇదే మాది రిగా అలసటతో చికాకుతో ఉన్న దుర్బాదాస్ ముఖం అతనికి గుర్తుకువచ్చింది.

"మిస్టర్ గుప్తా!"

"ఆజ్ఞాపించండి మేడమ్."

"ఆజ్ఞాపించడం గాదు మీరాటేబుల్ నాకిచ్చేయండి."

జనరల్ సెక్షనులోని గుమస్తా నవ్వుతూ - ఇప్పుడు చూడాలి తమాషా! అన్నాడు.

"బెనర్జీ దాదా, టేకు చెట్టుకొట్టించి టేబుల్ తయారు చేయిస్తానని మీరు జవాబివ్వండి" అంటూ మెహతాస్టోరు బాబు బెనర్జీకి టెలిఫోను జేసి చెప్పాడు. గుమస్తాలందరికి చాలా సంతోషంగా వుంది...క్రైసిస్, ప్రాబ్లమ్ అలాగే వున్నాయి. సొల్యూషనేమి దొరకలేదు. కానీ గడియారం ముల్లు కదులుతూనేవుంది ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు గంటలయింది.

మరుసటిరోజు మిస్‌దాస్ జబ్బుపడిందని ఒకవారం సెలవు కోసం అర్జీ పంపిందని తెలిసి అందరికీ ఆశ్చర్యమేసింది.

ఈ ఐదురోజుల్లోనే అనురంజన్ ఆఫీసులో పనిజేసే ప్రతి ఒక్కరిని గుర్తించి తెలుసుకున్నాడు. ఒకరిని మించి ఒకరు పని దొంగలు. గుల్షన్ మెహతా ఆఫీసర్లను పొగడటంలో మహానేర్పరి. అందువల్లనే అతన్ని అందరూ 'పాల్షన్' మెహతా అంటారు.

ఎవరు ఏమన్నా మిస్‌దాస్ తనపనిలో నేర్పరి. ఆఫీసు పనంటే ఆవిడ కెంతో ఇష్టం. తను ఏఫైలును డీల్ జేసినా దాన్ని ఎంతో జాగ్రత్తగా మెయిన్‌టెయిన్ చేస్తుంది. ఎలాంటి తప్పులకు తావుండదు. కానీ ఆటేబుల్ కోసం ఆమె పట్టిన మొండి పట్టు? దీన్ని ఏమనాలిమరి? దీనికి కారణమేమిటి?

"సార్! నాకు తెలుసుకారణం" అన్నాడుమెహతా.

"కారణమేమిటో చెప్పు" అన్నాడు. అనురంజన్.

మెహతా అనురంజన్ దగ్గరికొచ్చి చాలా నెమ్మదిగా - "మిస్‌దాస్ ఛాతీపైన కాలరు బోనుకు సరిగ్గా క్రింద ఒక రూపాయిబిళ్ళవెడల్పులో బొల్లి మచ్చ వుంది. దురద పుట్టినప్పుడల్లా టేబుల్ అంచుతో ఆ మచ్చను రాచుకుంటుంది."

"మెహతాగారూ! మీ ఎ.బి.యమ్. గారిని గురించి ఇటువంటి తలాతోకాలేని మాటలు నాముందర వాగకపోతే మంచిది" అన్నాడు.

అపురూపసౌందర్యరాశి దుర్గా శరీరంపైన బొల్లి మచ్చా? అసంభవం! ఈ మెహతా ఎటువంటి వాడో తనకు తెలుసు. లోకంలోని ఏవిషయమైనా సరే తనకు అంతా తెలిసినట్లు చెప్తుంటాడు... సేన్ గారు నిన్న చెప్పింది నిజం, "ఒక రోజు పెద్దదొరగారు మెహతా నడిగాడు. మిస్టర్ మెహతా, గాడిదఎట్లా అరుస్తుంది.

అరచి చూపించు అని! దొరగారు అడిగిందే తడవుగా మెహతా వెంటనే ఒంగ్ర పెట్టాడు. అటువంటి వాడు మెహతా. ఈ భూప్రపంచంలో మెహతాకు జోడీ ఎవరూ లేరు."

సేన్ మెహతాను ఈ విధంగా గేలిచేసినప్పుడు మెహతాయేమో సేన్‌ను - చచ్చిన చేప, ఆకలి గొన్న బెంగాలీ, నిండుగా అన్నంవున్న పళ్లెం అని ఏమేమో అంటూ గేలిచేయడానికి ప్రయత్నిస్తాడు.

ఆ రోజు ఆఫీసుమూసిన తర్వాత మెహతా దుర్బాదాస్ ఇంటికి పరుగెత్తుకెళ్ళాడు. బయట లాన్‌లో దుర్బాదాస్ విచారంగా కూర్చుని వుంది. ఆవిడ ఇంట్లో చాలా భయంకరమైన కుక్కలున్నాయి. ఆ భయం వల్ల అతను గేటు దాటిలోపలకు వెళ్లలేదు. బయటి నుంచే అతను, "ఈ వేళ డి.డి.టి. పౌడరు, గ్రైమక్సిన్ రెండూ కలిపిటేబుల్‌ను డిస్‌ఇంఫ్యాక్ట్ చేశారు. అని సమాచారం అందించాడు.

డి.డి. టి హరేమ్...! దుర్బాదాస్ ఈ సందేశాన్ని విని నిశ్చేష్టురాలయింది.

మిస్ దాస్ మరి నాలుగురోజులు సెలవును పొడిగిస్తూ అప్లికేషన్ పంపిందని అందరికీ తెలిసిపోయింది...

అనురంజన్ దాస్ గుప్తా పెద్దదొరగారి ఆదేశాలమేరకు రూల్సుప్రకారం అసిస్టెంటు మేనేజరుగారికి ఒప్ప చెప్పవలసిన పనులవివరాలు తయారుజేశాడు మిస్ దాస్ గైర్‌హాజరీలో అతను ఆమెపనులు కొన్ని చేశాడు.

ఆరోజున మళ్ళా టేబుల్‌ను గురించిన ప్రసక్తి వచ్చింది.

"టేబుల్ పుంలింగమా? అందుకే...అహ్హ,హ్హ,హ్హ," అంటూ సేన్ నవ్వాడు.

మిస్‌దాస్ పెట్టుకొన్న సెలవుల్లో మూడు రోజులు ముగిశాయి.

ఆరోజు ఆఫీసునుంచి తిరిగొస్తూనే అనురంజన్, "అమ్మా, నేను తొందరగాస్నానం చేసివస్తాను. ఈ రోజు ఇక్కడున్న రామకృష్ణ ఆశ్రమాన్ని మీకు చూపిస్తాను. ఈ వేళ అక్కడ ఎవరో స్వామీజీ ఉపన్యాసం ఇస్తారట" అని వాళ్ళమ్మతో అన్నాడు.

అనురంజన్ బాత్‌రూములోంచి బయటికి రాగానే 'ఎవరో ఒక స్త్రీ నీతో మాట్లాడటానికి వచ్చిందని వాళ్ళమ్మ అతనితో చెప్పింది.'

"స్త్రీ నా? అంటూ అనురంజన్ ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాడు. అరే! ఈ విడ దుర్బాదాస్! అమ్మ స్త్రీ అటుందేమిటి? మాడరన్ స్లీవ్ లెస్ బ్లౌజ్, మ్యాచింగ్ కంచిపట్టు చీర! ఇటువంటి మాడల్స్ రోజూ పేపర్లో ప్రింటు అవుతూనే ఉంటాయి. ఏవో చీరల కంపెనీ వాళ్ల ప్రకటనలలో! ఈ వేళ దుర్బాదాస్‌కు

ఏమయిందో ఏమిటో?"

"నమస్కారం!...ఇప్పుడెలావుంది మీ ఆరోగ్యం...అసలేమయింది మీకు?"

దుర్బాదాస్ మౌనంగా వుండి పోయింది. అనురంజన్ అమ్మగారు రెండు కప్పులతో టీ తెచ్చింది. "అమ్మా, ఈవిడ మా ఏ.బి.యమ్ మిస్‌దుర్బాదాస్...ఈవిడ మా అమ్మగారు" అనురంజన్ పరిచయంచేశాడు.

అమ్మ వంటింట్లోకి వెళ్ళిపోయింది.

ఇప్పుడు మీ అమ్మగారే వంటచేసిపెడ్తారా?

"అవునండి." నేనెంతో అదృష్ట వంతుణ్ణి. అమ్మ జేసిన వంటనే ఇప్పటికీ..."

"ఈ విషయంలో నేను కూడా అదృష్టవంతురాల్నే."

ఈ విషయంలోనే కాదు. అన్ని విషయాలలోనూ మీరు అదృష్టవంతులే.

ఈవిడ కలకత్తాలో తనతో పాటు చదివిన ఆదుర్బాదాసే అని గుర్తించాడు అనురంజన్ దాస్! కానీ ఇప్పుడు ఈమె ధరించిన వస్త్రాభరణాలు కొంచెం కొట్టొచ్చినట్టున్నాయి. అంతే తేడా!

"పాట్నా ఎలాగుంది మీకు?" అని దుర్బాదాస్ అడిగింది.

"పాట్నాకేమి? చాలాబాగుంది."

"ఏమి బాగుందండీ? కలకత్తా...బొంబాయిలకంటే బాగుందా?"

కలకత్తా శబ్దాన్ని ఉచ్చరించేటప్పుడు కళ్ళెందుకో చెమ్మగిల్లాయి! కొన్ని క్షణాలవరకు మౌనం వహించింది.

"మీరు రేపు ఆఫీసుకు వస్తున్నారు కదూ! మేడమ్."

"రేపు?" స్వప్నలోకంలోంచి ఊడి పడ్డట్టు అన్పించింది దుర్బాకు...రేపు నేను వచ్చేది, రానిదీ మీ మీద...నీ మీద ఆధారపడి వుంటుంది.

"నా మీదనా?"

"అవును...నీ పైన. నీ పైనే అనురంజన్ బాబుగారూ! నేను చెప్పానుగదా, అటేబుల్‌పైన మరెవ్వరూ పని చేయటం నాకు బొత్తిగా ఇష్టం లేదని! అది లేకుండానేను... ప్రతిరోజూ రాత్రికలల్లో నేను ఆటేబుల్‌ను చూస్తున్నాను...ఆ టేబుల్ నాకు దొరికి పోయినట్లు, మరలా ఎవరో దాన్ని లాక్కు పోయినట్లు...టేబుల్ కొరకు చాలా గొడవజరిగి పోయింది. ఒక విధంగా యుద్ధం జరిగినట్లు - పెద్ద ప్రమాదమే సంభవించింది. టేబుల్‌కు నిప్పంటించారు. నా టేబుల్ అగ్నికి ఆహుతై పోయినట్లు, పొగ, ఒకటే పొగ! టేబుల్ కాలుతున్నట్లు...ఈ మాదిరి ఎన్నో భయం

కరమైె నకలలు."

"మిస్‌దాస్, అందరికీ ఈ విషయం ఆశ్చర్యమేస్తుంది."

"ఆ సంగతి నాకు తెలుసు! అందరి అనుమానాలకు సమాధానం చెప్పవల సిన బాధ్యత నాకు లేదు. ఒక విషయం - ఎవరైనా ఒక స్త్రీ పరాయి పురుషుడి ముందు కాళ్ళు జాపుకొని, చేతులు చాచి, మనసిచ్చికూర్చోగలదా?" చెప్పు నీవే చెప్పు అనురంజన్.

అనురంజన్ ముఖం పాలిపోయింది.

"గుప్తా, నీవు ముందు ఇట్లా వుండే వాడివి కాదుగదా. ఇంత నిర్మోహమా టంగా ఎలా మారావు? డి.డి.టి. టేబుల్‌పైన చల్లించా వటగదా, నీకు మనసెలా ఒప్పింది? నీవు టేబుల్ డ్రాలు గట్టిగాలాగి మూస్తున్నావా? సేన్ కోపంతో టేబు ల్‌ను మాటిమాటికి గుద్దుతున్నాడా? నీవు దానిపైన మేకు కొట్టించినావట గదా! ఎందుకలా జేశావు చెప్పు గుప్తా!" చాలా ఆవేదనతో అంది.

మాట్లాడేటప్పుడు దుర్బాదాస్ మత్తుగొలిపే కళ్ళల్లో మరింత మత్తు ఆవరి స్తుంది. చేతి వ్రేళ్ళులయబద్ధంగా నాట్యంచేస్తాయి. అనురంజన్ ఇది గమనించా డు.

దుర్బాదాస్ లేచి కిటికీ వద్దకు వెళ్ళింది. ముక్కు చీది నాసికా రంధ్రాలను శుభ్రం చేసుకుంది... ఉన్నట్లుండి కలకత్తాలో ఉన్నప్పటి దుర్బా తిరిగొచ్చింది. కలకత్తాలో వున్న దుర్బా తేపినా, పళ్ళతో గోళ్ళు తీసుకున్నా, ముక్కు చీదినా, ముఖాన్ని వికృతంగా మార్చుకొన్నా, భయావహంగా వున్నా - అన్ని సందర్భా లలోను అందంగా కనబడుతుంది...."క్షణక్షణం నీ నిత్య నూతన రూపమే, నా కనుదోయిముందు కనిపించు గదా!" అని ఎవరో కవి అన్నట్లుగా.

'నీవు...."

"క్షమించండి, మిస్‌దాస్‌గారు. మీరు నన్ను నీవు అని పిలుస్తున్నారు. కానీ మిమ్మల్ని నేను నీవు అనిపిలువలేను."

"నిన్ను నీవు అని పిలుస్తున్నానా. సరే ఇప్పుడు నేను నిన్ను మీరు" అని పిలుస్తాను. సరేనా. మీరు కూడా నన్ను నీవు అని పిలువకూడదూ? ఎందుకు పిలవలేరు? సిల్లీ...అది సరే గానీ మిస్టర్ గుప్తా ఈ ఏడుదినాలు నేను టేబుల్ సమస్యను గురించి చాలా ఆ లోచించాను. పెద్ద దొరగారేమో కొత్తటేబుల్ నీకు ఇచ్చేదానికి వీలు పడదంటారు. చూడు గుప్తా, ఈ సమస్యకు ఒకటే సమాధానం వుంది. నీవు ఇక మొండి పట్టు పట్టవనుకుంటాను."

"మొండిపట్టా? నేను మొండి పట్టుపట్టున్నానా మిస్‌దాస్?"

"మిస్‌దాస్! ఎందుకు? కేవలం దుర్గా అని పిలవలేవా? సరే. నీవు నామాట వినక పోతే నారాజీనామాను నీవు కోరుకుంటున్నావని నేను అనుకుంటాను. పెద్ద కుటుంబ పోషణ భారం నా పైన ఉందని నీకు తెలియందిగాదు. ఉద్యోగాన్ని వదలి నప్పటికీ...ఆ టేబుల్ లేకుండా నేనెలా బ్రతక్కలను?"

"మీరు ఏమి ఆలోచించారో నాకు చెప్పండి మిస్‌దాస్."

"అలా కాదు. ముందు నేను చెప్పినట్లు వింటానని నాకు మాటివ్వు."

పోయిన సంవత్సరంకూడా దుర్గా ఇలాగే మాట ఇవ్వమని కోరింది.నాకు సహాయంచేస్తావు కదూ అని, అనురంజన్ మాటిచ్చాడు- "మీమాట వింటాను అదేదో చెప్పండి" అన్నాడు.

"నిజంగానా! చూడు అనురంజన్ ఆఫీసు పనికి సంబంధించి నంత వరకూ నీవు ఎక్కువ సమయం నా చాంబరులోనే గడపవలసి వస్తుంది. నీవే ఇంతకు ముందు అన్నావుగా- 'ఈ ఎ.బి.యమ్. కి సంబంధించిన కొత్త స్కీము అంటే ఏమిటో. సీనియర్ హెడ్‌క్లర్కు అన్నమాట. సీనియర్ హెడ్‌క్లర్కు అంటే అసి స్టెంటు బ్రాంచ్‌మేనేజరు' అని, అటువంటప్పుడు నీవు నా చాంబరులోనే ఎందుకు కూర్చో కూడదు? దీని వల్ల సమస్యకు పరిష్కారం దొరుకుతుంది. టేబుల్ నా చాంబరులోనే ఉంటుంది. టేబుల్ నా కళ్ళముందలే వుంటే నీవు గట్టిగా డ్రాలను లాగటం, గట్టిగా మూయటం చేయలేవు. సుత్తితో దానిపై నమేకులు గొట్టలేవు - కనీసం నేనుండగా."

అనురంజనేమో ఇది వరకే మాటిచ్చాడు. అయినప్పటికీ దుర్గాకు నమ్మకం కుదరలేదు. అందువల్లనే ఆవిడ మాటిమాటికి అంటూంది. - "చెప్పు అనురంజ న్. నీకు ఏమైనా అభ్యంతరముందా? నిజంగానే మాటిచ్చావుగదా. రేపు మరలా మాట మార్చవుగదా? వాళ్ళమాటా వీళ్ళ మాటా విని నాటకం ఆడవుగదా? గుల్షన్ మెహతావున్నాడే అతడు చాలాదుర్మార్గుడు!...సరేనా?"

చివరి మాట అంటూ దుర్గా అనురంజన్ చెయ్యి పట్టుకుంది.

"ఇప్పుడిక ఆశ్రమానికి పొయ్యేటయిము లేదుకదా అనురంజన్! సరే, పొయ్యి రగిలిస్తాను" అంది అనురంజన్ అమ్మగారు.

"సరే, నేను వెళ్తాను. రేపు పదిగంటలలోపునే ఆఫీసు కొస్తావు గదూ! తప్ప క రావాలి సుమా! పెద్ద దొరగారేమో తొమ్మిదిన్నరకే వచ్చేస్తారు...తర్వాత అందరూ వస్తారు. అప్పుడు మరలా టేబుల్‌ను గురించి రాద్ధాంతం చేస్తారు."

సెలవు అంటూ ఆవిడ వెళ్లిపోయింది.

దుర్గా తనను కొరడాతో పటా పట్‌మని కొట్టిమరీ వెళ్ళినట్లు అనురంజన్‌కు అనిపించింది.

మరుసటి రోజు దుర్గా తొమ్మిది గంటలా ఇరవది ఐదునిమిషాలకే ఆఫీసు కొచ్చింది.

పెద్దదొరగారి కారు తొమ్మిదిన్నరకొచ్చిపోర్టికోలో ఆగింది. దుర్గా ఎదురుగా వెళ్లి నమస్కారం చేసింది.

"మిస్‌దాస్ ఎలాగున్నారు? ఇప్పుడెలాగుంది... మీ ఆరోగ్యం."

"ఇప్పుడు బాగుందిసార్" ఉత్సాహంగా దుర్గాజవాబిచ్చింది. ఆఫీసరుగారు లోలోపల ఆశ్చర్యచకితులైనప్పటికి బయటికి మాత్రం నవ్వివూరుకున్నారు.

"దుర్గా ఆఫీసరు వెంట అతని చాంబరులోకి వెళ్లింది. ఆఫీసరుగారి ఫ్యాన్ చాంబరులో వున్నంత వరకూ ఆవిడ ఏమి మాట్లాడలేదు. ఫ్యాన్ బయటికెళ్ళి న తర్వాత ఆవిడ ఆఫీసరుగారి మూడ్‌ను పరికించి నెమ్మదిగా విన్న వించసాగిం ది- "టేబుల్ ప్రాబ్లమ్..."

"చూడు మిస్‌దాస్ ఇక నేను ఈ ప్రాబ్లమ్, ఈ సమస్య గురించి ఒక్కమాట గూడా వినదల్చుకోలేదు. ఇదే మాదిరి మీరు టేబుల్, కుర్చీల గురించి చిన్నపి ల్లలమాదిరి పోట్లాడు కుంటే నేను జి.ఎమ్.కు మీమీద రిపోర్టు చేయవలసివస్తుం ది...సిగ్గుచేటు " అంటూ ఆఫీసరు గారు మండిపడ్డాడు.

"లేదు సార్. ఇప్పుడు ప్రాబ్లమ్ ఏమిలేదు. అంతా సర్దుబాటయ్యింది!"

దుర్గాదాస్ సమస్యాపరిష్కారం గురించి అన్ని విషయాలు వివరంగా చెప్పింది. నిన్న సాయంత్రం తను అనురంజన్ ఇంటికి వెళ్ళి అన్ని విషయాలు నచ్చజె ప్పి వచ్చానని చెప్పింది.

ఆఫీసరు అంతావిని సరే చూద్దామని ఆలోచనలో పడ్డాడు. "అనురంజన్ గుప్తాను గురించి హెడ్ ఆఫీసు మొదలుకుని బోర్డులోని సభ్యులందరూ ఎంతో పొగిడేస్తూ వుంటారు. అతనే నా కార్యనిపుణుడు? అంటే వెన్నెముకలేని మనిషి!... సరే. జనరలు సెక్షనులో ఆమెహతాకు వాగే దానికి అవకాశం దొరుకుతుంది. ఆ హాండీ, హెల్ప్‌ఫుల్ మెహతా ఈ సత్పురుషుడైన అనురంజన్‌లో తేడా ఏముంది?" అది సరే గానీ గుప్తాకు ఎలాంటి అభ్యంతరముండదు గదా? అని మరలా అడిగా డు.

"అతనికేమీ అభ్యంతరముండదు సార్. అతనూ బయలుదేరి వస్తూవుంటా

డు."

పదిగంటలకు ముందే దుర్బాదాస్ తనటేబుల్‌ను తనచాంబరు లోకి తెప్పించుకుంది. టేబుల్ చాంబరులోకి తెచ్చేటపుడు ఆవిడ, తెచ్చే మనుషుల వెంటే ఉండింది- టేబుల్‌కు ఎలాంటి దెబ్బతగలకూడదని చూస్తూ! కాని లోనికి తెచ్చేటప్పుడు ఏదో ఒకటి తగులుతుంది గదా. ఎక్కడో గోడకు టేబుల్ రాచుకుందో లేదో గాని, దుర్బాదాస్ తనకు దెబ్బ తగిలినట్లు గట్టిగా అరిచింది.

చాంబరులో ఒక మూలటేబుల్‌ను పెట్టారు. బిస్మాసింగు గుడ్డతీసుకొని టేబుల్‌పైన గట్టిగా దులపసాగాడు. "ఏయ్, నువ్వు మనిషివా, పశువ్వా? ఇంత గట్టిగా ఎందుకు కొడుతున్నావు? ఆ గుడ్డ ఇలాగివ్వు నేను తుడుస్తాను." అంటూ దుర్బాదాస్ గట్టిగా అరిచింది.

దుర్బా తన చేతులతో టేబుల్‌పై నున్న ధూళిని నెమ్మదిగా తుడవసాగింది...బాబోయ్! ఒక పక్షం రోజుల్లో నే నీకీ దుర్దశ దాపురించిందా? అబ్బా! ఇప్పుడు నా ప్రాణంలోకి ప్రాణంవచ్చింది. ఇంకెప్పుడూ నిన్ను పొందజాలనేమోనని నేననుకున్నాను. అరే! ఈ ఎఱ్ఱసిరా నీ పైన ఎవరు పోశారు?

టేబుల్‌ను తుడిచి ఆమెగడియారం వైపు చూసింది. పది గంటలవుతూంది. గుప్తావస్తూ వుంటాడు. ఆమె వాకిలివైపుచూసింది. అక్కడ భరతనాట్యం చేస్తున్నస్త్రీల ప్రింటు వున్న కర్టను కన్పించింది. ఆవిడ మునుపటిమాదిరే రెండు చేతుల్ని చాచి టేబుల్ పైనున్న గ్లాసుపైన తన చెంపను ఆనించింది...ఆహా! ఎంత హాయి! అణువణువూ పులకరిస్తున్నది. ఎంతహాయి!

"ట్రింగ్, ట్రింగ్."

'హు జూర్, అంటూ బిస్మాసింగు అక్కడికొచ్చాడు. దుర్బా సంభాళించుకొంటూ- "ఏమీ లేదు, నీవు బయటికెళ్ళు. కాలింగ్ బెల్ దానంతట అదే మ్రోగింది!"

కర్టను అటువైపు రెండు కాళ్లు కనపడ్డాయి పెద్దదొరకు. అను రంజన్‌గుప్తా వస్తున్నాడు. పెద్ద దొరగారు ఒకలావు పాటిఫైలు తెరిచి కూర్చున్నాడు.

అనురంజన్ వచ్చి నిలబడ్డాడు. దొరగారు ఫైల్లోనిమగ్నుడై ఉన్నాడు- "సార్ నేను కూర్చోవచ్చా - కొంత మీతో."

"ఆఁ! కూర్చో. ఏమిటి?"

అప్లికేషన్ ఒకటి గాదు రెండు.

ఏమిటివి? ఒకటేమో ఒకటిన్నర నెల సెలవుకు సంబంధించినది...తల్లిగారు ప్రయాగ తీర్థయాత్రకు వెళ్ళాలట. తల్లికి ఒకడే కొడుకు కాబట్టి తల్లి వెంట తాను

వెళ్ళ వలసి వస్తుంది. కాబట్టి! రెండో అప్లికేషను తన ట్రాన్స్ఫర్‌కి సంబంధిం చింది - పాట్నా వాతావరణం తన ఆరోగ్యానికి అనుకూలంగా లేదనీ, తనను హెడ్ ఆఫీసు కలకత్తాకు గాని, లేక పోతే బొంబాయికి గానీ బదిలీ చేయమంటూ! ఇది వీలుగాక పోతే, ఈ అర్జీనే రాజీనామాగా భావించమని కోరుతూ.

"చూడు గుప్తా! ఆవేశంలో ఏపనీ చేయరాదు!"

"లేదుసార్, నేను బాగా ఆలోచించాను. ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చాను. మా అమ్మగారికి కూడా ఈ వాతావరణం సరిపడటంలేదు!"

ఆఫీసరు అప్లికేషనులోని భాష, అనురంజన్ ముఖంలో కన్పించిన భావాల్ని చదివి, అనురంజన్ బాగా ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చాడని అనుకున్నాడు. ఇతన్ని గురించి ఇతరులు అంటున్న మాటలు అబద్ధంగా అనిపించటంలేదు. వాస్తవంగా అనురంజన్ గుప్తా-

ఈ రోజు అనురంజన్ సెలవు కావాలని అడిగాడు ఓరల్‌గానే. ఆఫీసరు సెలవిచ్చాడు.

ప్రతి సెక్షనులో ఈ వార్త తెలిసిపోయింది...

అదే పనిగా శబ్దం చేసే ఇరవయ్ టైపురైటర్లు ఒక్కసారిగా ఆగి పోయినాయి.

గుమస్తాలందరూ ఒక్కుమ్మడిగా మంచి నీళ్లుకావాలని అడిగారు!

'ఆ...'

"చివరకు జరగవలసిందే జరిగిందన్నమాట. మిస్ దాస్ తన పంతం నెగ్గించుకుంది."

"త్రియాచరిత్రమ్..."

"అబ్బా. విచిత్రమైన స్త్రీ..."

"గుప్తాగారు వెళ్ళి పోయారా?"

దుర్గాకి గుడా ఈ విషయం తెలిసిపోయింది...

కొంతసేపు నిశ్చేష్టురాలయింది... మొహం పేలవంగా మారిపోయింది. మొహం తెల్లబడి పోయింది...రాజీనామా? సెలవు? అతను తనవద్దకు రానేలేదు. మరి అతనునిన్న మాటిచ్చాడుగా!

ఆమెముఖం తిరిగి గులాబీరంగులోకి మారింది. తను కుర్చీ నుంచి లేచింది. పెదవులపైన చిరునవ్వు మెరిసింది...ఆ చాదస్తపు అనురంజన్‌గుప్తా, రాజీనామా యివ్వనీ, బావిలో దూకనీ నా ధర్మం గెలిచింది, నా మానం దక్కింది.

నీవు నా దానివే...నాదానివే! పోనీ మనమధ్య వున్న కంటకం విరగడయ్యింది!

టేబుల్‌పై వున్న అద్దానికి తనరెండు చెంపల్ని ఒక దాని తర్వాత మరొక దాన్ని తాకించుకుంటూ ఆ స్పర్శ సుఖానికి గగుర్పాటు చెందుతూ- రోదిస్తున్నట్టు కిలాకిలా నవ్వుతూంది- ఎవరికి దేని పైన మక్కువవుంటుందో వాళ్లకే తెలుస్తుంది ఈ ఆనందం...ఆహా!...

ఈ సందర్భానికి వాడ దగ్గ ఇంగ్లీషు పదాలను ఆలోచించుకొని ఆవిడకు కంగ్రాచ్యులేషన్స్ చెప్పేదానికి మెహతా చాంబరులోకి ప్రవేశించాడు. మిస్ దుర్బాదాస్ ఎ.బి.ఎమ్. గారు టేబుల్ పైన చేతులు చాపి అద్దంపై చెంపలు ఆనించి కిలాకిలా నవ్వుతున్నది! రోదిస్తున్నది! కళ్ళు కన్నీళ్ళతో నిండి వున్నాయి. పెదవులపైన ఈ చిరుదరహాసం! మిస్ దుర్బాదాస్ పొందుతున్న ఈ సుఖాన్ని ఏమనాలి? ఏమిటీ సుఖదుఃఖాల సమ్మేళనం? ఏమిటిది?

ఏదో ఒక అశ్లీల దృశ్యం ముందునిలుచున్నట్టు మెహతాకు తోచింది. నా మతి మండా నాలాంటి మందమతి...? అవును, ఈ దృశ్యం చూడతగిందికాదు!

(1961)

# ఒంటరి ప్రయాణం

...అది పుట్టినప్పటి మాట, అంటే ఏడేళ్ల నాటి మాట.

ఒకానొక పర్వదినాన పోతుదూడగా పుట్టినప్పటికీ అది భూమి మీద పడ గానే అందరి ముఖాలు వికృతంగా మారాయి.. చీదరించుకొన్నారు. అందరినోటా అపశకునాలు, అపశబ్దాలు వెలువడ్డాయి.

అది జన్మాష్టమినాటి రాత్రి పుట్టింది కాబట్టి దాని పేరు 'కృష్ణయ్య' పెట్ట మనీ నేను ఇంటి వాళ్లతో అన్నాను.

నామాటలు పుండుపైన మిరపపొడిచల్లినట్లు అన్పించింది మావాళ్లకు..."దీనికా! ఈ కర్రిదానికి కిట్టయ్య అని పేరు పెట్టాలా?" పల్లెటూరి నాభార్య మూతి త్రిప్పుతూ అంది.

అందరూ నవ్వేశారు. నేను చెప్పినపేరు అందరికి నవ్వులాటగా తోచింది. కానీ నా భార్య అన్నట్లు పల్లెటూళ్ళలో వినిపించే 'కిట్టిగాడు' అనేపేరే దానికి నిల్చింది.

ఈ కిట్టిగాడి పుట్టుకతో మా ఇంటి వాళ్ల మాదిరి నా కేమీ నిరాశ, నిస్పృ హలు కలుగలేదు. కర్రిది! ఉంగరాల బొచ్చుది! దూడ ఎంతో ముద్దు వస్తూం ది...!

కానీ అది పుట్టి ఆరు రోజులుకాక మునుపే వాళ్లందరూ, "భాద్రపదంలో పుట్టింది. ఆశ్వీయుజంలో జడివానకురుస్తుందో ఏంపాడో! అదే సంభవిస్తే అందరూ చిప్పలెత్తుకు పోవలవసిస్తుందేమో!" అని భవిష్యవాణిపలికారు...ఛీ, ఛీ, ఏమి మనుషులో! అప్పుడే పుట్టిన దూడనుగురించి ఇలాంటి మాటలు రాక్షసులంటా రేమోగానీ మనుషులంటారా?

ఆరవనాటి రాత్రి ఇంట్లోని వాళ్లందరూ పశువులదొడ్లో ఏమి అనర్థం జరుగు తుందో అని భయపడ్డారు. మా అమ్మగారేమో షష్ఠీ మాతను ప్రార్థించింది. ఇంట్లో ని ముసలీ ముతక అందరూ, "జైషష్ఠీ మాతా! మనుషులకు మగబిడ్డలను, గేదె లకు పెద్దదూడను ప్రసాదించు తల్లీ! ఈ దున్నను తీసుకొని మాకు పెద్దదూడను ప్రసాదించు" అని మ్రొక్కుకున్నారు...తీసుకొమ్మంటే బలిగైకొనమని. గేదెల దొడ్లో

పోతుదూడలను ప్రసాదించవద్దు అని వాళ్ళ ప్రార్థన.

ఇప్పుడు మాదొడ్లో రెండు గేదెలున్నాయి. కోసీ నదికిరువైపులా పల్లపుదేశాల్లో నివసించే అన్ని కులాలరైతులూ జమిందారులూ, గేదెలను పెంచుతారు. గేదెలదొడ్లో మూడు జతల గేదెలు లేక పోతే ఆ ఇంటి వాళ్లను దరిద్రులుగా జమకట్టే వారు పదేండ్ల క్రితం వరకు. ఐతే ఇప్పడేమో లెక్కలేనన్ని గేదెలను పెంచుకుంటూ ఇతరత్రా ఏపనీ చేయకుండా పాడితోనే అందరూ పబ్బంగడుపుకుంటున్నారు. కానీ గేదెలదొడ్డి చిన్నదైనా, పెద్దదైనా, గొల్లవాడిదైనా, రైతుదైనా, పోతుదూడ పుట్టటాన్ని అందరూ అపశకునంగా భావిస్తారు.

నాకోరిక మేరకు నా ప్రార్థనవిని భగవంతుడు దీన్ని మాయింట్లో ప్రసాదించినట్లు నాకన్పించింది. ఇక ఇది తాగవలసిన పాలల్లో అధికభాగం నాకే లభిస్తాయి.. నాదుర్భల శరీరానికి కావాల్సిన పెరుగుకూడా దొరుకుతుంది. మా ఊరిలో పాలు, పెరుగు దొరకడం కష్టం, నన్నేమో మావైద్యుడు రొట్టె, అరటిపండు, పెరుగు లో కలుపుకొని తినమన్నాడు. పెరుగు దొరకక పోతే మజ్జిగతో సరిపెట్టుకోమన్నాడు...జాగ్రత్తసుమా! రవ్వంత ఉప్పుగానీ, చక్కెరగానీ ముట్టుకోవద్దు అని హెచ్చరించాడు. కూడా.

...నాకష్టాలను గట్టెక్కించడానికే సరియైన సమయంలో ఇది పుట్టినట్లు నా కన్పించింది. ఈ నాక్షీణించిన శరీరంలో పోయే ప్రాణం తిరిగొస్తుంది... ఇంకేం పర్వాలేదు. ఆశ్వీయుజపు జడివానో, షష్ఠీ మాతో ఒకవేళ దీని ప్రాణాలు తీసుకున్నా 'దధీ - కదలీకల్పానికి' ఎలాంటి కొరత ఉండదు.

'అంబ్యా! అంబ్యా!' కిట్టిగాడు దొడ్లో నుంచి అరిచాడు.

ఆరోజుల్లో అనారోగ్యం కారణంగా మంచం మీద పడుకొని పల్లెకు వచ్చేపోయే వాళ్లందరినీ తేరిపార చూసేవాడిని నే నొక్కన్నే ఆ పల్లెలో. భాద్రపద మాసం అయినందువల్ల పంటపైర్లు కోసే సీజను కావటం చేత మా ఊళ్ళో వాళ్లందరూ పగలంతా పొలాల్లో ఉంటారు. దొడ్లో నేమో కిట్టిగాడు తప్పమరే దూడ ఉండేది కాదు. దానితల్లి, చిన్నమ్మపొలాల్లో ఉంటాయి.

కిట్టిగాడిని కాకులు పొడిస్తే, నన్నేమో ఈగలు చంపుకుతినేవి. పాపం! ఏరోజున ఇది భూమి మీద పడిందో దీనికి రెప్పెపాడుపులే! పడ్డదూడ అయివుంటే గజ్జలదండ మెడలో వేసిఉండే వాళ్లు. కండ్లలోని పుసితుడిచేవారు. చాలా ప్రేమగా పొలాలనుంచి మూలికలు తెచ్చి వైద్యం చేసేవారు! ఇంట్లోని చిన్నా పెద్దా దొడ్లో ఏ పక్షి వాలినా కాకే అనుకొని తోలే వాళ్లు.

కిట్టిగాడు 'అంబ్యా! అంబ్యా! ' అని దీనంగా అరిచింది.

చాలాకష్టంతో చెప్పులేసుకొని పేడా, గంజరం దాటుకొని దొడ్లోకి వెళ్లాను. కొంతసేపు నా వైపు అదిఆశ్చర్యంతో చూసింది. 'ఏమయ్యింది కిట్టుడూ! కాకులు పొడుస్తున్నాయా!' అని అడిగాను.

అదిలేచి నిలబడింది... నేను దాని వీపుపైన చేతితో నిమిరాను. చెవులకు పిడుదులు అంటుకొని ఉన్నాయి. ఒక జలగ ఎప్పటినుంచో దానిరక్తం పీల్చేస్తుంది.

దాన్ని ఆరొచ్చులోంచి బయటికి తీసుకొచ్చాను. అది చెంగుచెంగు మని ఎగురుతూ నాతో పాటు వచ్చింది.

పిడుదులనూ, జలగనూ తీసేసి గాయాలకు సున్నం రాశాను. కళ్లలోని పుసిని ఆకుతో తుడిసేశాను. దాని కండ్ల నుంచి పుసే కాదు నీళ్ళు కూడా కారుతున్నాయి.

నేను పడుకొనే చోటే సరిగ్గా నా మంచానికెదురుగా గూటానికి కట్టేశాను. జాగామార్చినందుకో, లేక నా దగ్గరకట్టేసినందుకో అది చాలా ఉత్సాహంగా ఉంది. ఉండి ఉండి ఎగిరేదానికి ప్రయత్నంచేస్తూంది.

ఆరోజు దాన్ని గురించి నేను బాగా ఆలోచించాను...ఈ ఆశ్వియుజ మాసపు జడివానకు తట్టుకొనగల్గినా, దున్నపోతైపుట్టిన పాపం దీనిని జీవితాంతం వెన్నంటుతూనే ఉంటుంది. మూడు నాలుగేండ్ల తర్వాత జాతరలో దీన్ని అమ్మేస్తారు. తూర్పు ప్రాంతాలనుంచి వ్యాపారస్తుల్లో, ఏ లబానా (దున్నపోతులు కొనేవాడు) వ్యాపారో దీని మూపుపైన చెయ్యేసి పరీక్షించి - 'ఇంకా ఇది లేతది' అంటాడు. ఇప్పుడే మడక దున్నేదానికి సరిపడదు - లేబోనా, ఏటా లేబోనా (కొనద్దు దీన్ని కొనవద్దు) అంటాడు. ప్రతిమాటలో లోబోనా, లోబోనా వాళ్లు అనటం విని ప్రజలు ఈ వ్యాపారస్థులను 'లబానా' అని అనటం మొదలు పెట్టివుంటారు.

ఆదేరోజునన్ను ఈ కిట్టిగాడితో పోల్చుకున్నాను. పనీ పాటా లేని రోగిష్టి మనిషి కుటుంబానికి బరువే. ఈ కిట్టిగాన్ని అమ్మితే ఇంటివాళ్లకు అరవయ్యో - డెబ్భయ్యో రూపాయలు చేతికొస్తాయి. నన్నేమో ఊరక ఇచ్చినా ఎవరూ కొనరు.

సాయంత్ర మవుతూనే మాయింట్లో అందరికంటే చిన్నవాడు స్కూలునుంచి సంచి తగిలించుకుని వచ్చి మావైపు ఆశ్చర్యంగా చూడ సాగాడు. గుడ్లగూబమాదిరి గుడ్లు మిటకరించి చూస్తున్నావేమిరా, అని నేను అరిచాను.

వాడు చూస్తూండ గానే నేను ఆ దున్న మోర దగ్గరికి వెళ్లి ముద్దాడాను. పిల్ల వాడు ఆశ్చర్యచకితుడై ఈర్ష్యతో అసహించుకొంటూ నా వైపు చూశాడు. నేల పైన 'థూ!థూ!' అని ఉమ్మేస్తూ లోపలికి పరిగెత్తాడు - ఛీ ఛీ. అబ్బే. అబ్బే. తాతగారు దున్నముట్టెని ముద్దు పెట్టుకున్నాడు, అని బిగ్గరగా అరిచాడు.

నవ్వును అనుచుకుంటూ మా ఆవిడవచ్చి, "అరే! ఈ కిట్టిగాణ్ణి ఇక్కడ కట్టే శారేమిటి!" అంది.

"కట్టేశారంటే? నేనే కట్టేశాను! ఈ రోజునుంచి దీన్ని ఇక్కడే కట్టేయాలి. నా వద్దనే!"

"ఆహా, తెలిసిందిలే, పాలుతాగే దూడపేడ...ఛీ, ఛీ."

జిగట విరేచనాలతో నేనే మొ బాధపడుతున్నాను. అటువంటప్పుడు భార్య ఈ విధంగా మూతి ముడుచుకోవటం, నవ్వటం ఏమీ బాగులేదు. కానీ ఎవరు నచ్చ జెప్పుతారు ఈవిడకీ!

"సరే, సరేలే! నీ పిల్లోడు పెట్టే మలం మలయ పర్వత చందనంటాంటి వాసనకొట్టుందా?"

ఒక విషపు నవ్వు నవ్వి - "గుమ్మడికాయలదొంగ అంటే భుజాలు తడుము కొన్నాడట ఎవడో నీకు తోడుపోయినవాడు. నీ కోపం ఎందుకో నాకు తెలుసులే! నీ ముందర కూర్చుంటే దొబ్బులే లేస్తే దొబ్బులే. కోపం తెచ్చుకో! తాపం తెచ్చుకో! టీ మాత్రం ఇచ్చేది లేదు. టీ ఒక్క చుక్కకూడా ఇవ్వద్దని వైద్యుడు చెప్పాడు" అని దెప్పిపొడిచి పోయింది.

చేదు మాత్రలిచ్చే వైద్యుడు నాముందు తియ్యని మాటలు మాట్లాడ కూడ దనీ చెప్పాడేమో!

సాయంత్రానికి పొలాల నుంచి చెరువుగట్ల నుంచి పనులు ముగించుకొని అందరూ ఇంటికొచ్చారు. ప్రతి ఒక్కరూ దున్నను నా దగ్గర కట్టెయ్యటం జూసి ఆశ్చర్య పడ్డమే గాక ఎదిరించారు. నాకు చాలా బాధ అన్పించింది. కానీ నేను కూడా మొండికేశాను ఈ దూడ ఇక్కడే ఉంటుందన్నాను.

కొంత సేపట్లో దాని తల్లి దొడ్లోకి వచ్చి తన దూడకోసం అరిచింది. కిట్టిగాడు నా వద్దనుంచి ఉల్లాసంగా ఎగురుతూ - బ్యా...బ్యా...

అంటూ నేనిక్కడున్నానని అరిచింది.

గేదెకు చాలా ఆశ్చర్యమేసింది. తనదూడ నా వద్ద ఉండటం చూసి...

ఇప్పుడు దాని గురించి విపులంగా చెప్పే అవకాశం దొరికింది. ఏడేళ్ళ

వయసున్న ఈ కిట్టిగాడు చేసే అల్లర్లకు కారణ మంతా నేనే నని, నేనే అపరాధి నైనట్లు నా పైన విచారణ జరపటం మొదలుపెట్టారు.

స్వాతంత్ర్యోద్యమకాలంలో విప్లవకారులను కోర్టుల్లో నిలబెట్టి విచారణ జర పటం, వాళ్ళుదానికి సంజాయిషీ చెప్పుకోవటం నే నెరుగుదును. కానీ నేను చేసిన అపరాధాన్ని క్షుణ్ణంగా పరిశీలించి నాపైన విచారణ జరపాలని పట్టుబ ట్టారు.

ఇదండీ, ఈ కిట్టిగాడి చిన్ననాటి కథా కమామీషు.

సంక్షిప్తంగా చెప్పాలంటే రాత్రింబవళ్ళు నా వద్దే వుండటం వల్ల కిట్టిగాడు నేను చెప్పేదంతా అర్థం చేసుకొనగలుగుతున్నాది. నేనేమో కిట్టిగాడి భాషలో మహాపండితుణ్ణయ్యాను.

ఆ సంవత్సరం ఆశ్వయుజ మాసంలో ఎనిమిది రోజులవరకు జడివాన కురి సింది. ఆ ఎనిమిది రోజులు కిట్టిగాడు పగలంతా ఎగురుతూ గంతులేస్తూ ఉన్నది. దానికృపవల్ల నారోగం కుదుటపడ్తూ వచ్చింది. పెరుగు తినటం వల్ల చిటపటలా డటం కూడాతగ్గి పోయింది.

వైద్యుడు ప్రతి రోజు ఉదయం, సాయంత్రం పొలాల వరకు తిరిగి రమ్మని సలహా ఇచ్చాడు. మాకిట్టిగాడు నాతో పాటు రోజూ తిరిగే దానికి వచ్చేది. ఈ విధంగా మాకిట్టిగాడి బాలకాండ సమాప్తమయింది.

నా ఉదరరోగం తగ్గిపోయింది. కాని ఉదర పోషణ చింత ఎక్కువయింది.

ఊరు వదిలి పట్టణానికి వెళ్తున్న రోజు ఈ దున్నపోతు బండి వెంటచాలా దూరం పరిగెడుతూ వచ్చింది...'పోరా కిట్టిగా, ఇక ఇంటికి వెళ్లిపో,' అన్న నామా టలు విని దాని నోట్లో పచ్చి వెలక్కాయ పడినట్లు అయింది.

నేను వూళ్లో లేనప్పుడు కిట్టిగాడికి ఎలాంటి కష్టం కలిగించకూడదని, దాన్ని ఎవరికీ అమ్మ వద్దని, నేను ప్రతి జాబులో రాస్తూ నా భార్యకు గుర్తు చేసే వాణ్ణి, కానీ ఒక ఉత్తరంలో నా భార్య రాయించిన మాటలు నన్నెంతో కలవర పరిచాయి - "కన్హాయి బాబు, రాత్రింబవళ్ళు దున్నను గురించే ఆలోచిస్తూవున్నాడు. ఇదే మో ఇతరుల పొలాల్లో పడి పైర్లు నాశనం చేస్తుందట. ఎన్ని రోజులనీ ఇరుగు పొరుగు వాళ్ల తిట్లు తినాలి? మన ఊరిలోని 'మక్దూమ్‌మియా' దీనికి తొంభైరూపాయలిస్తానన్నాడుట. మీరు 'కన్హాయి బాబు' భాగం నలభై అయిదు రూపాయలు అతనికి పంపించండి."

రూపాయలు పంపలేదు గానీ నాలుగురోజులు సెలవుతీసుకొని ఊరికి తిరి

గొచ్చాను. ఊరిలోకి వచ్చిచూస్తే జరగకూడనిది జరిగిపోయింది. దున్నను అమ్మేశారు.

మక్దూమ్‌మియాదొడ్డి దగ్గర లావుపాటి తాడుతో కట్టేసివున్న కిట్టిగాణ్ణి చూసి, నామనసెంతో కలత చెందింది. దాన్ని మాలిమి చేసుకునేందుకు మక్దూమ్ ఇష్టమొచ్చినట్లు బాదాడు. దాని శరీరమంతటా బెత్తం దెబ్బలు కనబడుతున్నాయి.

మక్దూమ్‌కు నూటపదిరూపాయలు నగదు చెల్లించి దున్నను ఇంటికితోలుకొచ్చాను.

"ఈ దున్న ఈ రోజునుంచి మనందరిది - ఈ వూరిది, ఈ ప్రాంతానిది" అని ఊరిలోని ఐదుగురు పంచాయతీ దారులకు చెప్పివచ్చాను.

అప్పుడు నాలుగు రోజులవరకూ దున్నతో మనసులోని మాటలు చెబ్తూ కాలం గడిపాను. "కన్‌హాయి బాబూ ఏమో, పైసలు తీసుకొని మక్దూమ్ చేతికి దున్నతలుగు అందించాడు. కానీ దున్న తలుగు తెంచుకొని మనయింటి ఆవరణలోకి దూసుకువచ్చి నావద్దకు పరిగెత్తింది. అప్పుడు నేను వంటింట్లో వున్నాను. అక్కడ కొచ్చి ఒకమూల దాక్కొనింది. కళ్ళల్లోంచి నీళ్లు కారుతున్నాయి. నా వైపు అతి దీనంగా చూసింది - నన్ను నీ ఒడిలో దాచుకో అమ్మా అన్నట్లు" అని నాభార్యనాతో అప్పటి మాట పూసగుచ్చినట్లు చెప్పింది.

దీని తర్వాత కథ నేను విన్నదే!

పట్నం నుంచి ఊరికొచ్చి నప్పుడల్లా ఈ దున్నను గురించి ఏదో ఒక కథ వింటూ వుండే వాడిని. ఏదో ఒక అసాధారణమైన అలౌకికమైన ప్రత్యేకత ఈ దున్నలోవున్నట్లు ఏవో కథలు వూళ్లో వాళ్ళుచెప్పు కొచ్చేవారు.

అదంటే అందరూ ఇష్టపడేవారు. సాధు జంతువని ప్రసిద్ధిపొందింది. ఊరిలోని పిల్లలందరూ దానిపై ఎక్కి స్వారీ చేసేవారు. కాని ముసలిముతక తమ పాత అలవాట్ల ప్రకారం దాన్ని మందలించినా, కోపంగా చూసినా, నాసికారంధ్రాలను వెడల్పు చేసి బుసలు కొట్టేది.

మొరటోడు 'రామ బహారన్' తిట్లు లేకుండా ఏమాటా మాట్లాడలేడు. ఒకసారి అతను దాన్ని 'బరి తెగించిన దున్నా!' అని అన్నాడు. ఇంకేముంది 'బరితెగించిన' శబ్దం వింటూనే దున్నగిట్లరిగేటట్లు కాళ్లు దువ్వింది. ఒక గంపెడు దుమ్ము రేపి రామ బహారన్ కళ్ళలో పడేటట్లు చేసింది.

మక్దూమ్ మియాకు దానిపైన ఆశ వదలలేదు. అతన్ని చూస్తూనే అది బేతాళుని మాదిరిగా రొప్పుతుంది. పాపం, మక్దూమ్ మావీధి దారే మరచి పోయా

డు. కాని రాత్రింబవళ్ళు దీనిపైనే ధ్యాస అతనికి దాన్ని ఎలాగైనా కాజేయాలని. పొరుగూరి తన బంధువుతో ఒకసారి ఈ దున్నను గురించి ప్రస్తావించాడు. పశువులదొంగైన ఆ దుష్టుడు 'యగానా' "లోహపు గొలుసు, ముండ్లమొగతాడు తోపులి గూడా బిత్తరపోయి మన వశమవుతుంది. ఈ దున్న పోతు ఒకలెక్కా" అని అన్నాడు.

ఒకరోజు రాత్రి దున్నను దొంగిలించే దానికి మక్దూమ్ అతని బంధువు చడీ-చప్పుడు లేకుండా వచ్చారు.

వాళ్ళను చూస్తూనే దున్న దుమ్మురేపి హెచ్చరించి ఉంటుంది. కానీ ఎప్పుడయితే బళ్ళెంతో దాని వీపుపైన పొడిచి గాయపరిచారో, అప్పుడు వేరే గత్యంతరం లేక అది వాళ్ళపైన ఆక్రమణకు పూనుకొని ఉంటుంది. అది విజృంభించి మక్దూమ్, అతని స్నేహితున్ని ఒకరి తర్వాత ఒకరి కాళ్ళు చేతులను హూనం చేసింది.

ఈ సంఘటన తర్వాత అది ఆ ఊరిని కాపలా కాయటం మొదలుపెట్టింది. రాత్రిళ్ళు ఎప్పుడు కాపలా కాస్తుందో ఎవరికీ తెలియదు. ఒకనాడు రాత్రి తనుక్ సాహుదొడ్లో అరుపులు విన్పించాయి. తనుక్ సాహు కుటుంబ సభ్యులేమో మేలుకొన్నారు. కానీ ఎవరూ దొడ్లోకి పోవటానికి సాహసించలేదు. ఉన్నట్లుండి అరుపులు బిగ్గరగా విన్పించాయి - "రక్షించండి! ఒరే నాయనో, చంపేస్తున్నారు! రక్షించండి," పట్టండి విడువండి అంటూ కొంతమంది అక్కడికి పరిగెత్తుకు వచ్చారు. తనుక్‌సాహు దొడ్లో ఒకడెవరో రక్తం మడుగు లోపడి కొట్టుమిట్టాడుతూ కనపడ్డాడు. వాడి వద్దనే కిట్టిగాడు బుసలు కొడ్తు కన్పడింది...ఆదొంగ చెప్పిందాన్ని బట్టి తెలిసిందేమంటే ...వాడు ఊరిలో ప్రవేశించే టప్పుడు దున్న వాడి వైపు ఆశ్చర్యంగా చూసింది. ఎప్పుడైతే వాడు ఇంటికి కన్నం వేయటం మొదలు పెట్టాడో పొడవటం మొదలుపెట్టింది.

తనుక్ సాహుతో పాటు ఊరిలోని వాళ్ళందరూ దాన్ని ముక్తకంఠంతో 'దేవర-దున్న' అని అన్నారు. దానికి పూజలు చేశారు, కొమ్ములకు నెయ్యి పూసి, తలపైన కుంకుమాక్షింతలు చల్లారు. దున్నకు పచ్చని అరటి కాయలు ఎంతో ఇష్టమని నాభార్య చెపితే తనుక్ సాహురెండు డజన్ల పచ్చి అరటి కాయలు తెచ్చి తినబెట్టాడు.

కానీ రెండు డజన్ల అరటి కాయలు తిన్పించి నా గాని తనుక్ సాహుపైన అది దయాదాక్షిణ్యాలు చూపలేదు. ఒక రోజు పొద్దున్నే అతను నిద్ర లేచి నెత్తి,

నోరూ కొట్టుకుంటూ ఏడ్వసాగాడు - "ఇది ఎక్కడి దున్నరా! నా రెండెకరాల పొగాకు చేను కాళ్ళతో తొక్కి నాశనం చేసింది. రెండు వందల రూపాయల నష్టం కలిగించింది."

ఊరిలోని ఎవరూ కూడా అతనిపైనఎలాంటి సానుభూతి చూపలేదు. ఈ విషయం విన్న ప్రతి ఒక్కరూ; పిల్లలు మొదలు కొని పెద్దల వరకూ ఒక టేమాట - "బాగా అయ్యింది. భలేబాగా అయ్యింది! ఎంత చేసిన వాడికి అంతే అంటారు గదా...మొన్ననే ఈ తనుక్ సాహు అజబ్‌లాల్ దాస్ పశువులను జప్తు చేయించా డు, మూడు వందల రూపాయల దొంగ ప్రామిసరీ నోటు పుట్టించి. వాడిపై దావా వేసి డిక్రీ తెప్పించాడు...దున్న భలేమంచి శాస్తి చేసిందిలే," మరుసటిరోజు మధ్యాహ్నం తనుక్ సాహు అరవటం మొదలెట్టాడు- "చూడంర్రోయ్ నాయనో! ఈ దున్నకు పిచ్చెక్కినట్లయ్యింది!" అని.

ఊరి వారందరూ తమాషా చూస్తూ నిలుచున్నారు. దున్న తనుక్ సాహునా లుగు ఎకరాల పండిన ఆవాలచేను తొక్కుతూ వుంది. పిచ్చిదాని లాగా ఈ కొస నుంచి ఆ కొసకు పరుగెడుతూ వుంది. చేనంతా పచ్చటి పూలు రాలి చిందరవం దర అయిపోయింది.

తనుక్ సాహు ఏడుస్తూ ఉండి పోయాడు. ఆరోజు సాయంత్రమే అతను అజబ్‌లాల్ దాస్ వద్దముప్పయి రూపాయలు అసలు పైకం తీసుకొని డిక్రీ విర మించుకున్నాడు. ఒక్క పైసాకూడా వడ్డీ రూపంలో తీసుకోలేదు.

సంతోఖి తతమా విధవరాలు పగలంతా రైతులకళ్ళాల్లో గింజలు ఏరుతూ ఉంటుంది. సాయంత్రం పూట రెండు మైళ్ళ దూరంవెళ్ళి స్టేషన్ దగ్గరవున్న ఊరిలో పసుపు, మిరపకాయలు, చిల్లరసరుకులు అమ్ముకుంటుంది. చీకటి పడ్డాక ఊరికి తిరిగొస్తుంది. ఆవిడకాలి బాట వెంబటి నడుస్తూ కిట్టిగాణ్ణిపిలుస్తుంది. రోజూ దాని కొక పచ్చి అరటి కాయకొని తెస్తుంది. దీని కొక కారణముంది... ఈ విషయం మాఆవిడ నాకు చెప్పితెలిసింది.

ఊరిలోని ఒక పెద్ద మనిషి సంతోఖి విధవపైన కన్నేశాడు. ఒకరోజు ఆమె కోసం జనపనార పొలంలో పొంచి ఉన్నాడు. ఆరోజు ఆవిడ ఏదో గొణుక్కుంటూ ఎవరినో తిట్టుకుంటూ పొలం దగ్గరి కొచ్చింది. ఆపెద్ద మనిషి ఆమె పైకి క్రూర మృగంలా లంఘించాలను కున్నాడు. కానీ ఎందుకో సంభాళించుకొని నెమ్మది గా ఆమె ముంగిట కొచ్చి తన కోరిక నివేదించుకోబోయాడు.

మూడు అణాల పసుపు అమ్మి ఒక అణాకు ఉప్పుకొనుక్కొని తిరిగొస్తున్న

ఆవిడ ఆ పెద్ద మనిషి చేతిలో పదిరూపాయల నోటు చూసి వణికి పోయింది. ఆ పెద్ద మనిషి జేబులోంచి పాము బయట కొచ్చి పడగవిప్పినట్లు ఆనోటు ఆమెకు కన్పడింది. ఆ పెద్ద మనిషి ఆమె కాళ్లపై పడ్డాడు కాబట్టి ఆమె అరవలేక పోయిం ది.

"ఛ, ఛ, ఇదేం పని, లెయ్యండి బాబు గారూ."

ఎక్కడి నుంచి ఊడిపడిందో అక్కడే ఆదున్న ప్రత్యక్షమైంది. దున్నను చూస్తూనే ఆమగమహారాజు పౌరుషం మాయమయిపొయ్యింది. "...నిజమమ్మా, ఆరోజు కిట్టయ్య రాక పోతే నాగతి ఏమయ్యేదో" అని ఆవిడ నాభార్య చెవిలో చెప్పిందట.

మాకిట్టయ్య రఘుబర్ మహతో గారి బావిలో నీళ్ళు తప్పమరెక్కడా నీళ్ళు ముట్టుకోదు. సరిగ్గా మధ్యాహ్నంవేళ ఆ బావిదగ్గరికి పోయి నిలబడుతుంది. వృద్ధ రఘుబర్ మహతో క్రమం తప్పకుండా నీళ్ళు చేది దానికి తాపు తాడు. మహ తోకు రెండు మామిడి చెట్లుండేవి. మామిడిపండ్ల సీజనులో చెట్లకు పిందెలు పుడుతూనే చెట్లక్రింద మంచెవేసుకొని రాత్రింబవళ్ళు కావలికాస్తుండేవాడు. పోయిన సంవత్సం ముసలాయన జబ్బుపడ్డాడు. అతనికూతురు బతాసియా పగలంతా కాపలా కాసేది. కానీ ఎవరు రాత్రిళ్ళు కావలి ఉంటారు?

సూర్యుడు అస్తమించక మునుపే దున్న ఆచెట్ల దగ్గరికి వచ్చి నిలబడి పోయే ది. మరుసటి దినం ఉదయం బతాసియా చెట్లవద్దకు వస్తే అప్పుడది అక్కడి నుంచి వెళ్ళి పొయ్యేది...నిజం అయ్యగారూ! ఇది మామూలు దున్నగాదు దేవ రదున్న! అంటాడు రఘుబర్ మహతో.

ఇక నేను విన్న-కన్న కథ కూడా ఒకటుంది.

బీహారు రాష్ట్ర విధానసభలో జమీందారీ నిర్మూలన చట్టంపై విచారణ జర గబోతుందని తెలిసి రెండు నెలలముందే పెద్దా - చిన్నా జమీందారులు కలిసి ఏదో ఒక విధంగా తమ భూములు ప్రభుత్వానికి చెందకుండా చేయాలని గూడు పుఠాణీ చేశారు.

ఊరి నుంచి మా ఆవిడ నన్ను రమ్మంటూ ఉత్తరం రాయించింది. "మీ మూలంగానే యాభై ఎకరాల పొలం ప్రభుత్వం వాళ్ళు స్వాధీన పరుచుకున్నా రు. రికార్డులు తారు మారు చేసివుండాల్సిందనీ కన్‌హాయి బాబు అంటున్నాడు. మీరు తొందరగా రావాలి."

ఊరిలోకి వస్తూనే మాతమ్ముడు కన్‌హాయి బాబు ఒకరహస్యం నాకు చెప్పాడు.

"అదేమిటంటే ధాన్యం పండించిన వాళ్ళకు అది దక్కకుండా చేయాలి. మనమే పైరు కోయించి మనకళ్ళాల్లో వేసుకుందాము. నేను మన ప్రాంతంలోని పెద్ద జమీందారు శివశంకర్ సింగు గారికి ఈ ప్లాన్ చెప్పాను. ఆయన ఒప్పుకున్నాడు. మొట్టమొదట ఆయన తనపొలాల్లో పండినపైరంతా కోయించుకొని తన కళ్ళంలో వేయించుకుంటాడు. ఆ తర్వాత మనం కూడా అలాగే చేయవచ్చు. పంట పండించిన వాళ్ళు అడ్డొస్తే మనం శివ శంకర్ సింగ్ గారి దృష్టాంతం చెప్పవచ్చు. ఈ విషయంలో మరిమీరేమి జోక్యం కలిగించు కోకుండా ఉంటే చాలు."

"ఒక వేళ మన పొలాలు పండించినవాళ్ళే మనమాటవిని పండిన పైరంతా మన కళ్ళా ల్లోకి తెస్తే?" అని నేనడిగాను.

"అదే నేను వద్దనేది. మీరు మాప్లానంతా నాశనం చేయాలని చూస్తున్నారు. ఎవరైనా తాము పండించిన పంట మనకళ్ళాల్లోకి తెమ్మంటే తెస్తారా!" కన్హాయి బాబు ఆవేశంతో జవాబిచ్చాడు.

"వాళ్ళతో మాట్లాడి ఇరువురికి నచ్చిన ఒక పరిష్కారమార్గానికి వస్తే బాగుంటుంది కదా" అని మరలా నేనన్నాను.

"విసురుగా కన్హాయి బాబు ఇంటివైపు వెళ్ళి పోయాడు. నోట్లోంచి మాట మెదపలేదుగానీ అతని వాలకం చూస్తే నన్ను మూర్ఖుడిగా జమకట్టినట్లుంది. మా ఆవిడ ఇంట్లోంచి నా దగ్గరకు పరిగెడుతూ వచ్చింది. మీరు ఊరుకోండి కన్హాయి బాబు చెప్పినట్లు వినండి. సర్కారు వాళ్ళు భూములు స్వాధీనంచేసుకుంటే మనం పిల్లల్ని ఎలా పోషించగలము? నీవేమోపత్రికలో ఉద్యోగం చేస్తున్నావు! అది కూడా ఒక ఉద్యోగమేనా? దాంట్లో ఫింఛను కూడా రాదు! మీకాళ్ళు పట్టుకుంటాను ఊరికే వుండండి."

ఐదురోజుల వరకూ నేనేమిమాట్లాడలేదు.

ఐదోరోజు ముందు వేసుకున్న ప్లాన్ ప్రకారం శివశంకర్ సింగులాఠీలు తీసుకొని గూండాలతో పాటు తన పొలం వద్దకు వచ్చాడు. ఊరిలోనిరైతులందరూ ఆశ్చర్యపడ్డారు. ఇదేమిటి? ఉన్నట్లుండి ప్రభుత్వం కొత్తరూల్సు పాస్‌చేసిందా! ఇదెక్కడిన్యాయం? ఇంతదుర్మార్గమా?

నా పరిస్థితి అయోమయంగా మారిపోయింది.

ఏడుస్తూ, మొత్తుకుంటూ ఆపేదరైతులు మాయింటిముందుకొచ్చారు. కన్హాయి బాబు తనకేమి తెలియ దన్నట్లు తమలపాకులకు సున్నం రాసుకొని నెమ్మ

దిగా కిళ్ళీ నములుతున్నాడు. వాళ్ళను చూసి 'మమ్మ ల్నేమి చేయమంటారు? పోయి ఆశివశంకర్ బాబుతోనే మొరపెట్టుకోండి' అన్నాడు.

వాళ్లందరూ నా వైపు చూశారు. నేను కూడా ఒకప్పుడు పేదలపార్టీ తరపున పాల్గొనేవాణ్ణి. నేను కట్టుకొన్న ఖద్దరు బట్టలు చూసి వాళ్ళకు నాపై నమ్మకం కలిగి వుండవచ్చు. వాళ్ళు నా వద్దకు వచ్చి "బాబుగారూ! మీరే చెప్పండి ఇది న్యాయమేనా? ఏడాది పొడవునా మేమంతా ఆడా-మగా, పిల్లాజెల్లా, పొలాల్లో పని జేస్తే ఈ వేళ ఈ పైరు తీసుకు పోవటం...ఇదంతా మీముంగటే జరుగుతుంది" అని మొరపెట్టుకున్నారు.

ఒకవైపు వాళ్లపైన దయపుట్టుకొస్తున్నా, గత్యంతరం లేక హృదయాన్ని రాయిచేసుకొని కళ్ళుమూసుకున్నాను. "నేనేం చేసేది? ఏం చెయ్యగలను నాచేతులలో ఏముంది? పత్రికా ఉద్యోగం కూడా ఒక ఉద్యోగమేనా! పోలీసు ఉద్యోగమయ్యుంటే నాత్రస్సుని చూసైనా వాళ్ళు భయపడే వాళ్లేమో," అని ఎంతో కష్టం మీద అనగలిగాను.

నిరాశతో వాళ్ళంతా వెళ్ళిపోయారు.

పంట పండించే రైతుల వాడలో కలవరంమొదలయ్యింది. స్త్రీలుగుండెలు బాదుకోసాగారు. పిల్లలు ఏడ్వసాగారు. కుక్కలు ఏడ్వడం మొదలు పెట్టాయి.

పొలాల్లో ఏమో లాఠీలతో వున్నకిరాయి గూండాలు జేజేకారాలు చేస్తూ ఎగురుతున్నారు.

నా నరనరాలు ఉప్పొంగాయి. ఇలాంటి పరిస్థితులలో నాశరీరమంతా కంపించి పోతుంది. మలేరియతో బాధ పడేరోగి వణికినట్లుగా వణికి పోతున్నాను.

"అరే బాబూ! ఇప్పుడే మంటావు రా నీవు?"

"...రారా. నాగుండెకాయ కోసుకుపోదు, రా! "

"...ఆహా! పిల్లా-జెల్లా అంతా సచ్చిపోతారు."

"అయ్యోరామా!"

"...ఆహా!ఉహు."

ఎవరు పరుగెడుతూవస్తున్నారు? ఈ విడెవరు? నగ్నంగా పరుగెడుతుందే? పిచ్చిదానిలాగా వుందే? - దోచుకో. దోచుకోండిరా. శత్రు ముండా కొడుకులా రా...అని అరుస్తూంది.

"కావు కావు...అందరికీ పిచ్చెక్కింది."

"...లాల్ బాబు గారు మీరు దేవుళ్లు...కావు కావు."

"...లాల్ బాబుగారు మీరు రాక్షసులు...కావు కావు."

"...లాల్‌బాబు కొంచెం పొలాలవైపుకు రండి," అని నన్నెవరో పిలిచారు.

"నేనా! నేనేం చెయగలను? అరే ఎవరూ? శివశంకర్ సింగుగారి తమ్ముడు దేవీశంకర్ సింగుగారా? నన్నెందుకు పిలుస్తున్నారండి.నేనెక్కడికి వెళ్లలేను. నాకు అతి మూత్రవ్యాధి వుంది. నేను ఒక అడుగుకూడా నడవలేను. నాకుతిప్పుతున్న ట్లుంది...నన్ను ఎందుకు రమ్మంటున్నారు?"

"లాల్ బాబు!" దేవీశంకర్ నన్ను గద్దించాడు- మీరు మీదున్నపోతును రమ్మని కేక వేయండి. అది పొలాల్లో" అన్నాడు.

ఏమిటి పొలాల్లో దున్న పోతా అంటే! మాకృష్ణుడు ధర్మ క్షేత్రానికి ; కురుక్షే త్రానికి చేరాడన్నమాట. ఓహో ఇంకేమిటి? ఎక్కడ కృష్ణుడున్నాడో అక్కడ జయం ఖాయం.

"లాల్‌బాబు గారు తొందరగా పదండి."

"అన్నయ్యా. తొందరగా వెళ్లండి. దున్నపోతును తోలుకురండి." వెంటనే నాకు వణుకు తగ్గిపోయింది. ఆవేశ ఉద్వేగాలు తగ్గు ముఖం పట్టాయి. "నేనెం దుకు పోవాలి. దున్నపోతు నాదికాదు! ఊరివారందరిదీగదా. నేనెందుకు రమ్మ నాలి? నేను ఎవరి బంట్రోతును కాదు. నీ బంట్రోతును కాదు. నీ శివశంకర్ సింగు బంట్రోతును గాదు."

దేవీశంకర్ వెళ్ళిపోయాడు. నగ్నంగా వున్న పిచ్చిది కూడా ఏడుస్తూ పరు గెత్తుకుంటూ వెళ్ళిపోయింది. కన్‌హాయి బాబు కూడా వెళ్ళిపోయాడు.

పొలాల్లో మరల గలభామొదలయ్యింది. నాలో అక్కడ ఏమి జరుగుతుందో తెలుసుకోవాలనే కుతూహలం మెదలయ్యింది. ఇప్పుడు జయ జయకారాలు విన్పించటం లేదు. ఆ ధర్మ క్షేత్రమైన కురుక్షేత్రం నుండి కృష్ణుణ్ణి తరిమేయ డానికి అరుపులు మొదలయ్యాయి.

"...కొట్టండి. తరమండి. హాయ్‌హాయ్."

"పో పో. పో పో. తరుము. తరుము."

గలభా ఎక్కువయింది... ఇప్పుడు మాకిట్టిగాడు ముందు కాళ్ళ గిట్టలతో దుమ్ము రేపుతుంటాడు.

"...భాష్పవాయు ప్రయోగం."

"...కొట్టు. కొట్టండి. తరమండి."

"...ఢామ్. ఢామ్."

నకిలీ తుపాకీ శబ్దమా, లేక నిజమైన తుపాకీ శబ్దమా?

పరుగెత్తండి. పరుగెత్తండి.

ఢామ్. ఢామ్

అరే, నిజంగానే ఫైరింగు చేస్తున్నారే!

నేను అక్కడికి దౌడుతీశాను.

పొలంలోకి పోయి చూద్దునుగదా. దున్న శరీరం గడగడ వణికిపోతూంది. దాని కాళ్ళు కొట్టుకుంటున్నాయి. నేను గట్టిగా, 'ఒరే కిట్టిగా! అరేయ్ కిట్టయ్యా!' అని అరిచాను.

మా కిష్టయ్య ఎవరి ప్రాణాలు తీయలేదు. అది పేదోళ్ళ హక్కులను రక్షించడానికి పోరాడుతూంది... రాళ్ళు రప్పల వర్షాన్ని గూడా సహించి అది దుమ్మును ఎగచిమ్ముతూ, హెచ్చరిక మాత్రం చేస్తూంది. వాళ్ళు దాన్ని లాఠీలతో కొట్టారు అయినప్పటికీ అది ఎవరికీ హాని చేయలేదు, కొమ్ములాడించి భయపెట్టడం, గిట్టలతో దుమ్ము ఎగజిమ్మడం తప్ప! బల్లేలతో, బాణాలతో దాని శరీరాన్ని గాయపరిచారు - శరీరమంతా తూట్లు పడ్డాయి. అప్పుడు అది ఇద్దరు గూండాలను కింద పడవేసి కాళ్ళు చేతులు విరిచేసింది. శివశంకర్ గాలిలో ఫైర్ చేస్తే, దేవీ శంకర్ నిజంగానే తుపాకీ గురిపెట్టి దాని గుండెల్లోకాల్చాడు. తుపాకీ గుండు దెబ్బతిని కూడా అది ఎవరినీ చంపలేదు. చస్తూ చస్తూ అది శివశంకర్, దేవీశంకర్‌లను గాయపరిచింది. అది తలుచుకుంటే వాళ్ళ ప్రాణాలు తీసుండేది...కానీ ఊరివైపు అది పరుగెత్తింది. ఊరివైపు పరిగెత్తటంకాదు, వాస్తవానికి అది నావద్దకు రావాలనుకొంది. మా ఆవిడకొంగులోతలదాల్చి నిద్రపోవాలని...రఘుబర్‌మహతో బావి నీళ్లుతాగాలని...సంతోషి విధవ చేతి పచ్చి అరటికాయ తినాలని...మా వాడిచేతితో బెల్లం తినాలని...!

కొంత దూరం వచ్చి కాళ్ళు కొట్టు కొని పడిపోయింది. నేను దాని చెవిదగ్గర మూతి పెట్టి గట్టిగా అరిచాను. ఒరేకిట్టయ్యా! అయ్యో, నిన్ను నేను ముందుగానే పిలవాల్సింది...నాకు తెలుసు, ఈ వేళనీవు నేను పిల్చినారావని...! నీవు ధర్మయుద్ధాన్ని వదిలి రావని నాకు తెల్సు.

ఇంక ఇప్పుడు పోలీసోళ్లు పెట్టిన కేసు గురించి కూడా చెప్తాను.

నేను ఊరిలో గొడవలు రేపానని పోలీసోళ్లు తమరిపోర్టులో రాసుకున్నారు.

కాని అసలు విషయమేమిటంటే ఊరిలో ఎక్కడా గొడవలు జరగలేదు. అంతా మామూలుగానే ఉంది. ఊరిలోని పెద్దాచిన్నా రైతులందరూ పైరు కోసుకొని మీ

ఇష్టమొచ్చిన చోటికి తీసుకెళ్లండి అని జమీందారులతో అన్నారు. శివశంకర్‌కు తన భాగం ధాన్యం ఇంటికి చేరింది. కన్‌హాయి బాబు పంట అతని కల్లంలో చేరుకుంది. ఎక్కడా ఎలాంటి అలజడి లేదు.

కిట్టిగాడు చనిపోయిన తర్వాత కొంతమంది ఉద్రిక్తులైన మాటనిజమే. కాని నారాయణ, నారాయణ శబ్దాలు విని వాళ్లు శాంత పడ్డారు. దున్న శవం చుట్టూచేరి రాత్రంతా భజనకీర్తనలు పాడసాగారు. పొద్దున్నే అన్ని మర్యాదలతో దాన్ని పూడ్చి పెట్టారు. సమాధి కట్టారు. చుట్టూ వున్న పది ఊర్ల నుంచి మనుషులు వచ్చి సమాధి కట్టేదానికి చెయ్యి కలిపారు. స్త్రీలు ఒకరి తర్వాత ఒకరువచ్చి తమకొం గులను సమాధిపై పర్చి దానికి నీడను కల్పించారు. ధూపదీపాలు వెలిగించారు. శంఖధ్వనులు మారుమ్రోగాయి. యివన్నీ గొడవలకు కారణం కాదు గదా. ఈ సంగతి పట్నం వరకూ పాకింది. వ్యవసాయకూలీల సంఘానికి చెందిన మనిషి వచ్చాడు. కిసాన్ పార్టీ, కాంగ్రెసు పార్టీల కార్య కర్తలు వచ్చారు. పోలీసు ఇన్స్పె క్టరు వచ్చాడు. ఎవరెవరు వచ్చారో ఎవరు వెళ్లారో నాకేమి తెలియదు. కిట్టి గాడు చావు తర్వాత నేను మాట్లాడడమే మానుకున్నాను. కళ్ళు మూసుకొని ఉండి పోయాను.

సమాధి కట్టప్పుడు అక్కడ చేరిన వాళ్ళందరూ మాటిమాటికి జయ జయ కారాలు చేశారు. దాని చావుకు అంతరూ తామేదోషులమనుకున్నారు. కిట్టిగాడులేమితో వాళ్ళందరూ తమను నిస్సహాయులుగా భావించుకున్నారు. అందువల్లనే వాళ్ళు ఉన్నట్టుండి గుంపులు గుంపులుగా అయ్యో, అయ్యో అని ఏడ్చేవారు. ఈ ఏడ్పులను ఎవరైనా గొడవలంటారా?

కానీ పోలీసువాళ్ళు రిపోర్టులో ఏమి రాసుకున్నారంటే - ఉద్రిక్తమైన ఉప న్యాసాలిచ్చారు. ప్రజలను ఉద్రేకపరిచేదానికి, వారిని హింసకు పురికొల్పేదానికి విప్లవ గీతాలు ఆలపించారని!

నాకు గుర్తున్నంత వరకూ ఏనాయకుడు ఉపన్యాసం ఇవ్వలేదు. ఊరిలోని ఒక పాఠశాల విద్యార్థి భావుకుడై వచ్చీ రాని భాషలో నంగి నంగిగా ఏదో మాట్లా డాడు. కానీ అది ఉద్రేకం కలిగించే ఉపన్యాసంకాదు. ఆ విద్యార్థి చెప్పిందల్లా ఏమిటంటే "మనిషి దుఃఖాన్ని మరో మనిషి అర్థం చేసుకోలేక పోతున్న ఈకా లంలో ఈ క్రిష్టయ్య జంతువైపుట్టి గూడా మనిషి చేయలేని పనిని చేసింది. వాస్తవంగా అది దేవుడు చేయవలసిన పనిచేసింది. అది చచ్చి మనని జంతువు లకంటే హీనమని నిరూపించింది."

మావీధిలోని 'చంప' అనే అమ్మాయి తన ముగ్గురి చెల్లెళ్ళతో కలిసి విశ్వ కవి రవీంద్ర నాథ్ టాగూర్‌గారి "యదితోర్‌ఢాక్ సునే కేవున ఆసే... (నీ పిలుపు విని ఎవరూ రాకపోయినా...) గీతాన్ని ఆలపించింది."

సమాధిపైన ఎఱ్ఱజెండాలు పాతి పెట్టారని, పోలీసు ఇన్స్పెక్టరు రిపోర్టులో రాశాడు.

ఈ దుఃఖ సమయంలో కూడా నాకు నవ్వొస్తుంది. గ్రామంలోని ఏదేవాలయం ముంగిటనేనా ఎఱ్ఱటి జెండా నాటుతారా? ఆ జెండా హనుమంతుడిదైనా కావచ్చు, చండికమాతదైనా కావచ్చు. ఆ జెండాలు ఎరుపురంగులోనే ఉంటాయి. ఆరిపోర్టును ఆధారంగా చేసుకొని ఒకతను నన్ను ప్రశ్నించాడు. నీ పేరు లాలు బాబు గదా! లాల్ అంటే ఎరుపు రంగు గదా! నీ పేరులో ఉండే ఈ లాల్ ఏరాజకీయ పార్టీకైనా సంకేతమా. ఇతని మాటలు విని నేను ఆశ్చర్య చకితుడనయ్యాను.

కిట్టిగాడి సమాధిపై నాటిన జెండా ఎర్రదే. ఊరిలోని దర్జీజెండా పైన తెల్లటి గుడ్డతో దున్న ఆకృతిని కుట్టే దానికి ప్రయత్నించాడు. కొంపదీసి ఇన్స్పెక్టరు జెండాలో కనబడుతున్న కిట్టిగాని కొమ్ములను కొడవలిగానూ, ముఖాన్ని సుత్తిగానూ, కాళ్ళను నాగలిగానూ, తోకను చక్రంగానూ ఊహించుకోలేదుగదా?

తప్పు అతనిది గాదు. అతని దృష్టిది.

(1962)

# మంచిమనుష్యుడు

అప్పుడే వెలిగించిన పొయ్యిలపైన రెండు కెట్లీలను ఉంచి, ఉజాగిర్ తూర్పువైపు చూశాడు...రాత్రి నుంచి ఆర్ద్ర నక్షత్రం కన్పడుతూంది. సూర్యుడు ఉదయించాడో లేదో తెలియటంలేదు. మెల్ల మెల్లగా వీచే గాలిలో మేఘాలు తేలియాడుతున్నాయి. దూరంగా కురిసే వర్షంలో చెట్ల ఆకులు కన్పించటంలేదు. ఎదురుగా పెద్ద మైదానం. పచ్చటి గడ్డి మైదానాన్ని చీలుస్తూ ఒక రోడ్డు. అది కొత్తగావేసిన రోడ్డు.

ఎందువల్లనో ఉజాగిర్ మన స్సుచాలా సంతోషంగా వుంది ఈ వేళ. రాత్రంతా ఆ ప్రయాణికుడు అన్నమాటలు గుచ్చుకుంటూనే ఉన్నాయి- "నీవు మనిషిముఖాలు జూసి టీలో చక్కెరవేస్తావు. పకోడీలలో కూడా మోసం చేస్తావు. కొంత మందికేమో పచ్చిమిర్చి, అల్లం ముక్కలేసి వేడివేడి కరకరలాడే పకోడీలిస్తావు. కొందరికేమో కుళ్ళి పోయిన ఉల్లిపాయలు, సద్ది సెనగపిండితో పకోడీలు వేసి పెడ్తావు."

ప్రయాణికుడు జోగ్‌బనీ లేక పోతే ఫార్ బిస్‌గంజ్ నుండో తప్పక సారాయి తాగివచ్చి ఉంటాడు. నోటికొచ్చినట్లు మాట్లాడే అలాంటి ప్రయాణికుణ్ణి ఎప్పుడూ చూడలేదు. ఉజాగిర్ మరలా మైదానంవైపు చూశాడు.

మైదానం కుడివైపు మంచు కురిసి నందువల్ల కనపడటం లేదు. గవర్నమెంటు అటవీశాఖవారి క్రొత్త వెదురు వనంలో వేల కొద్దీ మొక్కలు కన్పిస్తున్నాయి. ఈ మొక్కలు పచ్చని జండాలను మాదిరిగా ఉన్నాయి. రెండేళ్ల తర్వాత ఈ వెదురు అడవిని 'బిజాబన్ - బిజూఖండ్ అని పిలుస్తారు.'

ఉజాగిర్ ఇల్లు ఊరికి దక్షిణపు కొసన ఒక మిట్టమీద ఉంది. ఇంటికెదురుగా చాలా దూరం వరకు పల్లపుప్రాంతం కోసీ నది కోత వల్ల ఇసుకతో నిండిన మిట్టపల్లాలతో కూడిన భూమి అది. గత సంవత్సరమే కటిహార్ నుండి జోగ్‌బనీ వరకు పక్కా రోడ్డుతయారయింది. దాన్ని ట్రాఫిక్‌కొరకు ఇప్పుడు తెరిచారు. తొలిసారి రోడ్డు మ్యాపు తయారు చేసినప్పుడు ఉజాగిర్ ఇంటికొరకే ఈ రోడ్డును

ఇక్కడ మలుపుతిప్పారా అని అనుకున్నారు అందరూ. ఉజాగిర్ ఇంటివద్దకు వచ్చి రోడ్డు మరలా కుడివైపుకు తిరిగింది.

ఉజాగిర్‌కి ఈ రోడ్డు పడుకొని వున్న ధరిత్రి మెడలో చంద్రహారంలాగా కన్పడింది. ఒక కెట్లీలోని నీళ్లు సలసలా కాగి పోతున్నాయి. తర్వాత రెండో కెట్లీ లోని నీళ్లు కూడా కాగి గుడ గుడా శబ్దం చేస్తూన్నాయి.

ప్రదీప్ కుమార్ అమ్మ మెడలోవున్న చంద్రహారం తళుక్కున ఉజాగిర్‌కి గుర్తుకొచ్చింది... ఈ వేళప్రదీప్‌కుమార్ అమ్మకేమయింది? కెట్లీలలో టీ నీళ్ళు మరుగుతున్నాయి! ఇంత వరకూ సెనగ పిండి డబ్బా శబ్దం కాలేదు. బాండీ, బొక్కల గరిటెల చప్పుడు విన్పించటంలేదు... ఏమయిందో ఏమో?

ఉజాగిర్ తన మూడేళ్ళ కొడుకును కేక వేశాడు, "ఒరే! ప్రదీప్‌కుమార్, ఒరే నాయనా! అమ్మతో చెప్పరా - బస్సువచ్చే టయిమయిందని. నాడిపార్టు మెంటు పనంతా పూర్తయిపోయిందనీ!"

లోపలినుంచి జవాబురాలేదు. ఉజాగిర్ తన డిపార్టుమెంటు పని మరోసారి చూసుకున్నాడు. అతని డిపార్టుమంటు అంటే చాయ్‌డిపార్టుమెంటు - కప్పులు, సాసర్లు, గ్లాసులు, టీ వడపోత, స్పూనులు, టీపొడి డబ్బా, పాలు మొదలయిన వి. అన్నీ సరిగ్గా ఉన్నాయి కానీ ఈ విడకేమమయిందబ్బా!

ఈ ప్రాంతంలో ఉజాగిర్ ఇల్లు ఒక ప్రైవేటుబస్ షెల్టరు లాంటిది. దాదాపు ఇరవయి - ఇరవైఐదు గ్రామాలనుంచి ప్రజలు వచ్చి ఇక్కడ బస్సుఎక్కుతారు. దక్షిణకటిహార్ నుంచి వచ్చే బస్సు అరరియా కోర్టు నుండి ఒకటిన్నర గంటలో, ఉత్తరజోగ్ బనీ - ఫార్ బిస్ గంజ్ నుంచి బయలుదేరిన బస్సులు ఒకటింబావు గంటలో అక్కడికి చేరుకుంటాయి. అందువల్ల ఉజాగిర్ దుకాణం వద్ద బస్సులు పది - పదునైదు నిమిషాలు ఆగుతాయి.

ఈ రూట్లో ఉజాగిర్ దుకాణంలోని పకోడీలు, టీ అంటే చాలా ప్రసిద్ధి. తెల్ల రంగు, కాకీ రంగు, ఎర్రరంగు బస్సుల్లోని డ్రైవర్లు, కండక్టర్లు, బస్సులోని ప్రయా ణికులు, క్లీనర్లు అందరూ వీటిని పొగిడేస్తూ ఉంటారు.

ప్రదీప్‌కుమార్ అమ్మవచ్చింది.

స్నానపానాదులు పూర్తిచేసుకుని తయారైవచ్చిన ప్రదీప్‌కుమార్ అమ్మను చూస్తూనే ఉజాగిర్ మనస్సు ఉల్లసిల్లింది. గ్లాసులో వేడి నీళ్ళు పోస్తూ అతను ముసిముసినవ్వులు నవ్వుకున్నాడు. ప్రదీప్‌కుమార్ అమ్మకూడా అతన్ని జూసి నవ్వింది. మనస్సులోని మాట ఆఖరికి అతను వెళ్ళగక్కాడు. 'ఇక రేడియోకొనా

ల్సిందే.'

నిన్నటి వరకూ దుకాణంలో ఒక గడియారం ఉంచాలని అనే వాడు! ఈ రోజు రేడియో మాట విని ప్రదీప్‌కుమార్ అమ్మకు ఆశ్చర్యం వేసింది.

"రేడియోవల్ల ఒకటికాదు, మూడు లాభాలున్నాయి. ఇష్టమొస్తే పాటలు వినొచ్చు, మనసైతే వార్తలు వినవచ్చు, తెలుసుకోవాలను కొంటే టైము కూడా తెలుసుకో వచ్చు" అని ఉజాగిర్ అన్నాడు.

ప్రదీప్‌కుమార్ అమ్మ బాండీ పొయ్యిమీద పెట్టింది. కళ్ళు నులుపుకుంటూ ప్రదీప్ కుమార్ ఇంట్లోనుంచి బయటి కొచ్చాడు. 'రా, రానాయనా, రా ఇక్కడి కిరా!' అని కొడుకును పిలిచాడు.

ప్రతిరోజు దుకాణం తెరుస్తూనే ఉజాగిర్ మూడు గ్లాసు టీ తయారుచేస్తాడు. తొలిగ్లాసు ప్రదీకుమార్‌కు రెండో గ్లాసు ప్రదీప్‌కుమార్ అమ్మకు, మూడోగ్లాసు తనకు. ప్రదీప్‌కుమార్‌కు రోజుకు ఐదుగ్లాసుల టీకావాలి.

కోర్టు పనులతో బస్సెక్కి పట్నానికి పోయే వాళ్ళు ఒకొక్కరే అక్కడి కొచ్చి చేరారు. ఎడ్ల బండిలో ఎవరో క్రొత్త పెళ్ళికూతురు ప్రయాణమై అమ్మగారిం టిపోకితూంది. ఈ రోజు మరలా ఆ సైకిలు అబ్బాయి వచ్చి ఇబ్బంది పెడ్తాడు. ఇక సైకిలును తనవద్ద ఉంచుకొనే బాధ్యత తను తీసుకోడు. అతను తాళం వేసి పెడతానన్నాకూడా తనవద్ద ఉంచుకోడు.

మొదటి బోణీ కిషన్‌పూర్ బాబు గారిది. 'నాలుగు అణాల పకోడీలు, రెండు గ్లాసుల టీలు ఇవ్వు, పాలు, చక్కెర సరిసమానంగా ఉండాలి. గ్లాసులు కొంచెం బాగా శుభ్రపరచాలి.'

ప్రదీప్‌కుమార్ అమ్మముసుగులోంచి ఓరకంటితో చూసింది. కిషన్‌పూర్ బాబుగారు తను మణికట్టునుంచి భుజాల వరకు వేయించుకొన్న పచ్చ బొట్టు చేపలపైనే దృష్టి సారించి ఉన్నాడు.

ప్రదీప్‌కుమార్ అమ్మ రెట్టలపై నుండే పచ్చ బొట్టును పైటకొంగులాక్కొని మూసుకొంది...'పకోడీలు వేడివేడిగా, కరకరలాడుతూ ఉండాలి' అన్నాడు కిషన్‌పూర్ బాబు గారు.

పిసికిన పిండిని కాగేనూనెలో వేయసాగింది.

చల్లగా వీచేగాలిలో వేడి వేడిపకోడీల వాసన కలసిపోయి అంతటా వ్యాపించింది.

...పకోడీలు! టీలు!

ఊరిలోని ముసలోడు సంతోఖ్ సింగు రోజూ ఈ వేళకు వస్తాడు. రోజూ.

ప్రతినిత్యం ఇదే టయానికి ఠంచను గావస్తాడు. అతడొచ్చేటప్పటికి ఒకవేళ బోణీ కాకుండా ఉంటే ఎంతో ఓపిగ్గా కాచుకొని ఉంటాడు. బోణీ అవుతూనే వెంటనే చిటికేసి జైసీతారామ్ అంటాడు. ఈ వేళ బోణీ అయినప్పటికి కూడా ఉజాగిర్ సంతోఖి సింగువైపు చూడలేదు. ఇటు వంటి సమయాలలో సంతోఖిసింగు ఏదో మాట్లాడడం, ఏవో గప్పాలు చెప్పటం ప్రారంభిస్తాడు. ఆ గప్పాలు కూడా దొంగ తనం, దోపిడీ గురించో లేక ఇంటి పోరుగురించో ఉంటాయి.. జబర్దస్తీగా ఇంట్లోకి దూరే దొంగను వాళ్ళ భాషలో 'చమ్‌చోర్' అంటారు.

ఈ వేళ ప్రక్క నున్న పల్లెలో చమ్‌చోరి లో పట్టు బడ్డ ఒక చమ్‌చోర్‌ను గురించి కథ చెప్పడం మొదలు పెట్టాడు.

సంతోఖి సింగును ఈ ప్రాంతంలోని చిన్నా-పెద్దా అందరూ ఎరుగుదురు. తనజాతి వాళ్లందరూ కలిసి ముసలివాడైన సంతోఖి సింగును జాతి నుంచి బహిష్కరించారు. జాతి వాళ్లు వెలివేసి తిండీ తిప్పలూ పెట్టకపోయినా సంతోఖిసింగు మాత్రం ఉజాగిర్ దుకాణంలోని టీలు, పకోడీలు వదల్లేదు. పకోడీలుతిని టీలుతాగే అతను రోజంతా గడుపుతుంటాడు. అతనికి ముందూ వెనుకా ఎవరూ లేరు. అతను రిటైర్‌డ్‌దఫేదారు. చాలా మంది ఎస్.పి. లు పోలీసు ఇన్స్‌పెక్టర్ల వద్ద పని జేశాడు. ఊరిలో కొత్తసంఘటన ఏదీ జరక్కపోయినా ఏదో జరిగి పోయిన పాత కథ చెప్పటం ప్రారంభిస్తాడు.

కానీ ఈ రోజు చెప్పుతున్న కథయదార్థమైంది. నిన్నరాత్రి జరిగిందే!

కిషన్‌పూర్ బాబు పచ్చిమిర్చికారానికి ఉసర్లుకొడుతూ -'అవును నిజమే; రాత్రి అటువైపు చాలా గలభా జరుగుతూవుంది'అన్నాడు.

గ్రామంలోని వాళ్లు పంచాయతీ పెట్టించి విషయాన్ని సర్దుబాటుచేశారన్న సంగతి సంతోఖిసింగు తెలుసుకున్నాడు. ముద్దాయి 'సాధోసాహ ' విధవరాలు పాపం ఏమి చేయగలదు! పంచాయతీ నిర్ణయం ప్రకారం జుర్మానా ఇచ్చుకొంది. ప్రదీప్‌కుమార్ అమ్మ సంతోఖికి పకోడీలు ఇవ్వలేదు. కానీ ఉజాగిర్ ఒకగ్లాసు టీ అతనికి అందిస్తూ...'సంతోఖి బాబా, పకోడీలు బస్సుపోయిన తర్వాత' అన్నాడు.

'అదెందుకని' నగదుపైసలిచ్చి పకోడీలు కొనితినేవాళ్ళకు మల్లే సంతోఖి సింగు కోపంగా అడిగాడు. ప్రదీప్‌కుమార్ అమ్మముసుగులోనుంచే సైగచేసి భర్తకు ఏదో చెప్పింది. ఉజాగిర్ అరటి ఆకులో వేడివేడి పకోడీలు తెచ్చి అతని ముందుంచాడు. ఈ మధ్య సంతోఖిసింగు ఈ విధంగా జబర్దస్తీ చేస్తుంటాడు.

"రాసో బాబూ! ఈ ముదసష్టపు రోడ్డు ఎప్పుడేశారో అప్పటి నుంచి

దొంగతనాలు, దోపిడీలు ఎక్కువయ్యాయి. మొదట్లో ఇరుగుపొరుగు ఊళ్ల వాళ్ళు మాత్రమే వచ్చి దొంగతనాలు. దోపిడీలు చేసుకు పోయేవారు. ఇప్పుడు మణిహార్‌ఘాట్, జోగ్‌బనీల నుంచి కూడా దొంగ నాకొడుకులు వచ్చి దొంగతనం చేసుకుపోతున్నారు. రాత్రికి రాత్రే ఎవరికీ తెలియకుండా..." సంతోఖిసింగు కిషన్‌పూర్ బాబుతో అన్నాడు.

"అరే! దీనికి కారణం ఈ రోడ్డెలా అవుతుంది? ఈ రోడ్డు తయారు కాక ముందుకూడా దొంగలు కలకత్తా నుండి వచ్చి కటిహార్‌లో జేబులు కొట్టేవారు. ఇది నీ వెరుగవా?" కిషన్‌పూర్ బాబు అడిగాడు.

ఈ రోడ్డు వేసేటప్పుడు ఈ ప్రాంతపు వాళ్ళు రోడ్డు వద్దని ఆందోళన జరిపారు. ఈ సంగతికిషన్‌పూర్ బాబుకు తెలుసు- రోడ్డు తయారవగానే కలకత్తాలోని జేబులు కొట్టే వాళ్ళూ, పట్నాలలో ఉండే దొంగలూ పట్టపగలే ఊళ్ళలోకి వచ్చి అలజడి తెస్తారని ఆందోళనకారులు, వాళ్ళు నాయకులు ప్రజలను భయపెట్టేదానికి ఈ పుకార్లు పుట్టించారు. కిషన్‌పూర్ బాబులేచి తన గడియారాన్ని చూసుకున్నాడు. చెవిదగ్గర దాన్ని పెట్టుకొని ...'బస్సులేటా, లేక నా గడి యారం ఆగిపోయిందా!' అన్నాడు.

"రెండు వైపులనుంచి వచ్చే బస్సులు ఈ రోజులేటే. జోగ్‌బనీలో రాత్రి పెద్ద వర్షం పడిందట" ఉజాగిర్ అన్నాడు.

"తూర్పున కూడా వర్షం పడింది" అని సంతోఖి అన్నాడు.

ఉజాగిర్‌కి దోపిడి, దొమ్మి విషయాలంటే గిట్టవు. ఈ వేళ ఆయింట్లో జొరబడి వాళ్ళు చేసిన దొంగతనం మాటంటే అసలే గిట్టదు.

దొంగతనం ప్రసక్తి మార్పించాలనే ఉద్దేశ్యంతో- "తూర్పున, పశ్చిమానా, ఉత్తరానా, దక్షిణానా అన్నిచోట్లా వర్షం పడింది. మనప్రాంతంలో కురవలేదు" అన్నాడు.

"అరే! మన ప్రాంతంలో వర్షం ఎలాపడుతుంది? పట్టపగలే దొంగతనాలు జరుగుతూంటె ఇక్కడే వర్షం కాదు కురిసేది. పిడుగులు పడ్తాయి." మధ్యలో సంతోఖిసింగు అడ్డొచ్చి అన్నాడు.

ఉరిమినట్లు శబ్దమయింది. ప్రదీప్‌కుమార్ అమ్మ ముసుగులోంచి నవ్వింది, 'అరే, ఉరుముగాదు బస్సుమోత.'

ప్రదీప్‌కుమార్ అమ్మకు పోయిన సంవత్సరం కురిసిన వర్షం గుర్తొచ్చింది. వర్షం వచ్చి నప్పుడు పకోడీలు, టీలు ఎక్కువగా అమ్ముడు పోతాయి... వానలో

కూడా పంచలు ఎగ జెక్కుకొని, గొడుగులు పట్టుకొని అందరూ పకోడీలు తిని టీతాగుతారు.

కిషన్‌పూర్ బాబు తనసంచిలోంచి ప్లాస్టిక్‌పేపర్‌లో దాచుకొన్న రెయిన్‌కోటు తీశాడు. మలేరియా డిపార్టుమెంటు వాళ్ళకు కాస్తా-కూస్తో ముట్టజెప్పి ఈ రెయిన్‌కోటు సంపాదించాడు. దీన్ని తొడుక్కుంటే ఎంతవానపడినా బట్టలు తడవవు.

"ఇక్కడ ఒక నాలుగడుగులు దుకాణాన్ని పొడిగించి నీవు కూర్చునే దానికి కూడా దిమ్మెకట్టుకోవచ్చుగదా," లేస్తూ కిషన్‌పూర్‌బాబు ఉజాగిర్‌కి సలహా ఇచ్చాడు.

ప్రదీప్‌కుమార్ అమ్మచీర కొంగును రెట్టలపైకి లాక్కొని ఉజాగిర్‌తో ఏదో అంది. కిషన్‌పూర్‌బాబు కళ్ళుమిళమిళా మెరిసి పోతున్నాయి.

"రాసోబాబూ, ఒక్కబండి ఎదురు బొంగులులేక పనంతా ఆగిపోయి వుంది. మీరు ఊఁ, అంటే ఒకరోజు బండితోలుకొని మీ వద్దకు వస్తాను" ఉజాగిర్ అన్నాడు.

ముసుగులోంచి రెండు కళ్ళుకూడా ఏమో అంటున్నట్టు కిషన్‌పూర్ బాబు గమనించాడు. "సరే ఒక రోజురా, ఒక బండేమి, రెండు బండ్ల వెదురు తీసుకు పోదువుగాని" అన్నాడు.

"ఒక బండిబోద కూడా నీవు అడిగుండాల్సింది. ఈ రోజు రాసో బాబు గారు మంచి మూడ్‌లో ఉన్నట్లు కన్పిస్తున్నారు." అందుకున్నాడు. సంతోఖిసింగు.

ఇంతలో వర్షం మొదలైంది. ఒకే సారి రెండు వైపులనుంచి బస్స లొచ్చాయి... పకోడీలు, టీలు, పైసలు అన్ని చోట్లా కన్పించాయి...ఉజాగిర్‌కి శ్వాసపీల్చుకోవడానికి కూడా తీరికలేదు.

'ఒక పొట్లంపకోడీలు మిర్చిలేకుండా.'

ప్రదీప్‌కుమార్ అమ్మముసుగులోంచే ఈ వేళ మిర్చిలేని పకోడీలు వీలులేదంది.

'ఎర్రబస్సు డ్రైవరు గారికి కావాలంటండీ.'

"ప్రదీప్‌కుమార్ అమ్మ మిర్చిలేని సెనగపిండి పిసకడం మొదలు పెట్టింది."

ఎర్రబస్సు డ్రైవరు మంచి వాడు. మణి హారీఘాటువద్ద పడవలోంచిదిగి, బస్సెక్కే ప్రయాణికులందరికీ ఉజాగిర్‌దుకాణంలోదొరికే పకోడీల, టీల గురించి గొప్పగా చెపుతాడు- "ఏమయ్యో, దారిలో మరెక్కడా టీ తాగడమంటే పైసలు గంగలో పోసినట్లే, టీగానీ, నాస్తాగానీ రహీఖ్‌పూర్‌లోనే తీసుకోండి. ఒకసారి అక్కడ తిని చూడండి. మీకే తెలుస్తుంది. వేడి వేడిటీలు, కరకరలాడే పకోడీలూనూ!'

ఎర్ర బస్సు డ్రైవరు రోజూ తన బస్సును ఈ చోటే ఆపుతాడు. ఎందువల్లనంటే అక్కడి నుంచి నిల్చొని చూస్తే అతనికి ప్రదీకుమార్ అమ్మకళ్ళు ముసుగులోంచి

కనబతాయి.

బస్సులో కూర్చుండే ప్రయాణికులకు మాత్రం దుకాణంలోని ముందు భాగం మాత్రమే కనబడుతుంది. ప్రదీప్‌కుమార్ అమ్మ కూర్చునే చోట ఒక తడికెవుంది -ఆతడికెకు అడ్డంగా కూర్చుని పనిచేస్తున్న ప్రదీప్‌కుమార్ అమ్మ చేతులూ, పిండి కలుపుతున్నవ్రేళ్ళు మాత్రమే కన్పడుతాయి. బాండీ లోంచి కాలినపకో డీలు తీస్తున్నప్పుడు ఆమె చేతి గాజులు సంగీత స్వరాలతో మోగుతాయి.

ఉజాగిర్‌కు పాపం అటూయిటూచూసే తీరిక వుండదు- చుట్టూ గ్లాసులు, చక్కెర, నీళ్లు, టీ ఆకు, స్పూన్లు, పైసలు, కొనేవాళ్లు!

అరిటాకులో పకోడీలు పెట్టేటప్పుడు మాత్రం అతనొకసారి ప్రదీకుమార్ అమ్మ వైపు చూస్తాడు. "అయ్యో, కొంచెం ఆగండి. గలభా చెయ్యవద్దు. కొంచెంశాతంగా వుండండి. అందరకీ ఇస్తాను." అని నచ్చజెప్తాడు.

రెండు బస్సులు వెళ్లిపోయాయి.. ప్రదీప్‌కుమార్ అమ్మ పొయ్యి దగ్గరినుంచి లేచి లోపలికెళ్ళింది. ఉజాగిర్‌పైసలెంచుకుంటున్నాడు.

సంతోఖిసింగుకు ఇంకో టీకావాల్సినట్టుంది. వర్షం కూడా జోరుగా కురుస్తూంది.

అతన్ని చూసి, 'నీళ్ళు వేడి కానీ' అన్నాడు, ఉజాగిర్.

టీచేయడం ఉజాగిర్ బాల్యంలోనే నేర్చుకున్నాడు.

'కమలదహ జమీందారు గారి హవేలీలో ప్రతిపనికి వేరువేరుగా నౌకర్లు. చాకర్లు వుండే వారు - టీలు తేసే వాళ్ళు, హుక్కా వెలిగించే వాళ్ళూ, మాలిష్ జేసే వాళ్ళు, భంగుపొడి చేసి నింపేవాళ్ళు.'

కమలదహ జమీందారు గారి జమీందారీ అయితే పోయిందీకానీ ఉజాగిర్ టీ చేసే నేర్పరితనం తన వద్దనే ఉండిపోయింది. ఈ నేర్పే అతనికి సహాయపడింది. 'ఇంటికి లక్ష్మివచ్చింది.'

తన ఊరు రహిఖ్‌పూర్‌లో తన పూర్వీకులు సంపాదించిన స్థలంలో ఇల్లు కట్టుకొని, ఒక అందగత్తెను పెళ్ళాడాలని అతనికి ఎప్పటి నుంచో కోరిక. కమల దహజమిందారుగారి చిన్నకొడుకు భార్యలాంటి పెళ్ళాం తనకు దొరికితే తాను జీవిత మంతా భార్యరూప సౌందర్యాన్ని ఆస్వాదించాలనుకున్నాడు.

సౌందర్యరాశి పెళ్ళాం!

ఇసుకనేలలోని బావి, పల్లెటూరిలో దొరికే రూపపతి భార్య, రెండూ సమానమనుకున్నాడు. ఇసుకనేలలోని బావినీరుచల్లగా, తియ్యగా వుంటుంది. ఒక గుక్కెడు తాగితే చాలు మన్సుసుకు తృప్తిగా ఉంటుంది. పల్లెటూరి యువతి

రూపం ఒకసారి చూస్తేచాలు కళ్ళలోకి నిద్రమత్తు ముంచుకొస్తుంది. కానీ ఇసుకనేల బావి రెండేళ్ళలోనే పూడిపోతుంది. పల్లెటూరి సౌందర్యం సంవత్సరంలోనే మరుగు పడిపోతుంది.

ఉజాగిర్ భాగల్‌పూర్, ధర్‌భంగా, పాట్నామొదలగు పట్నాలలో ఎక్కడెక్కడో నౌకరీ చేశాడు. కానీ ఎక్కడా తనకు రూపలావణ్యవతి కన్పడలేదు. అంతా నకిలీ సౌందర్యమే. అంతా పైతళుకు బెళుకులే...ఇదీ ఒక సౌందర్యమేనా?

పట్నంనుంచి రూపాయల మూట మాత్రం తెచ్చుకోగలిగాడు. కానీ మనస్సులోని కోరిక ఫలించలేదు.

ఊరిలోపెళ్ళిళ్ళ పేరయ్యలు అతన్ని మోసగించి చాలా డబ్బులు కాజేశారు. బంధు -మిత్రులు సంబంధాల పేరుతో యాభైరూపాయలదాకా తిన్నారు. కానీ అందమైన భార్య దొరకలేదు.

అయినప్పటికి ఉజాగిర్ నిరాశచెందలేదు..."ఉజాగిర్ నీవు చాలాబాగా టీ చేస్తావు. నీ చేతి టీ ఇచ్చి ఇంద్రుని సభలోని దేవకన్యను కూడా మెప్పించగల వు. ఆమెను నీకైవసం చేసుకోగలవు." కమలదహచిన బాబు గారి భార్య ఒక నాడు అన్నమాటలు అతనికి గుర్తుకొచ్చాయి.

ఈ మాటలు గుర్తుకు రాగానే ఉజాగిర్ ఒకనాడు ఇంటినుంచి బయలుదే రాడు - ఎక్కడైనా టీ కొట్టులో నౌకరీ దొరుకుతుందేమోనని ఆశతో!

ఉజాగిర్ ఆనాటి శుభఘడియలు ఎప్పుడూ మరువజాలడు.

'కురుసేలా' స్టేషనులోదిగి చాలా సేపు వరకూ అక్కడ కూర్చున్నాడు.

దోసకాయ కొనుక్కొని తింటూ వుంటే అతనికి తన బాల్యంనాటి ఒక ఆట గుర్తుకొచ్చింది. పిల్లలు దోసకాయ గింజలను పిడికిళ్ళలో పట్టుకొని పలానీ వాడి పెళ్ళి ఏవైపు జరుగుతుంది అని ఒకరినొకరు అడిగేవారు. పిడికిటిలోని గింజలు వ్రేళ్ల సందులోంచి ఏ పక్కకు జారిపడితే ఆ పక్కఊరిలో పెళ్ళి జరుగుతుందని అనుకొనేవారు.

ఉజాగిర్ దోసకాయగింజలను వ్రేళ్ళమధ్యలో ఉంచుకొని గట్టిగా అదిమి అనుకొన్నాడు - గింజ ఏవైపు పడితే ఆవైపు ఉన్నపల్లెలోనే తనకు కావాల్సిన సుందరాంగి ఉంటుందని.

గింజ ఉత్తరదిశన జారిపడింది. మరేమి ఆలోచించకుండా కురుసేలా నుంచి ఉత్తరదిశగా రాణిగంజ్‌కు పోయే బస్సులో ఎక్కికూర్చున్నాడు.

'ఎక్కడికి పోతావు?' అడిగాడు కండక్టరు.

ఉజాగిర్ ఏమని జవాబు చెప్పగలడు! అతనికేమి తెలుసు, ఈ బస్సు ఎక్కడి కెళ్తుందో? ఇంతలోనే ప్రక్కనున్న ప్రయాణికుడు బిరౌలికి టికెట్టు ఇవ్వమన్నా డు. ఉజాగిర్ కూడా బిరౌలీ వరకు టికెట్టు తీసుకున్నాడు. బస్సు బిరౌలీ చేరుకొని ఓ పకోడీల దుకాణం ముంగిట ఆగింది. బిరౌలీలో దిగిపోయేవారు దిగిపోయారు. ఉజాగిర్‌కూర్చుని ఉండి పోయాడు. ఆ ఊరిలో దిగి అతనేంచేయాలి! కళ్ళు మూసుకొని ఏదో ఆలోచిస్తున్నాడు. ఇంతలోనే కండక్టరు వచ్చి అతన్ని ఊపిలే పి, ఏమయ్యో, బిరౌలీ వచ్చింది. దిగిపో అన్నాడు.

ఉజాగిర్ తన మూట తీసుకొని ఇష్టం లేక పోయినా బస్సుదిగాడు. బస్సు దిగినవాళ్ళు పకోడీలదుకాణం వద్దకొంతసేపు ఆగి పకోడీలు తిని వెళ్ళి పోయా రు. ఉజాగిర్ ప్రక్కన ఒక మోడాపైన కూర్చొని ఉండిపోయాడు. దుకాణం ముసల్ది బాండీ పొయ్యి మీద నుంచి దింపి ఉజాగిర్‌ని నీ వెక్కడికి పోవాలి అని అడిగిం ది.

ఉజాగిర్ తేరుకొని, ఎక్కడికీ లేదు, నాకు ఒక అణాపకోడీలు ఇవ్వు అన్నా డు. ముసల్ది విసుక్కొని, "ఇంత సేపు మూతి ముడుచుకొని కూర్చున్నావు! బాండీదింపిన తర్వాత ఇప్పుడు పకోడీలు కావాలంటావు! ఇప్పుడు పకోడీలు లేవు. వంకాయ బజ్జీలు కావాలంటే చెప్పు. బాండీ పొయ్యిమీద పెట్తాను..."..." ఓసీత, ఏమే ఎంత సేపే వంకాయలు కోసేది. కోసినవి తీసుకురా. ప్రయాణికు లు కాసుకు కూర్చున్నారు" అంది.

లోపల గుడిసెలోంచి ఒకసన్నని గొంతు పలికింది, "రేపటి నుంచి నేను ఈ పాడు వంకాయలు కొయ్యను. అన్నీ పుచ్చిపోయినవే. ఒక్కొక్కదానికి అయి దారు పుచ్చులున్నాయి." ముసల్ది వంకాయను జోడించి సీతని ఒక తిట్టు తిట్టిం ది.

సీతచాటలో కోసిన వంకాయలు తీసుకొచ్చింది. "చూడే పెద్దమ్మా, పరదేశీ యాత్రికులున్నప్పుడు నన్ను తిట్టొద్దని రోజూ నీతో అంటూనే ఉన్నా అయినా నీవు మాత్రం..."

ఉజాగిర్ సీత సౌందర్యాన్ని చూసి మంత్రముగ్ధుడయ్యాడు. కానీ ఒక్కొక్క వంకాయలో ఐదుపుచ్చులు, వంకాయతో జత చేసి సీతను ముసల్ది తిట్టిన తిట్లు ఇవన్నీ జూసి ఉజాగిర్‌కి వాంతి వచ్చినట్లయింది. కానీ సీతను చూసిన తర్వాత స్థిమితపడ్డాడు. ఇదే అందమంటే! ఇట్లుండాలి అనుకున్నాడు. గొంతు సవరిం చుకొని ఏమమ్మో, ఒక అణాబజ్జీలు కాదు నాలుగణాలవి కావాలి అన్నాడు.

"ఊఁ ఊఁ. సరే. ఇదేమిటి? ఈ మనిషి ఉన్నట్లుంది మాట మారుస్తాడు. ఎన్నికావాల్నో ఒకేసారి అడుగకూడదా."

ఉజాగిర్ వూరుకున్నాడు. కానీ ఉజాగిర్ తరపున మాట్లాడుతూ, "ఒక సారి అడగనీ...వెయ్యిమార్లు అడగనీ, నువ్వు ఈ మాదిరి, వచ్చిన వాళ్ళతో రగడ పెట్టుకుంటే ఒక్క పైసా బజ్జీలు కూడా అమ్ముడు పోవు," సీత అంది.

బాండీ లో వంకాయలు వేస్తూ "భలే వచ్చిందిరా పిల్లది. మొగుడిపక్షాన మాట్లాడుతుంది," అంది.

ముసలిగొంతు, యువతి గొంతు రెండు కలిసి ఒకరి నొకరుతిట్టుకుంటూ వుంటే మధ్యలో ఉజాగిర్ తన పురుష గొంతు కలిపాడు. "ఛ. ఛ. మాట మాటకు మీరిట్లా పోట్లాడు తుంటే నేను తిననీ బజ్జీలు" అన్నాడు.

"విన్నావుగదా! ఇప్పుడు చెయ్యి నాలుగణాల బజ్జీలు!" అంది సీత.

"తినడూ! తిననీ తినక పోనీ పైసలేమో ఇవ్వాల్సిందే!"

సీత తొలిసారి ఉజాగిర్ వైపు చూసింది. నోట్లో మాటనోట్లోనే ఉండి పోయింది. ఆవిడ అతన్ని చూస్తూనే లోపలికి వెళ్ళిపోయింది.

"నాలుగణాల బజ్జీలు తను తినగలడా - ఈ పెద్దప్లేటు నిండా ఉన్న బజ్జీలు" ఉజాగిర్ కూర్చుని అనుకుంటున్నాడు.

"ఒసే, సీతీ! ఆకులెక్కడున్నాయే? బజ్జీలు దేని మీద వడ్డించాలే నీ ముఖం మీదనా!" ముసల్ది గద్దించింది.

ఉజాగిర్ బజ్జీలు తినసాగాడు. అప్పుడు ముసల్ది నెమ్మదిగా "నాయనా, ఏమనుకోవద్దు. ఇదుందే. మాసీతి. మామూలు మాటలతో పనిచేయదు. ఉండు నీకు నీళ్ళు తెస్తాను." అంది. ముసల్ది లేచి నీళ్ళు తెచ్చేలోపలే సీతి గ్లాసులో నీళ్లు తెచ్చిపెట్టింది..."ఆ...ఆ...తెలిసి పోయింది. బస్సు వచ్చేటయిము అయింది కదా. నీవు ఏదో ఒక సాకు పెట్టి పొయ్యి దగ్గరకూర్చో కుండా ఎక్కడికోపోవాలని ఉన్నావు. చూడు అట్లయితే బాండీ పొయ్యి మీద నుంచి తీసి పారేస్తా." అంది సీత.

లేచిన ముసల్ది మళ్ళీ కూర్చుంది. ఆమె మరలా ఏదో చెడ్డతిట్టు తిట్టేలోపలే ఉజాగిర్ అందుకొని "అమ్మా, ఇక్కడ టీ కొట్టుపెడితే బాగా నడుస్తుంది కదా" అన్నాడు.

"ఏమినడుస్తుంది బాగా?" ముసల్ది మూతి ముడుస్తూ అంది.

"టీ కొట్టమ్మా."

"ఎవరు పెడ్తారు?"

"ఎవరన్నా పెట్టనీ, నడుస్తుంది బాగా."

"ఒక పకోడీల పొయ్యితోనే వేగలేక పోతున్నా. ఈ ముసల్దాని ఎముకలు గుల్లయిపోతున్నాయి. దీనికి తోడుగా మళ్ళీ టీ కొట్టు ఒకటా! నీ కొట్టు మండి పోనూ!" కోపంతో అంది ముసల్ది.

ఈ సారి మరలా సీత ఉజాగిర్ వైపు చూసింది. టీ కొట్టుమాట ఉజాగిర్ అంటూనే సీత అతనివైపు ఆశతో చూసింది. "టీలో ఎనిమిదంతలు లాభముం టుంది. నాలుగు అణాలు ఖర్చు పెడితే రెండు రూపాయలు గిట్టుబాటవు తుంది. అని మరలా అన్నాడు."

"రెండు రూపాయలే" ముసల్దీ, సీత ఇద్దరూ ఒకేసారి ఆశ్చర్యంగా అన్నా రు...రెండ్రూపాయలే.

"ఉంటే ఉందిలే నాయనా గిట్టుబాటు. ఇక్కడ టీ తాగే వాళ్ళెరి?" కొంతసే పాగి ముసల్ది అంది.

"దొరికితే అందరూ తాగుతారు" అని సీత జవాబు.

"నిజం. మంచి మాటన్నావు" ఉజాగిర్ అన్నాడు.

ముసల్ది బజ్జీలు చేసే గరిటెతిప్పి, "అదిసరేనే! టీ ఎవరు చేస్తారే? నీ మొగు డొచ్చి చేస్తారా!" అని అడిగింది.

"నా మొగుడు కాదు నీమొగుడొచ్చి" తిప్పికొట్టింది సీత.

కానీ ఆశ్చర్యం! తిట్లు తినికూడా ముసిల్ది బోసినోటితో నవ్వింది. ఉజాగిర్ గుండె జోరుగా కొట్టుకో సాగింది. కొంత సేపు ఆగి అతను అందుకున్నాడు. అవును, నిజమే. టీ కొట్టు మగవాడే నడపగలడు."

ముసల్ది దీర్ఘంగా నిట్టూర్చింది... సీత మరలా లోనికి వెళ్ళింది.

ఉజాగిర్ చాలా సేపటి వరకు టీ కొట్టు పెట్టే ఏర్పాట్లగురించి అన్ని వివ రాలు విపులంగా తెలిపాడు. రెండో బస్సు తిరిగొచ్చేలోపల ఉజాగిర్ తనతియ్యటి మాటలతో ముసలావిడను వశ పర్చుకున్నాడు. "అమ్మగారూ, మీరు సరే అంటే నేను ఈ వేళేవెళ్ళి, టీ కొట్టుకు కావాల్సిన సరుకులన్నీ తీసుకొస్తాను."

"మీ ఇల్లెక్కడుంది నాయనా?"

"రహిమ్‌పూర్."

ఏ కులస్థుడివి?...అరె, అయితే మాకులస్థుడవే నన్నమాట. ఆఖరికి టీ కొట్టు పెట్టాలని నిర్ణయించుకున్నారు.

ఉజాగిర్ కురుసేలా బజారుకొచ్చి టీ దుకాణానికి కావాల్సిన సరుకులన్నీ కొనుక్కొని రాత్రి బస్సుకు తిరిగొచ్చాడు. "అరె, నిజంగానే నీవు తిరిగొచ్చావే! ఎవరో దారిన పోయిన దానయ్య ఆమాట ఈమాటా చెప్పి గప్పాలు కొట్టి పోయాడనుకున్నానే!" అంది ముసల్ది.

"ఏందమ్మా, నీవు మరీనూ, ముసల్దానివయ్యావు! ఏ మనిషి ఎటువంటి వాడో గ్రహించే బుద్ధినీకు రాలేదు." లోపలినుంచి సీత ఒక విసురు విసిరింది.

"టీ కొట్టు కు కావాల్సిన సరుకులను ముసల్ది, సీత కళ్ళప్ప గించి చూసి 'ఇన్ని సరుకులు కావాలా టీ కొట్టుకు!' అన్నారు. రాత్రికి సీతే తన చేతుల్తో ఉజాగిర్‌కి అన్నం వడ్డించింది తొలిసారిగా. పాత విషయాలు గుర్తుకొస్తే ఉజాగిర్‌కి లేని పోని ఉత్సాహ మొస్తుంది. సీత మాటలు, సీత నవ్వులు, సీత నడక ఇవన్నీ రాత్రింబవళ్ళూ ఉజాగిర్ గమనిస్తూ ఆమె రూపసౌందర్యాన్ని ఆస్వాదిస్తూ స్వప్నలోకంలో విహరించసాగాడు."

"టీ కొట్టు మొదలయింది. టీ తయారయింది."

"ముసలిదాని వద్దకు ఎవరో బంధువచ్చాడు. టీ దుకాణం పెట్టారు. ఇక ఊరిలోని అంగట్లో కూర్చుని వేడి వేడి టీ తాగవచ్చు" ఆ ఊరిలోని అందరూ అనుకున్నారు.

బస్సు డ్రైవర్లు, కండక్టర్లు, ప్రయాణికులు, క్లీనర్లు ఒకరేమిటి అందరి నోటా ఒకటే మాట- "టీ చాలా బాగుంది. టీ తయారు చేసేవాడు యువకుడు గదా! ...అంగటి బాగా నడుస్తుంది."

కానీ టీ కొట్టు ఆరునెలలు, కూడా నడువలేదు.

ఐదో నెలలో నే సీత ఉజాగిర్‌ను రెచ్చగొట్టింది..."ఏం, నీకుగుండెకాయ లేదా? ముసలిదానితో స్పష్టంగా ఎందుకు చెప్పలేవు?"

"ఒకవేళ ముసల్ది ఒప్పుకోకపోతే."

"ఒప్పుకుంటుందో, ఒప్పుకోదో అదివేరే మాట. ముందు చెప్పి చూడరాదూ!"

"ఒకవేళ ఒప్పుకొని ఇల్లరికముండమంటే!"

"ఇప్పటికి సరే అను, తర్వాత చూసుకోవచ్చు."

ముసలావిడకు కండ్లు సరిగ్గా కన్పించవు. సరిగ్గా విన్పించదు కూడా. కాని సరిగ్గా కన్పించకున్నా, విన్పించకున్నా ఆవిడ అంతా అర్థం చేసుకొంది. అందువల్లనే ఒకరోజు ఉజాగిర్ సంకోచిస్తూ నంగి నంగిగా విషయంప్రస్తావిస్తే, ముసలావిడ 'ఆహా... కడుపునిండా ఆరగించి... మొగుడు దగ్గరకొచ్చిపండ్లుతోముతుం

దట. నీకు తోడుపోయిన ముండ' అని తిట్టు తిట్టి ఇంకకొదువేముంది...ఎంగిలి కుండను పూజారి తాకడు గదా! మంత్రాలు గింత్రాలు ఇక ఎందుకు?...ఇంక కాని వ్వండి. బాగా తాగండి వేడి వేడిటీలు!

ముసలావిడ తనపకోడీల దుకాణంలో కూర్చుని ఇప్పుడూ తిడ్తూ వుంటుం దేమో. ఆ దగుల్బాజి తియ్యటి మాటలు చెప్పి, వేడివేడి టీ తావించి, ఆ పాడు ముండను కైవసం చేసుకున్నాడు...రాత్రింబవళ్ళు వాళ్లగుసగుసలు వినటం నాకు నచ్చలేదు. మీ దారి మీరు చూసుకోండి. అనింది ముసల్ది. ఆ రాత్రికే వాళ్ళు లేచిపోయారు.

సీతకాదు. ఈమె లక్ష్మినే! అందుకే అంటారేమొ కోడలు ఇంటికి వచ్చిన వేళా విశేషం అని.

రాణిగంజ్ నుంచి కురుసేలా వెళ్ళే బస్సులో ఎక్కిరూపలావణ్యవతియైన భార్యను తీసుకొని ఉజాగిర్ ఊరికి తిరిగొచ్చాడు. తిరిగొస్తూనే తన ఊరిలో కూడా క్రొత్త రోడ్డు వేస్తారని తెలుసుకున్నాడు.

నిజంగా ప్రదీప్‌కుమార్ అమ్మలక్ష్మినే.

క్రొత్తరోడ్డు వేసేకంట్లాక్టరు ఉజాగిర్ గుడిసెలోనే మకాం వేశాడు.

"ఇంట్లో యుక్తవయస్సులో నున్న అందమైన భార్యను పెట్టుకొని అక్కడే ఎవరో పరదేశికి చోటివ్వటం మంచి పనికాదని" ఊర్లో వాళ్లందరూ ఉజాగిర్‌కి నచ్చజెప్పటానికి ప్రయత్నించారు.

సంతోఖ్ సింగు కనబడి నప్పుడల్లా పట్టపగలే జరిగిన ఏదో ఒక దోపిడి గురించి కథలు చెబుతూనే ఉంటాడు. ఉజాగిర్ బయట తిరిగి ఇంట్లోకి వచ్చి, భార్య సౌందర్యాన్ని చూస్తూ "ఊర్లోవాళ్లు ఏమనుకుంటున్నారో తెలుసా!" అని అడుగుతాడు.

ఊళ్ళో వాళ్ల మాట లింటావా? కంట్రాక్టరు మాటింటావా? రోడ్డు తయార యిన తర్వాత టీ, పకోడీలదుకాణం పెట్టండి అంటున్నాడతను. ఇప్పుడేమో కూలీ-నాలీ చేసేవాళ్ళు రోడ్డు పని చేసే దానికి ఎక్కడెక్కడి నుంచో వచ్చారు. బియ్యం, పప్పులకొట్టు పెడితే బాగుంటుందట. వారం వరకూ అప్పులిచ్చి వారాంతంలో వాళ్ళకు జీతాలొచ్చి నప్పుడు ఒకటికి రెండింతలు వసూలు చేసు కోవచ్చు. ఇది మంచి అదును అంటున్నాడతను.

'నిజంగానా! అప్పిస్తే ఒకవేళ వాళ్లు అక్కడ నుంచి పారిపోతేనో?'

'ఎక్కడికి పారిపోతారు? వాళ్ళ జుట్టు కంట్రాక్టరు చేతిలో ఉందిగదా! నిజమా!

నీవు చెప్పింది సబబుగానే ఉంది, 'బిరౌలీ దానా' కంట్రాక్టరు చాలా మంచివాడు.'

'ఏయ్! నన్ను బిరౌలీ దానా అనిఎందుకు పిలుస్తున్నావు? అలా పిలిస్తే నాకు బాగుండదు.!'

'మరి ఏమని పిలవను?' ఉజాగిర్ కిలకిలానవ్వి, "ఓ, సరే,నేను కూడా కంట్రాక్టరు నీకు పెట్టిన పేరు 'పసిడివన్నె దానా' అని పిలువమంటావా?" కంట్రాక్టరు నిజంగానే చాలా మంచి వాడు. ఊళ్ళోని ఆకతాయి కుర్రవాళ్ళు ఉజాగిర్‌ను ఏడిపించటానికి ఒకటే వాక్యం "కాంట్రాక్టరు చాలా మంచి వాడు" మాటి మాటికి వల్లె వేస్తూ వుంటారు.

మంచి మనుషులను మంచి మనుషులు అనకపోతే మరే మనాలి? ఊళ్ళో వారందరికి ఈ ర్ష్య- ఉజాగిర్ భార్య అందగత్తె, గుణవతి, ఊళ్ళో ఏయింటికైనా ఇలాంటి కోడలు వచ్చిందా. ఈమె ఊళ్ళో అడుగు పెడుతూనే క్రొత్త రోడ్డు వచ్చింది. బియ్యం, పప్పుల దుకాణం పెట్టుకొని అయిదు నెలల్లోనే పదెకరాల పొలం కొన్నారు. ప్రజలు ఈర్ష్య పడ్తారంటేఎందుకుపడరు? కంట్రాక్టరు ఇంగ్లీషులో ఉత్తరాలు రాస్తాడు. మన ఊరిలో ఎవరైనా ఉన్నారా ఇంగ్లీషులో ఉత్తరాలు రాయగలిగేవారు? పసిడివన్నెకోడలు బేషుగ్గా అంటుంది. 'ఇతరులకు కళ్ళు కుట్టేటట్లు పనిచెయ్యి' అని.

పిల్లవాడు పుట్టి నప్పుడు కంట్రాక్టరు గారు మనీపర్సునుంచి యాభైరూపాయల నోటు తీసి దిష్టితీసిచ్చాడు. పిల్లవాడు పుట్టిన ఆరోజు రాత్రంతా కూర్చుని సంతోషంగా రామాయణపారాయణం చేశాడు. ప్రదీప్‌కుమార్ పేరు కూడా అతను పెట్టిందే. ఊర్లోని పండితుడేమో'పతాశు' పేరు పెట్టమని చెప్పాడు. పతాశు కూడా ఒకపేరేనా?

ఇప్పుడెక్కడున్నారో ఆ కంట్రాక్టరుగారు. ఎక్కడన్నా ఉండనీ! భగవంతుడు ఆయనను చాలా చల్లగా చూడాలి. ప్రదీప్‌కుమార్ అమ్మ ఇప్పుడు కూడా అతన్ని ప్రతి నెలా అనుకుంటూ వుంటుంది. అప్పుడప్పుడూ వచ్చి ప్రదీప్‌కుమార్ని చూసి పోతూ వుంటానులే, అని అతను చెప్పిన మాటలు ఆమెకు గుర్తుకొస్తూ ఉంటాయి.

ప్రదీప్‌కుమార్ ముఖం అచ్చం ఆ కంట్రాక్టరు మాదిరేవుంది అని'ఛితనూ' కొడుకు 'రామ్‌డోల్వా' అంటాడు. పిచ్చి వాడెక్కడో.

ఎర్ర బస్సుడ్రైవరు కూడా మంచి వాడే. "చూడు ఉజాగిర్ భాయీ పొయ్యి

వద్ద కూర్చొని కూర్చొని ప్రదీప్‌కుమార్ అమ్మ రంగు నల్లబడుతూంది. ముఖానికి పౌడరు రాసుకుంటే బాగుంటుంది. అని మరుసటి రోజే పూర్ణియా నుంచి ఒక పౌడరు డబ్బాకొనుక్కొచ్చాడు. ఇంత మంచి మనిషి ఈ ఊరిలో నేకాదు మన ప్రాంతమంతా వెతికినా కనపడడు."

క్రొత్తగా వచ్చిన ఈ పోలీసు ఇన్‌స్పెక్టరు గూడా మంచి మనిషే. మీ పకోడీలు చాలా బాగుంటాయని ఎస్.పి.సాబ్ అంటారు. జోగ్‌బనీసేఠ్ గారి కొడుక్కు పకోడీల పేరు వింటూనే నోట్లో నీళ్ళు వూరుతాయి. రాత్రి పన్నెండు గంటల బస్సులో పోలీస్ ఇన్‌స్పెక్టరుతో పాటు వచ్చి పకోడీలు దొంగతనంగా తింటాడు. అతడువైష్ణవుడు. వాళ్ళింట్లో ఉల్లిపాయలు నిషిద్ధం. అలాంటప్పుడు ఉజాగిర్ దుకాణంలో కూర్చొని ఉల్లిపాయల పకోడీలను పబ్లిగ్గా ఎలా తినగలడు! జోగ్‌బనీ సేఠ్‌గారి కొడుకు గంగిగోవులాంటివాడు. బక్కగా ఉంటాడు అందువల్ల పకోడీలతో పాటు టీతాగడు. ఇంగ్లీషుసారాయి తాగుతాడు. ఆవేళ సాయంత్రం నుంచే ప్రదీప్‌కుమార్ అమ్మకు వళ్లంతా నలుపుతూంది... పోలీసు ఇన్స్‌పెక్టరు ఒక గ్లాసు తెచ్చుకోమన్నాడు. గ్లాసులో విస్కీపోస్తూ, ఒక గుక్కెడు తాగి నావంటే నొప్పిగిప్పి మటుమాయ మవుతుంది. నిజంగానే అలాగే జరిగింది. సాయంత్రంనుంచి ఒళ్లు విరుసుకుంటూ నొప్పితో బాధ పడుతున్న ప్రదీప్‌కుమార్ అమ్మ సేఠ్ కొడుకుతో బడబడా గప్పాలు కొట్టడం మొదలు పెట్టింది. ప్రదీప్‌కుమార్ అమ్మ లక్ష్మి తోసమానం.

మూడుగంటల బస్సువస్తూంది.

నాయనా బాబూ, ఎక్కడున్నావురా! అమ్మతో చెప్పు మూడు గంటల బస్సు వస్తూంది చూడు. నాడిపార్టుమెంటు పనంతా పూర్తయింది.

"బాబూ ప్రదీప్‌కుమార్? అమ్మెక్కడరా? తెల్లారు జామున మంచి నిద్రలో వున్నాడు ప్రదీప్‌కుమార్. ఉజాగిర్ బీడీ వెలిగించాడు. ఈ వేళింత పొద్దున్నే ఈ విడ ఎక్కడికి వెళ్లిందబ్బా? వంట్లో ఏమన్నా బాగులేదా? ఎర్రబస్సు డ్రైవరు అనేది నిజమే. ఆరోగ్యమే మహాభాగ్యం పాపం ప్రదీప్‌కుమార్ అమ్మరోజంతా పొయ్యి దగ్గర కూర్చునే ఉంటుంది. తన ఆరోగ్యానికిది మంచిదికాదు. పకోడీలు చేసే దానికి 'సుగనీ' అమ్మను కూలిచ్చి పెట్టుకోవాలి."

ఉజాగిర్ కూర్చుని ఆలోచిస్తున్నాడు. వేగుచుక్క అస్తమించటంతో తెల్లారింది... కానీ ప్రదీప్‌కుమార్ అమ్మ ఇంకా దుకాణంలోకి రాలేదు. అతను బయటి కొచ్చి చూశాడు. బయట పాత్రలన్నీ పడివున్నాయి... అయితే ఎక్కడికి పోయుం

టుందబ్బా?

ఉజాగిర్ ఇంట్లోకి వచ్చి చూశాడు. పెట్టె తెరచి వుంది. అరేసిల్కు చీర, సిల్కు బ్లౌజు లేదే. భూమి గిర్రున తిరిగినట్లనిపించింది. అరే నాయనా, బాబూ లేరా అని గట్టిగా అరిచాడు. "ప్రదీప్‌కుమార్! అమ్మ ఎక్కడరా?"

ప్రదీప్‌కుమార్ నిద్రలేచి జోరుగా ఏడ్వడం మొదలు పెట్టాడు. "అమ్మా, ఓ అమ్మా అని."

కొడుకు ఏడ్పు ఆపడానికి ఉజాగిర్‌తన్ను సంభాళించుకున్నాడు."నాయనా, అమ్మ గంగానది ఒడ్డున జరిగే తిరునాళ చూడటానికి పోయింది. మధ్యాహ్నం పన్నెండు గంటల బస్సుకు వస్తుంది."

ఎక్కడికి పోతుందిలే. ఏదో పని మీదనే పోయివుంటుంది. తనకు తనే సముదాయించుకున్నాడు.

పొద్దున బస్సు లొచ్చేటయిమయింది. రోజూ మాదిరే సంతోఖిసింగ్ టయానికొచ్చాడు. వస్తూనే పొయ్యివైపు జూసి "ఈ రోజు పొయ్యి వెలిగించలేదే" అన్నాడు.

ప్రదీప్‌కుమార్ అమ్మపెద్దమ్మకు ఆఖరి ఘడియలు దాపురించాయనీ కబురొస్తే ఉన్నపళంగా రాత్రి బస్సుకెళ్లి పోయిందనీ జవాబిచ్చాడు ఉజాగిర్.

అమ్మగంగానది ఒడ్డున జరిగే తిరునాళ వెళ్లిందన్నాడు ప్రదీప్ కుమార్. రాత్రి తెల్ల బస్సురాలేదుకదా! ఏ బస్సులో వెళ్ళింది మరి." పోలీసోళ్ళ ఎంక్వయిరీ చేసినట్లు అడిగాడు సంతోఖిసింగు.

బోణీ కాకుండానే ఈ వేళ సంతోఖిసింగుకు పెద్ద గ్లాసులో టీ అందించాడు. కాలం సరిగా లేదు. "ఆడకూతురు ఒంటరిగా వెళ్లటమంటే..." టీ తాగుతూ సంతోఖిసింగు అన్నాడు.

ఇరువైపుల నుంచి బస్సులొచ్చి ఆగాయి. ఉజాగిర్ ఎర్రబస్సు వైపు చూశాడు. అరే డ్రైవరు క్రొత్త వాడే? "ఈ బస్సుపాతడ్రైవరు సెలవులోవెళ్లాడా? ఎన్ని రోజుల సెలవులో వెళ్ళాడో? ఈ వేళ పకోడీలు లేవు. టీ మాత్రమే దొరుకుతుంది."

మధ్యాహ్నమవుతూనే ఉజాగిర్ దుకాణం మూసివేశాడు.

ఉజాగిర్ లోలోపలకుమిలిపోతున్నాడు. గట్టిగా ఏడ్వాలన్పించింది. కానీ ప్రదీప్‌కుమార్ ముఖం చూసి సంభాళించుకున్నాడు. తనే ఏడిస్తే ఇక పిల్లవాడి గతేం కావాలి?

'నాన్నా, పన్నెండు గంటల బస్సు వస్తూంది!'

ప్రదీప్‌కుమార్ అమ్మ దాంట్లోరాలేదు. "బాబూ, ఈ బస్సులో రాలేదు, మూడు గంటల బస్సులో వస్తుంది."

"నాన్నా, మూడు గంటల బస్సు వస్తూంది."

"దీంట్లోనూ రాలేదు."

ఈ దఫా తండ్రీ కొడుకులిద్దరూ ఇంటిముంగిట్లో కూర్చుని ఏడ్వసాగారు. ప్రదీప్‌కుమార్ వెక్కి వెక్కి ఏడుస్తూ 'నాన్నా! అమ్మ కావాలి!' అని అంటూంటే అతను ఈ లోకంలోకి తిరిగొచ్చాడు. "రాత్రి బండ్లో తప్పకుండా వస్తుంది లే బాబూ, నీకోసం బిస్కట్లూ, బొమ్మలు తెస్తుంది." కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ బుజ్జగించాడు.

ప్రదీకుమార్ అమ్మ రాత్రి బస్సులో తిరిగొచ్చింది.

"వచ్చేసింది, అమ్మ! అమ్మొచ్చింది." ప్రదీప్‌కుమార్ జోరుగా ఏడుస్తూ అన్నాడు. "ఎక్కడికి పోయావు?" అంటూ ఉజాగిర్‌కూడా ఏడ్వసాగాడు.

'అరే అరే! ఏమయింది మీయిద్దరికీ.'

"ఎక్కడికి వెళ్ళావు? ఏ బస్సులో వెళ్ళావు?"

"పనుండి పోతిని. పూర్ణియా బస్సులో కాదు, లారీలో పోయినా."

"చెప్పిపోతే."

"పనిగాక ముందు చెప్పటం బాగుండదు."

ప్రదీప్‌కుమార్ బొమ్మలు చూసుకుంటూ సంతోష పడ్డాడు. మూటలోంచి వాళ్ళమ్మ బిస్కెట్ పాకెట్ తీసిచ్చింది. ఉజాగిర్ మౌనంగా కూర్చుని ఆమెవైపు కన్నార్పకుండా చూస్తున్నాడు - ఎన్ని రోజుల తర్వాత ప్రదీప్‌కుమార్ అమ్మ సిల్కు చీరకట్టుకుంది...అందం కొంచెం కూడా తరిగి పోలేదు - ఎంత అందగత్తె అయినా పల్లెలో ఒకసంవత్సరానికే అందం తరిగి పోతుందనీ ఎవరన్నారోగానీ అది పొరపాటు. ప్రదీప్‌కుమార్ అమ్మ చీర కొంగు లోంచి ఒకకాగితాన్ని తీసి, ఉజాగిర్‌కు చూపిస్తూ "ఇదేందో చెప్పుకో" అన్నది. ఉజాగిర్ లాంతరు వెలుతురులో కాగితాన్ని అటూ యిటూ తిప్పుతూ, ఏమో అబ్బా!, ఇదేందో నాకు తెలియటం లేదు. చూస్తే ఇదే దో గవర్నమెంటోళ్ళ కాగితం లాగుంది. ఏమో నీవు చెప్ప రాదు? 'ప్రదీప్‌కుమార్ అమ్మ నవ్వుతూ అంది'-

"కరెక్టుగానే కనుకున్నావు. గవర్నమెంటోళ్ళ పత్రమే...పర్మిట్!"

"పర్మిటా. దేనికి పర్మిట్?"

"ఊళ్ళో వుండే ఈ ర్ష్యపడే వాళ్ళను బాగా ఏడ్పించాలి!" అని నవ్వుకుంటూ అంది.

"ఏడ్పించాలనా? అంటే? ఓహో అర్థమయింది. పక్కా ఇల్లా? వాస్తవంగా నీవు ధన్యురాలివి. నాతో చెప్పకుండా పోయినీవు మంచి పనిచేశావు. ఇంత పెద్దమాట నాకడుపులో దాగేదికాదు. అబ్బా, పట్టరాని సంతోషంతో నేను పిచ్చివాడినైపోతున్నాను. సాక్షాత్తు, నీవు లక్ష్మివి!"

"ఇందులో నేను చేసిందేమీలేదు. అంతా ఆ ఎర్రబస్సు డ్రైవరు దయాదాక్షిణ్యమే! ఆ సేఠ్‌గారి గుమస్తాతో ఈ డ్రైవరుకి మంచి స్నేహం. ఇంకోమాట చెప్పనా? ఈ పర్మిట్‌తోనే ఇల్లుకట్టటానికి కావల్సిన సగం పైసలు వసూలవుతాయి!"

"అదెట్లా?"

"చూస్తావుండు! రానీ సేఠ్‌గారి అబ్బాయిని."

"నిజంగా! అబ్బా ఎంతమంచి మాటో! రేపు సంతోఖిసింగుకు బోణీ కాక మునుపే ఐదుగ్లాసులటీ ఇస్తాను. ఇప్పుడు నిన్ను ఏమని పిలువమంటావు? పసిడి వన్నె పెళ్ళామా?"

"హీ, హీ,!"

ఇంటికి పునాది పడింది. ఒక వెదురు బొంగు నాటి దానికి పాత చీపురు కట్టారు - దిష్టితగలకుండా వుండే దానికి. ఊళ్లోవాళ్లు ఈ ర్ష్యతో కుమిలిపోతున్నారు.

ఎందు వల్లనో చాలా రోజులుగా ఉజాగిర్ లోలోపలకుమిలి పోతున్నాడు. పర్మిట్ కాగితాన్ని సేఠ్ కొడుక్కిచ్చి, ఇటుకలు, సిమెంటు, స్టీలు తీసుకున్నారు. సరే, కానీ పర్మిట్ తీసుకొనేటప్పుడు ప్రదీప్‌కుమార్ అమ్మ వేళ్లను సేఠ్ కొడుకు మెల్లగా పిసికాడు. సరే పోనీలే అనుకొంటే ఆవేళ పోలీసు ఇన్సపెక్టరు తాగినమత్తులో ఆవిడను పంచెవన్నెల చిలుకా అన్నాడు. సరే లే గవర్నమెంటు ఆఫీసరు వాళ్ళేమి జేసినా చెల్లుతుంది... హోలీరోజున ఎర్రబస్సు డ్రైవరు ఆమె బుగ్గలకు రంగు పులిమాడు. సరేలే హోలీ నాటి సంగతి అది. అయినా సరే డ్రైవరు మంచి వాడే- కానీ...

"కెట్లీలో మసలుతున్న నీళ్ళు పొంగిపోతున్నాయి! చూడు. చూడు! అటు చూడు. ఏమాలోచిస్తున్నావు. ఏలోకంలో ఉన్నావు?" ప్రదీప్‌కుమార్ అమ్మ మందలించింది.

"ఈ లోకంలోనే ఉన్నాను!" అని జవాబిచ్చారు ఉజాగిర్, కెట్లీదింపేశాడు. ఇల్లుకట్టే అబుద్ధమూతి మేస్త్రీ గాడు చెప్పాపెట్టకుండా ఇంట్లోకి ఎందుకురారాడు? వెళ్ళేటప్పుడు ప్రదీప్‌కుమార్ అమ్మ వైపు చూసికన్ను కొట్టాడెందుకు? ఆవిడ నవ్వెందెందుకనీ? నవ్విలోనికెందుకు పోయింది?

ఉజాగిర్ మనసు పొగతో నిండుకున్నట్లు అయింది.

'బాబూ, ప్రదీప్‌కుమార్' అనికేకేశాడు.

ప్రదీప్‌కుమార్ వచ్చాడు. పిల్లవాని ముఖం కూడా కోపంగా ఉన్నట్లు కన్పించింది. వాణ్ణి ఉజాగిర్ నెమ్మదిగా అడిగాడు - "బాబూ! అమ్మఎక్కడ? ఏమి చేస్తూంది?"

"నాన్నా, ఈ మేస్త్రీ చాలా బద్మాష్, నన్ను పతాశు అని పిలుస్తాడు. ఉజాగిర్‌కి చెప్పలేనంత కోపం వచ్చింది. ఆ బుద్ధమూతి మేస్త్రీకి ఇంత ధైర్యమా! నా కొడుకు ప్రదీప్‌కూమార్‌ని పతాశు అని పిలుస్తాడా!"

అతనులేసి ఇంటి గడపవద్దకు వెళ్ళాడు. లోపల గుసగుసమని ఏమిటో మాట్లాడుకుంటున్నారు.- ఎదురెదురుగా కూర్చుని. ఈ మేస్త్రీ ముండా కొడుకు పంచెతొడలపై వరకూ ఎగజెక్కి ఏం చేస్తున్నాడో? ఉజాగిర్‌కి నెత్తినకుంపటి పెట్టినట్లయింది. లోనికి అడుగుపెట్టి గర్జించాడు.

"మేస్త్రీ! గోడకు ప్లాస్టరింగు ఇక్కడ్నే చేస్తున్నావా!"

మేస్త్రీ తడబడుతూలేచి బయటికి వెళ్లాడు. ప్రదీప్‌కుమార్ అమ్మ కూడా నవ్వుతూలేచి నిలబడింది. ఉజాగిర్‌లోని కెళ్ళిరబాలున వాకిలి మూశాడు.

ప్రదీప్‌కుమార్ అమ్మ నిప్పుల్లాంటి ఉజాగిర్ కళ్లను చూసి భయపడింది. ఉజాగిర్ పెదాన్ని పండ్లతో కొరుక్కుంటూ ఆమె దగ్గరికి వెళ్ళి నెమ్మదిగా అరిచాడు - "నీవు కుక్కవు! మనిషివికావు."

"ఏమైంది నీకు?" ప్రదీప్‌కుమార్ అమ్మబిగ్గరగా అరిచింది.

ఉజాగిర్ తనగదికి వెళ్ళిపోయాడు. గదిలో నుంచే కొడుకును పిలిచాడు...'ప్రదీప్‌కుమార్, నాన్నా నీవు ఇటురా.'

ప్రదీప్‌కుమార్ తండ్రి వద్దకు వెళ్ళి పోయాడు. బయట దుకాణంలో పొయ్యి మండుతూంది. బస్సులొచ్చాయి. డ్రైవర్లు హారను మోగిస్తూ ఉజాగిర్‌ను పిలిచారు. సంతోఖిసింగు కూడా పిలిచాడు. లోపలినుంచి ఎలాంటి జవాబు రాలేదు. "ఇప్పుడు పక్కా ఇల్లు కట్టుకొన్నాడు గదా! ఇక దుకాణంలో ఎందుకు కూర్చుంటాడు!" అని మధ్యలో ఎవరో అన్నారు. బస్సులొస్తున్నాయి. ఆగుతున్నాయి. హారను మోగించి మరలా వెళ్ళిపోతున్నాయి.

ఆరోజంతా ఉజాగిర్ ఇంట్లోంచి బయటికి రాలేదు. ప్రదీప్‌కుమార్‌కూడా నాన్నతో పాటే పక్కనే పడుకొన్నాడు. ప్రదీప్‌కుమార్ అమ్మ వసారాలో ఒకమూలకూర్చుని గొణుక్కుంటూ ఏడుస్తున్నది.

సాయంత్రమయింది. ఉజాగిర్ లేచి భార్య వద్దకెళ్ళి, "ఆ బుద్ధమూతి మేస్త్రీగాడితో పోవే! గబ్బుముండా! నాయింట్లో ఉండద్దుపో" అన్నాడు.

"ఇంత పౌరుషముంటే రేపటి నుంచి ఈ కూలోళ్లపని నీవే చూసుకో. పక్కా ఇల్లు కట్టించుకోవటమంటే మామూలు మాటలు కాదు," అని ప్రదీప్‌కుమార్ అమ్మ అంది.

"పోయే దొంగముండా! నీ పక్కా ఇల్లులేక పోతే మానే!"

"ఈ మాటలు దుకాణం వద్ద ఇంత మంది ముందర...?"

"ఈ దుకాణం నాశన మైపోనీ!"

ఉజాగిర్ బయటికొచ్చి రెండు పొయ్యిలను తన్ని నాశనంచేశాడు. తలుపు లేస్తూ, "పో, వెళ్ళిపో, వెనుక వాకిలివైపునుంచి నోరు మూసుకొని వెళ్ళిపో, లేకపోతే నీ రక్తం తాగుతాను అన్నాడు."

ప్రదీప్‌కుమార్ ఏడువసాగాడు. కొడుకును తనఒడిలోకి తీసుకొని ఉజాగిర్ గదిలోకి వెళ్ళి పోయాడు. ప్రదీప్‌కుమార్ అమ్మ వసారా లోనే ఏడుస్తూ కూర్చుంది. ప్రదీప్‌కుమార్ ఏడుస్తూనే నిద్ర పోయాడు.

సాయంత్రం గడచిపోయింది. రాత్రయింది. రోడ్డు పైనుంచి ఒక ట్రాక్టరు గడగడ మంటూ వెళ్ళి పోయింది. ఉజాగిర్ బయటికొచ్చి చూశాడు. ప్రదీప్‌కుమార్ అమ్మ వసారాలో ఒక మూలపడుకొని ఉంది.

ఉజాగిర్ చడీ- చప్పుడు లేకుండా ఆమెవద్దకు వచ్చాడు - "పోయి ఆ మేస్త్రీ మంచం మీద పడుకోరాదూ! నీవేషాలు చాలు, ఈ నేల మీద పడుకొనే ఖర్మ నీకు దేనికి?" అన్నాడు.

"లే, నీకే చెప్పేది. దొంగముడా! నీ ఆటలు నావద్ద సాగవు. ఇంకెవరి దగ్గరయినా చూపుకోపో నీ ఆటలు" అని ఉజాగిర్ తన్నాడు.

ఆమెలేచి కూర్చుంది. రెండు చేతుల్తో ఉజాగిర్ కాళ్ళ పట్టుకొని ఏడుస్తూ అంది..."ప్రదీప్ నాయనా! నేను నీకాళ్లకు మొక్కుతా. నా పీక పిసికి చంపు...చంపేసెయ్యి నన్ను."

ఉజాగిర్ రెండు చేతుల్తో ఆమె పీకను గట్టిగా నొక్కి పట్టాడు. ఆవిడ పొడగాటి తలవెంట్రుకలు చెల్లా చెదురైయ్యాయి..."ఆ. చంపేస్తా."

"చంపేసెయ్యి. నేను బ్రతకాలను కోలేదు."

"చంపేస్తానే. గొంతు పిసికేస్తా. దొంగముండా."

"చంపు. ప్రదీప్ నా...ఆ..."

"చెప్పు. రేపటి నుంచి నీవు గడప దాటతావా."

"దాటను."

"ఎవరితో నవ్వటంగానీ, మాట్లాడటం గానీ చెయ్యవుగదా!"

"చెయ్యను."

"మేస్త్రితో గూడా!"

"...అతనితో కూడా."

"ఆసేఠ్ కొడుకుతో కూడా?"

"...అతనితోకూడా."

"...ఎర్ర బస్సు డ్రైవరుతో గూడా."

"...లేదు. లేదు. ఎవరితోకూడా...ఎవరితో నూ మాట్లాడను ప్రదీప్‌నాయనా."

ఆవిడ ఉజాగిర్ ఎదపై తన ముఖాన్ని ఆనించి వెక్కి వెక్కి ఏడ్వసాగింది... పెండ్లి తర్వాత ఈ వేళ తొలిసారిగా తన యింటి వానితో; తన మొగుడితో శోభనం రాత్రి గడుపుతున్నట్లు ఆమెకు అన్పించింది...ప్రతి అంగంలోనూ వణుకు...అల లు...తుఫాను చెలరేగింది...ప్రదీప్ నాన్నా నన్నుచంపు!"

రోడ్డుపై నుంచి ఒక లారీ దడ దడా శబ్దం చేస్తూ వెళ్ళిపోయింది.

(1962)

# సందేశవాహకుడు

హరగోబిన్‌కు ఆశ్చర్యం కలిగింది- అయితే ఈ రోజుల్లో కూడా సందేశ వాహ కుని అవసరం ఉందన్నమాట! నేడు పల్లె పల్లెకూ పోస్టాఫీసు ఉంది. సందేశవా హకుని ద్వారా సందేశం పంపించాల్సిన పనేముంది? ఈ రోజు ఎవరైనా ఇంట్లో కూర్చునే లంకకు కూడా ఉత్తరాలు రాసుకోవచ్చు. అటు నుండి క్షేమసమాచా రాలు తెలుసుకోవచ్చు. అయితే మరి తనకు పిలుపు ఎందుకొచ్చింది?

హరగోబిన్ పెద్ద హవేలి విరిగిన ద్వారం దాటుకొని లోపలికెళ్ళాడు. ఎప్పటి లాగానే పరిస్థితిని పసిగట్టి సందేశం ఏమయిఉంటుందో అంచనా వేసుకో గలిగా డు...జరూరుగా ఏదో గోపితమైన సందేశం తీసుకెళ్ళాల్సి ఉంటుంది. సూర్య చంద్రాదులకు కూడా తెలియనట్టిది. పైన ఎగిరే పక్షులకు కూడా తెలియకూ డదు.

"కాల్ మొక్కతా పెదరాణీ గారూ!"

పెద్దహావేలీ పెద్దకోడలు హరగోబిన్‌ను చూసింది. కొంత సేపుకూర్చోమని సైగ చేసింది. పెద్దహావేలి ఇప్పుడు నామ్‌కే వాస్తే పెద్దహవేలి... ఒకప్పుడు రాత్రింబగళ్ళు నౌకర్లూ -చాకర్లూ, కూలీ-నాలీ జనాలతో నిండి ఉండేది. ఈ రోజు హవేలీ లో పెద్దకోడలు తన చేతుల్తో చాట బట్టి ధాన్యం చెరుగుతూఉంది. ఒకప్పుడు ఈ చేతులకు గోరింటాకు పూయటానికి ఒక మంగలి కుటుంబం పోషించబడేది. ఆరోజులు ఏమయ్యాయో? హరగోబిన్ నిట్టూర్చాడు.

పెద్దన్నయ్య చచ్చి పోతూనే నాటకమే ముగిసింది... ముగ్గురు అన్నదమ్ముళ్ల మధ్య గొడవలు మొదలయ్యాయి. రైతులు దావావేసి భూమిని దఖలు పర్చుకు న్నారు. ఇంకే ముంది ముగ్గురన్న దమ్ముళ్ళూ ఊరు వదలి పట్నం చేరుకొన్నా రు. ఇక మిగిలింది పెద్దకోడలే - పాపం! ఎక్కడికెళ్తుంది? భగవంతుడు మంచి వాళ్ళకే కష్టాలు కలిగిస్తాడు. లేకపోతే జబ్బుసోకిన గంటలోనే పెద్దన్నయ్య ఎందుకు చనిపోతాడు?...ముగ్గురన్నదమ్ముళ్ళూ పెద్దకోడలు ఒంటి మీదున్న నగానట్రా లాగే సుకొని పంచుకొన్నారు. హరగోబిన్ తనస్వంత కళ్ళతో చూశాడు ఆ ద్రౌపదీ వస్త్రాపహరణ లీలను. బెనారసీ చీరను మూడు ముక్కలు చేసుకొని పంచుకొ

న్నారు, దయా దాక్షిణ్యం లేని తమ్ముళ్లు, పాపం పెద్దకోడలు!

కిరాణా కొట్టు ముసల్ది ఎప్పుడు వచ్చి ఇంటిముందు కూర్చుందో, ఏదేదో వాగేస్తుంది. "అప్పుతీసుకొని తిన్నసరుకేమో చాలా తియ్యగా ఉంటుంది. కానీ డబ్బులివ్వాలంటే మాత్రంచేదు. ఈ రోజు ఏమయినా సరే నా డబ్బుతీసుకొని గానీ లేవను."

పెద్దకోడలు బదులు మాట్లాడలేదు.

హరగోబిన్ మరో సారి నిట్టూర్చాడు. కిరాణాకొట్టు ముసల్ది వరండా దాటేం తవరకు పెద్దకోడలు హరగోబిన్‌తో ఏమి మాట్లాడదు. ఇక నోరు మూసుకొని ఉండలేక పోయాడు. "పిన్నీ, బాకీ వసూలు చేయటంలో నీవు కాబూలీ వాణ్ని కూడా తలదన్నగలవు."

కాబూలీవాడి మాట వింటూనే కిరాణా ముసల్ది కోపంగా లేచి నిల్చుంది- "నోర్ముయ్! పేడె మూతోడా..."

"ఏం చెయ్యమంటావు పిన్నీ, భగవంతుడు నాకు గడ్డాలు-మీసాలు ఇవ్వలేదు. కనీసం ఆకాబూలీ సాయిబులాంటి నిగనిగలాడే గడ్డాన్ని..."

"మళ్ళీ కాబూలీ వాడిపేరెత్తా వంటే నీనాలుక పీకేస్తా."

హరగోబిన్ నాలుక బయటకు చాచి చూపించాడు. కావలిస్తే పీకేసుకొమ్మ ని.

...ఐదేళ్ళకు ముందు గుల్ మహమ్మద్ ఆగా ఆ ఊర్లో బట్టలు అప్పుగా ఇచ్చేవాడు. కిరాణా ముసల్దాని వసారాలో బట్టల మూట వేసుకొని కూర్చునే వాడు. ఆగా బట్టలు ఇచ్చేప్పుడు మాత్రం తియ్యతియ్యగా మాట్లాడేవాడు. కానీ డబ్బులు వసూలు చేసుకునేప్పుడు దౌర్జన్యంగా ఒకటికి రెండుగా వసూలు చేసు కొనే వాడు. ఓసారి ఏమయిందంటే బట్టలు అప్పుగా తీసుకొనే వాళ్లంతా ఒకట యి చితకబాదారు. ఆ దెబ్బతో మరలా ఆ ఊళ్లో అడుగుపెట్టలేదు. కానీ ఆత ర్వాతే ఎప్పుడూ దిగులుగా ఉండే కిరాణాకొట్టు ముసల్దానికి కోపం ఎక్కవయిం ది...కాబూలీ వాడంటేనే కాదు, కాబూల్ బాదమన్నా కూడా కిరాణాకొట్టావిడికి చిర్రెత్తేది. ఊళ్లో వేషాలేసే వాళ్లు ఒకసారి కాబూలీ వాడి వేషంవేశారు - "నువ్వు మాదేశం వస్తావా కిరాణా కొట్టుదానా? మేము కాబూల్ బాదామ్ తినిపిస్తాము, అకరోటు తివిపిస్తాము..."

కిరాణా కొట్టుది కోపగించుకొని తిట్టుకొంటూ వెళ్ళిపోయింది... అప్పుడు పెద్దకోడలు హరగోబిన్‌తో చెప్పింది "హరగోబిన్ బాబూ, నీవు ఓ మాట చెప్పి

రావాలి. ఈ రోజే. చెప్పు, వెళ్లగలవా?"

"ఎక్కడికి?"

"మా అమ్మ గారింటికి."

హరగోబిన్ కళ్ళనీళ్ళు నింపుకొన్న పెద్దకోడలి కళ్ళవైపే చూస్తూ- "చెప్పండి, ఇంతకీ సందేశం ఏమిటి?"

సందేశం చెబుతూ పెద్దకోడలు వెక్కిళ్ళు బెట్టి మరీ ఏడ్చింది. హరగోబిన్ కళ్లుచెమర్చాయి...పెద్దహవేలీ లక్ష్మి ఇలా ఎక్కిళ్ళు పెట్టడం హరగోబిన్ మొదటిసారి చూశాడు. అతడు సముదాయించాడు- "పెదరాణీ గారూ! గుండెను దిటవు చేసుకోండి."

"ఇంకా ఎంత గట్టి పర్చుకోమంటావు?...అమ్మతో చెప్పు నేను అన్నా వదినలకు సేవచేసి పొట్టపోసుకుంటానని. పిల్లోళ్ల ఎంగిలి మెతుకులు తిని ఓమూల పడి ఉంటాను. కానీ ఇంకా ఇక్కడే మాత్రం ఉండలేను...చెప్పు, అమ్మనన్ను ఇక్కడి నుండి తీసుకెళ్ళకపోతే ఏదో ఒకరోజు మెళ్లో నీళ్లకడవ తగిలించుకొని చెర్లో పడి మునిగిచస్తానని చెప్పు...ఆకులు అలములు తిని ఎంత కాలం బతగ్గలను? ఎందుకు...ఎవరి కోసం?"

హరగోబిన్ రోమరోమమూవిలపించ సాగింది. మరుదులూ, తోటి కోడళ్ళు ఎంత కఠినాత్ములు. సరిగ్గా వరికోతల సమయానికి పిల్లా-పెద్దలని వెంటేసుకొని పట్నంనుండి దిగుతారు. పదిహేను రోజుల్లో అప్పులూ సప్పులూ లెక్కేసుకొని తిరిగి వెళ్ళేప్పుడు రెండు రెండు మణుగుల బియ్యం, అటుకులు తీసుకెళ్తారు. మళ్ళీ మామిడికాయల సీజనులో ఊడిపడ్తారు. పండూ-పిందెకోసేసుకొని బస్తాల్లో వేసుకెళ్తారు. ఇక తిరిగి చూస్తే ఒట్టు...రాక్షసులు!

పెద్ద కోడలు కొంగుకు ముడేసిన మూటవిప్పి నలిగిన ఐదు రూపాయల నోటు తీసింది- "కనీసం దారిఖర్చుకయ్యే మాత్రమైనా జమచేయలేకపోయాను. తిరిగి రావటానికయ్యే ఖర్చుకు అమ్మ నడిగి తీసుకో. వస్తే అన్నయ్య నీతో పాటే రావచ్చు."

"పెదరాణీ గారూ! దారి ఖర్చులకు ఇవ్వాల్సిన అవసరం లేదు. నేను ఆఏర్పాటు చేసుకొంటాను," అన్నాడు హరగోబిన్.

"నువ్వు ఎక్కడి నుండి ఏర్పాటు చేసుకుంటావు?"

"నేను ఈ రోజు పదిగంటల బండికి వెళుతున్నా."

పెద్దకోడలు చేతిలో నోటు బట్టుకొని మౌనంగా శూన్యదృక్కులతో హరగోబి

న్ను చూస్తుండిపోయింది. హరగోబిన్ హవేలీ నుండి బయట పడ్డాడు. "నేను నీరాకకోసం ఎదురు చూస్తుంటాను" అని పెద్దకోడలు చెప్పడం అతడి చెవిలో పడింది.

హరగోబిన్ సందేశహవాకుడు! సందేశాన్ని చేరవేసే కార్యాన్ని అందరూ చేయలేరు. మనిషి భగవంతుని ఇంటినుంచి సందేశవాహకునిగా మారి వస్తాడు. సందేశంలో చెప్పిన మాట పొల్లు పోకుండా మదిలో వుంచుకోవాలి. యే భావంతో, యే స్వరంతో సందేశం విన్నాడో సరిగ్గా అదే మాదిరి అప్పజెప్పడం మామూలు విషయంకాదు. పల్లెవాళ్ళు పొరపాటుగా లెక్కవేస్తారు. సోమరి పోతు, పని దొంగ, తిండి పోతు, తాడు బొంగరం లేని వాడే సందేశ వాహకుడుగా పని చేస్తాడని, కూలీ-నాలీ తీసుకోకుండా పల్లె పల్లెకూ వెళ్లి సందేశాలు అందించే వాణ్ణి మరేమంటారు?...ఆడంగుల గులామా అంటారా! నాలుగు తియ్యతియ్యని మాటలు వింటూనే కైపు ఎక్కినట్లయి పోతే అలాంటి మగాణ్ణి మరిమగవాడని అనగలరా? కానీ ఆ ఊళ్ళో ప్రతి తల్లీ, కోడలు, కూతురు తమ సందేశాల్ని హరగోబిన్ ద్వారానే పంపుతూ ఉంటారు...కానీ ఇలాంటి సందేశాన్ని ఇదే మొదటి సారిగా తీసుకెళ్తున్నాడు.

బండి ఎక్కుతూనే హరగోబిన్‌కు పాత రోజులు, సందేశాలు గుర్తుకువచ్చాయి.. ఓ మరచిపోయిన కరుణా రసపూరిత గీతం తాలూకు శకలాలు తన చెవుల్లో ప్రతి ధ్వనిస్తున్నాయి.

"పాదాలు పట్టుకుంటాను గడ్డం పుచ్చుకుంటాను...
మా సందేశాన్ని తీసుకెళ్లరో సందేశ వాహకుడా!"

పెద్దకోడలు చెప్పిన సందేశంలోని ప్రతి మాట అతని మనసులో ముల్లులాగుచ్చుకొంటూంది - ఎవర్ని నమ్ముకొని ఇక్కడుండాలి? ఓ నౌకరు ఉండేవాడు, వాడు నిన్ననే పారిపోయాడు. గూటానికి కట్టిన ఆవు నీళ్ళు, మేత లేక రంకెలేస్తుంది. నేను ఎవరికోసం ఇన్ని కష్టాలని భరించేది?

హరగోబిన్ తన పక్కసీటులో కూర్చున్న వ్యక్తిని అడిగాడు-

"ఏమండి, 'థానా బిహపూర్'లో బండి ఆగుతుందాలేదా?"

"థానా బిహపూర్‌లో అన్ని బళ్ళూ ఆగుతాయి" అని విసుగ్గా సమాధానం చెప్పాడు.

ఈ మనిషి చిర్రు బుర్రు లాడే మనిషి అని హరగోబిన్ ఊహించాడు. ఇతడితో బాతాఖానీ పనికి రాదను కున్నాడు. అతడు మళ్ళీ పెద్దకోడలు సందేశాన్ని

మనసులో తల్చుకొన్నాడు...కానీ తాను సందేశం విన్పించే టప్పుడు తనగుం డెను ఎలా రిటవు బరచుకోగలడు? పెద్దకోడలు సందేశం చెప్పేటప్పుడు మధ్య మధ్యలో ఎక్కడెక్కడఏడ్చిందో తనూ ఏడ్వాలా?

బండి కటిహార్ జంక్షన్ చేరగానే అతడు అటుయిటూ చూశాడు. పదిహేను ఇరవయి సంవత్సరాలలో చాలా మారి పోయింది. ఇక స్టేషనులో దిగితే ఎవర్నీ అడగాల్సిన అవసరంలేదు... బండి పట్టాలమీదికి వచ్చిందోలేదో మైకులో మాటలు విన్పిస్తున్నాయి. 'థానాబిహపూర్, ఖగడియా, బరౌనీ వెళ్ళే యాత్రికులు మూడో నెంబరు ప్లాట్‌ఫారమ్ చేరండి...బండి సిద్ధంగాఉంది.

హరగోబిన్ సంతోషించాడు -కటిహార్ చేరుకున్న తర్వాతనే తెలిసింది... నిజంగా స్వరాజ్యం వచ్చిందని. ఇంతకు ముందు కటిహార్ చేరుకుని ఏబండి ఎక్కాలి? అది ఎక్కడికి వెళ్తుంది? అని వివరాలు అడిగేలోపలే ఎన్నోసార్లు తాను ఎక్కవలసిన బండి కదిలిపోయేది.

బండి మారిన తర్వాత మళ్ళీ పెద్ద కోడలు కరణా పూరిత ముఖం తన కళ్ళ ముందు ప్రత్యక్షమయింది. 'హరగోబిన్ బాబూ! అమ్మతో చెప్పు, దేవుడు చిన్న చూపు చూశాడని, కానీ ఇంకా మాఅమ్మ ఉంది...ఎందుకు...ఎందుకు...ఆకులు అలుములు తిని ఎంతకాలం బ్రతకాలి!'

బండి థానాబిహపూర్‌స్టేషన్ చేరుకుంది... హరగోబిన్ హృదయం బరు వెక్కింది. ఇంతకుముందు కూడా ఎన్నోసార్లు మంచీ చెడు సందేశాలు తీసుకొని ఈ ఊళ్ళోకి వచ్చాడు. కానీ ఎప్పుడూ ఇలా అన్పించలేదు. అతడికాళ్ళు పల్లె వైపు ముందుకు సాగడం లేదు. ఈ కాలిబాటనే పెద్దకోడలు అమ్మోరింటికి తిరి గివస్తుంది. ఊరు వదిలేసి వచ్చేస్తుంది. మరి యెప్పటికి తిరిగి రాదు!

హరగోబిన్ మనసు వికలమైంది- ఇక ఊళ్లో మిగిలిందేమిటి? గ్రామలక్ష్మి యే గ్రామాన్ని విడిచి వెళ్ళిపోతే! తను ఏముఖం పెట్టుకొని ఇలాంటి సందేశాన్ని వినిపించగలడు? పెద్ద కోడలు ఆకులు అలుములు తిని బతుకు తోందని ఎలాచె ప్పగలడూ...విన్నవాళ్ళు హరగోబిన్ ఊరిపేరు తలచుకొని ఉమ్మేస్తారు- లక్ష్మీదేవి లాంటి పెద్దకోడలి చేత కంటతడి పెట్టించే ఊరు ఒక ఊరేనా!

అయిష్టంగానే హరగోబిన్ ఊళ్ళోకి చేరుకున్నాడు.

హరగోబిన్‌ను చూస్తూనే ఆ వూరి వాళ్ళు గుర్తు పట్టారు- జలాలాగడ్ వూరి సందేశవాహకుడొచ్చాడు...ఏ సందేశం తీసుకొచ్చాడో మరి!

"రామ్‌రామ్ భాయీ! చెప్పు అంతా క్షేమమే కదా?"

"రామ్‌రామ్ అన్నయ్యా దేవుని దయవల్ల అంతా క్షేమం."

"అటువైపు వానచినుకులు పడ్డాయా?"

పెద్దకోడలు పెద్దతమ్ముడు హరగోబిన్‌ను గుర్తుపట్టలేదు. హరగోబిన్ తన పరిచయం తెలుపుకున్నాడు. వెంటనే తన సోదరిక్షేమసమాచారాలు అడిగాడు." అక్క ఎలా ఉంది?"

"దేవుని దయవల్ల అంతా సంతోషంగా ఉన్నారు."

కాళ్ళు చేతులు కడుక్కున్న తర్వాత హరగోబిన్‌ను పిలిపించారు. హరగోబిన్‌కి కాళ్లు చేతులు ఆడటంలేదు. అతడిగుండె వేగంగా కొట్టుకోసాగింది...తను ఇలా ఢీలాపడి పోవడం ఎప్పుడూ జరగలేదు...పెద్ద కోడలు బొటాబొటా కన్నీరు కార్చిన కళ్ళు! ఎక్కిళ్లతో నిండిన సందేశము! అతడు పెద్దకోడలి ముసలి తల్లి పాదాలు ముట్టుకొన్నాడు.

ముసలి తల్లి అడిగింది- "చెప్పుబాబూ, ఏమిటి సమాచారం?"

"తల్లీ, మీ ఆశీర్వాదం వల్ల అంతా కుశలమే!"

"ఏదైనా సందేశం?"

"ఏంటీ?...సందేశమా?...మరండి సందేశమంటూ ఏమీ లేదు. నేను నిన్న సరసియా గ్రామమొచ్చాను. సరే ఇంత దూరం వచ్చాను కదా అని మీ దర్శనం చేసుకొని పోదామని."

ముసలితల్లి హరగోబిన్ మాట విని కొంత దిగులు చెందింది - "అయితే నీవు సందేశం ఏమి తీసుకురాలేదన్న మాట?"

"లేదు తల్లీ సందేశమేమి లేదు...మాటవరసకు పెద్దకోడలు ఏమని చెప్పిందంటే ఖాళీ ఉంటే దసరాకు, గంగజాతరకూ వచ్చి అమ్మను కలుసుకుంటాను అని చెప్పింది. ముసలి తల్లి మౌనంగా ఉండి. పోయింది. మళ్ళీ హరగోబిన్ కలుగజేసుకొని - "ఖాళీ ఎలా దొరుకుతుంది! కుటుంబాన్నంతటినీ పెద్దకోడలే చూసుకోవాలాయె"అన్నాడు.

ముసలి తల్లి పెదవి కదిపింది- "నేను బాబుతో చెబుతూనే వున్నాను, వెళ్లి అక్కయ్యను తీసుకరా, ఇక్కడే వుంటుందీ అని, అక్కడ ఇంకా ఏం మిగిలింది? ఆస్తిపాస్తులన్నీ పోయాయి. మరుదులు ముగ్గురూ పట్నం చేరుకున్నారు. మంచీ చెడ్డా చూసేనాథుడేలేడాయే. నాకూతురు ఒంటరిగా..."

"లేదు తల్లీ! ఆస్తిపాస్తులకు యిప్పటికీ కొదవేమీ లేదు. పోతే అట్టహాసాలూ ఆర్భాటాలూ లేవు. ఈ మాట మాత్రం నిజం! చెప్పాలంటే పెద్దకోడలికి వూరంతా

తనకుంటుంబమే. మావూరి పాలిట లక్ష్మీదేవి తల్లీ పెద్దకోడలు...గ్రామలక్ష్మి గ్రామాన్ని వదిలేసి పట్నం ఎలా వెళ్తుంది? మరుదులు వచ్చినప్పుడల్లా పట్నం పదమని మొండికేస్తుంటారు కూడా?

ముసలి తల్లి స్వయంగా హరగోబిన్‌కు టిఫిన్ తెచ్చి పెట్టింది, "ముందు కొద్దిగా టిఫిన్‌తీసుకోబాబూ."

టిఫిన్ తింటున్న హరగోబిన్ పెద్దకోడలు వరండాలో కూర్చొని తనకోసమే ఎదురు చూస్తున్నట్లన్పించింది - ఆకలి దప్పులతో...రాత్రి భోంచేసేటప్పుడు కూడా పెద్దకోడలు ఎదురుగా వచ్చి కూర్చున్నట్లే అనిపించింది...అప్పూ సప్పూ ఇక యిచ్చే వాళ్ళెవరూ లేరు...అమ్మతోచెప్పు...!

హరగోబిన్ పళ్ళెం వైపు చూశాడు -పప్పు, అన్నము, మూడు రకాల కూర లు, నెయ్యి, అప్పడం, ఊరగాయ...పెద్దకోడలు ఆకులు వుడకబెట్టుకొని తింటూ వుంటుంది.

ముసలి తల్లి అడిగింది- "ఏమిటి బాబూ, భోంచెయ్యడం లేదు?"

"తల్లీ కడుపునిండా టిఫిన్ తిన్నాను గదా!"

"అరె, వయసులో వున్న మగాడికి, అయిదు సార్లు టిఫిన్ తిన్నాగిన్నెడు కూడు యే మాత్రం!"

హరగోబిన్ ఏమీ తినలేదు... అసలు తినడానికి బొత్తిగా సయించడం లేదు.

సాధారణంగా సందేశవాహకుడు కడుపారాతిని, కన్నారానిద్రపోతాడు. కాని హరగోబిన్‌కు నిద్రపట్టడం లేదు...తను చేసిందేమిటి? అసలు తను ఇక్కడికి వచ్చిన పనేమిటి? తను అబద్ధ మాడటం దేనికి?...లేదు, ఏది ఏమైనా కానీ తెల్లారి లేస్తూనే ముసలి తల్లికి పెద్దకోడలి సందేశాన్ని ఉన్నదున్నట్లు చెప్పాలి - అక్షరం కూడా పొల్లు పోకుండా: అమ్మగారూ, మీ ఒక్కగా నొక్కకూతురు చాలా కష్టాల్లోవుంది. ఈ రోజే యెవరైన్నా పంపించి పిలిపించుకోండి. లేక పోతే ఏదో ఒక అఘాయిత్యం చేసుకుంటుంది. అసలు, ఎవరి కోసం ఆమె ఇన్ని కష్టాలు పడాలి! పెద్దకోడలు వదిన గారి పిల్లల యెంగిలి మెతుకులు తిని ఒక మూల పడి వుంటానని గూడా చెప్పింది...!

రాత్రంతా హరగోబిన్ కంటికి కునుకు పట్టలేదు.

తనకళ్ళ ముందు పెద్దకోడలు కూర్చుని వెక్కిళ్లూ బెడుతూ, కళ్ళు తుడుచుకుంటున్నట్లు కనిపించసాగింది. ఉదయాన్నే నిద్రలేచి గుండెదిటవు పరచుకున్నాడు. తను కేవలం ఒక సందేశవాహకుడు మాత్రమే. ఉన్నది ఉన్నట్లు చెప్పడమే

తనపని. అతడు పెద్దకోడలు సందేశం వినిపించడానికి ముసలి తల్లి దగ్గరకెళ్ళి కూర్చున్నాడు. ముసలి తల్లి అడిగింది- "యేం బాబూ, చెప్పేదే మైనా ఉందా?"

"అమ్మగారూ, నేను ఈ రోజే వెళ్ళిపోతున్నా, నేను వచ్చికూడా చాలా రోజులయింది."

"అదేమిటి, అంతతొందరెందుకు! మరో రెండ్రోజులుండివెళ్ళు."

"లేదమ్మగారూ, ఈ సారికి సెలవిప్పించండి. దసరాకు మాత్రం పెద్దకోడలు తో పాటు నేనూ వస్తాను. అప్పుడు పది పదిహేన్రోజులు దిట్టంగా కూర్చొని మీ ఆతిథ్యం అందుకుంటాను."

ముసలి తల్లి అంది, "అంత త్వరగా వెళ్ళాల్సివుంటే అసలు ఎందుకొచ్చినట్లు? కూతురికి పెరుగు-అటుకులు పంపిద్దామనుకున్నాను. కానీ పెరుగు ఈ రోజుకు దొరకదు. కొద్దిగా అటుకులున్నాయి... తీసుకెళ్ళు."

అటుకులపొట్లం చంకలో పెట్టుకొని హరగోబిన్ ముంగిలి దాటి వెళుతూంటే పెద్దకోడలి పెద్ద అన్నయ్య అడిగాడు- "ఏమయ్యా దారి ఖర్చులకు డబ్బుందా?"

"బాబుగారూ, మీ ఆశీర్వాదాల వల్ల దేనికి కొదవలేదు," అన్నాడు హరగోబిన్.

స్టేషన్ చేరుకొని హరగోబిన్ లెక్కవేశాడు. తనదగ్గర వున్న డబ్బుతో కటిహార్ వరకు టికెట్టు కొనగలడు. ఒకవేళ పావలాకాసు చెల్లకపోతే మాత్రం సైమాపూర్ వరకే వెళ్లగలడు...టికెట్టు లేకుండా మాత్రం ఒక్క స్టేషన్ కూడా దాటలేడు. భయంతో వంట్లోవున్న రక్తం ఎండిపోతోంది.

బండిలోకూర్చుంటూనే అతని పరిస్థితి అయోమయంగా వుంది. తను ఎందుకు వచ్చినట్టు? ఏం చేసుకుని వెళ్లుతున్నట్టు? పెద్దదకోడలికి ఏమి సమాధానం చెప్పుకోవాలి?

ఆబండిలోకి పాటపాడే గుడ్డి వాడే రాకపోతే తన పరిస్థితి ఎలా వుండేదో! సూరదాసు పాటవిన్నాక అతడి మనసుకు నిలకడ ఏర్పడింది-

"...ఓ రామా!
అత్తగారింటి సుఖమే మో కలలోని కల్లాయనే!
ప్రియుడేమో బండెక్కి పరదేశాలకేగెనే!
ఏడవకమ్మా తల్లి! ఏడవకు!
ఎవరు జేసిన కర్మ వారను భవించక తప్పునా!"

పాడే ఆ గుడ్డి వాడు వెళ్లిపోవడంతో మళ్ళీ పెద్దకోడలు ఏడుపు వినిపిస్తోంది-

ఎవరికోసం యిన్ని బాధలు భరించేది!

ఉదయం అయిదుగంటలకు అతడు కటిహార్‌స్టేషను చేరుకొన్నాడు.

మైకులోంచి మాటలు వినిపిస్తున్నాయి- బైరగార్హీ, కురియార్, జలాలాగడ్ వెళ్లే యాత్రికులు ఒకటో నెంబరు ప్లాట్ ఫారమ్ మీదకి వెళ్లండి.

హరగోబిన్ జలాలాగడ్ వెళ్ళాలి. కానీ తనదగ్గర కటిహార్ వరకే టికెట్టువుంది... మరి తను ఒకటో నెంబరు ప్లాట్ ఫారమ్ మీదికి ఎలా వెళ్ళగలడు? జలాలాగడ్! ఇరవైకోసులు! పెద్దకోడలు తన రాక కోసం ఎదురు చూస్తుంటుంది...ఇరవై కోసుల దూరమూ ఒక దూరమేనా? తను నడిచే వెళ్ళగలడు.

హరగోబిన్ మహ వీర-విక్రమ-బజరంగ్ నామం జపిస్తూ నడక సాగించాడు. పది కోసులదూరాన్ని ఒకే వూపులో అధిగమించాడు. ఓ పెద్ద గ్రామంలో ఆగి కడుపు నిండా నీళ్లు తాగాడు. చంకలో వున్న పొట్లాన్ని తీసి ముక్కు దగ్గర బెట్టుకొని వాసన చూశాడు. అబ్బ! బాస్ మతీ అటుకులు. కూతురి కోసం తల్లి కానుక. వద్దు, తాను ఇందులోంచి పిడికెడు కూడా తీసి తినలేడు...కానీ తాను పెద్దకోడలికి ఏమని జవాబు చెప్పగలడు?

అతడి కాళ్ళు తొట్రు పడుతున్నాయి. హు, ఇప్పుడు తాను యేమీ ఆలోచించ దలచుకోలేదు. ఇంకా తాను నడవాలి. త్వరగా చేరుకోవాలి వూరు...పెద్ద కోడలి చెమ్మగిల్లిన కండ్లు అతణ్ణి వూరివైపుకి లాక్కెళ్లుతున్నాయి- నేను ఇక్కడే కూర్చొని నీ రాక కోసం ఎదురు చూస్తూంటాను!

పదిహేను కోసులు! అమ్మతో చెప్పు. ఇక బతకనని చెప్పు. పది...పదకొండు...పన్నేండేండ్లు...జలాలాగడ్ స్టేషన్ సిగ్నల్ కనిపిస్తోంది....వూరి తాటి చెట్టుతల పైకెత్తి తన నడకను గమనిస్తోంది... ఆతాటి చెట్టు కిందే పెద్ద హవేలీ వరండాలో మౌనంగా కూర్చుని తనరాక కోసం ఎదురు చూస్తుంది. పెద్దకోడలు - ఆకలిదప్పులతో 'నా సందేశం తీసుకెళ్లరో సందేశవాహకా!!'

కానీ తను ఎక్కడికి చేరుకున్నాడు? ఇది యేవూరు? పొద్దుకుంకుతూనే అమావాస్య చీకట్లు అలుముకున్నాయి. తనుయేదారి బట్టి ఎటువైపు పయనిస్తున్నట్టు?... నది వచ్చింది! ఈ నది ఎక్కడిది? నదికాదు, పొలము...ఇవి గుడిసెలే నా లేక ఏనుగుల గుంపులా? తాటి చెట్టు ఎటు వైపు వెళ్ళి పోయింది? తను దారి మర్చి పోయి ఎక్కడెక్కతిరుగుతున్నాడో...ఈ వూళ్లో మనుషులులేరా?...ఎక్కడా వెలుతురు లేదు, ఎవర్ని అడగాలి?...ఎక్కడ, అది వెలుతురా లేక కళ్ళా? తను ఆగి పోయాడా లేక నడుస్తున్నాడా? తను బండిలోనే వున్నట్టా లేక నేలమీదనా?

"హరగోబిన్ బాబూ, వచ్చావా?" పెద్దకోడలు మాటలా లేక కటిహార్ స్టేషన్ మైకులో వినిపించే మాటలా?

"హరగోబిన్ బాబూ, ఏమయింది నీకు...?"

"పెదరాణీ?"

హరగోబిన్ చేత్తో తడిమి చూశాడు, తాను పక్కమీద పడి వున్నాడు. ఎదురుగా కూర్చున్న ఆకారాన్ని తాకి "పెదరాణీ గారూ?" అన్నాడు.

"హరగోబిన్ బాబూ, ఇప్పుడు నీ వంట్లో ఎలా వుంది?...

ఇంద మరో గుటికెటు నీళ్లు తాగు...నోరు తెరు...ఆ...తాగు, తాగు!"

హరగోబిన్ స్పృహలోకి వచ్చాడు...పెద్ద కోడలు గ్లాసునోటి దగ్గర పెట్టి పాలు తాపిస్తోంది?

అతడు మెల్లగా చేతులు చాచి పెద్దకోడలి కాళ్లు పట్టుకున్నాడు, "పెద్దరాణీ గారూ! నన్ను మన్నించండి. నేను మీ సందేశాన్ని చెప్పలేక పోయాను...మీరు వూరు విడిచివెళ్లద్దు. మీకు ఎలాంటి కష్టాన్ని రానివ్వను. నేనే నీ కొడుకును! పెద్ద రాణీగారూ, నీవే మా అమ్మవు, ఈ వూరంతటకీ అమ్మవు! ఇక నేను కాళ్ళు చేరేసి కూర్చోను. నీ పనులన్నీ చేస్తాను...చెప్పు, పెద్దమ్మా, నువ్వు...నువ్వు వూరు విడిచి వెళ్లకూడదు? చెప్పు...!!"

పెద్దకోడలు వేడిపాలలో ఒపిడికెడు బాస్మతీ అటుకులు వేసి కలిపింది... సందేశం పంపినప్పటి నుండీ ఆమె తన తప్పును తెలుసుకొని పశ్చాత్తాపం చెందసాగింది.

(1962)

# ఓ మొదటి రాత్రి సువాసన

కరమాకు బొత్తిగా నిద్రపట్టడంలేదు.

కొత్తగా కట్టిన ఇంట్లో అతనికి ఎప్పుడూ నిద్రపట్టదు. సున్నమూ వార్నీసు ఘాటు వాసనలకు అతడి కణతల దగ్గర పావలాబిళ్లమాయిన నొప్పి జివుల్ జివుల్ మంటూ వుంటుంది. పాతలైన్లోని పాత స్టేషన్‌లో అయితే అవి ఎంత పాతబడిన వైనా సరే నిద్రపడుతుంది...అబ్బ, ముక్కులో దురద బెట్టేస్తోంది...

కరమా తుమ్మాడు. కొత్త ఇంట్లో అతడి తుమ్ము ప్రతిధ్వనించింది.

"కరమా, నిద్రపట్టడంలేదా?" బాబుక్యాంపు కాట్ మీద మరోవైపు వత్తిగిలి పడుకుంటూ అడిగాడు.

తువ్వాలుతో ముక్కు తుడుచుకుంటూ "ఇక్కడ నాకు నిద్ర పట్టదని ముందే తెలుసు బాబూ" అన్నాడు కరమా.

"నాకూ నిద్రపట్టడయేదు." బాబు సిగరెట్టు వెలిగించి "కొత్తచోట మొదటి రాత్రి నాకూ నిద్రపట్టదు" అన్నాడు.

కొత్త ఇంట్లో మీకు సున్నం వాసన వస్తుందా బాబూ, అని అడగాలనుకు న్నాడు కరమా. కణతల దగ్గర నాలాగే మీకూ పోటుగా వుందా?...బాబూయేదో పాట కూనిరాగంతీస్తున్నాడు. ఓ కుక్క గస్తీ తిరుగుతూ సిగ్నల్ కేబిన్ వైపునుండి వచ్చి వరండాలో ఆగింది. కరమా గుట్టుచప్పుడు కాకుండా కుక్క కదలికను కని పెట్టి చూస్తున్నాడు. కుక్క బాబు మంచంవైపు మోరపైకెత్తి వాసన చూస్తోంది. ముందుకు కదిలింది. కరమాకు అర్థమై పోయింది. ఇది తప్పకుండా చెప్పులు కొరికే కుక్క అని, దొంగముండా! కాదు...చెప్పులజోలికి పోలేదు. వూరికే వాసన చూస్తింది అంతే. కుక్క ఇప్పుడు కరమా వైపు తిరిగింది... మళ్ళీ గాలివాసన చూస్తోంది. ఈ సారి వెయిటింగ్ రూంవైపు కుప్పిగంతులు వేస్తూ వెళ్ళిపోయిం ది...

"నీ పేరు కరమా లేక కరమ్‌చందా లేక కరమూనా!" అని బాబూ అడిగాడు.

...ఏడు రోజుల బట్టి కలిసివున్న తర్వాత ఈ రోజు అర్థరాత్రి పూట బాబు మనసు విప్పి భలే మంచి ప్రశ్నవేశాడు.

"బాబూ, నా పేరు కరమానే. జనాలు ఎవరి నోటికి తోచిన పేరుతో వాళ్ళు పిలుస్తారు...నితాయ్ బాబూ 'కోరమా' అని పిలిచేవారు. ఘోస్‌బాబు కరీమా అని పిలిచేవారు. సంతోషంగా వున్నప్పుడు ఎగతాళిగా - హాయ్ నాకరమా! అనేవారు...పేర్లోయేముంది లేబాబూ! మీమనసుకు తోచిన పేరు మీరూ పెట్టండి. సవాలక్ష పేర్లు..."

"మీవూరు సంథాల్ పరగణాలో కదా? లేక రాంచీ హజారీబాగ్ వైపా?"

ఈ ప్రశ్న అతణ్ణి కొద్దిగా గాబరా పెట్టింది. ఇలాంటి ప్రశ్నలకు సమాధానం చెప్పేటప్పుడు మాత్రం అతడు రమతాజోగి (వేదాంతిలా) ముద్ర వహిస్తాడు. ఇల్లా? ఎక్కడ వళ్ళుంటే అక్కడే ఇల్లు. అమ్మానాయనా - ఆ భగవంతుడే...కానీ, బాబుకు అలా చెప్పడం కుదర్దు గదా.

బాబూ భలేవారే! పేరును బట్టి ఇల్లు సంథాల్ పరగణా లేక రాంచీ హజారాబాగ్ వైపున ఏదో వూరై వుండొచ్చని సరిగ్గానే అనుకున్నాడు. కరమా పండుగ రోజు పుట్టివుండొచ్చు. అందుకే కరమా అని పేరు పడివుంటుంది. నుదురు, కపాలము, పెదాలు, శరీర ఆకారాన్ని బట్టి కూడా కరమా పేరు పెట్టి వుంటారని వూహించాడు.

బాబు చాలా తెలివైన వాడులా వున్నాడు. తన గురించి కరమాకు బొత్తిగా తెలియదు. కాని బాబూ, పేరు, కపాలం చూసి అన్నీ చెప్పేస్తున్నాడు. యింతకాలానికి ఓ మంచిబాబు దొరికాడు గోపాల్ బాబు లాంటివాడు!

కరమా అన్నాడు - "బాబూ, గోపాల్‌బాబు కూడా ఇలాగే అనేవారు. ఈ కరమా పేరు గోపాల్ బాబే పెట్టారు. కరమా గోపాల్ బాబు గురించి చెప్పడం మొదలెట్టాడు. "గోపాల్ బాబు అంటుండేవారు. అస్సాం నుంచి తిరిగి వచ్చే గూడ్సు బండిలో రసీదు లేని అమాంబాపతు సరుకుల్లో పడివున్నావు అని."

...పోనీలే, బాబుకు కునుకుపట్టింది. గురకబెడుతున్నాడు. గోపాల్ బాబు గురించి చెప్పాల్సింది అలాగే వుండిపోయింది.

కుక్క మళ్ళీ గస్తీ తిరుగుతూ వచ్చింది. ఇది కార్తీకమాసమే కదా! అందుకే దొంగముండ అలసిపోయి వచ్చింది. వగిరిస్తోంది...రా, నువ్వూ, ఇక్కడే పడుకుంటావా? అబ్బా! వెధవ ముండ కంపు ఇంతదాకా వస్తోంది - కొట్టూ, కొట్టూ!

బాబూకు మెలకువ వచ్చింది "ఆ, ఆ, ఆతర్వాత యేమయింది నీ గోపాల్ బాబుకు?"

కుక్క వరండా కిందికి వెళ్ళిపోయింది... తల తిప్పిచూస్తుంది. గుర్రుమం

ది... మళ్ళీ మెల్లగా రెండు మూడు సార్లు బౌ, భౌ మంది. ఆ తర్వాత ఆడవాళ్ల వెయిటింగ్ రూంవైపు వెళ్ళిపోయింది. అక్కడ పేట్‌మాన్ నిద్రపోతున్నాడు.

"బాబూ నిద్రపోయ్యావా?"

...సరే, బాబూకు మళ్ళీ నిద్రపట్టింది. బాబూ గురక సరిగ్గా బాబుగార్ల మాదిరే వినిపిస్తోంది. పేట్‌మాన్ గురక పెడుతూ వుంటే కర్రలు చీలుస్తున్నట్లుంది... గోపాల్‌బాబూ గురక వీణ వాయిద్యంలాగా వుంటుంది. అసగర్‌బాబు బుసలు కొడుతూ గురక పెట్టేవారు, సాహుబాబూ నిద్రలో మాట్లాడేవారు -ఏ! డౌన్ టూ, బండి వదలండి...

టెలిగ్రామ్ గంట, స్టేషన్ గంట, గార్డు విజిల్, ఇంజన్ కూత, స్టీమరు కూత... వేల కొద్దీ ఈలలు...కూతలు...పోం...పోం...పోం...

...లక్షసార్లు ప్రయత్నించి కూడా తను రైలుపట్టాల మీది నుండి బయట పడలేక పోయాడు కరమా. కాళ్ళు చేతులు కొట్టుకున్నాడు, కేకలు వేశాడు. కానీ అతని శరీరం ఉన్నచోటు నుండి కదల్లేదు. అతడు అతుక్కుపోయి వున్నాడు. ధడ్ ధడా...ధడ్ ధడా చప్పుడు చేసుకుంటూ ఇంజన్ మెడ, కాళ్ళను ఖండించు కుంటూ వెళ్ళిపోయింది...లైనుకు ఒకవైపు తన తల దొర్లిపడి వుంది, మరోవైపు రెండు కాళ్ళూ వేరువేరుగా పడి వున్నాయి! తను త్వరత్వరగా విరిగిపడిన కాళ్ళను ఒకచోట చేర్చాడు - అరే. ఇది ఆంథోని గార్డు సాబ్‌వాన బూట్లుజోడు. - తన తల ఏమైనట్లు? చేయ్, చేయ్ దొంగముండ ముక్కూ, చెవులూ నమిలే స్తోంది...

"కరమా!"

"ఛేయ్ ఛేయ్..."

"లే, లే కరమా, టీ చెయ్యి!"

కరమా గాబరాగా లేచి కూర్చున్నాడు...అబ్బ! తెల్లారిపోయింది. గూడ్సుబండికి థ్రూపాస్ చేసి పేట్‌మాన్ చేతితో కర్రకమాను తిప్పుకుంటూ వస్తున్నాడు...ఛా! కలలు ఇలాంటివి గూడా వుంటాయా? గత పన్నెండేళ్లలో కరమా ఇలాంటి పీడ కల చూడ్డం ఇదే తొలిసారి.

ఈ పన్నెండేళ్లలోనూ ఒక్కరోజు కూడా రైల్వే లైనుకు దూరంగా వెళ్లలేదు. కరమా. కాని ఇలాంటి ఏక్సిడెంటు కల ఎప్పుడూ చూళ్ళేదు అతడు.

కరమా రైల్వే కార్మికుడు కాదు. అతడు కావాలనుకుంటే ఫిట్టర్, కళాసీ, పేట్‌మాన్ లేదా నీళ్ళు పోసే పాండే ఉద్యోగం దొరికేది. చాలా సులువుగా

రైల్వే నౌకరుగా చొరబడి వుండేవాడు. కానీ మనసు ఒప్పుకోలేదు. రైల్వే కంపెనీ నీలి చొక్కా యింజన్ ముద్ర బటన్లూ వాడాలనే కోరిక అతడికి ఎప్పుడూ లేదు.

రైల్వే నౌకరీయే కాదు మరే నౌకరీ చేయలేదు కరమా. పేరు, ఊరు అడిగిన తర్వాత ఎవరైనా నీవు ఏం పనిచేస్తావు అని అడగడం సహజం. దానికి జవాబుగా కరమా, "బాబుతో పాటు వుంటాను - అంటాడు. ఒక్కపైసా కూడా జీతం పుచ్చుకోని వాడిని నౌకరు అని చెప్పలేం కదా."

...గోపాల్ బాబుతో పాటు ఏకధాటిగా అయిదేళ్లు! ఆ తర్వాత, ఎందరో బాబుగార్లతో పాటు ఉండే వాడు. కానీ ఒక్కమాట చెప్పాలి...కుటుంబంతో పర్మ నెంటుగా వుండే యేబాబు దగ్గర తను వుండలేదు.

...గోపాల్ బాబు వెళ్ళి పోయాడు! అలాంటి బాబు ఎక్కడ దొరుకుతాడు? కరమా తల్లీ - తండ్రీ అమ్మా-అక్కా, కులమూ, గోత్రమూ- అన్నీ ఒక గోపాల్ బాబే! ...రసీదులేని అమాంబాపతు సరుకు కరమా. రైల్వే ఆసుపత్రి నుంచి తెచ్చుకొని తన దగ్గరే వుంచుకున్నాడు గోపాల్ బాబు. ఎక్కడికి వెళ్లినా కరమా వెంట వుండాల్సిందే! ఆయన ఏది తింటే కరమా అదే తినాలి. కానీ మనిషి బుద్ధి ఎప్పుడు ఎలా మారుతుందో ఎవరు చెప్పగలరు? రిలీఫ్ ఉద్యోగం మానేసి పర్మినెంటు ఉద్యోగంలో చేరిపోయాడు. ఆతర్వాతపెండ్లి కూడా చేసుకున్నాడు...గోపాల్ బాబు ఫామిలి...ఆరిదేవుడా! ఆవిడ ఆడమనిషేనా? సాక్షాత్తు దయ్యం.

...పగలంతా గోపాల్ బాబు బాగానే వుంటాడు. సాయంత్రం అయ్యేసరికి అతడి ప్రాణం పక్షిలాగా రెపరెపడుతుంది...అర్ధరాత్రి ఎప్పుడో స్పెషల్ రైలును పాస్ చేయించడానికి బాబు బయటపడేవాడు. అప్పుడుచూడాలి. అమెరికన్ రైల్వే ఇంజన్ బాయిలర్కు బొగ్గు వేసి బయటపడ్డట్టుంటాడు...కరమా క్వార్టరు వరండాలో పడుకునేవాడు. మూడు నెల్లదాకా రాత్రిళ్లు కంటికి కునుకుపడితే వొట్టు...అమ్మగారు హా, హూమనేవారు. బాబు మేక పిల్లలాగా మాట్లాడేవారు. అంతే ఏడుపులూ పెడబొబ్బలూ, తిట్లూ దెబ్బలాటలు మొదలయ్యేవి. బాబు బయటికి పరుగుతీశేవాడు. ఆ ఆడమనిషి దుమికి జుట్టు పట్టేసుకొనేది...అప్పుడే కరమాకు ఓ ఉపాయం తట్టింది. అలాంటప్పుడు కరమా లేచి తలుపు తట్టి. "బాబూ, స్పెషల్ కాల్ అవుతోంది." అని చెప్పేవాడు. బాబు బాధలను కరమా ఎంతకాలం తప్పించగలడు?...అమ్మగారు ఓ రోజు గట్టిగా కేకలేశారు "రేయ్, పనికి మాలిన ముండా కొడకా వెళ్ళు, దూరంగా వెళ్ళిపో! వీడు దొంగ వెధవ, దొంగ...దొంగ."

...అప్పట్నుండీ ఫేమిలీ క్వార్టరువైపు చూస్తే చాలు కరమా చెవుల్లో దొంగ!

లంజకొడుకు! శబ్దాలు ప్రతిధ్వనిస్తాయి.. ఫేమిలీ క్వార్టర్లే కాదు. ఆడవాళ్ళ వెయిటింగురూం, ఆడవాళ్ళు...ఆడవాళ్లు మనసులో మెదులుతూనే వాంతికి వచ్చినట్లు వుంటుంది.

...ఒక యేడాదిలోనే గోపాల్ బాబు రక్తమాంసాలు చప్పరించేసింది, ఆ ఆడది! పువ్వులాంటి సుకుమారుడు గోపాల్ బాబు. జీవితంలో మొదటి సారి వెక్కిళ్లు పెట్టి ఏడ్చాడు కరమా.

...రమతాయోగి, పారేసీరు, రిలీఫియా బాబూ - వీళ్ళెప్పుడూ ఒకేచోట వుండలేరు. హెడ్‌క్వార్టర్‌లో ఇరవై నాలుగ్గంటలు గడిచిందోలేదో ఆర్డర్సు జారీ అయాయి - ఫలానా స్టేషన్ మాస్టరు జబ్బు పడ్డాడు, సిక్కు రిపోర్టు వచ్చింది. వెంటనే జాయిన్ అయిపో...రిలీఫియాబాబు పెట్టేబేడా ఎప్పుడూ రెడీగా వుండాల్సిందే. కనీసం వారం లేదా అధికంగా అయితే మూణ్ణెల్ల కంటే ఎక్కువ కాలం ఒకేచోట రిలీఫియాబాబు వుంటానికి వీల్లేదు...క్రపెట్టెలో వంట సరుకులతో సహా అన్నీ రెడీగా వుంచుకొని ఈ రోజు యిక్కడ, రేపు అక్కడా...పానీపాడా నుండి భాత్‌గాంవ్ కుర్సెలీ నుండి రౌతాడు మళ్ళీ హెడ్‌క్వార్టర్ కటిహార్!

...గోపాల్ బాబు తనను ఘోస్‌బాబు దగ్గర చేర్చాడు - చాలా మంచోడు.బాగా చూసుకుంటాడు అని చెప్పాడు. కానీ ఘోస్‌బాబుతో పాటు ఒక నెలరోజుల కంటే ఎక్కువ కాలం వుండలేక పోయాడు కరమా. ఘోస్‌బాబూకు నిష్కారణంగా తిట్టే అలవాటుంది. తిట్లు కూడా చండాలమైన తిట్లు. అమ్మా అక్కా, అని తిట్టేవాడు...ఇంత కంటే ఘోస్ బాబులో చెడ్డ గుణం యేమిలేదు. తన స్వంత మనిషిలా చూసుకొనేవాడు...ఘోస్‌బాబూ యిప్పటికీ ఎక్కడైనా కనిపిస్తే తిట్లతోనే పలకరిస్తాడు. "యేరా...కరమా? ఎవరి దగ్గర వుంటున్నావ్. మాదర్చోద్...?"

...ఘోస్‌బాబును ఎవరూ అమ్మా, అక్కా తిట్టేవారు లేదు. ఎవరైనా అతన్ని అలా తిడితే తెలిసేది. అమ్మా అక్కా మాట వింటూనే శరీరంలో రక్తం ఎలా వేడెక్కిపోయేదో. మంచివాళ్ళెవరూ అలా చండాలపు తిట్లు తిట్టడం కరమా ఎప్పుడూ విన్లేదు.

...రాంబాబు గారి అలవాట్లన్నీ మంచివే. కానీ గొప్ప రసికుడు. యే స్టేషన్లోకి వెళ్లినా సరే పేట్‌మాన్. పోర్టరు - సూపర్‌వైజరుతో ఎవరూ లేని చోటికి తీసుకెళ్ళి చెవిలో మాట్లాడేవాడు. యిక రాత్రైతే చాలు. అటు సరుకుల గోడౌన్ వైపో, యిటు ఆడవాళ్ళ వెయిటింగ్‌రూం, లేదా ఆడవాళ్ల పాయిఖానాలవైపు...ఛీ ఛీ...ఎక్కడి కెళ్ళినా తిట్లు తిట్టుతూ అనేవాడు, "యేంటండీ, సరైన సరకు యెప్పుడూ ఏర్పాటు

చేయరు...చివరకు కరమా అన్నట్లే జరిగింది - సరుకే అతణ్ణి నరికేసింది. పోయిన సంవత్సరం బోగబనీలైన్లో ఓ నేపాలీ యువకుడు మచ్చు కత్తితో రెండు తుంటలుగా నరికేశాడు. ఎగిరిపోయింది. సరుకు...ఎవరి శీలము వారికి గొప్ప!"

...సింగ్‌జీ గొప్ప భక్తుడు సీతారాములు, లక్ష్మణుల విగ్రహాలు ఎప్పుడూ తన సంచిలో వుంటాయి. రోజూ తెల్లవారుఝామున నాలుగ్గంటలకు స్నానం చేసి దేముని గంట మోగించేవాడు...తన ఇంట్లో దేవుని పటాలుంటాయి.. కాబట్టి ఆయింట్లోకి స్నానం చేయకుండా ఎవరూ అడుగు పెట్టకూడదు...బయటకి వెళ్ళిన ప్రతిసారి ఇంట్లోకి అడుగుపెట్టక ముందే స్నానం చేయ్యాలంటే ఎవరి తరం? పదిసార్లు స్నానంచేసి, వెయ్యి సార్లు కాళ్లు కడగాలంటే సాధ్యమేనా? అదీ శీతాకాలంలో...ఏదైనా ముట్టుకుంటే చాలు, అరే లే...ఛీ ఛీ. ముట్టుకున్నారా...అలాంటి అంటూ సంటూ వున్న మనిషి రైల్వే డిపార్టు మెంటుకు ఎందుకు రావాలి?...సింగ్‌జీతో కలిసి వుండలేక పోయాడు కరమా.

...సాహూబాబు ఉదారస్వభావుడు. కానీ ఎంతటి తాగుబోతు అంటే పట్టపగలు యాభైయొక్క సారాసీసాలు ఖాళీ చేసి గూడ్సుబండికి థ్రూపాస్ సిగ్నల్ ఇచ్చేశాడు. బండి బోల్తా పడింది. కరమాకు బాగా గుర్తు, ఏక్సిడెంటు వార్తవిని సాహూ బాబూ మరో సీసా పట్టించాడు. చివరికి మైండు పాడైందని డాక్టరు సర్టిఫికెట్ యిచ్చేశాడు.

...అయినా, అంతటి ఏక్సిడెంటు అయిన సమయంలో కూడా ఏరాత్రి కరమాకు ఇలాంటి చెడు స్వప్నం రాలేదు.

...ఛీ, ఛీ...తెల్లారకముందే ఇలాంటి అపశకునపు మాటలు బాబుకు చెప్పకుండా ఉండాల్సింది అనుకొన్నాడు. కరమా. రైల్వే నౌకరీలోకి బాబు ఈ మధ్యనే చేరాడు.

...కానీ ఈ బాబు స్వభావం గురించి కరమాకు ఇంతవరకూ బొత్తిగా తెలియలేదు. దాదాపు వారంరోజులు తోడుగా ఉన్నప్పటికి నిన్న రాత్రే మొదటిసారిగా మనసువిప్పి బాబు రెండు ప్రశ్నలు వేశాడు. అందుకే తెల్లవారుతూనే కరమా నోరువిప్పి తనకల గురించి చెప్పాడు. టీ కప్పు ముందు పెడుతూ కరమా నవ్వి చెప్పపాడు - "బాబూ, రాత్రి నేను విచిత్రమైన కల గన్నాను. దడదడా...పరుగెత్తే ఇంజను - లైను అంటుకుపోయిన నాశరీరం పళ్ళు కదల్లేదంటే నమ్ము...తలకాయ, మొండెం నుంచి తెగి ఒకవైపు పడిపోయింది, కాళ్లు రెండూ లైనుకు అటువైపు పడి పోయాయి...ఆంథోని గార్డు సాబువానబూట్లు కన్పించాయి....అంతా విచిత్రంగా వుంది."

"ఛీ! పొద్దున్నే తలాతోకా లేకుండా మాట్లాడుతావెందుకు? గంజాయి ఏమైనా తాగుతావా?"

...కరమా బాబుకు కల గురించి చెప్పడం బాగోలేదు.

కరమా లేచి గూట్లోవున్న అద్దం తీసి ముఖం చూసుకున్నాడు. ఛీ, తన పెదాలు గోరువంక ముక్కలాగా వున్నాయి...

"ఏంటి కరమా ఏం చేస్తున్నావు?"

...నీళ్ళు మోసే పాండే మంచివాడు. కరమాతో చాలాకాలంగా పరిచయం వుంది. చాలా స్టేషన్లలో కలిసి స్నేహంగా వున్నారు. కానీ, యీ పైట్‌మాన్ కొంచం తిరకాసు మనిషిలాగా వున్నాడు. మాటమాటకి కుయ్ - కుయ్ మని నవ్వుతుంటాడు.

"కరమ చన్ బాబు, యేజాతి వాడు?"

"ఎందుకు? బంగాలీ అయుండాలి."

"బెంగాలీ బాబుల్లో చాలా రకాల వాళ్ళున్నారు."

"పాండేజీ ఆసంగతి నాకు తెలవదు. కానీ చాలా మంచి మనిషి. పేరును బట్టి, ముఖం చూసి అన్నీ చేసేస్తాడు. అదో, గంట కొట్టింది. రెండుగంటల బండికి, కానీ... నాకాయగూరలు ఇంకా పొయ్యి మీదనే ఉన్నాయి."

నీళ్ళ పాండే పోతూ పోతూ, "కొద్దిగా కూరవుంచు కరమచన్" అన్నాడు.

...ఇల్లెక్కడా? ఏజాతి? మనిహారీ మఠంలోని మస్తాన్ బాబు నేర్పిన సమాధానం అన్నిచోట్లా చెల్లదు. హరిభజన చేసే వాళ్లంతా హరిదాసులే! కానీ, ఆ హరికి గూడా ఒక జాతి ఉంది కదా...అబ్బా, ఘాట్‌రోడ్డు వైపు వెళ్లే రైలు ఇంజనును ఈ రోజు ఈ లైనులో ఎందుకు పంపించారో? సంథాలీ పిల్లన గోవిలాగా సన్న ఈల - సీ...ఈ...ఈ...చూసుకో, ఈ బండిలోంచి ఒక ప్యాసింజరు దిగితే ఒట్టు. ఎందుకు రైల్వే డిపార్టుమెంటు వాళ్ళు ఇంత ఖర్చు పెట్టి ఇక్కడ స్టేషను కట్టించారో కరమాకు అర్థం కావడంలేదు. ఏమిటి లాభం? పేరుకే అధమ్‌పురా - ఆదాయం మాత్రం సున్న. వారం రోజుల్లో రెండు టికెట్లు కొన్నారు. ఐదుమంది పాసింజర్లు దిగారు. అందులో రెండు టిక్కెట్లు లేని కేసులు...ఇన్ని రోజుల తర్వాత పదిహేను బస్తాల వంకాయలు బుక్కఅయ్యాయి. పదిహేను వంకాయలిచ్చి తన పని జరుపుకున్నాడు, ఆ ముసలాయన...కానీ వంకాయలాయన మాట వరుస వింతగా ఉంది. కరమాతో కలివిడిగా మాట్లాడాలనుకొన్నాడు ముసలాడు. ఇల్లెక్కడ? ఏజాతి? ఇంట్లో ఎవరెవరున్నారు?...కరమా అన్ని ప్రశ్నలకు ఒకే జవాబు చెప్పాడు -

ఆకాశంవైపు చెయ్యి చూపించి. ముసలాడు నవ్వాడు...చాలా వింతగా వుంది అనవ్వు.

...ఘాట్‌రోడ్డు వైపు వెళ్ళే బండి! సీ... ఈ -ఈ - ఈ!

కరమా మనీహారీ ఘాట్ స్టేషనులో కూడా ముందు వున్నాడు. మూడునెల్లు ఒకసారి, ఓ నెల్రోజుల పాటు మరోసారి...మనీహార్ స్టేషను తరహాయే వేరు. ఎక్కడి మనిహారీఘాట్ ఎక్కడి అధమ్ పురా స్టేషను.

...కొత్తవూరు, కొత్త స్టేషను చేరుకున్నాక చుట్టుప్రక్క ల వాళ్ళు తిరక్కుండా వున్నచోటే కూర్చోవడం కరమాకు చాలా చికాకుగా వుంది. ఏదో చీకటి గుహల్లోపడ్డట్టుంది...స్టేషను సిగ్నలుకు అటువైపుగా చాలా దూరం వరకు పొలాలు వున్నాయి...ఆ నల్లని అడవి...వంటరిగా నిల్చున్న తాటిచెట్టు...ఈ రోజు బాబుకు భోజనంవడ్డించి ఎలాగైనా తిరిగి రావాలనుకున్నాడు కరమా. ఇలా ఖాళీగా కూర్చుంటే కరమాకు తిండి వంటబట్టినట్లు వుండదు...ఇండ్లు వాకిళ్ళు, వూళ్ళు - పొలాలు తిరక్కుండా వుంటే తను చెట్లు ఎక్కడం ఈత కొట్టడం ఎలా నేర్చి ఉండేవాడు?

...లఖపతియా స్టేషను పేరుకు ఎంత గొప్పగా ఉంది? కానీ స్టేషనులో ఓ చిన్న టీ కొట్టు కూడా లేదు. చుట్టు ప్రక్కలా కోసు దూరం దాకా వూళ్ళే లేవు. కానీ స్టేషనుకు తూర్పువైపున వున్న రెండు పూరిళ్లను కరమా ఎలా మరిచిపో గలడు? అద్దంలాగా మిల మిలలాడే నీళ్ళు...వైశాఖమాసం మధ్యాహ్న వేళ్లలో గంటల తరబడి గొంతులోతు నీళ్ళల్లో మునిగి తేలడంలో వున్న ఆనందాన్ని మాటల్లో చెప్పడానికి సాధ్యం కాదు.

...ముదాకదమ్‌పురా...నిజంగానే అది కదమ్‌పురాయే. స్టేషను దగ్గర నుండి వేలాది కడిమి చెట్లే...కడిమి చెట్నీ తిని ఓయుగం గడిచినట్లుంది.

వారిస్‌గంజ్ స్టేషను సరిగ్గా వూరి మధ్యనే వుంది. పెద్ద పెద్ద గోదాములు వేలకొద్ది జనపనార బేళ్ళు వడ్లు, బియ్యం బస్తాలు, బొగ్గూ, సిమెంటు, సున్నం కుప్పలు - ఎప్పుడూ వేలమంది గుమికూడి వుంటారు. కరమాకు వాళ్ళల్లో ఎవరి ముఖం గుర్తులేదు. కానీ స్టేషన్‌కు ఆనుకొని ఉత్తరం దిక్కుగా మైదానంలో గుడారాలు వేసుకొని గాడిదలతో పాటు ఉండే మగహీ మాట్లాడే డోమ్ జాతి వారు గుర్తుకు వస్తుంటారు. ఘాఘరీలు వేసుకొని, చేతులకు పెద్ద పెద్ద కడియా లు, చెవులకు జుమికీలు వేసుకొన్న స్త్రీలు...వంటి మీద బట్టలు లేని పిల్లలు చెవు లకు పెద్ద పెద్ద కుండలాలు ధరించిన పురుషులు...వాళ్ళ కోళ్లు కుక్కలు...

...బథనాహా స్టేషనుకు నాలుగువైపులా వేలకొద్దీ ఇండ్లు వెలిశాయి. ఐదు

ఏండ్లకు ముందు బథనాహా స్టేషనులో జనసంచారమే ఉండేది కాదట.

...ఎన్నిమార్లు ఎంత మంది జనాలు గుర్తుకొస్తుంటారో...సోన్ బరసా మామిడి పండ్లు...కాలూ చక్ చేపలు...భటోతర్ పెరుగు...కుసీయాగాంప్ చెరకులు...

కానీ అన్నింటికంటే ఎక్కువగా మనిహార్ ఘాట్ స్టేషన్ గుర్తుకువస్తుంటుంది. స్టేషన్‌కు ఒకవైపు నేల ఒక వైపు నీళ్లు. ఇటురైలుబండి అటు పడవలు. ఈ ఒడ్డున పొలాలు, పల్లె, మైదానం, అటు ఒడ్డున సాహెబ్‌గంజ్ నీలికొండలు, నీలం రంగు నీళ్ళు - తెల్లని ఇసుక ...మూడున్నూ. ఒకటీ, నాలుగు! నాలుగుమాసాల పాటు ప్రతి రోజూ గంగలో స్నానం చేశాడు కరమా. ఇక నాలుగు జన్మల వరకూ తన మీద ఎలాంటి శాప ప్రభావం వుండకూడదు. ఇంతటి మంచి పేరు మరేస్టేషన్‌కైనా ఉంటుందా - మనహారీ...బలిహారీ! పడవలనుంచి చేపలు దింపేటప్పుడు చూడాలి. ఆ తలుకులకుమెరపులకు కరమా కళ్ళు చెదిరి పోయ్యేవి...

రాత్రిళ్ళు అటువైపు - ధూ...ధూ...మంటూ స్టీమరు...ఇటువైపు చుక్...చుక్...మని రైలు కటిహార్ వైపు పరుగుతీసేది. ఆజూసాహు కొట్టు కట్టేస్తూనే నది ఒడ్డున మస్తానా బాబుగారి మండలి గుమిగూడేది.

...మస్తానాబాబు కూలి జాతివాడు. మనీహారీ ఒడ్డున కూలీ పనిచేసుకునేవాడు. ఓ సారి అతని మనసు మారిపోయింది. గడ్డం మీసాలు, జడలు పెంచేసి బాబాగా మారిపోయాడు. కంజీర వాయిస్తూ నిర్గుణ గీతాలు పాడేవాడు. బాబా అంటూండేవాడు - తీర్థాలన్నీ చవిచూశా కానీ అన్నీ చప్పనే. ఒక్క గంగాజలమే తియ్యనిది...బాబా ఒక్కసారి గంజాయి హుక్కా దమ్ములాగి అయిదు కథలు చెప్పేవాడు. అన్నీ వేదాలు పురాణాలకు సంబంధించిన కథలే! కరమా వేదాంతానికి సంబంధించిన నాలుగైదు మాటలు మనీహారీ ఒడ్డుమీదే నేర్చుకొన్నాడు - మస్తాన్ బాబు సాంగత్యంలో కానీ తనూ ఎప్పుడూ గంజాయి దమ్ములాగలేదు...ఈ రోజు బాబు చికాకుపడి, గంజాయి గింజాయి ఏమయినా తాగావా అని అడగటంతో కరమాకు మస్తాన్ బాబు గుర్తుకొచ్చాడు. బాబా అంటూండేవాడు - ప్రతి చోటా సువాసన దుర్వాసన రెండూ ఉంటాయని...ఈ అర్థం పురా కంపు భరించలేక కరమాకు అన్నపానాలు రుచించటంలేదు.

...మస్తాన్ బాబు నుంచి దూరమయిపోయాక మనిహార్ ఒడ్డు ఎప్పుడూ గుర్తుకు రాలేదు.

కరమా గూట్లోని అద్దం తీసి మళ్ళీ తనముఖాన్ని చూసుకున్నాడు. తన కళ్ళను సగం తెరుచుకొని, పళ్ళు బయట పెట్టి నవ్వుతూ మస్తాన్ బాబా ముఖం

మాదిరి పెట్టాడు - సంతోషంగా జీవించు...సదా కళ్ళూ చెవులూ తెరిచి ఉంచు... నేల తల్లి మాట్లాడుతుంది. చెట్టూ చేమా తమ వాళ్లను గుర్తుపడ్తాయి...పచ్చని పైరు ఆడుతూ పాడుతూ ఉన్నప్పుడు చూశావా ఎప్పుడైనా? అమావాస్య రాత్రి కంట తడిపెట్టడం చూశావా...సదా ఆనందంతో జీవించు...కరమాకు ఎలా తెలుస్తుంది. వెనుకవైపు బాబు నిల్చుని తమాషా చూస్తున్నట్లు. బాబు విస్తుపోతూ అడిగాడు - "నువ్వు మేల్కొనే కలగంటున్నావా?...మళ్ళీ ఏమో గంజాయి తాగనంటావు."

నిజంగానే తను నిల్చునే కలగంటున్నాడు. మస్తాన్ బాబా ముఖం మర్రిచెట్టులాగా పెరిగి పోయింది. అతని స్వచ్ఛమైన నవ్వు ఆకాశంలో ప్రతిధ్వనిస్తుంది. గంజాయి పొగ ఎగురుతూ వుంది. గంగానదిలో అలలు కదులుతున్నాయి. దూరంగా స్టీమరు హారను వినిపిస్తోంది - పోం పోం ఓం!

బాబూ భోజనం వడ్డించమన్నాడు. "చూద్దాం ఎలా వండావో?నీతోయేగడం చాలా కష్టంగా వుంది..."

మొదటి ముద్ద నోట్లో వేసుకుని బాబు కరమా ముఖం చూస్తూండిపోయాడు. "భోజనం బాగానే వండావు."

అన్నం తింటున్న బాబు మనసు మారిపోయింది. మళ్ళీ రాత్రిలాగానే మన సువిప్పి బాతాఖానీ మొదలెట్టాడు, "వంట వండడం ఎవరు నేర్పించారు నీకు? గోపాల్ బాబు పెళ్ళామా?"

...గోపాల్ బాబు పెళ్ళాం? కరమా అన్నాడు. "గోపాల్ బాబు పెళ్లాం స్వభావం ఎంత కటువయిందంటే ఆవిడ మాటలు వింటే చాలు తాజాపాలు విరిగి పోతాయి. ఆవిడ ఏం నేర్పిస్తుంది. పనికిమాలిన ఆడది."

"మరి ఈ మాట కారితనం ఎవరు నేర్పారు నీకు?"

కరమాకు మస్తాన్ బాబా పదం మదిలో మెదిలింది, "బాబూ, ఒకరు నేర్పించేదేముంది? పట్నమే పోలీసుకు పాఠం నేర్పిస్తుంది."

"నీ పెళ్ళాం బాగా సుఖపడుతుంది."

బాబూ ఇలాగే కులాసాగా వుంటే ఒకరోజు అంతా కరమా మస్తాన్‌బాబు కథంతా విన్పిస్తాడు.

"బాబూ, ఈ రోజు నాకు కొద్దిగా సెలవిప్పించాలి."

"సెలవా! ఎందుకు? ఎక్కడికెళ్లాలి?"

కరమా ఓ దిక్కుగా చేయి చూపించి, "కొద్దిగా అటు తిరిగి వస్తాను..."

పేల్‌మాన్ కేకేసి చెప్పాడు, "కరమా! బాబుతో చెప్పు రేపు కలుసుకుంటా నని."

...నీపెళ్ళాం బాగా సుఖపడుతుంది...కరమా పెళ్ళాం. వారిస్‌గంజ్ స్టేష న్...మగహీ దోమ్ జాతివాండ్ల గుడారాలు...వయసుమీరిన యువతి...ముక్కుకు ముక్కెర...ముక్కుకు ముక్కెరకు మధ్య అంటుకుపోయిన నల్లని మైల...పసుపు పచ్చని పళ్ళు? ఆ పళ్ల సందున గార.

కరమా తనచేతితో వండిన హల్వా - పూరీ ఆయువతికి తినిపించలేక పోయాడు. ఓ రోజు మనసుపడి కాగితపు పొట్లంలో తీసుకెళ్ళాడు. కానీ వళ్లంతా చెమటతో తడిసిపోయింది. అతడికి ధైర్యం చాలడంలేదు...అది ఒకవేళ కర్మకాలి గోలపెట్టి నువ్వు చాటుమాటుగా హల్వా ఎందుకు తినిపిస్తున్నావ్ అని అడిగితే యేం చెప్పాలి?...అరిదేవుడా...

...బాబూ వెయ్యి చెప్పొచ్చు. కానీ తాను సంథాల్ పరగణా లేదా రాంచీ వైపు వాడన్న మాట నమ్మాలంటే అతనికి మనసొప్పలేదు. మనిహారీ ఘాట్‌లో రెండు మూడు దఫాలు వుండి వచ్చాడు. ఒడ్డుకు అటువైపునున్న సాహెబ్ గంజ్ - కజరోటియా కొండలు తనను ఏమాత్రం ఆకట్టుకోలేదు. కాని వారిస్‌గంజ్, కద మ్‌పురా, కాలుచన్, లఖపతియా పేర్లు వింటేచాలు వళ్ళు పులకరించిపోతుంది. ఎంతమంది తెలిసిన ముఖాలు గుర్తుకు వస్తాయో, యెన్ని కబుర్లు - కష్ట సుఖా లు, మంచి చెడ్డలు గురించి. పొలమూపుల్ర, చెట్లూ పుట్టలూ, నదులూ, కాలవ లూ, పశు - పక్షులూ అన్నీ ఒక్కసారిగా కరమాను ఆకట్టుకుంటాయి.

...వారం రోజులుగా ఆ అడవిలో నల్లని తాటిచెట్టు అతణ్ణి సైగచేసి పిలుస్తోం ది. అడవిపైన ఆకాశంలో నిలకడగా ఎగిరే గద్ద కరమాను ఎందుకు పలకరి స్తోందో? ఎందుకోమరి!

రైల్వే హద్దులు దాటి పోయినా కుక్క కరమా వెంటవస్తోంది. రెండుసార్లు బెదిరించాడు. "నీ వెక్కడికొస్తున్నావే భడవా? ఎక్కడికెళ్ళినా కుక్కలు భౌ, భౌ మని పరుగెత్తుకొస్తాయి...పో...ఫో..."

కుక్క ఆగిపోయి కరమాను చూస్తోంది. వరిపొలాల మధ్య నుండి వెళ్ళే కాలిబాట మీద నడుచుకుంటూ కరమా వెళతున్నాడు. వరి వెన్నులు యింకా విచ్చుకోలేదు...కరమాకు హెడ్‌క్వార్టరులో వుండే చౌదరీ బాబుగారు, కడుపుతో వుండే ఆ బాబూగారి పెళ్ళి గుర్తుకొచ్చింది. లేడీ డాక్టరు ఫోటో తీసి చెప్పిం దట - కడుపులో కవల పిల్లలున్నారని.

...ఇక్కడ హస్త నక్షత్రంలో వర్షాలు బాగా పడ్డాయి. పొలాల్లో యింకా నీళ్ళు నిలవున్నాయి...చేపలు?

నీళ్ళల్లో మాంగూర్ చేపల్ని చూసి అతడి కాళ్ళకు బంధాలు వేసి నట్లయింది. అతడు శ్వాస బిగబట్టి నిశ్శబ్దంగా నిలుచున్నాడు. తర్వాత మెల్లగా పొలం గట్టువైపుకి వెళ్ళాడు.

చేపలు గంతులేశాయి. అద్దంలా స్థిరంగా ఉన్న నీళ్ళు వున్నట్లుండి నృత్యం చేశాయి...కరమా యేం చేయగలడు?...అటువైపు కాలువగట్టుకు అడ్డుకట్టువేసి నీళ్లు బయటికి చల్లేస్తే?...

...ఒయ్...ఒయ్! నీ యమ్మా! అడవిలో నక్క ఎక్కడికెళుతుంది? ఎగురూ యింకా ఎగురు!...అరే గాలం పడివుందే ఈడ! కరమాకు చేపలు పట్టడం కొత్తేమీకాదు.

ఎనిమిది మాంగుర్ చేపలు ఒక గరయా చేప దొరికాయి. అన్నీ కారునలుపు! కటిహార్ బజార్లోనయితే ఈ చేపలు మూడు రూపాయలిచ్చి మాట్లాడకుండా కొనేస్తారు...కరమా తువ్వాలు గుడ్డలో చేపలు మూట గట్టాడు. అతడి సంతోషానికి పగ్గాలేవు. ఇంత సంతోషం ఎప్పుడూ కలగలేదు. చాలా సార్లు చాలా చేపలు వేటాడి పట్టాడు కరమా.

ఓ ముసలి గొడ్ల కాపరి ఎదురయ్యాడు, "ఏమయ్యా, అటు నా గేదె ఏదైనా కంటపడిందా?" అని అడిగాడు.

గొడ్లకాపరి కరమాను బీడీ అడిగాడు. తనకు బీడీ తాగే అలవాటు లేదన్నాడు. అతడికి ఆశ్చర్యమేసింది- అటు బీడీ తాగక యిటు పొగాకు నోట్లో పెట్టని మగాడు యేం మగాడు అనుకున్నాడు. అతడికి కోపం వచ్చింది. కటువుగా ప్రశ్నించాడు. "ఇటు యెక్కడికి వెళ్లాలి? వూళ్లో మీవాళ్ళెవరున్నారు? చేపలు ఎక్కడికి తీసుకెళుతున్నావు?"

...తాటిచెట్టు వెనక్కి జరిగి పోతోంది. కరమా వూళ్లోకి వచ్చాడు. వూళ్ళోకి ఆటగాడు ఎవరో వచ్చాడు. పిల్లలు పరుగుతీస్తున్నారు. ఔను, ఎలుగుబంటివాడు, డప్పు చప్పుడు వినిపసికట్టాడు.

...పల్లెటూరి పిల్ల తెమ్మెర వాసన!

...ఆవూరి పెద్దకాపు క్యాబేజి పొలానికి నీళ్ళు పెడుతున్నాడు. నెత్తి మీద జుట్టు తెల్లబడింది. కానీ నీళ్లు పట్టేటప్పుడు అతడి జబ్బలు యువకునిలా పొంగుతున్నాయి. ఇతడు ఆముసలాడే, ఆరోజు వంకాయలు బుక్‌చేయడానికి

స్టేషన్ వచ్చాడు. కరమాతో కలివిడిగా మాట్లాడాడు. కరమాను గుచ్చిగుచ్చి అడిగాడు - అమ్మానాన్నా ఉన్నారా లేక వాళ్లను వదిలేసి పారిపోయి వచ్చావా?...చివరికి అతడు కూడా కరమాను గుర్తుపట్టాడు.

"ఏమయ్యా? ఎక్కడికొచ్చావు?"

"ఊరకే. ఊరు చూద్దామని...మీయిల్లు ఈ వూళ్ళోనే వుందా?"

ముసలాడు నవ్వాడు. గుబురు మీసాల్లో చిరునవ్వు మెరిసింది. ముసలాడు సరిగ్గా సత్తో టి.టి. గారి నాన్నలాగే నవ్వాడు.

ఓ ఎర్రచీర కట్టుకొన్న పిల్ల హుక్కా మీద గంజాయి పట్టించి ఊదుకుంటూ వచ్చింది. గంజాయికి నిప్పంటిస్తూ బుగ్గలు రెండూ బుడగల్లాగా చేసి వూత్తోంది. కరమాను చూసి తత్తరపడింది. తర్వాత క్యాబేజి పొలం కాలువదాటి పోతోంది. "పదమ్మా, మేమూ యింటికే వస్తున్నాము" అన్నాడు ముసలాడు.

ముసలాడు కాళ్ళు చేతులు కడుక్కొని పొలం దాటి "'పద"అన్నాడు.

ఆ పిల్ల అడిగింది - "నాన్నా. ఈ మనిషి ఎవరు?"

"ఎలుగుబంటిని ఆడించేవాడు."

"ఛీ!"

కరమా సిగ్గుపడ్డాడు - తన ముఖం ఎలుగుబంటిని ఆడించేవాడిలా వుంటుందా ఏమిటి?

ముసలాడు అడిగాడు - "నువ్వు రిలిఫియాబాబు నౌకరువా?"

"కాదు నౌకరును కాదు...వూరకే అతనితో పాటు కలిసి వుంటాను."

"వూరకే? కలిసి? జీతం ఎంతవస్తుంది?"

"కలిసి వున్నందుకు జీతం ఎందుకిస్తారు?"

...ముసలాడు హుక్కా పీల్చడం మరిచిపోయాడు. మళ్ళీ అడిగాడు. "అంటే జీతంలేని కొలువు?"

"ముసలాడు ముంగిలివైపు ముఖం మళ్లించి, "సరసతియా! అమ్మనిటు పిలువు. ఓ వింత మనిషి దొరికాడు..."

ముసల్ది తడిక చాటుగా నిలుచుని వుంది. వెంటనే వాళ్లదగ్గరికొచ్చింది. ముసలాడు మాట్లాడాడు, "ఇటుచూడు, ఈ పిల్ల జవాను! కడుపునిండా కూడూ తింటాడు... ఏమయ్యా, బట్టలు కూడా ఇస్తారా?...ఇలాంటి వాళ్ళనే అంటారు - కడుపే కైలాసం!"

వరండాలోంచి పకపకా నవ్వులు వినిపించాయి. ఎలుగుబంటిని ఆడించేవాడు పక్కింటికి వచ్చినట్లుంది. డప్పుచప్పుడుకు అనుగుణంగా ఎలుగుబంటి

చేతులెత్తి ధన్ ధనా ధన్ ఎగురుతూ వుంటుంది - మోరపైకెత్తి...అద్దీ, భోలారామ్‌కు చాలా బాగా నాట్యం చేస్తున్నావు. ఒక్కసారి చూపించు. సోమరిపోతు ఆడది ఒళ్లో బిడ్డను పెట్టుకొని ఎలా ఎత్తుకువస్తుందో...వరే వాహ్! భోలేరామ్.

నవ్వులు ఒక్కటే నవ్వులు విన్పించాయి.

"నీపేరేమిటయ్యా? కరమచన్? వాహ్ పేరు చాలా లక్షణంగా వుంది. కానీ పని? పనియేమో చూల్హా (పొయ్యి) చన్."

కరమా సిగ్గుపడుతూ మాట మార్చాడు, "మీ పొలంలో పండిన వంకాయలు చాలా రుచిగా వున్నాయి. నెయ్యిలాగా..." ముసలాడు నవ్వాడు.

ముసలావిడ నవ్వు కరమా వంట్లో సత్తువ నిచ్చింది. కరమాకు అనుకూలంగా, "పాపం, కొంచెం అతన్ని ఊపిరి పీల్చుకోనివ్వండి. వచ్చినప్పటి నుండి రాసి రంపాన పెడుతున్నావు" అంది.

"చేపలా అవి? బాబుకు తీసుకువెళుతున్నావా?"

"కాదు. ఊరికెనే...వస్తూ వస్తూ పట్టాను..."

సరసతియా, అమ్మతో చెప్పు! చుట్టానికి వేయించిన అటుకులు, చేపల కూర తెచ్చి పెట్టమను...ఈరోజుకు వేరే వాళ్లు వండిన చేపలకూర తిని చూడు.

టిఫిను తింటున్నప్పుడు కరమా విన్నాడు - మరో స్త్రీ అడుగుతూంది, "ఎవరీ అబ్బాయి? ఏ ఊరి చుట్టం?"

"కటిహార్ లో ఉంటున్నాడు."

"ఎవరూ?"

"మావాళ్లే".

"కటిహార్ లో మీ వాళ్ళు ఎప్పటి నుండి ఉంటున్నారు?"

"ఈ మధ్యనే."

...మళ్ళీ ఓ నవ్వు విన్పించింది, తర్వాత చాలామంది నవ్వులు.

హుక్కా రగిల్చేటప్పుడు సరసతియా బుగ్గలు బత్తాయి పళ్ళలాగా గుండ్రంగా అయిపోయాయి. ముసల్ది ప్రేమపూర్వకంగా అడిగింది. "బాబూ! తంతి లోంచి మనిషి మాట ఎట్లా విన్పిస్తుంది? మాకు కొంచెం వివరంగా చెప్పు."

కరమా వెళ్ళిపోయేముందు ముసల్ది సర్ది చెప్పింది, "ముసలాడి మాటలు పట్టించు కోమాక. ఈ డుకు వచ్చిన కొడుకు పోయాక ఉసూరుమంటున్నాడు...కడుపులో దిగులు..."

"మరో మాటు వచ్చిపో."

"నీ ఇల్లే అనుకో."

తిరిగొచ్చేప్పుడు తన వీపువైపు మూడు జతల కళ్ళు చూస్తున్నాయని కరమా అనుకొన్నాడు. కళ్ళు కాదు - స్టేషను సిగ్నల్, హోమ్ సిగ్నల్ పైలట్‌సిగ్నల్...ఎర్ర ఎర్రని గుండ్రని వెలుతురు!

కరమా చేపలు పట్టిన పొలం గనెం మీద ఓ పూడుపాము పడుకొని వుంది. సరసర మంటూ పరుగుతీసింది...అబ్బా! కుక్క ఇంకా ఇక్కడే కూర్చొని తన కోసం ఎదురు చూస్తుంది. కరమాను చూసి సంతోషం పట్టలేక గంతులేస్తుంది.

రైల్వే స్టేషన్ చేరుకున్నాక కరమా అనుకున్నాడు - "ముసలాడు తనను మాటలతో మాయ చేశాడు" అని. మూడు రూపాయల ఖరీదు చేసే పెద్దపెద్ద మాంగూర్ చేపలను కాజేశాడు. పిడికెడు అటుకులు తినిపించి, నాలుగు తియ్య తియ్యని కబుర్లు చెప్పి...

...కరమా చేపల విషయం తన కడుపులోనే వుంచుకున్నాడు. కానీ బాబు ఆవలిస్తే పేగులు లెక్క పెట్టేరకం. బారెడు దూరంలోనే ఉండగానే అడిగాడు, "కరమా, నీ దగ్గర చేపల వాసన వస్తూంది. చేపలేమయినా తెచ్చావా?"

...కరమా ఏమని చెప్పగలడు! జీవితంలో మొదటిసారి ఓ బాబుకు నమ్మక ద్రోహం చేశాడు...చేపలు తెచ్చుంటే బాబు ఎగిరి గంతులేసేవాడు.

పదిహేను రోజులు ఇల్లే గడిచిపోయాయి.

ఇప్పుడే రాత్రి బండికి స్టేషను మాస్టరు బాబు దిగాడు...పిల్లాజెల్లాతో పాటు పదిహేను రోజులుగా నిశ్శబ్దంగా వున్న ఫేమిలి క్వార్టరులో ఇప్పుడు గోలగో లగా వుంది. తెల్ల వారుఝాము బండికి బాబుతో పాటు కరమా హెడ్‌క్వార్టరుకు వెళ్ళిపోతాడు.. ఆతర్వాత మనిహర్ ఘాట్!

...లాభంలేదు...ఈ రోజు రాత్రికి కరమాకు నిద్రపట్టదు. ముందటిలా ఇప్పుడు వార్నిషు సున్నం వాసన బొత్తిగా లేదు...బాబు వళ్ళు మరిచి నిద్రపోతున్నాడు. బాబు నిజంగా గోపాల్ బాబు లాంటి వాడే. ఏ వూరిపైనా మోహం లేదు. ఏమాత్రం మాయామర్మం లేని మనిషి...కరమా ఏమి చెయ్యగలడు? తన మనసు ఏదోలా వుంది. ఎప్పుడూ ఇలా లేదు...మరో మాటు వచ్చి వెళ్లు. నీ సొంత ఇల్లే అనుకో... మావాళ్ళే...ఈ మగాడికి కడుపే కైలాసం.

...ఉన్నట్లుండి కరమాకు ఏదో వింత వాసన తగిలింది. లేచాడు. ఎటువైపు నుండి వాసన వస్తూంది. అతడు మెల్లగా ప్లాట్‌ఫారమ్ దాటాడు. మెల్లగా వాసన చూసుకుంటూ వెళ్ళుతున్నాడు...రైల్వేలైను మీద అడుగుపెడుతూనే అన్ని సిగ్నల్లు

- హోమ్ స్టేషను, పైలట్ సిగ్నల్ గట్టిగా విజిల్సు విన్పించాయి...ఫామిలీ క్వార్టరు ఓ స్త్రీ గట్టిగా కేకలేస్తూంది - "దొంగ...దొంగ...దొంగ!"అతడు పరుగుతీశాడు. వెనుక ఓ ఇంజను అతన్ని వెంబడిస్తుంది...మగహీ డోమ్ జాతి పిల్ల...గుడారంలో అతడు దాక్కున్నాడు...సరసతియా గలగలా నవ్వింది. దాని గుబురు జుట్టు, స్నానం చెయ్యని వంటి వాసన కరమా ప్రాణంలో ప్రాణమై పోయాయి...అతడు భయంతో సరసతియా ఒడిలో...కాదు దాని ముసలి తల్లి ఒడిలో ముఖం దాచుకున్నాడు...రైలు, స్టీమరు కూతలు రెండూ ఒకేసారి విన్పించాయి. ఎర్ర ఎర్రని సిగ్గులు వెలుతుర్లు...

"కరమా, సామాను బయటకు సర్దు."

...కరమా మధురమైన వాసనా సముద్రంలో మునిగి వున్నాడు. లేచి చొక్కా వేసుకున్నాడు. బాబు పెట్టె బయటికి తీశాడు. నీళ్ళ పాండే వచ్చి 'నేను ఎప్పుడైనా తప్పుగా మాట్లాడి వుంటే క్షమించు' అని అడిగాడు. కరమా ఏదో లోకంలో మునిగి పోయాడు.

...బండి వచ్చింది. బాబు బండి ఎక్కాడు. కరమా పెట్టె బేడా బండ్లోకి చేర్చాడు...తను సర్వెంటు తరగతిలో కూర్చుంటాడు. బాబూ అడిగాడు, "అన్నీ ఎక్కించావా? ఏవైనా వదిలెయ్య లేదు కదా?...లేదు యేమీ వదల్లేదు" బండి కూతేసింది. కుక్క ప్లాట్ ఫామ్ మీదకూర్చుని తనవైపు చూసి కుయ్యో...మొర్రో అంటోంది...కుక్క తనకోసం తనకలాడి పోతోంది.

"బాబూ!"

"యేమిటి?"

"నేను రావడంలేదు." కరమా కదిలే బండి నుండి దూకేశాడు. నేలమీద అడుగు పెడుతూనే పడబోయి సంభాళించుకున్నాడు.

(1964)

# తెగతెంపులు

సరిగ్గా అదే జరిగింది. తాను ఊహించినట్లుగానే మొదలయింది. సంవత్సరాల తరబడి తాను మనసులో అనుకున్నట్లే అక్షరం పొల్లుపోకుండా జరిగింది. రెండు సంవత్సరాల తర్వాత అతడు రాత్రి బందికి పూరు చేరాడు. ఈ వార్త రాత్రికి రాత్రే ఆవూరి ముసలి వడ్డీ వ్యాపారి మిశ్రాకు తెలిసిపోయింది. పొద్దు పొడవక ముందే బ్రాహణ-కోమటి కిర్రచెప్పులు తటకరిస్తూ వచ్చాడు: వస్తూనే ద్వారం ముందే కూర్చుని గల్ల వూస్తున్నాడు.

మొదట అతడికి తెల్లారు ఝామున కల కంటున్నట్లనిపించింది...రెండేళ్ళ నుండీ తెల్లారుఝామున వచ్చేకలలన్నీ ఇలాగే మొదలయ్యేవి.

కఫంతో నిండిన కంఠనాళం నుండి బొంగురుపోయినస్వరంతో, "బిలస్‌బా బా...ఆహ్‌యాక్ థూ...!" మరలా గల్ల వూచాడు.

వళ్లు మర్చి అర్ధనగ్నంగా నిద్రిస్తున్న తన పెళ్ళాం గాబరాబడిలేచింది. బట్టలు సర్దుకుంటూ, "మిశ్రామహారాజ్!" అంది.

...మహారాజ్? అయితే యిది కల కాదన్నమాట. ముసలి ముండా కొడుకు వాడు నిజంగానే వచ్చి పడ్డాన్నమాట!

తను అనుకున్నట్లే జరిగినందుకు అతడు ఆశ్చర్యపడ్డాడు. సరిగ్గా ఈ ఘడియకోసమే తన జవసత్వాలను కూడ గట్టుకొని గత ఇరవై నాలుగు మాసాలుగా ఎదురుచూస్తున్నాడు. అతను ఊహించినట్లే అంతా జరుగుతున్నప్పటికి అతడి గుండె వేగంగా కొట్టుకుంటుంది. వెన్ను పూసలోంచి పాతభయం జుర్రుమని పాకింది. దవడలు వణికాయి. కణతల్లో వేడి పుట్టింది. డ్రామాలో పరదా ఎత్తుతూనే డైలాగులను మరిచిపోయిన నటుడిలాగా వుంది. తన పరిస్థితి.

తన పెళ్లాం కళ్ళలో నిద్రకు బదులు భయం చోటు చేసుకుంటుంది. ఆవిడ కళ్లతోనే అడుగుతుంది-మహారాజుకు ఏమని చెప్పాలి అని.

తన పెళ్లాం భయవిహ్వలతను జూచి అతడు ధైర్యం కూడగట్టుకున్నాడు. మందస్వరంలో గొణిగాడు, "ఎవడే నీ మహా రాజు...ఎందుకలా చూస్తావు? పిరికిముండా?"

బయట మిశ్రా మొదటిసారి వచ్చిన దగ్గును ఎలాగో భరించాడు. ఈ సారి అతడు స్వరం స్వాభావికంగా పలికింది, "బిలసి యా - యా -యా!"

అతడు వరండాలోకి వచ్చి చూశాడు, ముసలి తల్లి ఓమూల మూటలాగా ముడుచుకుని కూర్చుంది. భయంతో చేతిలోవున్న హుక్కా పీల్చడం లేదు...ఎక్కడ మిశ్రాకు గుడుగుడుమని వినిపిస్తోందోనని.

గోల్డు బటను వేసిన టీషర్టు వేసుకుంటూ వరండాలోంచి జవాబిచ్చాడు, "ఎవరండీ?...ఇలా గొడవెందుకు చేస్తున్నారు?"

అతడి ములుకుల్లాంటి జవాబువిని తల్లీ, పెళ్ళామేకాదు. బయట నిలుచున్న డెబ్బై రెండేళ్ళ ముసలివాడు, ఆ పూరి యజమాని మిశ్రా కూడా అవాక్కయిపోయాడు - బహుశా మందు కొట్టాడేమో? అనుకున్నాడు.

అతడి పెళ్లాం అగ్గి పెట్టె పట్టుకొని తలుపు దగ్గరకు వెళ్లబోయింది. అతడు హూంకరించాడు - "అగ్గి పెట్టె తీసుకొని ఎక్కడికి బయల్దేరావు? పొయ్యి రగిలించి నీళ్ళు వేడి చెయ్యి."

వరండా బయటికొచ్చి బీడీ పొగవదిలాడు...అబ్బే యింతకాలంగా బట్టీ పెట్టిన పాఠాన్ని అంత తేలిగ్గా తను ఎలా మరువగలడు? "చెప్పండి, యేంటి సంగతి?"

మిశ్రాకు ఈ మాత్రం మర్యాద చాలు. ఒక నమస్కారం లేదు, పాదాభివందనం లేదు, పైగా ముఖమ్మీదికి యెంగిలి పొగ వూదాడు.

"అరె, రె, నువ్వు పూర్తిగా మారిపోయావే! బిలసియా!"

...ఆశ్చర్యం! మిశ్రా మళ్ళీ అదే పలకరింపు!

అతను ముందుగా కూడ బలుక్కున్న జవాబిచ్చాడు, "బిలసియా - బిలసియా యేంటి మీరంటున్నది? నా పేరు రామ్ బిలాస్...రామ్‌బిలాస్ సింగ్."

రామ్‌బిలాస్ తన తల్లిని పిలిచి, "అమ్మా, ఓ తట్టెడు పేడా, చీపురుకట్టా యిలాపట్రా..."

రామ్‌బిలాస్ పెళ్ళాం అత్తగారి ముఖంవైపు చూసింది?...మొదటేమో నీళ్ళు వేడి చేయమన్నాడు, ఇప్పుడు పేడా చీపురుకట్టా తెమ్మంటున్నాడు.

ముసల్ది వరండాలో నుంచే భయపడుతూ, భయపడుతూ అడిగింది, "పేడా, చీపురు కట్టా ఎందుకు నాయనా?"

మిశ్రా కళ్ళు పెద్దవయ్యాయి. వూపిరి పీల్చడం కష్టమైంది. అవమానం, క్రోధం, భయం, ముప్పిరిగొనగా మిశ్రా గొంతులో గందరగోళంగా ఉంది. పొడుచుకు వచ్చే దగ్గును ఆపుకునే ప్రయత్నంలో అతడినోరు వికృతంగా మారింది.

కడుపులో దేవినట్టుంది...

"వేణ్ణీళ్ళు ఎందుకో కోడలు అడుగుతోందిరా?"

రామ్‌బిలాస్ విసుక్కున్నాడు, "అబ్బ! ఎందుకు వాడన నీళ్ళెందుకు, చీపు రెందుకు...ఇలా వచ్చి చూడు. ఇంటి ముందు వుమ్ములూ, గల్లతో ఎంత అస హ్యంగా వుందో... ఓ మిశ్రాజీ వుమ్ముళ్ళూ, గల్లలు అక్కడ పొలంలో కెళ్లి వూయ రాదూ?"

మిశ్రా తమాయించుకోడానికి ప్రయత్నించాడు. కానీ కందువా అంతా ఖరాబై పోయింది.

రామ్ విలాస్ ముక్కూ ముఖమూ చిట్లించి, "అంత తట్టుకోలేని దగ్గుతో వూరూ వాకిలీ ఎందుకు తిరుగుతారు? ఈ జబ్బును పోషించడమెందుకు! చికి త్సచేయించుకోండి...ఫొటో తీయించుకొని టీబీ-గీబీ ఏమైనా అంటుకుందేమో చూపించుకోండి."

పాపం, మిశ్రాకు పట్టిన దగ్గుతో ఆతడి ఆటకట్టు అయిపోయింది.

రామ్‌బిలాస్ అంచనాప్రకారం, టీబీ-గీబీ మాటలకు మిశ్రా జవాబు యిలా వుండాలి "నోర్ముయ్.. టీబీ నీకూ నీ వంశానికి..."

కానీ మిశ్రా పరిస్థితి తారుమారయింది. "బాబూ! యింకా చికిత్స ఎందుక య్యా. యేండాక్టర్లు, యేం మందులు టీబీ అయినా ఉబ్బసమైనా పోయేకాలం దగ్గర పడింది కదా."

...పోయిన సంవత్సరం, మహేంద్రపూర్ వీధిలో దుర్గాపూజకు డ్రామా వేశా రు. డ్రామాలో కిల్లీ కొట్టుగల జగలీ మహతో ఇలాగే ఆటపాడు చేశాడు. ఉరితీసే వాని వేషం వేసి స్టేజి మీదికి ఎక్కాడు. కత్తి పైకెత్తి నరికే సమయంలో బట్టీ పట్టిన డైలాగులు కాస్తా మరిచిపోయి నోటికి వచ్చినట్టు వాగుతూ కత్తి పారేసి ఏడుపు మొదలెట్టాడు...కానీ, మిశ్రా ఏడుస్తాడా? అబ్బే, ముక్కు తుడుచుకుంటున్నాడు.

మిశ్రాకు అర్థమై పోయింది...వీడు ఒకపట్టాన చేతికి రాడని. ఇటువంటి వాడు ఏమన్నా సరే, నోరు మెదపకుండా తన పని తాను చేసుకుపోవాలని.

రామ్‌బిలాస్ తల్లి చేతిలో చీపురు పట్టుకొని బయటకు వచ్చింది - "కాల్మొ క్తా మహరాజ్!"

...ముసల్ది చేతిలో చీపురుకట్ట పట్టుకొనేపాదాలు ముట్టుకుంది?

"హే భగవాన్! హే ప్రభూ! ఇప్పుడు బిల...రామ్‌బిలాస్‌బాబూ, మర్యాదగా వెళ్ళిపోవాలని కోరుకుంటున్నాను. ఈ దారినే వెడుతుంటే రాత్రి బిల్...రామ్‌బిలా

స్‌బాబూ వచ్చాడని ఎవరో అంటే సంతోషపడ్డాను...అబ్బా చాలా గొప్పవాడివై పోయావు!"

ఇక రామ్‌బిలాస్ బదులు చెప్పాల్సిందేముంది...అంతా తారుమారై పోయింది!

"మీరు బాకీ కట్టమని తగదా పెట్టుకోడానికి వచ్చారేమో అనుకున్నాను. రాత్రే వచ్చాను. ఇంతలో పారిపోనుకదా? మీరు ఎటూ వచ్చారు గనక మీ బాకీ డబ్బులు పట్టుకెళ్ళండి."

ముసల్ది చెప్పింది. "నీళ్ళు వేడెక్కయని కోడలు అంటోంది మరి...?"

"మాటమాటకూ వాదన, నీళ్ళు వేడిచేయమన్నది టీ పెట్టడానికి."

మిశ్రా మాట్లాడాడు, "బాకీ డబ్బులు లెక్కా - పక్కా అంతా వుంది కదా. ఇప్పుడు తొందరేమొచ్చింది?"

"వద్దు..." అతను లేచి వెళ్లేప్పుడు కూడా బిలసియా పాదాభివందనం చేయలేదు.

రామ్‌బిలాస్ తన కొత్త సూట్‌కేసు తెరిచి టీ పొట్లాం, పంచదార, కప్పులు బయటికి తీశాడు. పెళ్ళాం అంది, "ఇప్పుడేమో మిశ్రా మహరాజ్ మైదాపిండి లాగా మెత్త బడిపోయాడు. అమ్మను అడుగు, ప్రతినెలా రెండుసార్లు తండ్రీ కొడుకూ ఇంటిమీదికొచ్చి గేదెను బాకీ కింద జమకట్టు కుంటామని బెదిరించే వాళ్ళు."

"అప్పుడెందుకు మాట్లాళ్ళేదు? మీ ఇద్దరి నోర్లు పడిపోయాయా?"

రామ్‌బిలాస్‌కు బాగా గుర్తుంది. మిశ్రా సూటిపోటి మాటలు వినలేకే ఒట్టువేసుకొని తాను డబ్బు సంపాదనకోసం పట్నం పరుగెత్తాడు... "వెధవ నీవు నా దగ్గర డబ్బు తీసుకొని పెళ్ళి పేరంటం చేసుకున్నావ్. ఇప్పుడేమో పెళ్ళాం కాళ్ళ మీద కాళ్లేసి పడుకొని నాబాకీ మర్చిపోతావా? యేం?...నేనే గనక డబ్బివ్వకపోతే యేం తిని బతికే వాడిని, ఆ!"

...వెధవన్నర వెధవ! ఇప్పటికి గుర్తుకు తెచ్చుకుంటే వళ్ళు మండిపోతుంది.

"నాయనా! ఇప్పుడు యేమని చెప్పేది? ఈ మధ్య ఓ రోజు మిశ్రా కొడుకు పాలకోసం వచ్చాడు. పాలన్నీ అమ్ముడు పోయాయి. ఎక్కణ్ణుండి తెచ్చేది? అంతే గిన్నె తీసుకొని వెళ్ళి నాలిక మడిచి -"రోజులు మారిపోయాయి. లేకపోతే , ఈ గూడెం నుంచే గేదెపాలకు బదులు అడదాని పాలు పిండుకొని మా సిపాయిలు తీసుకెళ్ళేవారు" అన్నాడు.

రామ్‌బిలాస్ నాలుక చుర్రుమంది. టీ వూదుకుంటూ, "అప్పుడెందుకు మాట్లాళ్ళేరు? నోరు పడిపోయిందా?" అని మర్లా అన్నాడు.

...అడదాని పాలు? లంజకొడుకు, గుండెల్ని మండించే కూతలు కూశాడు!

రామ్‌బిలాస్ తన పెళ్ళాంతో చెప్పాడు, "సూట్‌కేస్‌లో కొత్త జాకెట్టుంది. తీసుకొని వేసుకో...ఇంగ్లీషోళ్ల జాకెట్టు!"

"అబ్బో ఎంత బాగుందో?"

పొద్దు ఎక్కడంతో వూరంతా తెలిసిపోయింది.

...బిలిసియా రాత్రి యింటికొచ్చాడని. అబ్బో! యిప్పుడు అతణ్ణి బిలిసియా అతని పిలవకూడదట! తెలతెలవార్తుండగనే మిశ్రా నోరు మూయించాడట. అన్నాడుట; "బిలసియా అని పిలవద్దు, రామ్‌బిలాస్ అని పిలవండి" మిశ్రా ముఖమ్మీద రెండొందల రూపాయల నోటు విసిరేశాడట. ...అతగాడి చొక్కా జేబులో 'లైసెన్సు వుందట. గవర్నమెంటు ముద్రకూడా వేశారట. పాట్నాలో రిక్షా నడుపుతాడట. అందుకే తప్పని సరిగా లైసెన్సు యిచ్చుంటారు?...నీకు తెలుసా? అతడు పెళ్ళాన్ని పేరుబెట్టి పిలుస్తున్నాడుట - "ఏయ్ ఝుమ్‌కీ" అని.

ఝుమ్‌కీ - రామ్‌బిలాస్ పెళ్ళాం - ఎర్రజాకెట్టు వేసుకొని నీళ్ల కెళ్ళింది. ఆడవాళ్ళంతా ఆవిణ్ణి చుట్టుముట్టారు. "ఇలా పట్టు, ఇంగ్లీషు జాకెట్టు ఎలావుందో చూద్దాం; దొరసాన్లు వేసుకుంటారటగా, వళ్లంతా చూపిస్తూ. అబ్బా, చూడ్డానికి బెత్తెడు జాకెట్టు, ఖరీదు అయిదు రూపాయలా? బటన్లు లేకుండా ఎలా విప్పుకుంటావు ఎలా వేసుకుంటావు? అలాగే ఎప్పుడూ అతుక్కొని వుంటుందా? చీరకూడా తెచ్చేవుంటాడు? రాత్రి ఎప్పుడొచ్చాడు. మొదటి ఝామున."

ఝుమ్‌కీ గర్వంతో సిగ్గుపడుతూ నవ్వుతూ చెప్పింది. "నాకు భలే భయం వేసింది. యింతరాత్రి పూట టక్కు బూట్లు వేసుకొని ఎవరొచ్చార్రా దేవుడా అని! అత్తయ్య భయపడి పోయి పశువుల కొట్టం వెనక దాక్కొండి పోయింది. పట్నం వెళ్లాడేగాని గొంతు కూడా మారిపోయింది. కాని కారుగేదె ఆయన మాట గుర్తుపట్టేసింది...ఊయ్...ఊయ్! మని తాడు తెంచుకొని వరండా లోకి పరుగెత్తింది. తలనుండి కాళ్లదాకా దుగదగా నాకింది...అంతే వస్తూనే నా మగాడు అంటించడం మొదలెట్టాడు - మీకంటే ఈ కారుగేదెలు ఎంతో నయం...మనుషుల కంటే."

"ఆ తర్వాత యేమయింది? తినడానికి యేం పెట్టావు అంత రాత్రిపూట?"

"యేం చెప్పేదక్కా, చెప్పుకుంటే సిగ్గు పోతాది. యింట్లో సంగతి యెట్లా

వుందంటే యింట్లో పిడికెడు బియ్యం గానీ, చిటికెడు అటుకులు కూడా లేవు...అ దృష్టం కొద్దీ అప్పటికే పెరుగు తోడుకుంది...చివరకు పెరుగుతింటూ, కారు గేదె లేక పోతే ఇంటికొచ్చి ఉపవాసం చేయాల్సి వచ్చేది" అన్నాడు.

"ఆ తర్వాత, ఏమయింది."

"జాకెట్టు రాత్రే వేసుకున్నావా?"

"పన్నీరు సీసాలు కూడా తెచ్చుంటాడు?"

"ఆ తర్వాత, యింకేమైనా అన్నాడా?"

"పట్నం వెళ్తే మగాడి మాటే మారుతుందా లేక...?"

ఝుమ్కీ విలాసంగా చిరునవ్వు విసిరింది. నీళ్లకు వచ్చిన ఆడవాళ్లంతా నవ్వేశారు. వాళ్ళందరి కళ్ళల్లో ఝుమ్కీ వేసుకున్న ఎర్రజాకెట్టు మెరమెరలాడుతుంది. కొత్త జాకెట్టువేసలకున్నాక ఝుమ్కీ రూపలావణ్యమే మారిపోయింది.

మధ్యాహ్నం పూట నీళ్లకు వెళ్లేప్పుడు ఝుమ్కీ చెవుల్లో లోలాకులు వ్రేలాడుతున్నాయి...ఝుమ్కీ అందాలు మరీ వికసించాయి.

స్నానం చేసేప్పుడు ఆడవాళ్లు, ఆడపిల్లలు గుంపుకూడారు. అందరూ ఝుమ్కీ చుట్టూ చేరి మూన్‌లైట్ సబ్బు నురగ తీసుకొని వంటికి రాసుకున్నారు...ఝుమ్కీ యిక రోజూ సబ్బు రుద్దుకొని స్నానం చేస్తుంది కాబోలు, అలాగైతే తప్పకుండా బెంగాలీ దొరసానిలా ఎర్ర బడిపోతుంది? అంతేకదా?

తెల్లార్తూనే కిరాణా కొట్టు కెళ్లింది - నొసట చకమక్ తిలకం దిద్దుకొంది. దార్లో చెవిటి పిన్నోళ్ల వీధిలో 'శివధారీ' నిలుచుని ఉన్నాడు. ఝుమ్కీని చూసి తట్టుకోలేక పోయాడు, "అబ్బ! యిక బ్రతకడం వృథా...యిక? నాగతి యేంకాను?"

"ఛీ! దారిలో వెకిలి చేష్టలు యేంటి?"

"...నాయి వెకిలి చేష్టలా?"

మూతి విడిచి గొణుక్కుంటూ వెళ్ళింది.

"కొంపదీసి ఇంట్లో చెప్పరు గదా! అబ్బిగాడు పట్నం వెళ్ళి పేరు పక్కన సింగ్ తగిలించుకొని వచ్చాడట. కాని, ఇదీ చూద్దాం, ఎన్నాళ్ళో ఈ తతంగం? పట్నంగాలి రుచి మరిగినవాడు ఈ పల్లెటూర్లో ఎంతకాలం వుంటాడు/...ఇన్నిరోజుల బట్టి ఇచ్చిపుచ్చుకొన్నది, చేసిన కష్టం - అన్నీ ఎగిరిపోయాయా?"

కిరణా కొట్టు ముసల్ది అందరి ముందూ మాటమార్చి ఝుమ్కీని హెచ్చరించింది. "కొంచెం మీ అత్త దగ్గర జాగ్రత్తగా ఉండు. ఎవరూ లేనప్పుడూ కొడుకు చెవిలో నీమీద చాడీలు చెప్పి తను లోబరుచుకుంటుంది. డబ్బు దస్కము ముసల్ది

కొట్టేస్తుందేమో చూసుకో."

ఝుమ్కీ కొత్తకోడలులాగా ముసుగు ముందుకు లాగి లోపలి నుండే మాట్లాడింది. "పిన్నీ, ఎవరైనా చాడీలు-గీడీలు చెపితే చెప్పనీ. అన్నిటికీ పైన దేవుడనే వాడు ఉన్నాడు గదా! ఇరుగూ పొరుగూ ఉండనే ఉన్నారు. ఈ గేదె లేకపోతే మాగతి ఏమయిఉండేదో? రెండు సంవత్సరాలు ఎలా గడిపామో అందరికీ తెలుసు."

...ఝుమ్కీకి కూడా మాటలు అల్లడం బాగానే చేతౌతుంది. అందరికి అర్థమయింది. శివధారీ గురించే చెబుతోందని. తాత్పర్యం, శివధారీ లేకపోతే గేదెను మేపేదెవరు? రాత్రిళ్ళు దానికి గడ్డి-గాదం చూసుకోవటం చిన్న విషయమా?

ఝుమ్కీ అంది, "ఇంటి వెనుక రెండు కుంటలు పొలం ఉంది. కాని పొలమున్నంత మాత్రాన సుఖం లేదు కదా! దాన్ని దున్నాలి, తవ్వాలి...రెండేళ్ల బట్టి ఇరవై రూపాయల క్యాబేజి, పది రూపాయల ఉల్లి, వెల్లుల్లి పండింది. దాంతో గడవదు కదా...ఈ ఊళ్ళో అప్పులు ఎగ్గొట్టే వాళ్లు ఎలాంటి వాళ్లో అందరికి తెలిసిందే. పాలు, పెరుగూ తీసుకొనేటప్పుడు మాత్రం చాలా తియ్యగా మాట్లాడుతారు. కాని బాకీ తీర్చేటప్పుడు మాత్రం వేపకాయ చేదు మాటలు. బజారులో మనుషుల్ని తన్నించి పాలూ పెరుగూ వెల కక్కించడం ఆడవాళ్లకు సాధ్యమయ్యేపని కాదాయే."

కిరాణాకొట్టు నుండి తిరిగివస్తూ చెవిటి పిన్ని ఇంటి ముంగిట్లోకి వెళ్ళింది. శివధారీ ముఖం వేలాడేసుకొని పురికొస ఉండ చుడుతున్నాడు. ఝుమ్కీ చిన్న నవ్వు నవ్వి, "నాకు నీ మీద చాలా కోపంగా వుంది. తెల్లారినప్పటినుంచే అందరూ వచ్చి పోతున్నారాయె. నువ్వేమో గేదెకు పాలు తీసి పారిపోయావు...ఉదయం నుంచి నీ గురించి పదిసార్లు అడిగాడు. నువ్వు అతన్ని కలవకపోతే అతనికి ఎలా తెలుస్తుంది కష్టసమయంలో నీవు మమ్మల్ని ఎలా ఆదుకొన్నది. నాకు తెలిసినంత మటుకూ నేను చెప్పాలిసింది చెప్పాను...నీకు భయమెందుకు? నిజం చెప్పడానికి జంకెందుకు?"

ఝుమ్కీ తట్టలోంచి ఓ బీడీ కట్టతీసి వసారాలో పెట్టింది. "ఇదో, నీ బీడీలు - వక్కలు ...ముఖం దాచావంటే అతడు విన్నదంతా నిజమే అనుకొంటాడు."

శివధారీకి వళ్లు పులకరించింది. పోయిన ప్రాణం వచ్చినట్లయింది...నిజమే, తనకు తెలివి తక్కువే. ఝుమ్కీ పదినెచూపించే కోపం సబబే అని అనుకున్నాడు.

...ఝుమ్కీ చెవిపోగులు...ఎర్రజాకెట్టు...చెక్‌మక్ తిలకం చుక్క...గుమగుమ

లాడే ఒంటి వాసన...ప్రాణాలు తోడేసే నవ్వు!

శివధారీ శరీరం వేడెక్కిపోయింది...నిప్పంటుకుపోయినట్లు.

శివధారీ వసారాలో పెట్టిన బీడీ కట్టలోంచి ఓ బీడీ తీసి రగిలించాడు. వున్న ట్లుండి అతనికి దిగులు పట్టుకొంది...ఇన్నిరోజులూ తనను వూరించేది...నేనేమ యినా పారిపోతానా? అని.

...ఇక అతడు దొంగచాటుగా మాత్రమే కలుసుకొని మాట్లాడగలడు.

శివధారీ చాలా సేపటి వరకూ బీడి పొగ వదుల్తూ కూర్చున్నాడు.

రామ్‌బిలాస్ మంచం చూట్టూ బీడీ పొగలు మేఘాల్లా ఎగురుతున్నాయి. వుండి వుండి నవ్వుల జల్లు విని పిస్తోంది. ఒక్కణ్ణి మించి ఒకడు నవ్వు పుట్టించే కబుర్లు చెబుతున్నారు. పాట్నా వాలా రామ్‌బిలాస్ కబుర్లే అన్నీ.

...రెండేళ్ళ కిందట చైత్రమాసంలో అర్ధరాత్రి పూట వూరు వదిలేసి చడీ చప్పుడు కాకండా పారిపోయాడు రామ్ బిలాస్. వూరునే కాదు, మిశ్రా యింట్లో చాకిరీని, మిశ్రాకి చెల్లించాల్సిన బాకీనీ వదిలేసి వెళ్లిపోయాడు.

...యింకేముంది, తెల్లార్తూనే వూళ్లో జనాలంతా రామ్‌బిలాస్ యింటి ముంగిట చేరిపోయారు. ఆతడి తల్లి యేడ్చియేడ్చి అక్కడున్న వాళ్లకి మొర పెట్టుకుంది, కోడలు యింట్లో అడుగుపెట్టినప్పట్నుండీ తనకొడుకు మతి చలించిందని కన్నీరు పెట్టుకుంది. పరాయింటి పిల్లొచ్చి తన కన్నకొడుకును మాయ చేసింది.

ఝుమ్కీ ముసుగు లోపల్నుంచే ముసల్దాన్ని తిడుతోంది. గూటానికి కట్టిన గేదె వుండి వుండి దీనంగా అరుస్తోంది. "ఊయ్, య్, య్, ఊయ్!"

మిశ్రా వస్తాదు 'రామ్‌సింహా సన్ సింగ్' అన్నాడు కదా-యీ సంగతులన్నీ మాకు బాగా తెలుసు. యేమీ ఎరగనట్లు అత్తాకోడలూ కూడ బలుక్కొని వేషాలే స్తున్నారు! బిలసియా యింట్లో చెప్పా పెట్టకుండా యేమీ వెళ్లలేదు. తల్లీ పెండ్లాంతో బాగా మంతనాలాడే వూరు వదిలి పెట్టాడు. పరుగెత్తి ఎక్కడికి పోతాడు?...యీ గేదెను యేదో ఒకరోజు యజమాని బాకీ కింద లెక్క కట్టెయ్యకపోతామా!

"ఆ వెధవ యిప్పుడు ఎక్కుడున్నాడు?...నౌకరీ వదిలేసి పారిపోయాడా?" రామ్ బిలాస్ విసిరిన ఈ ప్రశ్నకు అక్కడున్న వాళ్ళంతా ఆశ్చర్య పడ్డట్లు "అయ్యో! నీకు తెలీనే తెలీదా?" అని గొల్లున నవ్వారు.

పాట్నా కబుర్లకు దీటుగా ఒక జరిగిన కథ చెప్పేందుకు అవకాశం దొరికింది ఘోతనాకు.

"చెప్పు, చెప్పు విందాము ఘోతనా."

"రామ్‌బిలాస్ అన్నయ్యా! ఈ రోజు నువ్వు చూపించిన సాహసానికంటే రెట్టింపుగా కిందటి సంవత్సరము వెనుకవైపు గూడెంలో వుండే సాయిబు కొత్త కోడలు గొప్ప ధైర్యమైన పనిచేసి చూపించింది. ఏమయిందంటే, సింఘవా...వెధవ యెంత పొగరుగా వుండేవాడో, మావూళ్ళోకి ఎవరైనా కొత్తకోడలు వచ్చిందంటే చాలు ఇక వాడికి నిద్రపట్టదు...బావురుపిల్లిలా యింట్లోకి జొరబడి మాటువేసి ఏమాత్రం చప్పుడుకాకుండా మీగడంతా నాకేసేవాడు. కాని సాయిబు కోడలు వాడి చేత యిన్నాళ్ళూ తిన్న మీగడంతా కక్కించేసింది...వెధవని అట్లాయిట్లాతన్నలేదు, గూబ పగం తన్నింది."

"అలాగా?"

"కావాలిస్తే ఎవరినైనా అడగండి...ఆఖరుకు అరరియా ఆస్పత్రికెళ్ళి ఆ పరేషను చేయిస్తే కానీ బతకలేదు. ఆసుపత్రి డాక్టరు అడిగాడట ఎక్కడైనా తిరుగలి మధ్య పడినలిగి పోయావాఅని. ఆసుపత్రి వదిలిన తర్వాత మళ్ళీ ఊరువైపు ముఖం చూపిస్తే ఒట్టు" అని గట్టిగా నవ్వాడు.

"అలాంటి ఆడకూతురుకు గవర్నమెంటోళ్లు పిలిచి మెడలివ్వాలి...ఇదే పట్నంలో జరిగుంటే న్యూస్ పేపర్లో ఫోటోతో పాటు అచ్చయ్యేది..."

"ఫోటో ఎలా పడుతుందిలే?...వాడ్జి రెక్కలు విరిచి పట్టుకున్నట్టే? అదెలా సాధ్యం?"

ఫోటో విషయం మాట్లాడుతుంటే రామ్‌బిలాస్‌కు తన ఫోటో గుర్తుకు వచ్చింది. జేబులో నుంచి లైసెన్సు బయటికి తీసి చూపించాడు. అందరూ ఒకరి తర్వాత ఒకరు ఫోటొచేతులోకి తీసుకొని రిక్షా లైసెన్సును వింతగా చూశారు...అబ్బే, రామ్‌బిలాప్ అబద్ధం ఎందుకు చెప్పాడు. జనాలు కల్ల బొల్లి కబుర్లు అల్లి కిరస్తానీహోటల్లో అంట్లు తోముతున్నాడు అని చెప్పుకున్నారు. కాని...మామూలు జనాలే కాదు, దూబే పెద్ద కొడుకు కూడా ఇలాగే చెప్పాడు. జంద్యం మీద ఒట్టు పెట్టి మరీ చెప్పాడు, నిజంగా తన కళ్ళతో తాను చూశానని.

శివధారీని చూసి అందరూ మౌనం వహించారు...రామ్‌బిలాస్‌కు శివధారీని వ్యాకం తెలిసిందో లేదో మరి?...తెలుస్తే ప్రాణాలతో వదిలిపెట్టాడా...

"ఏరా శివధారీ! ఉదయం నుంచి కన్పించలేదు?"

"కొద్దిగా స్టేషనుకు వెళ్లి వచ్చానన్నా."

కడవలో ఉన్న నీళ్ళు పారబోసి నీళ్ళకోసమని బయలు దేరింది రామ్‌బిలాస్ పెళ్లాం..."శివధారీ యిక మాటలు వింటూ ఎలా ఉండగలదూ?"

రామ్‌విలాస్ పెళ్ళాం నీళ్ల కడవతో వచ్చింది. ముసుగు లోపల్నుంచే చెప్పిం ది, "సహాజో పిన్ని అంటూంది, మీయింట్లోంచి సాయిబు గుడిసెల్లోంచివచ్చే వాసన మాదిరి వాసన వస్తుందట. కోడిగుడ్లు ఏమైనా వండుతున్నారా?" అని అడిగింది.

రామ్‌బిలాస్ ఏమనుకున్నాడో ఏమో, "రేపట్నుంచి కోడికూర వండుకుంటాము, కోడికూర. ఎవడు ఏమంటాడో చూస్తాను...వెధవది ఇదీ ఒక వూరేనా? బంగాళా దుంపల కూరలోకొద్దిగా గరమ్ మసాలా వేస్తే చాలు, వూళ్లో వారందరికీ కోడి గుడ్ల వాసన వచ్చేస్తాది? భలేవూరు."

శివధారీ కలుగజేసుకొని, "ఈ వూళ్ళో వున్న చోద్యం ఇదేకదా?" అన్నాడు.

"పట్నంలో అంతా పెళ్లాన్ని పేరుపెట్టి పిలుస్తారు. నేను నా పెళ్ళాన్ని వేయి పేర్లు పెట్టి పిలుస్తా, ఎవడికేం?"

రామ్‌బిలాస్ తన పెళ్ళాన్ని "ఏయ్ ఝుంకీ! శివధారీ వచ్చాడు. కొంచెం టీ తీసుకురా" అన్నాడు.

ముంగిట్లోంచి అత్తను పిలిచి, "చూశావా అత్తా, ఈ మగాడు ఎట్లా మాట్లాడు తున్నాడో" అంది.

సంపాదన పరుడైన కొడుకును చూసి, గుమగుమలాడే వాసన పీలుస్తూ ముసల్ది సంతోషంగా వుంది. పైగా అంది, "ఏమి చూడమంటావే? మనిషి ఎక్క డుంటే అక్కడి అలవాట్లు వస్తాయి."

"వెధవది నేను పగలంతా టీ తాగితే వీళ్ళకెందుకూ, రాత్రంతా మందు కొడితె ఈ జనాలకెందుకు? - శివధారీ...! స్టేషను దగ్గర మంచి నికార్సయిన సారా దొరుకుతుందా? లేక వీళ్ళ సారాయేనా? ఈ రోజు రెండు సీసాలు ఖాళీ చేయాల్సిందే."

అయినా శివధారీ కేంతెలుసు సారాయి సంగతి. గంజాయి గురించి చెప్ప గలడు గాని, "ఏమ్ ఝుంకీ, షలారా...నువ్వు ఓ చేత్తో ముసుగు ఎందుకు పట్టు కుంటావు?"

ఝుంకీ సిగ్గుతో ఇంట్లోకి వెళ్ళిపోయింది.

అంతా అచ్చం రామ్‌బిలాస్ పాట్నాలో వూహించుకున్నట్లే జరుగుతూంది. తాను మిత్రాను కోరలు తీసిన పాములా తీసి పారేశాడు. అందుకే వూళ్లో జన మంతా బహ్మారథం పడుతున్నారు. ఏ ఇంట్లో చూసినా మగాడంటే అలా ఉండాలం టున్నారు.

ఇది వరకూ మిశ్రా అరుగుమీద కాలక్షేపం చేసే వాళ్ళంతా ఇప్పుడు రామ్ బిలాస్ వరండాలో చేరారు. ఆఖరికి, బ్రాహ్మలు, రాజపుత్రులు, కూడా వున్నారందులో. రోజంతా అక్కడే టీ తాగడం, సిగరెట్లు, బీడీలు కాల్చడం, పేకాడ్డం, రివాజై పోయింది. ఓ రోజు రోజంతా మిశ్రా కొడుకు అక్కడే ఉండిపోయాడు. ఎనిమిది ఔన్సులు తప్పతాగి పేకాటలో డబ్బు పోగొట్టుకున్నాడు.

ఆ వూళ్లో యువకులంతా రామ్‌బిలాస్‌తో పాటు పాట్నా కెళ్లి పోదామనుకున్నారు. వాడు చెప్పే కథలు విని.

"...రాజేంద్ర నగరు ఎట్లా ఉంటుందంటారు? మన ఇంజనీర్లు ఇంద్రలోకం చూసొచ్చి అట్లనే భవనాలు కట్టితే ఎలా ఉంటుంది...? అంతే...రోడ్లకు రెండువైపులా రంగు రంగుల పూలు. ప్రతి పూలమొక్క కాడా ఒక సొగసైన పిల్ల వుంటుంది."

"ఓహ్! అట్లైతే నిజంగానే ఇంద్రలోకపు ఇంద్రసభే..."

"ఆడ పాకీది కూడా పెద్దింటి కోడల్లా అగుపిస్తుందిరా."

"అంత అందగత్తెలా?"

"చూడ్డానికి నల్లగా వుంటే ఏంటయింది? అసలు సరుకు శరీరం పుష్టిగా వుంటుంది...రజబియా అని ఓ పిల్లుంది. మారిక్షా స్టాండు దగ్గరే దానికొంప. అది పూలపూల కోక కట్టుకొని జండాకర్రలాగా చీపురుకర్ర పట్టుకొని తిరుగుతూ వుంటే అది రాజ్యాలేలడానికి వెడుతున్నట్లు వుంటుంది, రోడ్లు వూడ్చడానికి వెడుతున్నట్లుండదు."

"ఔనా!"

...అలాంటప్పుడు ఈ మూతి మీద మీసమున్న ఏమగాడు ఈ ముదనష్టపు వూళ్ళో వుండాలనుకుంటాడు, అదివిని, వయసులో వున్న కుర్రాళ్లంతా 'మేము పట్నాం వస్తాం ఈ సారి నీతో పాటు' అని బతి మాలాడారు అతణ్ణి. ఈ వూళ్లో ఏమో సంవత్సరము పొడుగునా మడక దున్నితే నూట ఇరవై రూపాయలు దొరుకుతాయి. పాట్నాలో ఏమైనా నెలకు రెండువందల రూపాయలు సంపాదించుకోవచ్చు మరి...తనతో తీసుకెళ్ళమని అంతా పట్టుపట్టారు. ఒక శివధారీ తప్ప. శివధారి అసలు దీని వూసే ఎత్తలేదు.

ఇదంతా సరేగాని రామ్‌బిలాస్ మనసులో వుండివుండి ఒక అనుమానం ముల్లులా గెలుకుతూంది. ఆ రోజు రాత్రి ఝుమ్కి ఎందకట్లా మాట్లాడింది? "అంతా బాగుంది కానీ..." అంటూ నీళ్లు నమిలింది.

"ఏంటీ, కాని ...కాని...అని నీళ్ళు నములుతున్నావు? చెప్పు!"

...ఝుమ్కీ కళ్లు మూసుకొని నవ్వింది.

"కళ్ళెందుకు మూసుకున్నావు?"

"లాంతరు ఆర్పేయి."

రామ్‌బిలాస్ అయిష్టంగానే లాంతరు వత్తి తగ్గించాడు. ఝుమ్కీ మళ్ళీ అంది, "వద్దు పూర్తిగా ఆర్పేయి."

"...వెధవ ముండా! నువ్వు ఆడదానివా లేక గబ్బిలానివా?"

శివధారీకి గంజాయి తాగే అలవాటుంది. కాని ఎన్ని చెప్పినా ఒక్క సారా చుక్క కూడా నోట్లో వేసుకోలేదు.

తెల్లారి నిద్రలేస్తూనే మళ్ళీ మనసులో అదే ముల్లు గుచ్చుకొంటోంది. 'అంతా బాగానే వుంది, కాని...'

ఇక నాలుగు రోజులే గడువుంది. రామ్‌బిలాస్ మనసులో దిగులుగా వుంది. గొంతులో వీడ్కోలు గీతాలు ధ్వనిస్తున్నాయి.

పట్నం వెళ్ళాలనుకొన్న యువకులంతా స్టేషను - బజారులోకి వెళ్ళి క్రాపులు కొట్టించుకొని వచ్చేసారు...ఎందుకంటే రామ్‌బిలాస్ చెప్పాడు, పట్నంలో తల వెంట్రుకలు చూస్తే కనిపెట్టేస్తారట ఈ మనిషి ఎక్కడ్నుంచి వచ్చింది...యువకులందరి నరాల్లో ఉత్సాహం పెల్లుబుకుతూంది. కాని, రామ్‌బిలాస్ మనసులో వుండివుండి ముల్లు గుచ్చుకుంటూంది.

...ఈ రోజు రాత్రి ఝుమ్కీని మళ్ళీ అడగాలి.

"ఝుమ్కీ నేను యిక్కడ నాలుగు రోజులే వుంటాను."

"ఊ!"

రామ్‌బిలాస్ కొద్ది సేపు ఏమి మాట్లాడలేదు. అప్పుడు ఝుమ్కీ అడిగింది. "మళ్లీ ఎప్పుడొస్తావు?"

"ఏమో, ఎవరికి తెలుసు!"

ఈ రోజు రామ్‌బిలాస్ సారా తాగలేదు...పేకాడలేదు. ఈ వేళ పేకాడనన్నాడు. రామ్‌బిలాస్ మూగనోము జూసి ఝుమ్కీ ఏమీ మాట్లాడలేదు. కాని మేలుకొనే వుంది.

"ఝుమ్కీ!"

"ఆ...ఈ రోజు సారా ఎందుకు తాగలేదు?"

"ఈ రోజు రాత్రంతా మేలుకొని వుంటా."

...నిజంగానే రాత్రంతా జాగారం చేశాడు రామ్‌బిలాస్. తెల్లారుతూనే పక్షుల కలరవాలు వినిపించాయి. "కొద్దిగా మెల్లగా మాట్లాడు!" అంది ఝుమ్కీ. ఇంక కరెక్టుగా మూడు రోజులే మిగిలిపోయాయి.

నాలుగోరోజు సాయంత్రం ఇరవై మంది యువకులు బరౌనీ ప్యాసింజరులో బయలుదేరడానికి సిద్ధమయ్యారు. శివధారీ మాత్రం వూళ్ళోనే వుండి పోయాడు. చాలా రోజుల బట్టీ పాలు పితకడానికి కూడా వాళ్ళింటికి రాలేదు. రామ్‌బిలాస్ స్వయంగా పాలు పితికాడు.

"ఝుమ్కీ!"

"ఏమిటి?"

"నేనీరోజు చుక్కేసుకోలేదు. కొంచెం హుక్కా పీల్చాను. ఒళ్లు గాల్లో తేలి పోతున్నట్టుంది."

"శివధారీ రాత్రేల గొడ్డు మేపటానికి రాడంట. చెవిటిపిన్ని వచ్చి చెప్పెల్లింది."

"రాకపోతే పోనీ, వాడు కాక పోతే ఇంకోణ్ణి పట్టుకొస్తా!"

"ఎవరిని తీసుకొస్తావేమిటి?"

"ఎవరైతే ఏమి?"

"వూళ్ళో పనులు చేసుకునే వాళ్లందరినీ పోగేసి పట్నం తీసుకుపోతున్నావటగా?"

"ఎవరే చెప్పింది?"

"వూళ్ళో అంతా చెప్పుకుంటున్నారు."

"వూళ్ళో అందరూ కాదే...నీ వాడున్నాడు చూడు నీ శివధారీ గాడు. వాడే ఈ మాటలంటూంది."

"ఝుమ్కీ మాట్లాడలేదు. ఆమెను మోకాళ్ళతో పొడుస్తు అన్నాడతను, "నాను చెప్పేది నిజమే కదా?"

"మవ్వెట్లా అనుకోవాలను కుంటే అట్లా అనుకో."

"విన్న విషయమే అంటున్నా, నిజమేనా?"

ఝుమ్కీ నిట్టూర్చింది.

"చెప్పు, నేనన్నది నిజమేనా?"

"ఆ!"

"నాలుగో రోజు నుండి బాగా మజా చేసుకో."

"నేను ఎట్లాగుంటే నీకేమిటి...పట్నంలో దానితో అదే రజబియాతో కులికే వాడికి నాయిసయం పట్టుద్దేంటి?"

"ఏమిటి, ఏంటన్నావు?"

ఝుమ్కి ఏమి మాట్లాడలేదు. రామ్‌బిలాస్ మళ్ళీ మోకాలితో పొడుస్తూ, "ఏమన్నావ్? చెప్పు?"

"నన్ను కొట్టాలనుకుంటే కొట్టి ఒకేసారి చంపెయ్యి."

"ఏంటే లచ్చీ! నేను ఇక్కడినుంచి వెళ్ళే లోపు నీ అంతు, నీ శివధారీ గాడి అంతు తేల్చి గాని ఎల్లనే" దయ్యం పట్టినట్లు అరుస్తున్నాడు, రామ్‌బిలాస్.

అంతకు ముందే గంజాయి దమ్ము రెండు పట్లు పట్టాడు. అది యింకా దిగ లేదు.

"ఏయ్ గమ్మునుండు. ఎందకట్లా అరుస్తావు?" అంది ఆమె.

"లచ్చిముండా! ఏమనుకుంటున్నావ్. ఏం...పట్నంలోనే పెద్ద పెద్ద బారిష్టర్లు నానోరు మూయించలేక పోయారు. నీవు నన్ను అరవద్దంటావా!"

"అయితే అరుసుకో వాకేటి."

"ఈ రోజు నేను చుక్కేసుకోలేదు. నువ్వేమో ముఖం అటు మళ్ళించి పడు కుంటావా? ఇటు తిరుగు, నీ...!"

"వద్దు."

"లచ్చిముండా!"

రామ్‌బిలాస్ నిజంగానే చంపేలాగున్నాడు. దాన్ని ముక్కలుముక్కలుగా చీరె ద్దామనుకున్నాడు. "...ఏమేయ్? ఏమనుకుంటున్నావ్...రిక్షా తొక్కినంత మాత్రాన కొజ్జానైపోయాననుకున్నావా? చెప్పు, నేను చెప్పేదంతా అపద్దమని చెప్పు...అ మిశ్రా గాడు దగ్గర నాలుగు రెట్లు వడ్డీకి అప్పుజేసి అ శివధారీ గాడేనా నిన్ను పెళ్ళి చేసుకొంది? చెప్పు, చెప్పు, ఏద్వద్దు నోర్మూయ్....ఒట్టెయ్! ఏమనుకు న్నావు? పట్నంలోవున్నంత మాత్రాన, సారా తాగినంత మాత్రాన మగాడు...నో ర్మూయ్ లచ్చీ, నాకంతా తెలుసు."

ఝుమ్కి ఏడుస్తోంది. పక్కమీంచి రామ్‌బిలాస్ లేచి పోతుంటే అతని బని యను పట్టుకొంది.

"యేంది?" అన్నాడు రామ్‌బిలాస్.

"ఇదో..నువ్వు పాట్నా వెళ్ళకు" బతిమాలింది.

"ఏం కూస్తున్నావు?"

"నీకాళ్లు మొక్కుతా. ఇదో నువ్వు మాత్రం పాట్నా వెళ్ళొద్దు."

"పట్నం వెళ్ళకపోతే...బతికేదెట్లాగే?"

"ఇంతమంది వూళ్లో ఎట్లా బతుకుతున్నారు?"

"హు..."

"అలాగైతే నన్ను కూడా తీసుకెళ్ళు."

"మరి శివధారీ గాడో..."

ఝుమ్కీ వెక్కిల్లు పెట్టి ఏడుస్తుంది. తెల్లారి బారెడు పొద్దెక్కింది. ముసల్ది పిలిచింది - "అమ్మే...ఏ...ఏ..."

వూళ్లో వున్న యువకులంతా ఒక్కసారి గుమికూడారు. మిశ్రా యింటిదగ్గర పట్నం వెళ్ళటానికి సిద్ధమైన యువకులని కలయజూసి రామ్‌బిలాస్ యిలా చెప్పాడు, "చూడండీ, ఇంటి దగ్గర సగం రొట్టె తింటే వచ్చే సుఖం పట్నం బతుకులో ఎక్కడుందని? నీవు ఎంత సంపాదిస్తావో దానికి నాలుగు రెట్లు రెక్కలుముక్కలు చేసుకోవాలి పట్నంలో. పల్లెటూరు పల్లెటూరే, పట్నం పట్నమే. మిశ్రాబాకీ చెల్లించినప్పుడు అతగాడు నాదగ్గర ఒక పైసాకూడా వడ్డీ తీసుకోలేదు. అదే పట్నంలో అయితే చెవులు వడబిండి వసూలు చేస్తారు. అది పాట్నా కాని ఢిల్లీ కాని సొంత పల్లెలో వుండే సుఖం దేవేంద్రుని స్వర్గంలో కూడా దొరకదు..."

తర్వాత పుకార్లు మొదలయినాయి. మిశ్రా పెద్దకొడుకు పిండిమర పెట్టబోతున్నాడని, రామ్‌బిలాస్ దానికి మేనేజరు కాబోతున్నాడని, పట్నం పోదామనుకున్న కుర్రాళ్ళ తాలూకు పెద్దలంతా కలిసి రామ్‌బిలాస్‌కి లంచం ముట్టచెప్పారని...లేక పోతే వాళ్లంతా పట్నం పోతే వూళ్లో పొలం పని చేయడానికి, పశువులు కాయడానికి మనుషులెట్లా - అని మరో పుకారు కూడా వచ్చింది - రామ్‌బిలాస్ పట్నంలో వ్యవహారము నడిపిన రజబియాకు కడుపు వచ్చిందని...

నాలుగు రోజులు పోయాక శివధారీ వూరు వదిలిపోయాడని తెలిసింది...అంతకుముందు రోజు వాడు స్టేషను బజారు దగ్గర తప్పతాగి పడుంటే ఎవరో చూశారట. వాడి చెవిటి అత్త చెప్పింది - 'రామ్‌బిలాస్ పెళ్ళాం మొన్నోరోజు వచ్చి గుసగుసతో వాడికేదో చెప్పిందని...ఆరోజు రాత్రి నుంచే శివధారీ మాయమయ్యాడని."

రామ్‌బిలాస్ అన్నాడు, "ఝుమ్కీ విన్నావా, ఆశివధారీగాడు పారిపోయాడు?"

"వాడు నాదగ్గర డబ్బులు తీసుకొని పారిపోయాడు" అంది ఝుమ్కీ, "ఆమాట నాకు ముందే ఎందుకు చెప్పలేదు? నీ నోరు పడిపోయిందా?"

"వాడు అట్లాంటి వెధవ పని చేస్తాడని నాకేం తెలుసు?"

"యేంటే...మనిషిని చూస్తే ఆమాత్రం తెలియదా?"

"మళ్ళీ ఎప్పుడైనా వూళ్లోకి అడుగు పెట్టాడా అప్పుడు చెపుతా."

రామ్‌బిలాస్ ఝుమ్కీని తన గుండెల దగ్గరికి లాక్కుని గట్టిగా కౌగిలించుకొన్నాడు. ఆమె ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకుంటూ అన్నాడు- "పోనీ వెధవని! వాడు పట్నంలోంచి బతికి బయట పడాలి గదా! వెధవ ముండాకొడుకును సారాయే తినేస్తుంది. కావాలంటే చూడు."

ఝుమ్కీ ఉన్నట్టుండి లేచింది, "గేదె ఎందుకో రంకెలు పెట్టి అరుస్తోంది."

"అది కట్టు కొచ్చింది లేయే, నేను రేప్పొద్దున్నే వెళ్ళిదానికొక పోతును తీసుకొస్తాలే" అన్నాడు, రామ్ బిలాస్.

ఆ మాటలు వింటూ కొత్త పెళ్ళికూతురులా సిగ్గుపడింది ఝుమ్కీ. అది చూసి తాగినంత కైపెక్కింది రామ్‌బిలాస్‌కి.

"ఏయ్! కొద్దిగా చుక్క వేసుకుంటావా?...ఒకే ఒక గుక్కెడు."

ఝుమ్కీ నవ్వింది - "వద్దు...వద్దు...నాకు దాని వాసన చూస్తేనే ఏక్... వాంతికి వస్తుంది."

(1964)

# ఆత్మసాక్షి

వంటపాత్రలోంచి వుడికిన బంగాళాదుంపలు బయటకు తీసి తొక్కవలుస్తూ న్నాడు గణపతి. ఇంతలో బయట ఎవరో దగ్గి తమరాకను సూచించారు. అది హెచ్చరి కగా కూడా వుంది. గణపతి అడిగాడు - ఎవరూ?

"ఎవరున్నారులోపల? గణపతిగారూ...ఆఫీసు గదంతా చీకటిగా వుందేమిటి? లాంతరు ఇటు చూపండి."

గణపతి ఆశ్చర్యపోయాడు. కామ్రేడ్ బలరామ్‌గారు పాట్నానుండి అప్పుడే ఎలా వచ్చారు? తక్కిన కామ్రేడ్లు ఎవరూ తిరిగి రాలేదు. మరి బలరామ్‌గారు ఎప్పుడు ఎలా వచ్చారు?

వలుస్తూన్న బంగాళాదుంపల మీద గిన్నె బోర్లించాడు. లాంతరు తీసుకుని బయటికి వచ్చాడు.

"లాల్‌సలామ్, మిత్రమా, చెప్పండి ర్యాలీ విశేషాలు."

బలరామ్ ముఖ కవళికలు చూస్తూనే గణపతి మనసుకు యేదో సందేహం కలిగింది. బలరామ్ వికృత ముఖా కృతిని చూసి అతడి గుండె వేగంగా కొట్టుకో సాగింది...పరిస్థితి తారుమారయినట్లుంది.

"కొద్దిగా ఆఫీసు తెరవండి."

'కొద్దిగా తెరవండేమిటి, పూర్తిగానే తెరుస్తాను ముఖం మాడ్చుకొని మాట్లా డడం ఎందుకు?' అని మనసులోనే అనుకొన్నాడు...ఒక్కసారి పాట్నా వెళ్లి వస్తే చాలు, కామ్రేడ్లకు ఏమౌతుందో ఏమో!

అతడు ఆఫీసు అనబడే గుడిసె తలుపు తెరిచాడు. చాలా రోజులుగా మూసి వుంచడం చేత ఓ విధమైన బూజుకంపు కొడుతూంది. లాంతరు రెండు మూడు సార్లు గుప్‌గుప్ మని గుడ్డిగా వెలుగుతూంది.

బలరామ్ ముఖం మరీ ధుమధుమలాడుతూంది. , "లాంతరులో కిరోసిన్ బదులు నీళ్లు ఏమైనా పోశారా! ఒకొత్త చిమ్నీ కొనచ్చు గదా?"

గణపతికి అన్నం గుర్తుకువచ్చింది. చల్లారిన అన్నం తనకు సహించదు. తింటేనే తనకు వాంతికి వస్తుంది. అతడు వంటింట్లో బుడ్డి వెలిగిస్తూ "కిరోసిన్,

చిమ్నీ గురించి అడుగుతున్నారా కామ్రేడ్? అయితే ముందు నన్ను భోంచేసి రానివ్వండి, తర్వాత చెపుతాను...మీరు టీ తాగుతానంటే చెప్పండి. పొయ్యి మీద నీళ్లు పెడతాను. పొయ్యిలో ఇంకా నిప్పులు మండుతున్నాయి. పొట్లంలో కొద్దిగా తేయాకు వుంది." పొయ్యి మీద మసి బారిన అల్యూమినియం గిన్నె పడేసి నిప్పులు కదిపాడు. మళ్ళీ బంగాళాదుంపల తొక్కవలవడం మొదలెట్టాడు...బంగాళాదుంపల గుజ్జుకూర వేడివేడి అన్నం! గణపతికి ఈ ప్రపంచంలో యింతకంటే రుచికరమైన వంట మరొకటి లేదు. అందువల్లనేమో అప్పుడప్పుడూ నవ్వులాటగా కుసమీ అంటూ ఉంటుంది - గుజ్జుకూర గణపతి అని, దాన్ని పై దెబ్బ కొడుతూ గణపతి అంటాడు - కూడు తినే కుసమీ అని కుసమీ పెరట్లో వుందేమోనని అతను దగ్గి హెచ్చరిక చేశాడు. కాని కుసమీ లేదక్కడ. ఆమె గాని వుండివుంటే గణపతి ముఖం ఎర్రబడేది, అతను కావాలని కుసమీని అరిచేవాడు. "పనిచేసే దానికి ఇష్టం లేకపోతే వదిలెయ్యి. నీ కొడుకు మాదిరే నీవు కూడా పనిదొంగ అవుతున్నావు," అప్పుడు కుసమీ నవ్వి ఏదో జవాబిచ్చేది.

కూరవండే టప్పుడు గణపతికి ఈ రోజు పేపర్లో చదివిన వార్త గుర్తుకొచ్చింది - "మన సైనికులు శత్రుసేనల ట్యాంకులను పచ్చడి చేసేశారు."

నూనె, ఉల్లిపాయ, కారం, కొత్తిమీర కూరలోవేసి అన్నీ కలిపి ముద్దగా చేశాడు. మెరిసే ఇత్తడి గిన్నెలో కూర తిరగబోస్తూనే కొద్దిగా వాసన అతని ముక్కుపటాలని తదనంతరం మనసును మరింత అహ్లాదపరిచింది. కూర తిరగబోత వాసన మొట్టమొదట 1930లోనే ఆకట్టుకొంది - అదీ స్వయంసేవక శిబిరంలో . అప్పటినుంచి ఇప్పటివరకూ ఎన్ని ఆశ్రమాలు, శిబిరాలు, ర్యాలీలు, సభలు, జైల్లలో పంక్తి భోజనాలు చేశాడో! కాని ఇలాంటి రుచికరమైన వాసన ప్రతి రోజూ దొరుకుతుందా?

సంతృప్తిగా కడుపు నిండుకూ భోంచేసిన తర్వాత ఎంగిలి గిన్నె, అన్నం తిన్నచోటు శుభ్రంగా కడిగాడు. తెల్లారుతూనే కుసమీ ఎటూ వచ్చి బంకమన్నుతో బాగా రుద్దిరుద్ది కడిగేస్తుంది. అతడు అరిచి చెప్పాడు -"శోభిత్‌లాల్, అన్నం తీసుకెళ్ళు."

క్రపెట్టెలోంచి కప్పుతీసి దాంట్లో బలరామ్‌గారికి నిమ్మకాయ - తేనీరు పోశాడు. తర్వాత వేయించిన సోపు పొడి నోట్లో వేసుకొని టీ కప్పుతో ఆఫీసు గదిలోకి వచ్చాడు. గణపతికి సోపుపొడి తప్పించి మరే విధమైన అలవాట్లు లేవు. బీడీ సిగరెట్లు కాల్చడు, పొగాకు తాంబూలం ముట్టుకోడు.

టీ నీళ్ళు నోట్లో పడగానే బలరామ్ గారి మూడు మారిపోయింది. తోలుసంచిలో కాగితాలు, ఉత్తరాలు సర్దుకుంటూ బలరామ్ గారు అడిగాడు - మీరు వంట వండటమేమిటి? శోభిత్ వాళ్లమ్మ ఏమి చేస్తుంది?

గణపతికి నమ్మగర్భంగా మాట్లాడే మాటలకు అర్థాలు తెలుసు. అంటే నెలకు మూడు రూపాయల చొప్పున శోభిత్‌కు అయిదు రూపాయల చొప్పున అతని తల్లి కుసమీకు ఎందుకు ఇస్తున్నారని దాని భావం.

బలరామ్‌గారు మరోప్రశ్న వేశారు, "అయితే...ఇక్కడు చందా గిందా ఏమైనా వసూలయిందా...లేదా!"

గణపతి బ్రేవ్‌మని తేపి, "అరేగదా నేను చెప్పబోయేది కామ్రేడ్!"

బలరామ్ మధ్యలో కలుగజేసుకొని, "చూడండి, మీరు ఇలా మాటిమాటికి కామ్రేడ్ జోడిస్తారెందుకూ?"

"మరి కామ్రేడ్‌ను కామ్రేడ్ అని పిలువక మరేమని పిలువమంటారు? ఇదేమీ కొత్త గాదు. 1930 మొదలు పార్టీలో చేరినప్పటినుంచి కామ్రేడ్..."

"అప్పటి విషయాలు వదిలేయండి. ఇప్పుడెవరూ ఇలా పిలవరు...మీరు ఇలాగే మాట్లాడుతూంటే ఎవరయినా నవ్వి పోతారు."

"ఇందులో నవ్వాల్సిందేముంది?"

"అబ్బ, పోనిద్దూ. మీతో వాదించి ఎవరు నెగ్గగలరు? సరే, చందా గురించి మీరేం చెపుతున్నారు?"

"చెప్పేదేముంది. గడచిన ఆరు మాసాలుగా కిరాణాకొట్టు బాకీ రెండువందలయాభైకి చేరుకుంది. జిల్లా ర్యాలి సందర్భంగా స్టేషన్ దగ్గర మార్వాడి వద్ద తీసుకొన్న యాభైరూపాయలు అప్పు ఇంకా చెల్లించనేలేదు. పంటలు కోసేటప్పుడు అయితే ఎవరయినా చందాలిస్తారు. ఆకలి చావులు దాపురించినప్పుడు చందాలెవరిస్తారు? ఇప్పుడు వరి కోతకొచ్చింది. కాని కామ్రేడ్ మిత్రులంతా పరారీలో వున్నారు..."

బలరామ్ ఆశ్చర్యపోతూ, "పరారీ? ఎవరు పరారీలో వున్నారు?"

గణపతి నవ్వుతూ చెప్పాడు, "పరారీ అంటే ఆ పరారీ కాదు. అంటే ప్రస్తుతం కామ్రేడ్లంతా ఈ ఇలాకాలో లేరని అర్థం."

బలరామ్‌గారు గాంభీర్యం వహించారు. లేస్తూ అన్నాడు. "గణపతిగారూ మీరు సరిగ్గా చెప్పారు. నిజంగానే వాళ్ళు పరాపై పోతారా అనిపిస్తుంది."

"అంటే?"

"మీరు తెలుసుకొని ఏమి చెయ్యగలరు? అంతా హైలెవల్ సిద్ధాంత రాద్ధాంతాలు, మీకేం తెలుస్తాయి.?"

గణపతికి ఏమాత్రం తెలిసినా తెలియక పోయినా, మనుషుల్ని చదవడం వచ్చు. బలరామ్ గారి మాటల్లో ఏదో కిటుకు ఉన్నట్లు గ్రహించాడు...బంగాళా దుంపల కూరలో చెడిపోయిన నూనె కలిసినట్లు!

హైలెవల్! బలరామ్ ఇంగ్లీషు చదవక పోతే మాత్రం ఏం? వందలకొద్దీ ఇంగ్లీషు మాటలకు అర్థాలు తెలుసు. కేపిటలిస్టు, బూర్జువా, ప్రొలెటేరియన్, రియాక్షనరీ, గాంధీయైట్ ఫేస్, పార్టీ, లిటరేచర్, ఇంకా ఏవేవో అంటుంటాడు.

బలరామ్ గారే కాదు, కొత్త కామ్రేడ్లు కూడా గమపతిని గవ్వకు జమకట్టరు. ఇదే జియావుద్దీన్, శైలేందర్ గారూ, లేదా గోపాల్ గారైతే ఏదేనా ర్యాలీ నుంచి ఇలాగే ముఖం వ్రేలాడేసుకొని నొసలు చిట్లిస్తూ మాట్లాడుతారా ఏదో కొంపమునిగినట్లు పెళ్ళాం పక్కలో పడుకోవడానికి ఇంటికి పరుగెడతారా-తనకు శోభనం జరిగిన నాటినుంచి ఆఫీసు సెక్రెటరీ రోజూ పొద్దుకునకముందే ఆఫీసు మూసేసి ఇంటికి వెళ్ళి పోతాడు.

చాలా రోజుల బట్టీ ఇక్కడి పరిస్థితులు ఏమీ బాగాలేవని గణపతి పసిగట్టాడు. ఎవరికీ దేనిమీద ధ్యాసలేదు. చివరికి ఈ పాడు రోగం గణపతికి పార్టీకి కూడా అంటుకొంది. ఈ సారి జిల్లా సమావేశాల్లో మనసువిప్పి ఇదే ప్రశ్నలేవనెత్తాలి అనుకొన్నాడు గణపతి.

అతడకి తెలుసు, తను ఏదైనా చర్చించడానికి లేస్తే చాలు కుర్రకామ్రేడ్లు చెవులు కొరుక్కుంటూ అవహాస్యం చేస్తారనీ. దొంగ దగ్గులు దగ్గతారని. అంతే కాదు, 'కామ్రేడ్ గణపతీ! ఈ చర్చ కల్చరల్ ప్రోగ్రాములో స్టేజిమీద లేవనెత్తండి' అని కూడా అరుస్తాడు.

'హు! స్టేజిమీదట స్టేజి...'

వేళ్లమీద లెక్కించాల్సిన అవసరమేమీ లేదు. గణపతికి అన్నీ గుర్తే. ముప్పయి ఐదు ఏండ్లకు ముందు ఆర్యసమాజ్ సభామండపంలో కంజీరా వాయిస్తూ అస్పృశ్య నివారణ మీద పాట పాడటానికి లేచి నిలబడ్డాడు.

ఆసభను గుర్తుచేసుకుంటే చాలు. పార్వతి మనసులో మెదులుతుంది. ఏచేతినీరు తాగితే కులం మొత్తం వెలివేయబడుతుందో ఆవ్యక్తి ప్రేమలో పడి గణపతి ఆ నీచ కులస్థురాలి నోటితో ముద్దుగూడా పెట్టించుకున్నాడు. తనూ సర్వనాశనమైనా సరే ఎట్టి పరిస్థితుల్లోనూ పార్వతిని వదలి పెట్టనని ఒట్టేసుకున్నాడు. కులం,

సమాజంతో పాటు స్వంత కుటుంబీకులే గణపతిని అనేక విధాల బాధలు పెట్టారు. గణపతి యిక ఓర్చుకోలేక ఆర్యసమాజపు మంత్రికి పిర్యాదు చేస్తున్నాడు. ఈ లోపలే పార్వతి కుటుంబం మొత్తం ఆ ఊరు వదలి పారిపోయారు.

గణపతి మళ్ళీ తన యింటికి గానీ, వూళ్ళోకి గానీ వెళితే ఒట్టు. తల్లి దండ్రులతో, తోబుట్టువులతో, ఇల్లూ, వాకిలి, ఊరు-వాడా - అన్నిటితో తెగతెంపులు చేసుకున్నాడు. దేశం సమాజం సేవలో నిమగ్నమయ్యాడు. ఎక్కడ సభలు జరిగినా అందరికంటే ముందు చేత కంజీరా పట్టి గణపతి పాట పాడేవాడు - "ఓ హిందువులారా! హృదయం విప్పి ఆలోచించండి. మీతమ్ముళ్ళను చెల్లెల్లనూ అసహ్యించుకోవడం..."

ముప్పయి దశకంలో ఈ పాట పాడిన నేరానికి జైల్లో వేశారు. ఆసమయంలోనే శర్మగారి దయవల్ల అతడు కామ్రేడ్ అయ్యాడు...

శర్మగారు గణపతికి వున్న పిలక గడ్డము చేసుకునే కత్తెరతో కత్తిరించాడు. జంఝము తెంచేసి పైజామాలో పెట్టాడు. 'ఈ రోజు నుంచి నీవు కామ్రేడ్ గణపతి వి. సింగ్, గింగూ జాంతానై. కేవలం కామ్రేడ్‌వి...'

బావన్‌దాసూ, చున్నీదాసూ కలిసి గణపతిని ఎన్ని ముప్పుతిప్పలు పెట్టిందీ ఇంకా గుర్తుంది. కానీ అతడు తన పట్టు వదల్లేదు. బావన్‌దాసూని ఏడ్పించాలనీ శర్మగారి దగ్గర తను నేర్చుకొన్న తెలివిని ప్రదర్శించేవాడు - "బావన్ దాసుగారు, రాట్నం వడుకుతూ మేక పాలు తాగినంత మాత్రానా స్వరాజ్యం ఎలా వస్తుందో కాస్తా వివరించి చెప్పండి" అని అడిగేవాడు.

జైలు నుండి విడుదలైన తర్వాత చాల సంవత్సరాల పాటు జిల్లా మొత్తానికి గణపతి ఒక్కడే పార్టీ కామ్రేడ్. ఒక సంవత్సరంలోనే బిహార్ ప్రాంతంలో యెన్నో రైతు సంఘాలు, కార్మిక సంఘాలూ ఏర్పాటు చేశాడు. శ్రామికులతో భుజం కలిపి నినాదాలు, ధర్నాలు నిర్వహించాడు. ఖంజీర వాయిస్తూ పాటలు పాడాడు. అస్పృశ్యుల అభివృద్ధికోసం శర్మగారు నేర్పించిన అంతర్జాతీయ గీతాలాపన చేశాడు-

"ఉదయించె...ఉదయించేను
యఱ్ఱా యఱ్రని సూరీడు
మేలుకొండి, మేలుకోండి రైతన్నలారా!
మేలుకొండి శ్రామిక సోదరులారా!"

వైష్ణవ తల్లి దండ్రులకు పుట్టాడు గణపతి. అందుచేత జన్మతో, వైష్ణవుడు,

అందుకే శర్మగారు కఠిన పరీక్ష పెట్టారు. అందులో గణపతి నెగ్గారు... కోడి గుడ్డునేకాదు యేమాత్రం సంకోచం లేకుండా కోడిమాంసం కూడా తినేశారు. అదిచూసి శర్మగారన్నారు - 'శభాష్ కామ్రేడ్! నీవు జన్మజాత విప్లవ వీరుడవు!'

స్కూలు కాలేజిల్లో ఫెయిలై తిరిగే కుర్రకారుకేం తెలుస్తుంది. 'కామ్రేడ్ శిఫ్' అంటేయేమిటో...దేహరీ ఆఫీసులో ఏడుమంది కామ్రేడ్లకు అందరికీ కలసి రెండు పై జామాలూ, మూడు హాఫ్ పాంట్లు, ఒక పంచ వుండేవి. వాటితోనే ఆనందంగా గడిపేవారు. గంజి తాగినా కలసి మెలసి సంతోషంగా వుండేవారు. యిప్పుడా! ర్యాలీ సమయంలో విస్తర్ల మీదే వీరి విప్లవం!

యిప్పుడు యే మిత్రుడికైనా జీపూ, లౌడ్‌స్పీకర్ లేకుండా సభా సమావేశం ప్రకటించమని చెప్పండి. వెంటనే సమాధానం చెబుతారు - 'మేమేమైనా వాలంటీర్ల మనుకున్నారా? వీళ్ళు పార్టీ సమావేశాలకు జనంలోకి వెళ్ళి ప్రకటించడానికి సిగ్గు పడతారు.' పార్టీ జండా భుజం మీద మోపు కోవడం అవమానం. గణపతి ఒక్కడే డోలు వాయిస్తూ ప్రకటించేవాడు. "సోదరులారా! మనదేశం నుండి పేదరికాన్ని తొలగించడానికి పెట్టుబడిదారీ వ్యవస్థను నేలకూల్చడానికి రైతురాజ్యాన్ని, కార్మిక రాజ్యాన్ని స్థాపించడానికి ఈ రోజు సాయంకాలం నాలుగ్గంటలకు..."

అసలు గణపతే లేకపోతే ఆ వూళ్ళో 'అమర్ కిసాన్ ఆశ్రమం' యేర్పడేదే కాదు. ముగ్గురేసి పేరుమోసిన కరుడు గట్టిన హంతకులూ, జమీందార్లున్న ఈ యిలాకాలో యే పార్టీ కార్యకర్తా కనీసం దగ్గడానికి కూడా సాహసించేవారు కాదు - కేవలం భయంచేత పట్టపగలు హత్యచేసి శవాల్ని మాయంచేసే ముగ్గురు జమీందార్ల గుప్పెట్లో ఎనిమిది వందల యకరాల పొలముంది. వాళ్ళు భూముల స్వాధీనం కోసం సంఘర్షించడానికి పార్టీ ఆమోదం తెలిపి నెలల తరబడి మౌనంగా కూర్చున్నారు. యే ఒక్క కామ్రేడ్ కూడా ధైర్యం చేసి ముందుకు అడుగేయలేదు. ఒక రైతన్న కూడా విప్లవశంఖాన్ని పూరించలేక పోయాడు. అలాంటి పరిస్థితిలో గణపతి ముందుకొచ్చాడు...జమీందార్ల సిపాయీల లెక్క ప్రకారం గణపతిని చంపిపారేసినట్లే అనుకున్నారు. కానీ గణపతి చస్తూ చస్తూ బతికి పోయాడూ. స్పృహవస్తూనే ఆసుపత్రి దద్దరిల్లేటట్లు 'రైతు ఉద్యమం జిందాబాద్! లిసన్‌పుర్ రైతులు జిందాబాద్!' అనే నినాదాలిచ్చాడు. గణపతి ఆ రోజు దెబ్బలు తిని ఆసుపత్రిలో చేరకుండా వుంటే ఈ సమస్య 'రైతుబోర్డు' వరకూ వెళ్లేది కాదు...యెనిమిది వందల యకరాల భూమి ఉచితంగా జయించిన తర్వాత లిస

న్‌పుర్ రైతులు కలిసి ఆశ్రమం స్థాపించడానికి రెండెకరాల పొలాన్నిచ్చారు - అదీ చాలా తగువులు పడ్డ తరవాత.

ఆశ్రమం తెరిచింది మొదలు, జిల్లాలో యేకా[్రమే]డ్‌కు కష్టకాలం దాపురించినా సంచులు తీసుకొని ధాన్యం కోసం వచ్చేవారు. చెల్లెలి పెండ్లి కోసమని ఒకరూ, యింటి ఖర్చుల కోసమని యింకొకడూ, ఇంటి ఖర్చుల కోసమని ఇంకొకడు ఒకవైపు ఆ ఇలాకా మర్యాద కాపాడాలి మరోవైపు కా[్రమే]డ్ గౌరవాన్ని కాపాడు కోవలసిన బాధ్యత గణపతి మీద పడింది.

జిల్లా మొత్తానికి ఈ యిలాకా నుండి విధాన సభకు పార్టీ అభ్యర్థిగా విజయం సాధించాడు - అది ఆశ్రమం మహాత్మ్యంతోనే సాధ్యమయింది.

లాంతరు గుప్పుగుప్పు మని ఆరి పోయింది. గణపతి మదిలో వున్నట్టుండి ఓ వేదాంత గీతం గుర్తుకొచ్చింది - నీజన్మ నిరర్థకమాయె నరుడా...

గణపతి కలగన్నాడు - ఒక దొంగ పార్టీ కార్యాలయం - పెట్టె యెత్తుకుని పరుగుతీస్తున్నాడు. అతడు గట్టిగా కేక వేయడానికి ప్రయత్నించాడు - దొంగ... దొంగ...! దొంగ...దొం...!

గణపతి కల కల్ల కాలేదు. నిజమై కూర్చుంది. తెల్లావార్తూనే చంద్రికగారు వచ్చి దుర్వార్త చెప్పారు. "పార్టీ రెండు ముక్కలుగా చీలిపోయింది" అని.

గణపతికి చంద్రిక నోటినుండి వెలువడ్డమాట వజ్ర పాతంలా అనిపించింది. కాగితాలు, చందా అకౌంటు, రసీదులు - ఓచర్లూ, ముద్రలు అన్నీ మాయమై పోయాయి. "నిన్న రాత్రివేళ కా[్రమే]డ్ బలరామ్‌గారు వచ్చారు..." అని గణపతి అన్నాడు.

గణపతి నోటినుండి మాట వెలువడిందో లేదో కా[్రమే]డ్ చంద్రికా అతడి చెంపమీద చెళ్‌మని వాయించాడు - అతడు అదిరిపడి యేదో చెప్పబోయాడు, కానీ కా[్రమే]డ్ చంద్రికాగట్టిగా అరిచాడు, "అసలు మిమ్మల్ని యిక్కడ యెందు కోసం నియమించారు? కేవలం చందా వసూలు చేసి కడుపు నింపుకోటానికా? బలరామ్ అసమ్మతి వర్గానికి చెందినవాడని మీకు తెలియదా? యేం?"

"నాకు తెలీదు" గణపతి సూటిగా జవాబు చెప్పాడు. "ఎవరు తిరుగుబాటు మెంబరో ఎవరు అసలైన పార్టీ మెంబరో నాకెలా తెలుస్తుంది?"

"మీరు ద్రోహులు," చంద్రిక వేలు పిస్తోలు మాదిరి పైకెత్తి చూపుతూ, "మీరు పార్టీ కి ద్రోహం చేశారు. మీరు పచ్చి మోసగాళ్ళు."

ఒక్కొక్క తిట్టూ గణపతి శరీరాన్ని తూట్లు పొడుస్తోంది. చుట్టుపక్కల వూరి

వాళ్లు - స్త్రీలూ, పురుషులూ - గుమిగూడారు...ద్రోహి, కపటి, తిరస్కారం.

కామ్రేడ్ చంద్రిక వెళుతూ వెళుతూ హెచ్చరించి వెళ్ళాడు. "దాని పరిణామం యేమైనప్పటికీ నేను మిమ్మల్ని యిప్పుడే డిస్మిస్ చేస్తున్నాను. వెళ్ళిపొండి..."

కామ్రేడ్ చంద్రిక వెళ్ళిన వెంటనే కామ్రేడ్ బలరామ్ తన నూతన మిత్రుల్ని వెంటతీసుకొని వచ్చాడు. గణపతి కళ్ళు బొట్లు బొట్లుగా వర్షించాయి.

బలరామ్ చెప్పాడు, "కామ్రేడ్ గణపతి, యేడవకండి ధైర్యంగా ఈడిక్టేటర్లను ఎదిరించాలి. పెట్టీబూర్జువా కొడుకులు పార్టీని తను స్వంత జమీందారీ అనుకుంటున్నారు."

గణపతి బొంగురు పోయిన గొంతుకతో అన్నాడు, "కామ్రేడ్ బలరామ్‌గారూ, మీరు యిలా ఎందుకు చేశారు? మీరు పార్టీ సామాన్లు తీసుకెళ్లడానికే ఆఫీసుకు వచ్చారని తెలిసుంటే, బొత్తిగా మిమ్మల్ని..."

ఈ సారి బలరామ్ బదులు అకాలూ మహతో గారి పిచ్చోడుగా పేరు పొందిన కొడుకు సుధీర్‌మహతో మాట్లాడారు, "గణపతిగారూ మీరు పిల్లిలా కళ్లు మూసుకొని పాలు తాగుతున్నారు. అందుకే మీరు చేసే వెధవ పన్లు యెవరికీ తెలియవనుకుంటున్నారు. పార్టీ ఆఫీసు రాత్రింబగళ్ళు, విధవలతో ప్రేమాయణం చేయడానికి కట్టించలేదు."

గణపతి నిరుత్తరుడయ్యాడు. నలుగురి ముందు తన గౌరవం మంట గలిసిపోయింది అతణ్ణి ఘోరంగా అవమానించాడు సుధీర్ మహతో. ద్రోహి, కపటి, చెడ్డవాడు అని యిక చెప్పడానికి వినేందుకూ యేం మిగిలింది!

బలరామ్ వెళుతూ ఎర్రరంగు కాగితాల కట్టయిచ్చి, "ఈ రోజు బజార్లో, స్టేషన్‌లో ప్రతిచోటా ఈ కాగితాలు పంచాలి, అర్థమయిందా? అని చెప్పాడు."

గణపతి గుడిసెలోకి వెళ్ళి పోయాడు. పక్కమీద తెగిన మానులాగా పడిపోయాడు. అతడి శరీరం మీద రోమరోమంలోకి తిట్లు గుచ్చుకుపోతున్నాయి. అతడు ఎర్రచీటీ తీసి చదివాడు. అది ప్రజలకు పార్టీ పెద్దల హెచ్చరిక - 'రైతులూ, కూలీల పేరు చెప్పి పెట్టుబడిదారుల యెంగిలి మెతుకులతో పార్టీ నడిపే మోసగాళ్ళున్నారు మన మధ్య జాగ్రత్త...'

ఆతర్వాత ఒక్కమాట కూడా చదవలేక పోయాడు బండబూతులు, బురదా, పేడా...అంతా మహాకంపు.

గణపతి కడుపులో కెలికినట్టయింది. యిక వాంతులు అవుతాయనుకున్నా

డు. కడుపులో తిప్పడం మొదలైంది.

ఎవరు అసలు, ఎవరు నకిలీ? కామ్రేడ్ చోర్‌ఘడేనా లేక కామ్రేడ్ జాదవ్? క్రిందలేడు రైతుసభకి అధ్యక్షత వహించడానికి వచ్చాడు చోర్‌ఘడేగారు. స్వాగత పలుకుల్లోనే జాదవ్‌గారు చోర్‌ఘడేగారు యెంత ఆకాసానికి యెత్తేసారో...అంతా అబద్ధం మరి చోర్‌ఘడే గారు బిహారు పార్టీలోని మొత్తం సభ్యులను దేశద్రోహులుగా జమగట్టాడు. ఈ చీటీలూ రాశాడు.

గణపతి ఒక నిర్ణయానికి వచ్చాడు, తను పాట్నా, ఢిల్లీ వెళ్ళాలి. ప్రతిచోటా చిన్నా పెద్దా అనే తేడాలేకుండా మిత్రులనందర్నీ కలుసుకొని బతిమాలి, బామాలి, యేడ్చి ప్రజల కష్టాల్ని వినిపిస్తాడు. ఖంజీర వాయించి పాట పాడుతాడు - బాబూ, తగువులూ, తంటాలూ మనకొద్దు...

జాదవ్‌గారు చోర్‌ఘడేగారు సెంట్రల్ పార్టీ ఆఫీసు ఎదుట తగువులాడుతున్నారు. ఒకరినొకరు కొట్టుకుంటున్నారు. గణపతి వాళ్ళ యిద్దరి మధ్యకి వెళ్ళి నిలుచొని - శాంతి, శాంతి! అన్నాడు. కానీ యిరువురి కత్తులూ గణపతి మెడమీద వాలాయి.

గణపతి కళ్ళకు మబ్బులు కమ్మాయి. కళ్ల ముందు పదిహేను సంవత్సరాల ముందటి నాటక దృశ్యం ప్రత్యక్షమయింది. శరీరం వుండి వుండి కంపిస్తోంది. మలేరియా జ్వరం వచ్చే ముందు శరీరాన్ని యిలాగే వణికిస్తుంది.

గణపతి కంబలి కప్పుకున్నాడు. వాంతి చేసుకున్నాడు. సోపు పొడి నోట్లో వేసుకుని పడుకున్నాడు. వణుకుతోపాటు తీవ్రంగా జ్వరం ఆవహించింది. వాంతి అయింది. యిక పదరడం మొదలెట్టాడు. దేశం నుండి మలేరియా అంతరించిన నలబై యేళ్ల తర్వాత గణపతి మొదటి సారి జబ్బు పడ్డాడు. కనీసం తలనొప్పి కూడా రాలేదు. అతడి నోటి వెంట మొదటిసారి - "అమ్మా -ఓ నాతల్లో! ఓనా పార్వతీ - యీా - యీా - అన్నాడు."

అతడి కళ్లముందు శర్మాజీ ఎర్రని ఆపిల్‌పళ్ళు, బత్తాయిపళ్ళు చేతబట్టుకొని కనిపించారు. పళ్లరసం తీసి గణపతి చేతి కందిస్తూ - 'తీసుకో కామ్రేడ్! గుండెల్లో మంట చల్లారుతుంది అన్నాడు. గణపతి ఓగుక్క మింగాడు. గొంతు మండుతోంది. చేదు విషంలా వుంది.'

పార్వతి వచ్చింది. కాళ్ళ కట్ట దగ్గర కూర్చుని కాళ్ళు పడుతోంది. కానీ గణపతి పెద్దన్నయ్యా, కన్నతండ్రీ చేతిలో బల్లేలు పుచ్చుకొని వచ్చారు, కళ్ళు తేలిపోతున్నాయి.

పట్టుకూలీల యూనియన్ భాగల్పూర్‌లో హర్తాళ్ జరిపింది, గణపతి ఖంజీర వాయిస్తూ ఊరేగింపు ముందు ప్రపంచ కార్మికులారా ఏకంకండి..? అని పాట పాడుతున్నాడు.

పోలీసులు భాష్పవాయువు వదిలారు. గుర్రపు సేన గుర్రాల్ని అదిలిస్తూ హర్తాళ్ చేస్తున్న వాళ్ళని కొరడాలతో బాదుతూ, గుర్రాలతో తొక్కిస్తూ దుమ్ము రేపుకుంటూ పరుగులెత్తించారు.

గణపతి జైల్లో ఓమురికి సెల్‌లో పడివున్నాడు. తలకు కట్టుకట్టారు. పార్వతీ పారబతీ - పరబతీ - పారో...ఓ...ఓ...

ఏడు దినాలు యేడిపించిన తర్వాత గాని జ్వరం వదల్లేదు. ఆసుపత్రి డాక్టరు యెంతో శ్రద్ధ తీసుకొని చికిత్సచేశాడు. "డాక్టరు బాబుగారు ఒకే సారి రెండు రెండు యింజక్షన్లు యిచ్చేవారు" అని చెప్పింది కుసమీ. కానీ యిదే డాక్టరుకు విరుద్ధంగా గణపతి గతంలో బలరామ్ చెప్పిన మాటవిని చీటీలు పంచి పెట్టాడు - బిసకపూర్ ఆసుపత్రి డాక్టరు కిరాతకాలు అరికట్టండి, డిస్మిస్ చేయమని ప్రింటు చేయించాడు.

ఏడు రోజుల జ్వరంగాదు, గణపతికి గత ముప్పై అయిదు సంవత్సరాలుగా పట్టిన జ్వరం ఈనాటికి వదిలిందనిపించింది. యిన్నినాళ్లూ చీకటి సొరంగంలో అర్థం పర్థం లేకుండా వృధాగా పయనించినట్లనిపించింది.

కుసమీ వేడి వేడి పాలు అటుకులు తీసుకొని తెచ్చింది. "డాక్టరుబాబు మాంగురు చేపలు పథ్యం తినమని చెప్పారు. చేపలకోసం శోభిత్‌ను పంపారు. సాయంకాలాని కల్లా ఓ అర్ధసేరు చేపలు తప్పకుండా తెస్తాడు."

మళ్ళీ కుసమీ అన్నది, "ఈ వారం రోజుల బట్టీ ఊళ్లో వాళ్ళందరు వచ్చి చూసిపోయారు. కానీ కామ్రేడ్ మిత్రులెవరూ వచ్చిన పాపానపోలేదు. నిన్న బలరామ్ బాబువచ్చి చెప్పివెళ్ళాడు - గణపతిని యింటికి తీసుకెళ్లు పార్టీ ఆఫీసు ఖాళీ చేసెయ్యండి. అతణ్ణి పార్టీనుంచి తీసేశారు."

కుటుంబం, జాతీ, మతమూ, ప్రభుత్వమూ, అన్యాయమూ, అత్యాచారాలూ - వీటన్నిటికీ విరుద్ధంగా పోరాడిన తిరుగులేని వీరుడు గణపతి. ఈ రోజు గోదాలో ఓడిపోయిన మల్లయోధునిలా పడివున్నాడు. అందరూ తలా ఒక తన్ను తన్ని, తిట్లు తిట్టివెళ్ళి పోతున్నారు...ముప్పై అయిదేళ్ల పాటు ఘోటక బ్రహ్మచారిలా లంగోటా బిగించి పంచేంద్రియాలకు కళ్ళెంబిగించి తను ప్రజాసేవ చేశాడు. ఎవడి సొమ్మూ దొంగిలించలేదు, పార్టీసొమ్ము పైసాకూడా మాయం చేయలేదు.

తల్లీ, తండ్రీ, తోబుట్టువు, వూరూవాడా, పార్వతి - వీటన్నిటికంటే పార్టీని, పార్టీ జండాను అమితంగా ప్రేమించాడు. అన్నీ వృధా...

గణపతికి సూర్యుడూ చంద్రుడూ ముక్కముక్కలుగా విడిపోయినట్లనిపించింది. ప్రపంచంలో ప్రతి వస్తువూలూ రెండు భాగాలుగా విడిపోయినట్లనిపించింది. అంతేకాదు ప్రతి మనిషి రెండు ముక్కలుగా, రెండు రెండు ముఖాలుగా రెండు ముక్కలైన గుండె కాయతో జీవిస్తున్నట్లనిపించింది.

యింతవరకూ ఏమాటల్నాయితే పెట్టుబడిదారులూ, సామ్రాజ్యవాదులూ, యుద్ధోన్మాదులు మాటలుగా భావించి చెవిని పెట్టలేదో ఆమాటలన్నీ ఇపుడు మాటిమాటికీ గుర్తుకు వస్తున్నాయి.

గణపతీ, మీనాయకులు, అంటే మీపార్టీ కులాన్నీ మతాన్నీ నల్లమందు అని పిలుస్తారు కదా, మరి మీనాయకులు తమ పిల్లలను యితరకులాల వాళ్ళకిచ్చి యెందుకు పెళ్ళిచేయరు? అబ్బాయి పెళ్ళికి కామ్రేడ్ రామలగన్ శర్మ పాతిక వేలు కట్నం తీసుకున్నాడు. మీనాయకుల పిల్లలు డార్జిలింగు, డెహ్రాడూన్‌లలో చదువుతున్నారు. మీ సెక్రెటరీ పెళ్ళాం కాంగ్రెస్ మినిష్టర్ పదవి కొట్టేయడానికి కులసంఘాన్ని యేర్పాటు చేసింది. మీ విప్లవకుమార్ మిల్లు యజమానులతో కుమ్మక్కు అయిపోయి కూలీల గొంతు...

గణపతి కళ్ళముందు ఒక్కో కామ్రేడ్ చిత్తరవులు ప్రత్యక్షమౌతున్నాయి. చోర్ ఘడేగారు, యాదవ్‌గారు, గోపాల్‌గారు, సిన్హాసాబు, ఠాకూరుగారు, తుఫాన్‌జీ అందరి చిత్తరవులు నుండీ ఒకేమాట వెలు వడుతోంది. మేము చెడుమార్గంలో వున్నాము...

ఒక చీకటి సొరంగం నుండి బయట పడి గణపతి కుప్పకూలిపోయాడు. అతడి పేల ముఖం మీద మీసాలు వేలాడుతున్నాయి...ముప్పైఅయిదేళ్ళుబట్టి తను తప్పుడు మార్గంలో నడిచాడు. తెలుసుకోకుండానే తను యెన్ని తప్పులు చేశాడో! యెంతమందిని చెడు మార్గం పట్టించాడో!

పార్వతి కడుపు తీయించకుండా ఉంటే యీపాటికి ముప్పై అయిదైళ్ళవయసు సంతానం కలిగి వుండేవాడు. కొడుకే అయివుంటే బలరామ్ అంతటి వయసు వాడై వుండేవాడు ఈ పాటికి.

పార్వతిని తాను మోసగించాడు. ఆ మొదటి అపరాధాన్ని నేటికీ అనుభవిస్తూనే వున్నాడు.

కుసమీ గత అయిదేళ్ళుగా తనను అనురాగంతో చూస్తోంది. గణపతికి అన్ని

తెలిసి కూడా యేమితెలియనట్లు నటిస్తూంటాడు. పాపం విధవరాలు కుసమీ తన వైపే దీనంగా చూస్తుంటుంది. దానికీ ఓర్వ లేక అకాలూ మహతో తాగుబోతు కొడుకు ఎగతాళి చేశాడు - విధవరాలితో ప్రేమ వ్యవహారం...అని.

కుసమీ మంగలిని పిలిపించింది. క్షవరం చేస్తున్నపుడు కుసమీ అనింది, "మీసాలు కూడా తీసెయ్, పాలూ - బార్లీ తాగేప్పుడు యిబ్బందిగా వుంటుంది."

బంగాళాదుంపల కూర వేడివేడి అన్నం తింటూనే నోటి చేదువదిలి పోయింది. సోపు పొడినోట్లో వేసుకోని అద్దంముందు నిల్చుని ముఖం చూసుకొన్నాడు... యెంత ఆశ్చరం.! తనముఖం సరిగ్గా ఒక్క గుర్రంలాగా పొడవుగావుంది. ముప్పై అయిదుయేళ్లు నా ఆకసాయియజమాని తనచేత వెట్టిచాకిరీ చేయించుకుని చివరికి ముందరి కాళ్లకు బంధంవేసి వదిలిపెట్టాడు. తను నేలమీద పడి కొన వూపిరితో కొట్టమిట్టాడు కుంటున్నాడు. కాకులు తన శరీరాన్ని పొడిచి పొడిచి గాయాలు జేసాయి. పరబతియా కొడవలి తీసుకొని పరుగెత్తి వచ్చింది. ఆమె కాళ్ళకున్న బంధాలను తెంపేసింది. కాళ్లబంధాలు విడిపోతూనే చావు తప్పించు కున్న గుర్రం లాగా తలవంచి కూర్చున్నాడు తను.

గణపతిమెల్లగా కాళ్ళు పారజాపి పడుకున్నాడు.

బయట కామ్రేడ్ చంద్రిక పిలుపు వినిపించింది. ఓ ఎర్రటోపీ సిపాయి తొంగి మంగిలి వైపుచూసి కేకవేశాడు. "చపరాసీ బాబూ, చాపమీద కాళ్లు పారేసుకుని పడుకున్నావా!"

పోలీసు సబ్ఇన్స్పెక్టరు, పోలీసు సిపాయీని చూసి జాగ్రత్త పడ్డాడు. అతడి నరాల్లో చైతన్యం వ్యాపించింది. అతడు ఓ మారు కామ్రేడ్ వేపుచూశాడు. పోలీసు ఇన్స్పెక్టర్ అడిగాడు, "చూడు గణపతి, నీవు ఆశ్రమం తాలూకు చపరాసివి కదా?"

"నీవు, అనిపిలవద్దు, నేను ఎవరికీ చపరాసినీకాదు."

ఇన్స్పెక్టరు చంద్రికవైపు చూశాడు.

"చూడు గణపతీ, ఇన్స్పెక్టరుగారు ఆశ్రమం ఏరియాలో 144వ సెక్షన్ విధించడానికి వచ్చారు. నీవు..."

గణపతి యుధార్థంలోకి వచ్చాడు. అతడు ధైర్యంగా జవాబు చెప్పాడు. "యిక్కడ ఆశ్రమం ఎక్కడవుంది? యిదినాయిల్లు, నానేల, యిది ప్రజల ఆస్తికాదు. పార్టీ తాలూకు గోదా అసలేకాదు."

పోలీసు సిపాయి ముంగిలి లోపలికి తొంగి చూస్తున్నాడు. గణపతి గట్టిగా చెప్పాడు, "ఏయ్ సిపాయిబాబూ, అటు ఆడవాళ్ళ గదిలోకి తొంగితొంగి ఏం చూస్తున్నావు? నీ వుద్యోగం వుండాలనుందా లేక వూడాలనుందా?"

ఇన్స్పెక్టరు అడిగాడు, "నీవు...నీవద్ద...మీవద్ద యేవైనా సాక్ష్యాధారాలున్నాయా?"

"సాక్ష్యమా? యే సాక్ష్యం కావాలి? కాగితాల మీదా లేక నోటిసాక్ష్యమా? ... కుసమీ నా సంచి యిలా తెచ్చిపెట్టు."

కుసమీ ముసుగు కప్పుకొని బయటికి వచ్చింది. గణపతి తనసంచిలోంచి పత్రాలు పుస్తకాలు ఒకటొక్కటే బయటికి తీసాడు 'మార్క్సు వాద గ్రంధాలు, రైతులూ కార్మికుల గీతాలు, నకిలీ జమిందార్ల పై గీతాలు, బెజవాడ మహాసభ నిర్ణయాలు, తెలంగాణాలలో సలామ్ పాటలు, షహీద్ సినిమా పాటలు...యింద తీసుకొండి కాగితాల మీద సాక్షాలు. నోటి సాక్ష్యం కావాల్నా? పద పల్లెలో వుండేచంటి పిల్లల్ని కూడా అడగండి.'

ఇన్స్పెక్టరు నలిగిన దస్తావేజుల్ని సాపుచేసి మొదటి నుండి చివరి వరకూ చదివాడు. చిరునవ్వుతో చంద్రికవైపు చూశాడు, "యితడు చెప్పేదంతా నిజమే...ఆస్తిపాస్తులన్నీ వీరిపేరు మీదనే రిజిస్టరు అయ్యాయి."

చంద్రిక యిక ఓర్వలేక అరవడం మొదలెట్టాడు. "మోసగాడివి, ప్రజలసొమ్మును కాజేద్దామనా? నీ అంతు చూస్తాను.."

గణపతి లేచినిలుచున్నాడు. "ప్రజల పేరెత్తకు చంద్రికా, ప్రజలు గుడ్డివాళ్ళు కాదు, అన్నీ చూస్తుంటారు. వాళ్లకు అన్నీ తెలుసు. మీ స్వార్థం కోసం పార్టీని ముక్కలు ముక్కలు చేసే మీరు..."

కుసమీ లోపల్నుంచే హెచ్చరించింది. "వీళ్లతో వాదులాడాల్సిన అవసరం యే మొచ్చింది! డాక్టరుగారు ఎక్కువ మాట్లడ వద్దని చెప్పారుగదా!"

కానీ గణపతి యింతలోనే నినాదాలివ్వడం మొదలెట్టాడు. "విప్లవం వర్ధిల్లాలి! వేర్పాటువాదులు నశించాలి!...పార్టీవిరోధులు..."

గుమికూడిన జనంలో కలకలం బయల్దేరింది. ప్రజలు గణపతితో స్వరం కలిపి నినాదలివ్వడంతో ఇన్స్పెక్టరు అక్కడినుండి త్వరగా తప్పుకున్నాడు. అతడు చంద్రికతో ఇంగ్లీషులో యేదో మాట్లాడాడు.

పోలీసు సిపాయి. గాబరాబడుతూ, "బాబుగారూ, యిది పార్టీవాళ్ళ స్వవిషయాలు ఇక మనం యిక్కడ క్షణం ఆగినా పరిస్థితి విషమిస్తుంది,". అని అన్నాడు.

ఇన్స్పెక్టరు, చంద్రికా వెళ్ళిపోయిన తర్వాత గుమికూడిన ప్రజలు జయ

జయ కారాలు పలికారు "ఒక్కసారి గట్టిగా చెప్పండి - గణపతికి జై! రైతునాయ కుడు గణపతికీ జై! కార్మిక నేతా - గణపతి జీ! గణపతీజీ జిందాబాద్! మాతో తలపడితే, మసైపోతారు!"

ముప్పై అయిదేళ్ళలో మొదటిసారి తనను ఉద్దేశించి జయకారాలూ, జిందా బాద్ వినాదాలు విని గణపతి హృదయం పొంగిపోయింది.

కోలాహలం కేరింతల మధ్య ఎవరో ఉపన్యాసం మొదలెట్టారు - "సోదరు లారా! యీసారిగ్రామ పంచాయితీ ఎన్నికల్లో యీ పొడువుపాటి లాల్చీ పై జామావేసు కొనే దొరబాబుల్ని ఓడించాలి...ఈ రోజురాత్రి యిక్కడ రైతు సంకీర్తనలు యేర్పాటు చేయాలి."

అంతా వెళ్ళి పోయిన తరువాత ఏకాంతం దొరుకుతూనే గణపతి గుడిసెలో పల్నుంచి పిలిచాడు, "కొంచెంయిటువస్తావా?"

కుసమీ లోపలికి వచ్చింది. గణపతి ముఖం చూసి భయపడింది - మళ్ళీ జ్వరం ఏమైనా వచ్చిందా? ఆమె గణపతి నుదిటిమీద చేయి వేసింది. గణపతి కుసమీ మణికట్టు పట్టు కున్నాడు. అతడి పెదవులు వణికాయి. అతడు కుసమీ ముఖాన్ని తన ముఖానికి దగ్గరగా చేర్చుకున్నాడు. బొంగురు పోయిన స్వరంతో అన్నాడు "కుసమీ...యే మైనా యిదిపాపం, అన్యాయం, ప్రజల సొమ్ము, పార్టీనే ం...ఆశ్రమంలో...యిదిపాపం...ఘోరమైనపాపం..."

కుసమీకి సోపుపొడి వాసన చాలా అహ్లాదంగావుంది. కుసమీ స్వాభిమా నంతో కూడిన స్వరంతో అంది, "యేది పాపం? చంద్రిక తండ్రి పార్టీ చందా డబ్బులతో పాతవూరింటిని తీసివేసి మేడకట్టించాడు. రామలఖన్ జమీందార్ల దగ్గర లంచం తీసుకొని పేద రైతుల కోర్టుకేసులను కొట్టివేయించాడు మరి..."

"కుసమీ ఎవరు, యేంచేసుకున్నా నాకక్కరలేదు. కానీ యీపాపపుపనులు నావల్ల కాదు. నువ్వునన్ను...నువ్వు నన్నుబతికించు కోవాలను కుంటే నీగుడిసెలోకి తీసుకెళ్ళు."

కుసమీ కొద్ది క్షణాలు గణపతి చెమ్మగిల్లిన కళ్ళవైపూ, జేవురించిన ముఖం వైపూ చూసింది. మళ్ళీఅంది, "మరి...ఈ ఆశ్రమం?"

"నేను యీ భూమిని ప్రజలకు వాపసు యిచ్చేస్తాను. పదిమంది యిచ్చింది దానం అవుతుంది. దీన్ని ఒంటరిగా అనుభవించేవాడెవడికీ మనశ్శాంతి వుండ దు...యిక ప్రజా కార్యాలు చేయడంనావల్లకాదు. పార్టీయే ముక్కలై పోయింత ర్వాత..."

అతడు పిల్లాడిలా వెక్కిళ్ళు పెట్టి యేడవసాగాడు. కుసమీ తనమురికి చీర కొంగుతో గణపతి కళ్ళుతుడుస్తూ, "యేడవకండి" అంది.

గణపతి కుసమీను తనఛాతీకి దగ్గరగా తీసుకున్నాడు...అబ్బ! ముప్పైఅయి దేళ్ళ తర్వాత స్త్రీ కౌగిలింతలో వున్నవేడి అతడి శరీరంలో మొదటిసారి పరవ ళ్ళుతొక్కించింది. అతడు కుసమీ నల్లనల్లని పెదవుల్ని ముద్దుపెట్టుకొనడానికి నోరుచాచాడు, కాని ఆగిపోయాడు.

"వద్దు కుసమీ యిక్కడకాదు...యిక్కడ వద్దు...మనయింటికి పోదాంపద. యిక్కడ ఒక్క క్షణం కూడా ఉండే అధికారం నాకులేదు."

కుసమీ లేచి నిలుచుంది. గణపతి చేయిపట్టుకొని లేవనెత్తుతూ, "పద" అంది.

"అమ్మా! అన్నయ్యా! చూడూ, యెన్ని చేపలు తెచ్చానో!"

శోభిత్ వెదురుబుట్ట ముందు పెట్టాడు. నల్ల నల్లని మాంగుర్ చేపలు గంతు లేస్తున్నాయి.

కుసమీ అంది, "చేపల శకునం చాలా మంచిది."

గణపతి నవ్వాడు.

కుసమీ తన ఎదిగిన కొడుకుతో చెప్పింది "బాబూ, నువ్వు చిన్నాయన్ని పట్టుకొని నడిపించు. నేను పక్క చుట్టితీసుకొస్తా."

శోభిత్ తన అమ్మవంక చూస్తూ, "ఎక్కడికీ?" అని అడిగాడు.

గణపతి అన్నాడు. "నీ మనసుకునచ్చిన చోటుకు తీసుకెళ్ళు బాబూ!"

గణపతి ఒకసారి వెనుతిరిగి చూశాడు. పార్టీజండా రంగువెలిసిపోయి కూడా గాలిలో రెపరెపలాడుతోంది. తను కూడా పార్టీ జండాయే. యిప్పుడు శోభిత్ తన భుజమ్మీద మోసుకు వెడుతున్నాడు.

(1965)

# ఎంత విపత్తు

దిగ్విజయబాబూ ఉర్ఫ్ దిగోబాబు మతి భ్రమించి పిచ్చివాడై నగ్నంగా రోడ్డం బడి వెర్రి కేకలు వేస్తూ బండ బూతులు తిడతాడని దిగ్వి జయబాబుతో బాగా పరిచయమున్న వాళ్లెవరూ కలలో కూడా ఊహించరు. ప్రజలంతా అతణ్ణి అజాత శత్రువంటారు. ఒకవేళ పొరపాటున ఒకరోయిద్దరో శత్రువులేర్పడ్డా వారితో ఎప్పుడూ దిగోబాబు పెద్ద స్వరంతో మాట్లాడ్డం ఎవరూ చూళ్లేరు. అతడు శాంత స్వభావు డైన కారణంగా తను కాలు మోపిన ప్రతి రంగంలోనూ విజయమే సాధించాడు.

ఎంతో కాలంగా సేవచేస్తున్న పనివాణ్ణి నడిరోడ్డు మీద నోటి కొచ్చినట్లు తిడుతూ బెత్తంతో బాదుతున్నది ఖచ్చితంగా ఆ దిగోబాబేనని చుట్టు పక్కల వాళ్లంతా చూశారు, గుర్తించారు. ఎప్పుడూ చూపించని యింతకోపానికి గల కార ణమేమిటో అడగాలనుకున్నవాళ్లు దిగోబాబు నోటి వెంట వెలువడే బండ బూతులు విని వెనక్కి జంకారు. చుట్టు ప్రక్కల గుమిగూడిన వాళ్ళందరినీ వేలు చూపిస్తూ వెధవనాకొడకల్లారా! అని సంబోధించాడు. అంతేకాదు. తనకు అన్నీ ఎరుకేనట, అందర్నీ ఒక ఆట పట్టించిగాని నిద్ర పోవడట. తమాషాచూసే వాళ్ళం దరికి సరైన సమయంలో నాటకం రక్తి కట్టిస్తాడట. అంత వరకూ ప్రజలు ఓపిక పట్టాలట!

ఇంత వాగింతర్వాత వారు తమ బంగళాలోకి ప్రవేశించారు. వరండాలో వున్న పూలకుండీలను తన్ని నేల కూల్చిన తర్వాత లోపలికి వెళ్ళి పోయారు. నిశ్శబ్దంగా తెరుచుకొని మూసుకుపోయే తలుపుయీరోజు కిర్రుమని చప్పుడు చేసింది. దెబ్బలు తిన్నసేవకుడు రాంటహాల్ తలగుడ్డతో వీపు తుడుచుకుంటూ వారి వెనుకే లోపలికి వెళ్ళాడు. అంతే! ప్రజలు ఓపికపట్టాలట? నాటకం రక్తిక ట్టించే దృశ్యం చూపించడానికి మరి ఎంతసేపటికి బయటికి వస్తారో?...వారికి వూరివాళ్ల గురించి పూర్తిగా తెలుసట. కానీ దిగోబాబుకు వూరివారు ఏ హాని చేశారో వూరివారికి బొత్తిగా తెలియడమేదు. రోజూ వారి యింటికి వచ్చిపోయే వాళ్ళుకూడా యీరోజు వారి శాంతి కుటీరంలోనికి అడుగుపెట్టడానికి సాహసిం చలేదు. యిక అసలు కారణం ఎలా తెలుస్తుంది?

పనులూ,బాటలూ ఉన్నవాళ్లు వెళ్ళిపోయారు. ఏపనీ లేనివారు గంటల తరబడి ఎదురు చూడకుండా దగ్గర్లోవున్న పార్కులోకి వెళ్ళి పేకాడు కుంటున్నారు. కానీ తర్వాత ఏద్వారం నుండీ మనుషులు బయటికి రాలేదు, మనుషుల అరుపులుగానీ వస్తువుల చప్పుడు కానీ బయటకు వినిపించలేదు. వారు ఆవేశంతో పూలకుండీలను తన్ని వేగంగా తలుపులాగిన తీరు చూస్తే లోపలి కెళ్ళిన నిముషంలోనే ధనాధన్ మని చప్పుళ్ళు, గాజు, పింగాణీ పాత్రలు పగిలిన చప్పుళ్ళూ, ఆ వెంటనే వెక్కిళ్లుపెట్టి ఏడ్పులూ ప్రతి ధ్వనించాయి. కానీ రెండు గంటల తర్వాత కూడా ఏమి జరగలేదు. కాలం గడిచేకొద్ది క్రమంగా ఆ రహస్యమేమిటో అని అందరూ ఆశ్చర్య పడుతున్నారు.

రాత్రి పది గంటలకు రహస్యం తలుపు తెరుచుకుంది. దిగోబాబు యింట్లో పూర్తిగా హర్తాళ్ జరుగుతోందని ఆనోటా ఆనోటా వదంతి వ్యాపించింది. దిగోబాబుకు విరుద్ధంగా ఆ బంగళాలోవున్న వాళ్ళందరూ సహాయనిరాకరణోద్యమం చేపట్టారట. భార్య తన చిన్నగదిలోకి వెళ్ళి పడుకుంది. కొడుకు ఎదురు తిరిగాడు, సేవకులు తనమాట ఖాతరు చేయడంలేదు; వంటవాడు అతడి యిష్టం వచ్చిన వంట వండుతున్నాడు. చివరికి ఆయింటి పిల్లికూడా వారిని చూసి గుర్రుమంటోంది...అయ్యో పాపం! దిగోబాబు ప్రశాంత జీవితం యెంతలా మారిపోయింది! వారి 'శాంతి కుటీరం' అనగా న్యూపటేల్ పురీలో కొత్తగా కట్టుకున్న దిగోబాబు బంగాళాకు ఏగతి పట్టింది!!

మరుసటి రోజు సూర్యోదయంతోనే తమషా మొదలైంది.

దిగోబాబుముద్దుల కొడుకు శ్రీహర్ష తన సుతిమెత్తని స్వరాన్ని కర్కశంగా మార్చినిర్మలమైన ముఖాన్ని క్రూరంగా మార్చి పేపరు కుర్రాడితో యిలా అన్నాడు, "పేపరు యిక మీదట చిన్న బంగళాలో వెయ్యి - తెలిసిందా?"

"చిన్న బంగాళా అంటే బంగళా గెస్ట్ హౌస్" అన్నమాట. అందులో శ్రీహర్ష వుంటున్నాడు. పేపర్లన్నింటినీ చంకలో పెట్టుకొని బట్టబయలుగా సిగరెట్టు ముట్టించి పొగవదుల్తూ శ్రీహర్ష చిన్న బంగళాలోకి వెళ్ళిపోయాడు.

కొంతసేపటి తర్వాత, శ్రీహర్ష తల్లి అనగా శ్రీమతి ధర్మశీల తన భర్తను ఎందుకో ధిక్కరిస్తూ బయటి వరండాలోకి వచ్చింది. యింతవరకూ ప్రతి ఏకాదశికీ ఏ ఆడకూతురు భక్తితో పతి పాదోదకాల్ని తాగడం లోకులు చూశారో ఆ ఆడకూతురే యిలా అంది, "తెల్లార్తూనే వీరి పేరు తలచుకుంటే చాలు, ఆ రోజు వాళ్ళ పనులన్నీ తెల్లారినట్లే!"

నిన్న చావుదెబ్బలు తిన్న నౌకరు యీరోజు నిర్భయంగా లాన్లో యీజీ చైర్లో పడుకొని హాయిగా బీడీ పీలుస్తున్నాడు. మరి వంటవాడు తన జారిపోయిన పళ్ళని పళ్ళుతో మేపుల్లతో రుద్ది రుద్ది తోముతూ ఎక్కడ బడితే అక్కడ ఉమ్ములు ఊస్తున్నాడు - "నేను ఎవరికీ నౌకర్ని కాను. చాయ్ తాగాలనుకున్నవాళ్ళు హోటల్ నుంచి తెప్పించుకోండి. నేను గంగలోస్నానం చేసి బిర్లామందిరం వెళ్ళాలి! యాక్...థూ..."

ఎంత ఆశ్చర్యం! పాపం, దిగోబాబు జీవితంలో నిన్ననే మొదటిసారీ చివరి సారీ కోపం వచ్చింది. ఈ రోజు వారు మళ్ళీ ధీర గంభీరంగా శాంతమూర్తుల య్యారు - అన్నీ చూస్తూ వింటూకూడా.

భుజం మీద టవల్ వేసుకొని బయటకుళాయి దగ్గరకు వెళ్ళడం చూస్తుంటే ఎవ్వరికీ నమ్మబుద్దెయ్యలేదు, దిగోబాబు గారు ఆరుబయటస్నానం చేస్తారా! అదీ పని మనిషి అంట్లు తోమే చోట!

దిగోబాబు రోడ్డు మీద కేకేసుకు పోయే పూరీ, కూరవాణ్ణి పిలిచాడు. బజారు కెడుతున్నప్పుడు రోడ్డు పక్క తినుబండారాల బండ్లమీదికి ఎగబడి పకోడీలు, బజ్జీలు తినే కుర్రాళ్ళను చూసి వాళ్ళకు ఉచితంగా ఆరోగ్య సూత్రాలు బోధించే దిగోబాబు యిలా చద్ది పూరీలు తినడం చూసి ఓ పొరుగింటి వ్యక్తి హృదయం ద్రవించింది. "అయ్యో! అయ్యో! ఇదేంటి..." అంటూ సానుభూతితో మరేదో చెప్పబోయాడు కానీ దిగోబాబు ఓ ఇంగ్లీషు వాక్యానికి ఫక్తు అనువాదంలో మర్మ గర్భంగా జవాబిచ్చాడు. "మహాశయా! మీరు వెళ్ళి మీరాట్నానికి నూనెరాయం డి."

మధ్యహ్నం పూట ఓవ్యక్తి వెళ్ళి డబ్బుకు సంబంధించిన విషయం చెప్పాడు. "శ్రీ హర్షబాబు అయిదో నంబరు రోడ్డు మీద వుండే ప్లాటులో అద్దెకు ఉన్న వాళ్ళకు ఈ రోజు నోటీసు యిచ్చారు, ఇక మీదట ఇంటి అద్దె శ్రీహర్ష బాబు చేతి కే..."

అతడు వాక్యం పూర్తి చేయకముందే దిగోబాబు కలుగజేసుకొని, "ఔను, ప్లాటు శ్రీహర్ష పేరు మీదే వుంది. అంచేత యింటి అద్దె అతడికే చెందుతుంది" అన్నాడు.

శ్రీహర్ష ఆప్లాట్లో అద్దెకున్నవాళ్ళకే కాదు, దిగోబాబుకు కూడా నోటీసు పంపిం చాడు - జీవిత భీమా నామినీగా తను వుండదల్చుకోలేదనీ, అతడికి ఆడబ్బుతో నిమిత్తం లేదని తెలిపాడు.

తను ఎవరికీ ఆశ్రితుడు కాదు.

శ్రీమతి ధర్మశీల కూడా ఇదేవిధంగా చెప్పింది. దిగోబాబు ఆశ్రయంలో వుండటం ఒక శాపంగా భావిస్తున్నట్లు తెలిపింది.

దిగ్విజయబాబు పూర్తిగా మౌనం వహించాడు. అతడి గంభీర మౌనం తల్లీ కొడుక్కి, నౌకర్లకు చికాకు కలిగింపచేస్తోంది. "వీరిదేంపోయింది. మాట్లాడి తేనేం మౌనం వహిస్తేనేం - సంతోషంగానే వుటారు. తిప్పలన్నీ తమకేకదా."

"మీరు సంతోషంగా వుంటే లోకమంతా సంతోషంగా ఉన్నట్లే, కదా. వీరి సుఖశాంతులకు ఎలాంటి ఆటంకం కలగకుండావుంటే చాలు. యితడి మేలు కోరి యెవరైనా చచ్చినా యితడికేమీ బాధ లేదు."

దిగ్విజయబాబు నోట్లో వేలు బెట్టి కొరుక్కున్నాడు, కాదు, తను కల చూడ్డంలేదు!

చివరికి ఈ విషయం అనేక పుకార్లను సృష్టించింది. పట్నం నలుమూలలా అంతూ పొంతూ లేకుండా వదంతులు వ్యాపించాయి. యిక దిగ్విజయబాబుతో పరిచయమున్న అన్ని వర్గాల మిత్రులూ రావడం మొదలెట్టారు.

'శాంతి కుటీరం'లో ప్రవేశించేవాళ్ల దృష్టి మొట్టమొదట రామటహల్ మురికి లంగోటా మీద పడుతుంది. దాన్ని తిరుగుబాటు జండాకు ప్రతీకగా దిగోబాబు కిటికీమీద ఆరేశాడు రామటహల్.

దిగోబాబుకు సన్నిహితుడైన న్యాయవాది మిత్రుడు అసలు సమస్యకు మూలకారణం యేంటో తెలుసుకోడానికి ప్రయత్నించాడు...నౌకర్ను కొట్టిన తర్వాత పెండ్లామూ కొడుకూ తిరుగు బాటు చేశారా లేక ముందే జరిగిందా? మరి రామటహల్ చాలా కాలంగా ఆయింట్లోసేవకుడుగా వుంటున్నాడు. దిగోబాబు కాలేజీలో చదువు కోడానికి వచ్చినప్పుడు తనవెంట రామటహల్‌ను తెచ్చుకొన్నాడు. దిగోబాబు చదువు పూర్తియింది, ఉద్యోగంలో చేరాడు - విరమణ చేశాడు - కానీ రామటహల్ సదా కంటికి రెప్పలా వున్నాడు. పెళ్ళి పేరంటంలో కూడా దిగోబాబును అంటిపెట్టుకొని వున్నాడు...

దిగోబాబు మరో మిత్రుడు గూఢచారి శాఖలో ఉద్యోగం చేస్తుండేవాడు. ప్రపంచంలో జరిగే అపరాధాలవెనుక ఎక్కడో ఒకచోట కోమలమైన స్త్రీహస్తం తప్పకుండవుండి తీరుతుందని అతడి విశ్వాసం...ఈ విషయంలో స్త్రీ యెదుటేవుంది. కానీ యీవిడ ఒక్కతే కాకుండా మరో స్త్రీ లేదుకదా?

శ్రీమతి ధర్మశీలతో అర్థంపర్థంలేని కబుర్లెన్నో ఆడాడు కాని అసలు విషయం తెలుసుకోలేక పోయాడు. మరో స్త్రీ లేదా ఆ అమ్మాయి గురించి బోగట్టా యేమీ

తెలియరాలేదు! భర్త మీద కలిగిన వైరాగ్యం, సహాయ నిరాకరణకు కారణం అడిగితే శ్రీమతి ధర్మశీల రామటహల్ వైపు చూచి మౌనంగా వుండిపోతుంది.

అప్పుడు దిగ్విజయ బాబుగారి గూఢచారి మిత్రుడు మరో వైపు నుండి ప్రయత్నించాడు...శ్రీమతి ధర్మశీలే ఆ స్త్రీ కాదు గదా? ఇక రామటహల్ శరీరాన్ని భేదించే ప్రశ్నలు వేయసాగాడు...ఓ సారి యిలాగే పనసపండులో ఇనుపకడ్డీతో పొడిచిదొంగ బంగారాన్ని పట్టుకోవడం జరిగింది.

కానీ రామటహల్ మొదటి నుండి చివరి వరకూ ఒకే సమాధానం చెప్పేవాడు, "యజమాను రాలు నిజం చెప్పాలంటే దేవతాస్త్రీ!"

అతడు ఇక చేసేది లేక దిగోబాబు కాలితో తన్నిన పూలకుండీలను పరిశోధించాడు, కానీ ఆచూకీ దొరకలేదు.

మూడో రోజు యెవరో అజ్ఞాత హితైషి దిగోబాబు పెద్దకొడుక్కి టెలిగ్రాం పంపాడు - 'తండ్రికి ప్రాణం పోయేట్లుంది. వెంటనే రావాలి!'

దిగోబాబు గారి నిర్వికార మౌనవ్రతం జనాల్ని ఆశ్చర్యంలో ముంచేసింది. జరిగిన అపరాధానికి పెళ్ళాన్ని, కొడుకుల్ని, నౌకర్లను ఎవరైనా యింట్లోంచి బయటికి నెట్టి వేయగలరు, కానీ అన్నిటినీ మౌనంగా సహించడంలో ఉద్దేశ్య మేమిటి? బుర్ర సరిగ్గా పని చేస్తోందా లేక గోడగడియారం లాగా పని చేయడం ఆగిపోయిందా?

దుర్గాపూర్ నుండి దిగోబాబు పెద్దకొడుకు శ్రీపార్థ, అతడి పెళ్ళాం భవానీ పరుగెత్తుకుంటూ వచ్చారు. వాళ్లకి స్వాగతం పలికేదానికి శ్రీమతి ధర్మశీల, శ్రీహర్ష వెళ్ళారు. శ్రీహర్ష సైగచేసి, "అన్నయ్య డోంట్...!!" అన్నాడు.

"నాన్న గారెలావున్నారు?"

"వారికేం బాబూ! కష్టాలన్నీ మానెత్తి మీద వచ్చిపడ్డాయి."

శ్రీపార్థకీ, అతని పెళ్ళానికీ స్టేషన్‌లోనే తెలిసిపోయింది. తన తండ్రి గారికి ప్రాణాపాయం ఏమీ లేదని, మతి భ్రమించిందని...భ్రమించడం అంటే పిచ్చివాడవడం? ఆ మాట వింటూనే శ్రీమతి భవానీ శరీరంలో వణుకు, గుండె దడ, నాలుక పిడుచకట్టుకుపోవడం, తల తిరగడం - అన్నీ ఒకేసారి జరిగాయి! శ్రీపార్థ పెళ్ళాన్ని సముదాయించి ధైర్యం చెప్పాడు - "పిచ్చివాడైతే మాత్రం యేంటి - మాతండ్రేగదా!"

కాని కుటుంబీకులంతా బంగళా ద్వారం దాటి లోపలికెళ్ళడం చూసి భవానీ దేవి మళ్ళీ భయంతో కంపించింది...శ్రీహర్షవుండి వుండి, 'అన్నయ్యా డోంట్'

అంటున్నాడు. శ్రీమతి ధర్మశీల కలవరపడుతున్న కళ్ళు, కిటికీ మీద వేలాడుతున్న రామటహల్ మురికిబట్టిన నల్లని లంగోటా, గుసగుసలాడుతూసైగలతో మాట్లాడ్డం చూసి, విని శ్రీపార్థ పరిస్థితి దారుణంగా మారింది.

వాళ్ళంతా కట్ట గట్టు కొని చప్పుడు చేయకుండా వరండాలోకి వచ్చారు. శ్రీమతి భవాని అందరి కంటే వెనుక నిలిచింది. రామటహల్ దిగోబాబు గది తలుపు తెరిచి యేదో క్రూర జంతువును చూపిస్తున్నట్లు నిలుచున్నాడు. దిగోబాబు 'గీతారహస్యం' లో నిమగ్నమైన కళ్ళు పైకి లేవలేదు. శ్రీపార్థ దూరం నుండే మౌనప్రణామం చేశాడు. శ్రీమతి భవాని సాహసించి ముందుకు వెళ్ళబోయింది యింత లోనే రామటహల్ తలుపు మూసేశాడు.

అంతా ఒక్కసారిగా గాలిపీల్చుకొన్నారు.

శ్రీమతి ధర్మశీల అంది, "బాబు! నీవు వీరి మీద ఆధారపడాల్సిన పనిలేదు. మీకు భయమెందుకు? కష్టాలన్నీ మానెత్తి మీద వచ్చి పడ్డాయి!"

యింతలోగా వంటవాడు స్వర బద్ధంగా హనుమాన్ చాలీసా మొదలెట్టాడు, "నీ నామమే సంకటహరణం..."

అయిదునిముషాల్లో ప్రతి వ్యక్తి నోటా ఇరవైఅయిదు సార్లు 'సంకట' శబ్దం విన్నాడు. అది శ్రీపార్థమనసులో ముల్లులాగా గుచ్చుకుంటోంది - సంకటం...సంకటం...సం...కటం! అతడు అడిగాడు, "అసలు సమస్యయేమిటి?"

రామటహల్ ఏదో చెప్పబోతే శ్రీహర్ష అడ్డు పడ్డాడు. శ్రీహర్ష సంకటపరిస్థితులకు కారణమైన సమస్యలన్నిటినీ వివరంగా చెప్పాలనుకున్నాడు. కానీ శ్రీపార్థ అందర్నీ విడివిడిగా కలిసి మాట్లాడ్తానని అతడికి చెప్పాడు. అంచేత తల్లిని మాత్రం వదిలి తక్కిన వాళ్ళందరినీ గదిలోంచి బయటికి వెళ్ళిపొమ్మన్నాడు. ఎవర్ని పిలిస్తే వారురండి. ఒకరు మరొకరికి నేర్పించవద్దు అని చెప్పాడు.

శ్రీమతి భవానీ పైకి కొద్దిగా సంతోషంగా వుంది. తన భర్తతో చెప్పింది, "మామగారు నన్ను పిలుస్తున్నారు!...ఔను చాలా ప్రేమగా పిలుస్తున్నారు. నేను కిటికీ బయటనుండీ చూస్తుంటే పిలిచారు - అమ్మాయ్!" అని.

శ్రీపార్థ వాళ్ళ అమ్మ వైపు చూసాడు. శ్రీమతి ధర్మశీల తన అభిప్రాయాల్ని చెబుతోంది. 'యేమి చేయాలో యేమి చేయకూడదో' అన్న ప్రశ్నను మనసులోనే బంధించి అక్కడే నిల్చుంది.

అమ్మ శ్రీమతి ధర్మశీల, తమ్ముడు శ్రీహర్ష, రామటహల్, వంటవాణ్ణి వేర్వేరుగా ఇంటర్వ్యూచేసి శ్రీపార్థ సమస్యకు మూల కారణాన్ని వెదికాడు. మూడు నాలుగు

రోజుల బట్టి సంకట స్థితిలో వుండికూడా అతడి మస్తిష్కం చక్కగా పని చేస్తుండం గమనించి తండ్రి నిజంగానే మహాత్ముడై వుండాలను కున్నాడు.

శ్రీపార్థ తన తండ్రి పాదస్పర్శ కొరకు ముందుకు వెళ్ళాడు. అతడు శ్రీమతి భవానీని దగ్గరికి పిలిచి యేదో చెప్పాడు. శ్రీమతి భవాని భీతి చెంది శ్రీహర్ష, రామటహల్, ఆఖరున శ్రీమతి ధర్మశీల ముఖాలు పరికించింది...యింతమంది పిచ్చివాళ్ళ మధ్య...హేభగవాన్!

శ్రీమతి భవానీ తన భర్త దగ్గరకు పరుగుతీసింది.

అసలు విపత్కర పరిస్థితి యిలా మొదలవుతుంది.

...అష్టగ్రహాలగురించి భయంకరమైన పుకార్లు బయల్దేరాయి. ఇదే సమయంలో ఓ రోజున కోమటి ధర్మశాలలో దిగిన ఓత్రికాలదర్శి జ్యోతిష్కుడు ఇలా ప్రకటించాడు - అతడు ఈ నగరంలో ఒక పక్షం రోజుల కంటే మించి ఒక రోజు కూడా వుండడట. తమ భూత, భవిష్యత్ వర్తమానాల గురించి తెలుసుకోదలిచినా లేదా - దుర్దశ దాపురించిన వాళ్లు మళ్ళీ మంచి దశ పొందడానికీ త్వరపడండి.

అఖండ సంకీర్తనల అసంఖ్య వాయిద్యాల ధ్వనులతో బీభత్సహాహా కారాలు మిన్ను ముట్టుతున్నాయి. మహాయజ్ఞపు పవిత్ర ధూపాలు నగరాన్నంతా చుట్టుముట్టాయి. త్రికాల దర్శి స్వాములవారు ఆనగరానికి ఆశాకిరణాల్నే కాదు విశ్వాసమనే సూర్యుణ్ణి కూడా వెంట తీసుకవచ్చాడు. ప్రజలకు పోయినప్రాణాలు లేచి వచ్చినట్లయింది.

ఆ సందర్భంలో ఒకరోజు అదను జూచి శ్రీమతి ధర్మశీల తనభర్తతో అంది - ఓ మారు త్రికాల దర్శి స్వాముల వారిని దర్శించి రండి. శ్రీమతి ధర్మశీల తన భర్త ముఖకవళికలు చూసి భయ పడిపోయింది. కానీ దిగ్విజయబాబు కోపగించుకోలేదు. ప్రేమపూర్వకంగా ప్రశ్నించాడు - తెలివితేటలకు మించి దున్నపోతు గొప్పది ఎలా అవుతుంది?

శ్రీమతి ధర్మశీల నవ్వేసి వూరుకుంది. ఆమెకు తెలుసు కర్మయోగియైన తనభర్త యిలాగే అంటాడని. దిగోబాబు ఆ రోజు పేపర్లో ప్రచురించిన పండిత జవహర్లాల్ నెహ్రూ ప్రకటన చదివి వినిపించాడు.

కానీ వరసగా మూడుసార్లు బి.ఏ. పరీక్షల్లో ఫెయిలైన శ్రీహర్షకి 'తలరాత' మీద గొప్ప నమ్మకం ఏర్పడింది. అతడు మరుసటి రోజునే కాశీ నుండి వెలువడే ఒక ప్రముఖ పత్రిక కటింగ్ తీసుకవచ్చాడు "అమ్మా, చూడూ యిది నెహ్రూగారికి శ్రీ సంపూర్ణానంద స్వామి హెచ్చరిక, కొంచెం నాన్నకు చూపించు, ఒక సారి

చదవమని చెప్పు."

దిగోబాబూ పేపర్‌కటింగ్‌ను పైపైన చూశాడు. తర్వాత కంఠం విప్పి - 'దేవుడెల్లా రాసివుంటే అల్లే జరుగుతుంది...!'

దీంతో ధర్మశీలకు ధైర్యం చేకూరింది. కానీ రామటహల్, వంటవాడు చున్‌మున్‌ఝూ ఉదయం సాయంకాలం రెండు పూటలా భయంకరమైన తాజాపుకార్లు వెంట బెట్టుకొస్తున్నారు. శ్రీహర్షకు రాత్రి పూట నిద్ర పట్టితే వట్టు! రెప్పవాల్చు తూనే చెడుకలలు చూసి కేక లేసేవాడు.

శ్రీమతి ధర్మశీల బాధపడక యేం చేస్తుంది.

భయంతో యెండి పోయిన శ్రీహర్ష చెప్పాడు - మున్సబుగారు, ఊళ్లో వున్న వకీళ్ళు జ్యోతిష్యుని వద్ద తమ జాతకాలు చూపించుకున్నారట...సివిల్ సర్జన్ గారు రాత్రిం బగళ్ళు జ్యోతిష్యుని వెంటేవుంటున్నారట...కలకత్తాకు చెందిన గొప్ప సేఠ్ స్పెషల్ విమానంలో కుటుంబంతో పాటు వచ్చి వాలాడట.

జీవితమంతా కోర్టు గుమస్తా గిరీ నిర్వహించిన దిగ్విజయ బాబుకు 'కర్మ' మీద దృఢవిశ్వాసం యేర్పడింది. కోర్టు వకీళ్ళ పేరు వింటూనే మెత్తబడి పోయాడు. "కానీ నా దగ్గర నా జన్మకుండలీ లేదు గదా" అని చెప్పాడు. పెళ్ళాం అంది. "లేక పోతే యే మయింది.? మీరు యేదేనా పువ్వుపేరు చెప్పండి, జాతకం రాసి యిస్తారని విన్నాను." "కానీ నేను ఆ ధర్మశాలకు వెళ్ళి నా భవిష్యత్తును తెలుసుకో దలుచుకోలేదు." దిగోబాబు తన అభ్యంతరం తెలిపాడు.

"రెట్టింపు దక్షిణ చెల్లిస్తే జ్యోతిష్యులవారు యింటికి కూడా వస్తారు."

యెట్టకేలకు రాజీమార్గం కుదిరింది. శ్రీహర్షరెట్టింపు దక్షిణ చెల్లించి కార్లో జ్యోతిష్యులవారిని సాదరంగా యింటికి తీసుక రావడానికి తయారయ్యాడు.

అందరూ చాలా సంతోషించారు...యింటి యజమాని భాగ్య రేఖతో అందరి జీవితాలూ ముడిపడివున్నాయి...బాబుగారు ఒప్పుకున్నారు, అదే మహాభాగ్యం.

జ్యోతిష్యుల వారిని తీసుకరావడానికి శ్రీహర్ష కారుతీసుకొని వెళ్ళాడు. శ్రీమతి ధర్మశీల భర్తతో చెప్పింది, "మనం రెట్టింపు దక్షిణ యిస్తున్నాం గనక విషయాలేవీ వదిలి పెట్టకుండా వివరంగా అడిగి తెలుసుకోండి."

"అంటే..."

"అంటే, మీగురించే కాకుండా యీ యింట్లో వాళ్ళందరి గురించీ తెలుసుకోండి."

జ్యోతిష్యుల వారు వచ్చారు. మీసాలూ గడ్డాలు, జడలు పెంచుకొని విబూది రాసుకునే జ్యోతిష్యులను అందరూ చూశారు. కానీ సూటూ బూటూవేసుకున్న

యీజ్యోతిష్యుణ్ణి చూస్తూనే జనాలకు తమ భవిష్యత్తు కళ్ళ ముందు పారాడు తున్నట్లనిపించింది. ఈ మనిషి తప్పకుండా గొప్పమంత్ర గాడయ్యుంటాడు.

డాక్టర్ మాదిరిగా ఓ చేత్తో సంచీ, కాంట్రాక్టరు లాగా మరో చేత్తో ఓ పెద్ద ఫోర్టు పోలియో బ్యాగ్ వేలాడే సుకుని జ్యోతిష్యుల వారు కారునుండి దిగారు. దిగో బాబును చూసీ చూడకముందే తన మొదటి వాక్యంతోటే మంత్ర ముగ్దుణ్ణి చేశాడు. "నేను శాస్త్రోక్తంగా గణిస్తాను. అంచేత మేగ్ని ఫైయింగ్ గ్లాస్‌తో పాటు స్టెతస్కోపు, బ్లడ్ ప్రెషర్ ఆపరేటస్, ధర్మామీటరుకూడా దగ్గరుంచుకుంటాను. జామెట్రీ గణితం, సూక్ష్మాతి సూక్ష్మ అంశాల్ని గుణించడానికి ఇన్‌స్ట్రుమెంట్ బాక్సు, వేర్వేరు రాష్ట్రాలు, జిల్లాల మేపులతో కూడా నాకు పని వుంటుంది."

దిగోబాబు 'శాంతి కుటీరం' లో నివసించే వాళ్ళంతా మనసు లోనే జోకొట్టారు. కానీ దిగోబాబు ఓ కొత్తషరతు విధించారు. కేవలం ఏకాంతంలోనే తను జ్యోతిష్యం చెప్పించుకోదలిచానని.

దిగోబాబు గదితలుపులు మూయబడ్డాయి. అందరి నొసళ్ళ మీద ఓ అద్భుతమైన పులకరింతకలిగింది. అందరి అరిచేతులూ ఒకే సారి కపాలాన్ని స్పృశించాయి...హే భగవాన్!

జ్యోతిష్యులవారు నవ్వుతూ గది బయటకు రావడానికి మూడు గంటల సమయంపట్టింది. దిగోబాబుగారి ప్రకాశవంతమైన ముఖ మండలంలో అందరి భవిష్యత్తూ దివ్యంగా గోచరించింది. అంచేత శ్రీహర్ష అమితానందంతో జ్యోతిష్యులతో పాటు కారెక్కి కూర్చున్నాడు.

అందరికంటే ముందు ధర్మశీల అడిగింది, "దేవుని దయవల్ల అంతా చక్కగానే చెప్పారు గదా! అంతేనా?"

"వాడి బూడిద! అంతా మోసం," "యేమిటి? యేవైనా చెడు మాటలు దొర్లాయా?"

"చెడు మాటలా, వాడిబొంద? మ్యాపూ, ధర్మా మీటరుతో జ్యోతిష్యం చెప్పే వాడికి నేను పటేల్ పురాలో యింత పెద్ద బంగళా కట్టించినట్టు, పెన్షన్ తీసుకుం టున్నట్టు, పెద్ద కొడుకు వకీలు గానూ, చిన్నకొడుకు అందమైన మూర్ఖుడనీ, పెళ్ళాంపేరు ధర్మశీలనీ - ఆ పాటి తెలివితేటలుండవా..."

చాలా రోజుల తర్వాత తన భర్తను ఉల్లాసంగా చూసి ధర్మశీల సంతోషిం చింది...జ్యోతిష్యులవారు నిజంగానే త్రికాల జ్ఞాని అయివుండాలి.

శ్రీహర్ష జ్యోతిష్యుణ్ణి వదిలిపెట్టి యింట్లోకి అడుగుపెడుతూనే తన తండ్రి

భవిష్యత్తు గురించి తల్లిని అడిగాడు.

"ఏముందీ, వృధాగా ముప్పై ఐదురూపాయలు పోయిందంటున్నారు..."

"వృధాగానా? ఏమీ చెప్పలేదటనా?"

"అంతా మోసం అంటున్నారు."

"హుం!...నువ్వు ఒక సారి వీలు చూసుకొని మళ్ళీ అడుగు జ్యోతిష్యుని మాటల బట్టీ భవిష్యత్‌లో యెక్కడో తిరకాసున్నట్టుంది!!!"

"తిరకాసా?" శ్రీమతి ధర్మశీల నిర్మల వదనంలో సంశయరేఖలు వ్యాపించాయి, "వారు యేం చెప్పారు?"

"అమ్మా, ఐదురూపాయలు పై దక్షిణ గుంజుకొని కూడా జ్యోతిష్యులవారు నాకు యేమీ చెప్పలేదు. గూఢంగా యిలా అన్నారు, మానవుని భవిష్యత్తు చీకటి వెలుగులతో కలిసి వుంటుంది. కాబట్టి చీకటి వెలుగుల చెడు ప్రభావాల్ని తప్పించుకొనే ఉపాయం కూడా ఉండే తీరాలి..."

శ్రీమతి ధర్మశీల, శ్రీహర్ష జ్యోతిష్యుని గూడార్థం తెలుసుకొని ఒక అభిప్రాయమేర్పుచుకొన్నారు - ఖచ్చితంగా భవిష్యత్తులో యేదో ఒక దోషం వుండితీరాలి. దాన్ని తప్పించడానికి జ్యోతిష్యుల వారు మార్గం కూడా సూచించే వుంటారు. బహుశా అది చాలా ఖర్చుతో కూడు కున్న కార్యమై వుండాలి. అందుకే యజమాని నిజం చెప్పడంలేదు...

తల్లీ కొడుకులిద్దరి ముఖాలూ భీతితో దిగులుగా వుండడం చూసి రామటహల్ కూడా ముఖం వేలాడేశాడు. అతడు తల్లీ కొడుకుల ముఖాలవైపు మార్చి మార్చి ప్రశ్నార్థకంగా చూశాడు. తర్వాత హీన స్వరంతో అడిగాడు, "చినబాబు గారూ! 'ఆశ్రితులు' అంటే అర్థమేంటి? ఆశ్రితులు?"

"ఆశ్రితులా లేక ఆశారహితులా?"

రామటహల్ ఆమాటను సరిగ్గా పలకడానికి ప్రయత్నిస్తూ, "ఆశ్రితులు! రామటహల్ అటూ యిటూ చూసి చెప్పాడు, తను జ్యోతిష్యునికి ఫలహారము, తాంబూలం అందివ్వటానికి గదిలోకివెళ్ళాడు. అప్పుడు జ్యోతిష్యులవారు, వారితో యిలా చెప్పారు, వారి మీద అష్టగ్రహాల ప్రభావం యేమీ వుండదట. చాలా సౌఖ్యంగా జరిగి పోతుందట. యెటొచ్చీ కష్టాలన్నీ ఆశ్రితులకేనట!"

"ఓహో! ఆశ్రితులకా?"

శ్రీ హర్ష ఓ పెద్ద నిఘంటువు దుమ్ము దులిపి శబ్దార్థం వెతక నారంభించాడు. శ్రీమతి ధర్మశీల యిష్టదైవాన్ని ప్రార్థిస్తోంది. రామటహల్ కళ్ళు వెలవెలబో

తున్నాయి. అయిదు నిముషాలపాటు నిఘంటువుతో కుస్తీపట్టిన తర్వాత విజయం సాధించాడు. "ఆ! దొరికింది! ఆశ్రితులు...ఇతరులసహాయంతో...మళ్ళీ...నిలచిన, ఆగిన...పుం.-జీవనాధారం కొరకుయితరులను ఆశ్రయించిన వాడు, స్త్రీ-పిల్లలు, సేవకులు, మనస్సు మరియు జ్ఞానేంద్రియములు..."

ఉన్నట్టుండి ఆముగ్గురి మధ్యలో చేతి బాంబుపడ్డట్టు పెద్ద శబ్దం వినిపించింది. ముగ్గురూ తెప్పరిల్లి చూశారు, ఆపడింది చేతిబాంబు కాదు, శ్రీహర్ష చేతిలో నుండి నిఘంటువు జారిపడింది...యింకేముంది? ఆశ్రితులంటే -స్త్రీ-పిల్లలు-సేవకులు? ఈ దుష్టగ్రహప్రభావం నుండి రామటహల్‌గాని, వంటవాడుగాని...బ్రతికి బయటపడలేదన్నమాట!

భయభ్రాంతులైన ఆశ్రితులు చివరి ప్రయత్నంగా యజమానిని వివరణ అడగదలచారు-ఆశ్రితులను ఆపదనుండి గట్టెక్కించడానికి ఏదైనా ఉపాయం ఆలోచించారా లేదా? అని.

మధ్యాహ్నం పూట భోజనాల సమయంలో శ్రీమతి ధర్మశీల విసనకర్ర చేత బుచ్చుకొని ప్రేమపూర్వకంగా భర్త దగ్గర కూర్చుంది. భర్తనోట్లోకి మొదటి ముద్ద వెళుతూనే శ్రీమతి ధర్మశీల తన మనసులోని మాట బయట పెట్టింది. "ఒక వేళ జ్యోతిష్యం ప్రకారం భవిష్యత్తులో ఏదైనా విపత్తు వచ్చేటట్లయితే దాన్ని తప్పించడానికి ఏదో ఒక మార్గం చూపించి వుండాలి కదా? మీకు తప్పించి మిమ్మల్ని ఆ...శ్ర...యించిన..."

దిగోబాబు చీదరించుకుంటూలేచాడు, "వంటవాడు ఈ రోజు...యేం కూరత గలబెట్టాడు...యిది విషం...అబ్బ! యింత కారమా...నీవేమో రాత్రింబవళ్ళూ జాతకఫలాలు తెలుసుకొనే పిచ్చిలో పడిపోయావు. కాని వంటింట్లోకి తొంగిచూడ్డానికి కూడా నీకు తీరిక లేదాయె...అబ్బో! చంపేశాడు..."

దిగోబాబు అటుభోజనం చేయలేదు, యిటుకోపాన్ని వెళ్ళగక్కనూలేదు. ఎక్కిళ్ళు పెడుతూ నోరు పుక్కిలించాడు.

టీ టైములో కూడా శ్రీమతి ధర్మశీల ప్రయత్నించింది. కానీ ఫలితం లేకపోయింది.

రాత్రి భోజనాలకు ముందే ఈ ఆపద నుండి బయటపడ్డానికి శ్రీహర్ష ఓ మంచి టెక్నిక్ కనిపెట్టాడు. మరోమార్గం యెటూలేదాయె! 'శాంతి కుటీరాన్ని ఆశ్రయించి బతికేవాళ్ళముందు తన రహస్యప్రణాళికను బయటపెట్టాడు. ముఖ్యంగా వాళ్ళ అమ్మకు యిలా వివరించాడు. "ఏమైనా రూఢీగా తెలిసిపోయిందేమిటంటే

నాన్నగారు మనల్ని ఈ ఆపదనుండి రక్షించడానికి ఎలాంటి ప్రయత్నం చేయరు. మనం వారిని స్వార్థపరుడని అనలేము, కానీ దయలేనివారు అన్నమాట సత్యం. కనీసం ఏంచేయాలో కూడా చెప్పకపోతే ఎలా? ఈ పరిస్థితిలో మనం మన తెలివితేటలను ఉపయోగించి ప్రతీకారం తీర్చుకోవాలి. నాన్నగారు అన్ని వేళలా సుఖంగానే వుంటారు. వారికి ఎలాంటి ప్రమాదం లేదు. ఆపదలన్నీ వారిని ఆశ్రయించుకున్న వాళ్ళకే. మనం ఎటూ వారిని ఆశ్రయించుకొని వుండాల్సిందే. తప్పదు-అది మన అశక్తత. ఈ లాంటి పరిస్థితిలో 'పాము చావాకూడదు కర్ర విరగా కూడదూ' - సరిగ్గా అలాంటి టెక్నిక్కును ప్రయోగించాలి. దీనికి మీరందరూ సహకరిస్తేనే..."

సర్వసమ్మతితో ఆపదలో చిక్కుకున్న ఆశ్రితులు ఒక నిర్ణయాని కొచ్చారు - ఆత్మరక్షణార్థం యింటి యజమాని యెడ అహింసాత్మక విరోధాన్ని ప్రకటిస్తారు. అంటే ఆత్మరక్షణార్థం విరోధించడం, వాళ్ళు ఆశ్రితులైవుండి కూడా ఏమాత్రం ఆశ్రితులంకామనే అభిప్రాయాన్ని కలిగించాలి. ఎందుకంటే జాతకం ప్రకారం యజమాని అన్ని వేళలా సుఖంగా వుంటారు. ఆయనకు ఎలాంటి అపకారం జరగదు...

ఆ తర్వాత శ్రీహర్ష వివరంగా తనకార్యక్రమం పూర్వాపరాలను ఎలా నిర్వర్తించాలో చెప్పాడు.

అందరికంటే ముందు రామటహల్ రేపు తెల్లార్తూనే తిరుగుబాటు జండా ఎగురేయాలి. ఎందుకంటే యజమాని తెల్లవారకముందే పేరుపెట్టి పిలిపించుకొనే మొట్టమొదటి ఆశ్రితుడు అతడే గనుక. శ్రీమతి ధర్మశీల సంశయాలకు శ్రీహర్ష సమాధానం యిలా చెప్పాడు, "టీ తప్పకుండాయిస్తారు. కానీ కొంత ఆలస్యంగా యివ్వడం జరుగుతుంది. వారిని కష్టపెట్టడానికి కాదు, మనం కష్టాల నుంచి గట్టెక్కడం కోసమే మనం ప్రతిఘటిస్తున్నాం...వారిని ఎదిరించేముందు అందరూ గుండె దిటవు పరుచుకోండి."

రామటహల్‌కు ధైర్యం తెచ్చుకోవల్సిన అవసరం లేనేలేదు.

తెల్లార్తూనే యజమాని మొదటి పిలుపుకు అతడినోటి నుండి మాట వెలువడేదే కానీ పళ్ళు బిగబట్టి నోరు మూసుకున్నాడు...పాతికేళ్ళ అలవాటాయె!

మూడుసార్లు పిలిచినప్పటికీ రామటహల్ బదులు పలకలేదు.దిగోబాబు కొంచెం ఆశ్చర్యపోయాడు. ఆతడు తలతిప్పి చూశాడు, రామటహల్ ఎదురుగా వరండాలో పడుకొనివున్నాడు. ఈ సారి దిగోబాబు గొంతు విప్పిగట్టిగా పిలిచాడు.

"రామటహల్!"

"తెల్లారకముందే రామటహల్ - రామటహల్ అని ఎందుకు కేకలేస్తారు! చెప్పండి?"

తనుయింకా నిద్రకళ్ళతో వున్నట్టు నమ్మకం కలిగింది, అందుకే మరేం మాట్లాడలేదు. కానీ రామటహల్ వూరుకున్నాడు కాదు. "టీ కావాలంటే వంట వాణ్ణి పిలవండి."

దిగోబాబు స్వప్నలోకం నుండి 'శాంతి కుటీరం' గదిలోకి ఊడిపడ్డాడు. అటు వైపు రామటహల్ అరచేతిలో పొగాకు నలుపుకుంటూ మరచిపోయిన స్వతంత్ర గీతాన్ని గుర్తు తెచ్చుకుంటున్నాడు. గుండె దిటవుపరుచుకోడానికి కంఠం విప్పి గట్టిగా పాట అందుకున్నాడు - 'తోటలో కోతిలాగా ఇంగ్లీషోళ్ళను ఆడిస్తాం, తోటలో కోతిలాగా...'

దిగ్విజయబాబుకు రామటహల్ ఈ మధ్య గంజాయి తాగడం మొదలెట్టా డని నమ్మకంకుదిరింది. అవమానం, దుఃఖం, గ్లానీ అన్నీ ముప్పిరి గొని అక స్మాత్తుగా ఎదురు తిరగడంతో వారి శరీరంకంపించి పోయింది. లేచి నిల్చుని కర్ర చేతబుచ్చుకొని రామటహల్ మీదికి ఉరికారు. రామటహల్ పరుగెత్తడానికి ముందే సమాయత్తంగా వున్నాడాయె. అతడు పరుగు తీశాడు. కానీ రోడ్డు క్రాస్ చేయలేక పోయాడు. రోడ్డు మధ్యనే రామటహల్‌ని అటకాయించి బాదుతున్నా డు. అరుపులూకేకలూ విని వీధిలో వాళ్ళంతా మేల్కొన్నారు...జనాలు తమ కళ్ళతో చూశారు. దిగోబాబేనని గుర్తుపట్టారు.

చుట్టుపక్కల గుమిగూడిన వాళ్ళని హెచ్చరిస్తూ నాటకం రక్తి కట్టిస్తానని శపథం బూనిపూలకుండీలను కాళ్ళతో దొర్లించి తన గదిలోకి వెళ్ళి పోయారు. యిరుగు పొరుగునున్న వాళ్ళే తమపాతసేవకుణ్ణి తనమీదికి ఉసికొలిపారని అను కున్నాడు. దానికి సరైన గుణపాఠం నేర్పడానికి దారి వెదుకుతున్నారు. యింతలో వంటవాడు 'ఆశ్రితుల చారిత్రాత్మకమేనిఫెస్టో' చేత బుచ్చుకొని గదిలోకి ప్రవే శించాడు.

దిగోబాబూ చదివారు - "మీరు నిష్కారణంగా ఒక విశ్వాసపాత్రుడైన నిస్స హాయ ఆశ్రితుణ్ణి అన్యాయంగా కొట్టారు. మేమంతా దీన్ని ఖండిస్తున్నాము. మేమంతా మీ దుర్వ్యవహారానికి దుఃఖిస్తున్నాము. అంచేత మిమ్మల్ని తీవ్రంగా నిందిస్తు న్నాము. యిక ముందు..."

దిగోబాబు యిక చదవలేక పోయారు, యెందుకంటే యింతలోనే చిన్న

బంగళా నుండి ఓ పాతపాటరికార్డు చాలావాడియైన భాషలో మ్రోగుతోంది - "ఓ పాపీ, ప్రకృతినంతా ఎలా పాడుచేశారో చూడు...ఓపాపీ - ఓ హో పాపీ...!"

శ్రీహర్ష తనవంతు ప్రతీకారాన్ని తెలుపుకోవడానికి యిలాంటి పాటల రికార్డులు, నగ్నచిత్రాలు, బట్ట బయలుగా సిగరెట్టు కాల్చడం, కొందరు రౌడీ మిత్రులతో పేకాడటం వగైరా కార్యక్రమం ఏర్పరచాడు. తక్కిన ఆశ్రితులకు వేర్వేరు కార్యక్రమాలు ఏర్పాట్లు చేశాడు.

శ్రీహర్ష వాళ్ళమ్మతో ఇలా ఇలా చెప్పాడు - "పొర పాటునకూడా పాదాలు ముట్టుకొని ప్రణామం చేయవద్దు. కావాలంటే నాన్నగారి పటానికి పూజ చేసుకో, పర్వాలేదు. ఏది ఏమైనా నాన్నగారి యెడ దురుసుగా వ్యవహరిస్తూనే మనకష్టాలు తీరుతాయి."

మూడు రోజుల పాటు రాత్రింబగళ్ళు ఆశ్రితులు ఆత్మవిశ్వాసంతో, దృఢంగా తమవిరోధాన్ని కొనసాగించారు. ఇంటి యజమానిని చికాకు పరచడానికి అనునిత్యం కొత్త ఉపాయాలు ఆలోచించి ప్రయోగించారు. కానీదిగోబాబు మౌనము ద్రవహించి 'గీతారహస్యం'లో ఎంతగా లీనమైపోయారంటే, మెయిన్ స్విచ్ ఆపి వేసినా, గట్టిగా రేడియో వాల్యూమ్ పెంచినా కూడా ఏమాత్రం చలించలేదు... రామటహల్ మురికి లంగోటాను మాటి మాటికీ విదిలిస్తూ వారి క్రోధాగ్నిని ప్రజ్వలింప జేయడానికి శతవిధాలా ప్రయత్రించాడు. కానీ అన్నీ విఫలమయ్యాయి.

శ్రీమతి భవానీకి దైవసమానులైన తనమామగారికి సపర్యలు చేసే అవకాశం దొరకలేదు. శ్రీమతి ధర్మశీల ఏకారణంచేతో కోడలియెడ కోపంగా వుంది. అందుకే భర్త యెదుట వీలుదొరికి నప్పుడల్లా ఆమెను తిడుతుండేది.

శ్రీమతి భవానీ తన సద్బుద్ధి చేత దిగ్విజయ బాబును రెండు రోజుల్లోనే ముగ్ధుణ్ణి చేసింది. వారి మనసులో కొడుకులు లేరనే భావన దూరమైపోయింది.

ఆరోజున తన తండ్రిని ఎదిరించిన ఆశ్రితులందరికీ శ్రీపార్థ తననిర్ణయాన్ని వినిపించాడు - "యిప్పుడు మీరు మా నాన్నగారిని ఆశ్రయించినవారు కాదు. యిక మీకు యెలాంటి ఆపదవుంటుందని సందేహించాల్సిన అవసరంలేదు. నాన్నగారు యిక నా ఆశ్రయంలో దుర్గాపూర్‌లో వుంటారు. ఎందుకంటే జ్యోతిష్యులవారు చెప్పినదాని ప్రకారం తండ్రిగారు ఎవరి అధీనంలోనైనా వుండాలి."

శ్రీపార్థ తన తల్లికి సోషల్‌వర్కు చేయమని, శ్రీహర్షను యింటినౌకర్లతో యూనియన్ ఏర్పాటు చేయమని చెప్పాడు. రామటహల్‌ని వేరుశనక్కాయలు అమ్మకోమని, వంటవాణ్ణి గంగానది వడ్డున బిక్షం అడుక్కోమని ఉచితసలహాయి

చ్చాడు. శ్రీమతి భవానీని దుర్గాపూర్ ప్రయాణానికి వెంటనే సిద్ధం కమ్మని ఆజ్ఞాపించాడు.

దిగ్విజయబాబూ, బాలకుడి లాగా సంతోషంగా తన సామాన్లు సర్దుకుంటున్నారు. యింతలో బయట కోలాహలం వినిపించింది. శ్రీమతి ధర్మశీల కోపంతో ఊగిపోతూ వంటవాణ్ణి అడిగింది, "చెప్పు! నువ్వెకావాలని యిదంతా చేశావా? యెందుకు చేశావు? మేము సంతోషంగా వుండడం చూళ్ళేకనేనా?..."

శ్రీపార్థ తన ప్రయాణానికి ముందు ఈ కలహానికి కారణమేమిటో తెలుసుకోవాలనుకున్నాడు. శ్రీమతి ధర్మశీల చెప్పింది. - "బాబూ, నీవులాయరువి. నీవే న్యాయం చెప్పాలి. మొన్నమీనాన్నగారు వూరినుంచి వస్తూ కూరగాయల విత్తనాలు తెచ్చారు. వంటవాడు ఆవిత్తనాలతో పాటు చిటికెడు గంజాయివిత్తనాలు కలిపేశాడు. గతవారం రోజుల బట్టి పనిపిల్ల ఆకుకూరలతో పాటు గంజాయి మొక్కలు కూడా కోసుకొచ్చేది. వంటవాడు కళ్ళు మూసుకొని కూరలో వేసేవాడు...అలాంటప్పుడు యింట్లో వాళ్ళంతా పిచ్చివాళ్ళుగాక మరేమౌతారు?"

రామటహల్ అందుకున్నాడు, "ఇప్పుడర్థమయింది, నాతలయిలా ఎందుకు తిరుగుతోందాని."

శ్రీహర్ష చెప్పాడు, "రామటహల్, యిప్పుడే తక్షణం పోలీసువాణ్ణి తీసుకరా."

వంటవాడు చేతులు జోడించి ప్రాధేయపడ్డాడు-"అయ్యగారు-పెద్ద బాబుగారూ - చిన్న బాబుగారు - అమ్మగారూ-ఈ సారికి నన్ను క్షమించండి. ఇక ముందు ఎప్పుడూ ఇలాంటి పొరబాటు జరగదు..."

జరిగిన సంఘటనకు సరైన కారణం తెలుసుకున్నాక శ్రీమతి ధర్మశీల ఓగ్లాసు చల్లని నీళ్ళు తీసుకొని భర్తగదిలోకి వెళ్ళింది.

(1965)

# స్మృతిరేఖలు

ఎత్తైన రాణీడీహ భూమిపైన-ఎర్రనేల పొలంలో-కుంకుమ-అక్షింతలు చల్లి నట్లువుంది-సూర్యుడితొలి కిరణాలు ప్రసరించకముందే పొలంలో వేలాది పక్షులూ, గోరు వంకలు కిచ-కిచ మంటున్నాయి. క్రిందిటి రాత్రి అదే పొలంలో మూడవఝాము వరకు రాణీడీహ గ్రామంలోని పెండ్లికాని కన్యలు కిచ-కిచ మంటూ నృత్యనాటకాభినయం చేశారు.

రాత్రి 'శ్యామా - చక్రవాక' పక్షుల ప్రతిమలను నిమజ్జనం చేసేదానికి నీటిలో విసర్జన చేయించారు.

నల్లపిట్ట, చకోరపక్షి, కాటుకపిట్ట, వెన్నముద్ద పిట్ట, నీటికాకి, బాతు, అడవిబాతు, అడవికోడి, కంజుపిట్ట, ఎర్రజుట్టు పిట్ట, గవ్వరంగు పిట్ట, నీటి పావురం పక్షులు మొదలుకొని జీరంగి, బూరుగ, అగ్గిపురుగు, పేడపురుగు వరకు గల రకరకాల క్రిమికీటకాల చిన్నచిన్న ప్రతిమలను మట్టితో తయారు జేసి వాటికి రంగులు వేశారు. రెండు రాత్రిళ్ళు వాటిని పొలాల్లో వుంచిమేపారు. అంటే వాటిని పూజించారన్నమాట. ఈ రాత్రికి వాటి విసర్జన - నిమజ్జనం జరిగింది.

వందల సంఖ్యలో బృందావనాలు కాలాయి. చాడీలు చెప్పే వారి ప్రతిమలు వేలసంఖ్యలో కాలాయి. ప్రతిమల శిఖలు కాలాయి. - ప్రతిమలను కాల్చుతూ తిట్ల దండకం మొదలెట్టారు-ప్రతి ఇంట్లో నీవు కొట్లాటలను రేపుతావు, తండ్రి కొడుకుల మధ్య రగడపెడతావు, ప్రతి నిత్యము నీళ్లలో అగ్గి లేపుతావు, కారణం లేకుండానే ప్రతిరోజూ చుంచుమాదిరి అందరినీ తొలిచేస్తావు. నిన్ను కాల్చినుగ్గు చేస్తాంరా, ఒరే! చాడీల కోరు- చుంచు ఎలుక ముఖమూ, నీవూనూ...చాడీ కోరుగా! నీవూ నాశనం గానూ...కాలి పోతున్నాడు...చూడండి...ఆహా!ఆహా!

ఆడపిల్లలందరూ చప్పట్లు కొడుతూ సంతోషంగా నవ్వుకుంటున్నారు. నవ్వులు...చప్పట్లు.

నక్షత్రాలు రాలిపొయ్యాయి. కాళ్ళ మువ్వలు ఝుణఝుణ ధ్వనులు చేస్తూ మోగాయి. గోరింటాకు మొక్కలు తలలాడించాయి. రాత్రి తడిసి తెప్పరిల్లింది.

భూమి మీద అన్నిచోట్లా కుంకుమ - అక్షింతలు చల్ల బడివున్నాయి - గడ్డి

పైన వెదజల్లినట్లు ముత్యాల్లాంటి మంచు బిందువులు...చిన్నచిన్న ఇంద్ర ధనుస్సులు!

...ఇంతలోనే ఒక గద్ద రెక్కలు ఆడించింది. పిట్టలన్నీ ఒక్కసారిగా భయపడి లేచి పోయాయి. పిచ్చుకల గుంపు ఎగిరి వచ్చి ఆవాల చేలో వాలింది.

చాలా కాలం తర్వాత - దాదాపు ఐదేళ్ళ తర్వాత రాణీడీహ లోని కన్నెపిల్లలు 'శ్యామా-చకవా' ఉత్సవాన్ని జరుపుకొన్నారు. ఒక దుప్పటి కప్పుకునేంత చలివుంది. మార్గశిర మాసంలో కోతకు వచ్చే వరి పొలాల్లో ఇప్పుడు కొంత ఎర్రదనం వచ్చింది. అంటే వడ్ల గింజలు గట్టిపడుతున్నాయన్నమాట. బంగాళా దుంపలమొక్కలకు ఆకులు చిగుర్చుతున్నాయి. తెల్లవారు ఝామున్నే అందరూ క్యాబేజి మొక్కలకు నీళ్ళు పెడుతున్నారు.

"బిజయా దీదీ! నువ్వు ఇంత ప్రొద్దున్నే శ్రమపడి క్యాబేజిమొక్కలకు నీళ్ళు పెడుతున్నావు కదా, ఏమిలాభం చెప్పు. ఇక నీవు పాట్నాలోనే ఉండిపోతావుకదా...!"

"నోరు మూసుకోవే, చుప్పనాతి దానా! " గంగాపూర్ అవ్వ కోపంగా 'చుర్మునియా'ను మందలించింది; "ఎద్దుకాలిలో ముల్లంతలేవు, పనీ బాటా లేకుండా రోజంతా వాగుతూనే వుంటావు."

ఎద్దుకాలిలో ముల్లంతలేని చుర్మునియా నోరుమూసుకోలేదు. కళ్ళుతిప్పుతూ, మూతి ముడుసుకొని ఎక్కిరిస్తూ అంది - "సరేలే! నీకేం హాయిగావుంటావు! బిజియా దీదీ ఏమో క్యాబేజి మొక్కలు నాటి నీళ్ళుపెడతారి, నీవేమొ బుట్టలునింపుకొని క్యాబేజిలు అమ్ముకుతింటావు. పొలం గల పిన్నమ్మ పాట్నా నుంచి వచ్చిపైసలడిగితే అల్లి బుల్లి కబుర్లు చెప్పి డొంక తిరుగుడు సమాధానం చెపుతావు కానీ, అమ్మిన క్యాబేజీలకు సరైన లెక్కలు తేల్చవు...హా.హా.హా."

అవ్వ ఓ చెడ్డ తిట్టు తిట్టింది. తిట్టు తిని చుర్మునియా విజయవైపు చూసింది. విజయ మొదటి నుండి నవ్వుకుంటూనే వుంది. ఈ కర్రిపిల్ల చేసే అల్లరి ఆమెకు తెలుసు. ఈ పిల్ల అగ్గిపిడుగు. చూచి రమ్మంటే కాల్చివచ్చేరకం.

గంగాపూర్ అవ్వ చుర్మునియా మాటలను అంతగా పట్టించు కోలేదు. కాని ఆవిడ నంగి నంగిగా ఏదో అన్నది. చుర్మునియాకు ఆవిడ అన్నది అర్థమయింది. "ఏ మవ్వా, నేనన్నదాంట్లో తప్పు ఏమైనా ఉందా?" అని అడిగింది. పాపం గంగాపూర్ అవ్వకు ఇరవయి తర్వాత లెక్కపెట్టడం రాదు. అలాంటి ఆమెను పొలంగల యజమానురాలు, 'నూరు మామిడి పండ్లు ఐదురూపాయ

లైతే నూట యాభైమామిడిపండ్ల ధర ఎంత?' అని అడిగితే అవ్వ ఏమని జవాబు చెప్పగలదు మరి! అవ్వ ఆకాశంవైపు చూస్తుందప్పుడూ.

"తొందరగా తొట్టి నింపూ." అంది విజయ చుర్మునియాతో.

ఏడెనిమిది సంవత్సరాల ఈ తుంటరిపిల్లతో పని చేయించుకోవటం ఎవరి తరమూకాదు. విజయ ఒకర్తే ఈ పిల్లతో ఏగ గలుగుతుంది. ఈ పిల్ల వాళ్ళ అమ్మ మాట కూడా వినదు. తండ్రి అంటే అసలు లెక్కే లేదు.

విజయ రాణీడీహ వచ్చినప్పటి నుండి చుర్మునియా రాత్రింబవళ్ళూ వాళ్ళ హవేలీని వదలి రావటం లేదు.

"బిజయా దీదీ, నీవు వచ్చావంటే రాణీడీహలో ఏదో పెద్ద పండుగ మాదిరే వుంటుంది నాకు. దేవి దుర్గా జాతర జరుగుతున్నట్లు అన్పిస్తాది. నాకు నిజంగానే," అని నిన్ననే చుర్మునియా విజయతో అంది. కానీ నీవు కూడా కాటుకపిట్ట మాదిరి ఇక సంవత్సరంలో ఒక మారు ఈ ఊరికి వస్తావు కదూ! యజమానురాలు పిన్నమ్మవచ్చినట్లేనూ...నీవు కూడా పట్నానికి వెళ్ళి అక్కడ లోబాడీలు (బ్రాలు) వేసుకొంటావు కదూ!

"నీకు తన్నులకు రాసిందే!" అవ్వ ఆకు కూరతుంచుకుంటూ అంది, "ఈ గబ్బుముండకు చిన్నా-పెద్దా అన్న బిడియంకూడా లేకపోయింది."

కోపం వచ్చినప్పుడు అవ్వ చుర్మునియాను జుట్టు పట్టుకొని ఈడ్చి బాగా తిట్టికొడుతుంది. ఆరోజు ఊరు-నాడు ఏకం చేస్తుంది ఆపిల్ల. ఎక్కడో బూడిదగుట్టలో బోర్లాడి ఒంటి కంతా బూడిదపులుముకొని భూతం మాదిరి తయారై ఏడ్పు గీతాలు ఆలపిస్తుంది- "ఊ, ఊ, ముసల్ది, గంగాపూర్ది, పెద్దోళ్ళ ఇంట్లో చాకిరి చేసేది, నా సవితి ముండ...వూరకే నన్ను కొట్టుక చంపుతుంది ఈ ముసలి ముండ గంగాపూర్ది."

'ఇది పిల్ల కాదు రాబాబూ! రాక్షసి పిడుగు!' అంటుంది అవ్వ నవ్వుతూ, అపుడు పళ్ళులేని అవ్వమూతి చూడ చాలా ముచ్చటగా వుంటుంది. నవ్వుతూనే అవ్వ విజయతో అంది- "నీకు తెలుసునా బిజయా! ఈ ముండ ఒకసారి బాగల్పూర్ ఆవిడను ఎట్లా ఆటలాడించిందో!"

గంగాపూర్ అవ్వ నెమ్మదిగా చెప్పటం మొదలెట్టింది- "ఆ సంవత్సరం భాద్రపద మాసంలో భాగల్పూర్ ఆవిడ వచ్చింది. ఒకరోజు ఆమె తనపెట్టెలో నుంచి బట్టలు తీసి ఎండలో ఆరేయమని ఇచ్చింది. బట్టలను ఆరవేస్తూ ఈ తుంటరి చుర్మునియా గంతులేస్తూ అరవడం మొదలెట్టింది.- ఆహా. ఇది చూ

దండయ్యో! జర్మనీలో తయారయింది, రబ్బరు మాదిరి సాగేది, పుట్ట చెండు మాదిరిది, దీని ముక్కుచూడండి," అంటూ. నేను అటు చూస్తే ఆ పిల్ల ఒక వెదురు కర్రకు భాగల్ పూర్ ఆవిడ బ్రాని తగిలించి ఎగురుతూ గంతులేస్తూ కన పడింది. అక్కడే ప్రక్కన వాకిట ముందర మగవాళ్ళు కూర్చుని ఏదో మాట్లాడు కుంటున్నారు. భాగల్ పూర్ ఆవిడ మండిపడి కర్రతీసుకొని చుర్మునియా వెంట పడింది. గంగాపూర్ అవ్వతోపాటు విజయకూడ కడుపుబ్బ నవ్వుకుంది.

చుర్మునియా ఎక్కడి నుంచో ఒకపెద్ద బకెట్ తీసుకొచ్చింది.

ఎనిమిది గంటల రైలుకి టయం కాకముందే క్యాబేజి చేనుకు నీళ్ళు పెట్టా రు. బకెట్, చెంబు, తాడు తీసుకొని చుర్మునియాతో పాటు విజయ పొలంలో నుంచి బయటికి వచ్చింది. చుర్మునియా తన ఉంగరాల జుట్టులో వ్రేళ్ళు దూర్చుకొని అడిగింది, "బిజయా దీదీ, రేపు వెళ్ళి పోతున్నావా, నిజంగానే? పో దీదీ! పోవద్దు విజయా దీదీ."

చుర్మునియా మాట విని విజయ ఒక నిట్టూర్పు విడిచింది. పెద్దింటోళ్ళ హవేలీ; మొదట్లో ఇక్కడ అది ఒక్కటే హవేలీ.

తొలుత పెద్దింటోళ్ళు అంటూనే అందరికీ తెలిసిపోయేది. అది రాణీడీహ లోని చౌధరీల ఇల్లు అని. ఇప్పుడు హవేలీ అనే పదాన్ని జోడించాలి ఎందువ ల్లంటే ఇప్పుడు రాణీడీహలో పెద్దిళ్ళు ఒకటి కాదు మరెన్నో వెలిశాయి.

ఈ పెద్దింటి హవేలీకి ఒకానొక్క వారసుడు శ్రీరామేశ్వర్ చౌదరీ, ఎమ్. ఎల్. ఎ. గత కొద్ది ఏళ్ళ నుంచి కుటుంబ సమేతంగా పాట్నాలో వుంటూవున్నారు. దూరపు బంధువైన వాళ్ళ పిన్నమ్మ అంటే ఆవిడే గంగా పూర్ అవ్వ ఆపెద్దింటి హవేలీలో కాపలా దారు మాదిరి వుంటుంది. సీప్రసాద్ అన్న రైతు వ్యవసాయం పనులు చూచుకొంటాడు. అందరూ అతన్ని 'మనీజర్' అని పిలుస్తారు. ఎగతా ళిగా పెట్టినపేరే అతనికి స్థిరస్థాయిగా నిలచిపోయింది- 'సీప్రసాద్ మనీజర్.'

రామేశ్వర్ బాబు కౌలుకిచ్చిన భూములను ప్రతి ఏడూ అమ్ముతూ వచ్చా డు. స్వంతగా సేద్యం చేసుకునే భూములు, కుంట, తోటలు మాత్రం మిగి లిపోయాయి. వాటిని కూడా ఏదో ఒకనాడు మంచి ఆసామి వస్తే అమ్మేసి చేతులు దులుపుకోవాలని అనుకుంటున్నాడు. చేతులు దులుపుకోవడం అంటే, రాణీడీహ నుంచి; తన జన్మభూమినుంచి విముక్తి. ఇక ఆ ఊరినుండి సంబంధం తెంచుకో వటం! ఏమి చేస్తాడు, పాపం అతను మాత్రం?

గత పదిహేను సంవత్సరాలుగా రామేశ్వర్ బాబు పాట్నాలో ఉంటున్నాడు-

పాట్నా ఎమ్.ఎల్.ఎ. క్వార్టర్స్‌లో. ఇప్పుడేమో రాజేంద్ర నగర్‌లో ఇల్లుకట్టిస్తున్నాడు. బహుశా ఈ సారి పార్టీ టికెట్టు దొరకకపోవచ్చు. అలా జరిగినప్పటికీ, ఇక మరలా తిరిగి రాణీడీహ వచ్చే ప్రసక్తిలేదు. ఇక అతను పల్లెలో వుండలేడు!.

అన్నగారు కీర్తిశేషులు సిద్ధేశ్వర్ చౌదరి విధవరాలు, ఈ మధ్యనే చనిపోయింది. అన్నగారి ఒకే ఒక కూతురు విజయ గత ఏడెనిమిది సంవత్సరాలుగా అమ్మతోపాటు పెద్దమామగారి ఇంట్లో వుంటూ వచ్చింది. ఇప్పుడు ఆమె వయస్సు పదహారేళ్లు పూర్తవుతున్నాయి. విజయ చిన్నాన్నకు విజయ పెద్దమామ ఈసారి గట్టిగా జాబు వ్రాశాడు- "మీ అన్నగారు ఎంతో కష్టపడి సంపాదించిన ఆస్తిని ఓ పక్క అనుభవిస్తూనే ఆ అన్నగారి భార్యను అష్టకష్టాలు పెట్టారు...ఆమేమో స్వర్గస్తురాలై కష్టాలనుండి గట్టెక్కింది. కాని ఆమె చావుతో సమస్య తీరిపోలేదు. ఇంకా మీరు ఒక పని చేయాల్సివుంది. విజయ ఇప్పుడు పెళ్ళీఈడుకువచ్చింది...ఆమెను ఒక ఇంటిదాన్ని చేసే భారం మీమీద ఉంది. మీరు ఈ ఉత్తరానికి ప్రతిస్పందించక పోతే నేను గత్యంతరం లేక మీ పార్టీ ప్రధానికి ఈ విషయం తెలియ పరచాల్సివస్తుంది."

ఈ ఏడు దుర్గాపూజ సెలవుల్లో రామేశ్వర్ బాబు భార్య (భాగల్‌పూర్ ఆవిడ)ను వెంట తీసుకొని వచ్చారు. నారాయణ గంజ్‌కి మనిషిని పంపి విజయను పిలిపించుకున్నాడు. కాళీ పూజ తర్వాత విజయ పాట్నా తిరిగి వెళ్ళేటప్పుడు గంగాపూర్ ఆవిడ విజయను పదిరోజులు తనవద్దనే వుండి కూరగాయమొక్కలను నాటి పొమ్మంది. ఎటూ భాగల్‌పూర్ ఆవిడ వరికోతలప్పుడు ఒకనెల తర్వాత వస్తుంది. ఆవిడతో పాటు వెళ్ళిపోదువుగాని అని అన్నది.

రామేశ్వర్ బాబుకు సలహా నచ్చింది. సరే వరికోతల తర్వాత విజయ పాట్నాకు రావచ్చు అన్నాడు.

కాని మొన్ననే జాబు వచ్చింది- "వరికోతలప్పుడు ఆమెకు రావడానికి వీలు పడదని! ఇల్లు కట్టిస్తున్నారు కాబట్టి రాత్రింబవళ్ళు కూలీలపైన తనిఖీ అవసరంగా వుంది. వచ్చే వారం సీలింగ్ పని ప్రారంభమవుతుంది. కాబట్టి 'శ్యామా-చకవా' ఉత్సవం తర్వాత విజయ చిన్నమామతో పాటు పాట్నారావచ్చు" అని.

ఈవేళ సాయంత్రానికి విజయ చిన్నమామ నారాయణగంజ్ నుంచి వస్తారు. రేపు విజయ పాట్నా వెళ్ళిపోతుంది.

చుర్మునియా తన ఇంట్లో ఒకే ఒక పని చేస్తుంది. సాయంత్రం 'పూరబీ టోల'లోని సెట్టి గారి కొట్టునుంచి సరుకులు తెచ్చివ్వడం- మొక్క జొన్నలు, శన

గలు, ఉప్పు, నూనె, బీడీలు. సరుకులు లెక్కకట్టడంలో ఎప్పుడూ ఒక్కపైసా కూడా పొరపాటుచేయదు. తన తాత అవ్వల కంటే లెక్క చేయటంలో ఘటికురాలు. సెట్టి కొట్టువద్ద జరిగే బాతాఖానీల్లో పాల్గొంటూ చుర్మునియా వాళ్ళ మాటల్లో శృతి కలుపుతూ అంది, "ఇక బిజియా దీదీ కూడా వెళ్ళి పోతుంది, రేపే వెళ్ళి పోతుందట."

"మరి, గంగాపూర్ ఆవిడో?"

"ఆమె! ఆమె వెళ్ళిపోతే ఇక్కడ ఈమామిడి తోటకు కాపలా ఎవరుకాస్తారు? రాత్రంతా మేలుకొని కాపలా కాస్తుంది కదా!"

చుర్మునియా మాటలు విని అందరూ నవ్వుకున్నారు- "నిన్ను వెంట తీసుకొని పోవటం లేదా, మీ బిజియా దీది?" అని రామ్ఫల్ ఇంటి ఆవిడ అడిగింది.

"ఛీపో! నేను ఎందుకు పోతాను?"

సచ్చిదా అయిదుపైసలకు కర్ప్యూరం కొనేదానికి వచ్చాడు. విజయ రేపే వెళ్ళిపోతుందని విని ఆశ్చర్యచకితుడయ్యాడు.

పాడుపడ్డ హింగ నామతంలోని దిమ్మెపైన కూర్చుని కంజీరా వాయిస్తూ సద్గురిని నామం జపించే బాబా బైరాగి సూరత్ దాస్ అందుకున్నాడు, "అందరూపోతారు ఒకరు తర్వాత ఒకరు. అందరూ పోయేవాళ్ళే కదా!" అని.

ఊరిలో గయ్యాళి గంపగా పేరుబడ్డ బంతా అమ్మతనగొంతుకలుపుతూ అంది, "ఈ బాబా నోటినుండి అపశకునపుమాటలు తప్ప మరే మాటలు రావు. ఎప్పుడూ ఇవే పాడుమాటలు! అందరూ పోయే వాళ్ళే! అని. ఈ బాబా గారు ఈ మాటలు అన్నప్పటి నుంచి యువకులందరూ ఊరు వదలి వెళ్ళిపోతున్నారు. పట్టణాలలో ఏముందో మరి? ఒకసారి ఊరు వదలి పట్నంలోని నీళ్ళు తాగితే సరి, మళ్లీ వీళ్లకు ఊరి నీళ్ళు ఒంటబట్టవు. గోబిన్ ఊరువదలి పోయాడు: తన వెంట పంచగౌడియాను, మగువాను తీసుకొని! వీళ్ళ తర్వాత 'బామన్ టోలా' లోని ఇద్దరు ముసలివాళ్ళు: అరజున్ మిసర్, గేందార్ఝూ వెళ్ళి పోయారు..."

బంతా అమ్మ పూర్తిచేయకముందే రామఫల్ అమ్మ మొదలెట్టింది, "పిన్నీ, అరజున్ మిసర్, గేందార్ఝూ గురించి చెబుతున్నావు! నేను తెలియక అడుగుతాను - వాళ్ళిద్దరూ ఊళ్ళో వుంటూ ఏమిచేసేవాళ్ళు చెప్పు! బేకారుగా వుంటూ, ఆ ఇంటి గడపముందు ఈ ఇంటి గడపముందు కూర్చుని తీరిగ్గా పైనీ బొక్కలాడటం, పళ్ళు ఇకిలించుకుంటూ అన్ని చోట్లా అడుక్కు తినటం తప్ప! ఇప్పు

డేమో పట్నంలోని హోగల్‌లో వంట చేస్తున్నారట. గత నెలలో అరజున్ మిసర్ ఒకసారి ఊరికొచ్చాడు. అతన్ని చూడలేదా! అడపంలో పాన్ డబ్బా, సురతీ, అతని బొజ్జా, అతనూను."

"అయితే నీవు కూడా రామఫల్‌ను పంపరాదా పట్నానికి? బాగా బొజ్జవ స్తుంది."

"అరే, అదికాదు. అందరూ పట్నం వెళ్ళి అక్కడ రిక్షాలాగుతూ బతుకుతు న్నారు, అంటే! వాళ్ళ ఖర్మ గాకపోతే!" మధ్యలో ఎవరో అన్నారు.

"ఏం! రిక్షాలాగటం తప్పుపనా? రోజూ అయిదు రూపాయల సంపాదన మరెక్కడ దొరుకుతుంది చెప్పండి" ఎవరో సమాధానంగా చెప్పారు. ఎవరబ్బా ఈ సమాధానం చెప్పింది అని అందరూ తిరిగి చూస్తే, అయిదు పైసలకు కర్పూరం కొనటానికి కైవర్తిటోలీ నుంచి వచ్చిన సచ్చిదా కనిపించాడు, 'దీంట్లో తప్పేముంది చెప్పండి' అని అడుగుతూ.

ఎవరు ఏమీ జవాబివ్వలేదు.

సచ్చిదా వెళ్ళిపోయిన తర్వాత చుర్మునియా పెదాలు కదుపుతూ అంది, "ఆఁ ఆఁ. ఈయన కూడా రెక్కలు ఆడిస్తావున్నాడన్నమాట. రేపో మాపో ఈయన తుర్రుమని ఎగిరి పోతాడు."

హా.హా.హా...ఇంతవరకు ఆగియున్న నవ్వు ఒక్కసారిగా పెళ్ళుబికింది. చాలా సేపటి వరకూ అందరూ నవ్వుతూ వుండిపోయారు. చూర్మునియా అవ్వ కేక వేసింది. "ఓ, చుర్మునియా, ఎక్కడున్నావే! తొందరగా తగలడు."

రాత్రుళ్ళు చుర్మునియా పెద్దింటోళ్ళ హవేలీలో గంగాపూర్ అవ్వతో పాటు నిద్రపోతుంది. అవ్వ ఉదయం, సాయంత్రం టీ తాగుతుంది. చుర్మునియాకు కూడా టీ తాగే అలవాటయ్యింది. ఈ వేళ అదివారం. ఈ రాత్రికి అవ్వ రెండు మార్లు టీ తాగుతుంది.

కానీ ఈ వేళ ఆవిడకు టీ తాగాలని లేదు. చుర్మునియా కిమ్మనకుండా తన బొంతలో కాళ్ళు ముడుచుకొని పడుకొని కెట్లీలో మసులుతున్న నీళ్ళ శబ్దా లను వింటూవుంది. అవ్వ ఎగతాళిగా అంది, "ఏమే, చుర్మునియా! ఎవరి విర హవేదనతో నీవు ఈ వేళ ఇలా పడుకొని ఉన్నావే?"

"నీవనే ఈ పాడుమాటలు నాకు బొత్తిగా సరిపడవు" చుర్మునియా అవ్వ మీద మండిపడింది.

"ఓయ్, మంచి మాటల ముత్యాల మూట! నీకేమైందే ఈ వేళ? చుర్ము

నియా ఏమని జవాబు చెబుతుంది!"

ఒకళ్ళ తర్వాత ఒకరు అందరూ ఊరువదలి పోతున్నారు. సచ్చిదాకూడా వెళ్ళి పోతే ఇక ఊరిలో కబడ్డీలో అయిదు గురిని ఒకేసారి ఔట్ జేసి ఆటలో ఎవరు నెగ్గగలరు? ఆకాశాన్నంటే అంతపెద్ద భూతాల నేరేడు చెట్టు నెక్కి తేనె తుట్టెను ఎవరు తీసుకు రాగలరు? హోలీ పండుగకు 'గీతాలు ఎవరు పాడతారు? కుస్తీ మైదానంలో తొడలు తట్టి పహిల్వాన్‌ను ఉసికొల్పే సచ్చిదా...'

పోయిన ఏడాదినుండే హోలీ పండుగలో ఆఉత్సాహం సన్నగిల్లింది. ఏడెని మిదేళ్ల ఆచిన్న పిల్ల చుర్మునియా ఎందుకో పాపం భయపడుతూవుంది - ఏమో మరి!

చుర్మునియాకు కరుణ రసభరితమైన పాటను ఏడుస్తూ పాడాలనిపిస్తుంది. పాటలోని ఒక్కొక్క పంక్తిని జోడిస్తూ పాడటం ఈ పిల్లకు తెలుసు. నెమ్మదిగా పాడటం మొదలెట్టింది- "ఓ...రావే ఓ మాతా!"

గంగాపూర్ అవ్వమందలించింది, "అరే, ఏమైంది ఈ పిల్లకు! సాయం కాలం పూట ఏడ్వటం మొదలెట్టింది! లే!లేచి అటు చూడు బిజియా పిలుస్తున్న ట్టుంది!"

అరే! గోల్ పార్క్ అంటే ఏంటి?

పట్నంలో జరిగే వింతలు గురించి ఫులకన్ చెప్పిన మాటలు విని ఊర్లోని యువకులందరికీ ఉత్సాహం మెండు అయింది. ఫులకన్ చెప్పే మాటల్లో వాళ్ళకు ఒక వింతైన వాసన వస్తుంది. ఫులకన్ మాసిన వెంట్రుకల్లోంచి వచ్చే వాసన మాదిరి.

ఫులకన్ గప్పాలు కొడుతూ పోతున్నాడు- "రాజిందర్ నగర్? అబ్బా! దాని మాట ఎత్తకండి బాబూ! ఏంచెప్పాలలే! పేడలోంచి పురుగులు గుంపులు గుంపులుగా పుట్టుక వచ్చినట్లు రోజూ నేలను చీల్చుకొని లెక్కలేనన్ని బిల్డింగులు లేస్తాయి. ఎందుకు లేవవు? అక్కడ పనులు చేత్తో చేసేవారు వుంటే కదా! ప్రతిపనీ మిషను చేసేదాయె! కంకర సిమెంటును కలపడం మొదలుకొని ప్లాస్టరింగ్, ఫ్లోరింగ్‌పనులన్నీ మిషన్లే చేసుకుపోతాయి. క్షవరం చేయించుకోవటానికి మంగలి షాపుకు వెళ్తే మంగలి ఓ మిషన్ను మనతలవద్ద పెట్టి క్షణంలో క్షవరం చేసి పంపుతాడు...పది-పదిహేను అడుగుల తర్వాత ఓ గోల్‌పార్క్..."

"గోల్‌పార్కు అంటే ఏంటి? అన్నా!"

"గోల్‌పార్కు అంటే నేనెట్లా చెప్పాలబ్బా మీకు! దాన్ని చూస్తే గాని మీకు

తెలియదు. నోటి మాటలల్లో అన్ని రంగులను ఎలా చెప్పాలి ?...కాకి వెదుర్లతో తయారు జేసిన రంగురంగుల ఓ పెద్ద గూడు భూమిపైన అవతరించినట్లు అను కోండి! ...సాయంత్రం కాగానే పొడుగాటి మెర్క్యురీ గొట్టాలు ధగధగ మెరుస్తూ వెలిగిపోతాయి. అప్పుడు ఆ సాయంకాలాల్లో చల్ల చల్లని గాలిలో నగ్నసుందరీ మణులు...సుందరీమణులు కారు ఫిల్మ్‌స్టార్స్ తేలియాడుతూ వస్తారు అక్కడికి."

"ఫిల్మ్...అంటే ఏమిటి?"

"ఛ, పో! ఫిల్మ్‌స్టార్ అంటే కూడా తెలియదా? అరే సినిమా తారలు! పిక్చర్ ఆడేవాళ్ళురా! సినిమా వాళ్ళు."

"పిక్చరా...?"

"అబ్బా, మీతో ఏలా చావాలిరా! పిక్చర్ అంటే, సినిమా, చిత్ర పటం. సిని మాలో వస్తారే, వాళ్ళు...తెలిసిందా!"

"..సినిమా వాళ్ళు, చిత్ర పటం వాళ్లు!." అని ఫులకన్ ఏమేమో చెప్పుకు పోతాడు. ముందు ఎట్లా వున్నాడు? ఇప్పుడు ఎట్లా మారిపోయివచ్చాడురా! ఇవన్నీ వింటూ ఊళ్ళోని యువకుల్లో ఉత్సాహంపెల్లుబుకుతుంది. ఫులకన్ పాట్నాలో రిక్షాలాగుతాడు...లాగడట, డెలివరీచేస్తాడట. రిక్షా డెలివర్అట ఫులకన్.

"సరే, రిక్షా డెలివరీ ఎన్నిరోజుల్లో నేర్చుకోవచ్చు?"

"నేర్పించేవాడు మంచినేర్పరి అయితే, నేర్చుక్నొనేవాడు తెలివితేటలు కల వాడైతే మూడుదినాల్లో హేండిల్‌ను అదుపుచేసుకోవచ్చు అన్నింటికంటే ముఖ్య మైన వస్తువ్ హేండిలే!"

...ఫులకన్ కొన్ని కొన్ని మాటలకు 'వ్' తగిలిస్తాడని ఊరిలోని వాళ్ళు గమ నించారు- టికెటివ్, కాగితవ్, వస్తువ్.

ఫులకన్ తన పాకెట్‌లోంచి ఫిల్మ్‌స్టార్ ఫోటోలున్న కవరు తీశాడు, "అరే! ఇవి చూడండిరా..."

"అరే! అబ్బా!!"

"ఫిల్మ్‌స్టార్ ఫోటోలు!"

"అరే! రామ్! దారిలో నలుగురిలో ఈ మాదిరి ఈ ఆడోళ్ళులంగోటిలు కట్టు కుని తిరుగుతూ వుంటారా? ఎవరూ ఏమి అనరా?"

"అందరూ ఆఫోటోలను లాక్కొని కళ్ళుప్పగించి చూస్తున్నారు. అందరిక ళ్ళముందూ ఆసినిమా స్టార్‌లు నాట్యం చేస్తున్నట్లువుంది...రాత్రి వాళ్ళకలల్లో కూడా ఆస్టార్‌లు నాట్యాలు జేసారు. ఒకరిద్దరికైతే పిచ్చెక్కినట్లయింది."

ఊరుఖాళీ అవటం, ఊరు అంతరించిపోవటం చూచి ఈ చిన్నపిల్ల చుర్ము నియాకు కల్గినంత ఆవేదన ఈ ఊళ్ళో మరెవ్వరికీ కలగటంలేదు. ఇది గమనించిన విజయకు చాలా ఆశ్చర్యమేసింది. విజయ ఏడెనిమిది ఏళ్ళతర్వాత ఈ ఊరికి తిరిగి వచ్చింది. అయితే మాత్రం ఆవిడ ఈ ఊరిలో పుట్టి పెరిగిన పిల్లే కదా! విజయకుకూడా ఈ విషయమే తెలిసి ఏమి బాగుండటంలేదు.

పాట్నా వెళ్ళి పోవాలన్న విషయం నిశ్చయమైనప్పటి నుండి ఆమె లోలోపల కుమిలిపోతూవుంది...'రజనీగంధ' పూలమొక్కకొమ్మమాదిరి. ఆమెకు పాట్నా వెళ్ళటం ఇష్టంలేదు. ఆమె ఈ ఊళ్ళోనే వుండిపోవాలను కుంటుంది...నాన్నగారు గుర్తుకొస్తారు...అమ్మగుర్తుకొస్తుంది...ఇద్దరూ ఒకేసారి గుర్తుకు వస్తుంటారు. ఆమె ఏకాంతంలో బాధపడుతున్నప్పుడు వెనుకవైపువున్న ఆపెద్ద చింతచెట్టు, తోటలు-దొడ్లు, పశు-పక్షులు అన్నీ ఆమెకు ధైర్యం చెబుతూవుంటాయి. ఏదో ఒక అదృశ్యశక్తి ఆమెను ఓదార్చుతూ వుంటుంది. ఈ ఊరికి వస్తానే ఆమెకు తండ్రిగారు తోటలోకూర్చుని వున్నట్లు, అమ్మవంటింట్లో వంట చేస్తూవున్నట్లు వుంటుంది. కాబట్టి ఆమెకు ఎపుడూ మామగారి ఇల్లునచ్చలేదు. తన తండ్రిగారి ఈపాత ఇంట్లోనే ఆమె సుఖంగా వుండగలుగుతుంది.

"బిజయా దీదీ!"

చుర్మునియా ఈ వేళ అసలు విషయాన్ని కనిపెట్టేసింది. విజయ ఇక్కడికి వచ్చినప్పటి నుంచి రోజూ రాత్రిళ్ళు ఒంటరిగా ఏడుస్తూ వుంటుంది. ఉదయం నిద్రలేస్తూనే తడచిన దిండు కవరు మార్చుకుంటుంది.

"బిజయా దీదీ!" చుర్మునియా లేచి కూర్చుంది.

గంగాపూర్ అవ్వకు నిద్రా భంగం అయింది. పక్కకు దొర్లి చుర్మునియాను మందలించింది, "నిద్రపోనీ, ఎందుకు లేపుతున్నావే బిజయాను?"

విజయ ఓరకంటితో చుర్మునియా వైపు చూచింది. ఆ పిల్ల నిద్రపోతున్న అవ్వను నీకేమి? రెండు మార్లు టీ తాగేవు. పాపం బిజయాదీదీ నిన్నటినుండి పచ్చి మంచి నీళ్ళయినా ముట్టలేదు. అన్నట్లు ఎగతాళి చేసింది.

చుర్మునియా లేచి బయటకు వెళ్ళింది. ఆకాశంలో నక్షత్రాలను చూచింది. 'అరే! ఇంకా రాత్రి చాలా వుందే' అంటూ గొణుక్కుంటూ లోనికి వచ్చింది. ఇదంతా విజయ గమనిస్తూనేవుంది.

చుర్మునియా బిజయా దీదీ కాళ్ళవద్ద కూర్చుంది. నెమ్మది నెమ్మదిగా ఆమె కాళ్ళను వత్త సాగింది.

ఏమిటి, ఈ పిల్ల! ఈ పిల్లనన్ను వదిలేటట్లు లేదు! కాళ్ళు ముడుచుకుంటూ అంది, "ఏమిటిది? ఏం చేస్తున్నావు నీవు?"

"నీవు భలేదానివే! మేల్కొనే వున్నావుగా! మరి ఎందుకు మాట్లాడలేదు" చుర్మునియా నవ్వుతూ అంది.

"నీకు నిద్ర రాలేదా?"

చుర్మునియా గంగాపూర్ అవ్వ వైపు చూపుతూ, 'చూడు, అవ్వ ఏలా గురక పెడుతూ వుందో రంపంతో ఎవరో చెట్టును కోస్తు వున్నట్లు' అని సైగజేసి అంది.

విజయకు నవ్వువచ్చింది. ఆ పిల్లను బెదిరిస్తూ అంది "ఏం పిల్లా! అబద్ధం ఎందుకు చెబుతావే! పాపం ఈ వేళ అవ్వగురక పెట్టనే లేదు."

"నీవు మేల్కొని వుండకపోతే నీ కెట్లా తెలిసింది చెప్పు, అవ్వ గురకపెట్టిందీ లేందీ" చుర్మునియా నవ్వుతూ మరలా అంది, "నాకన్నీ తెలుసులే, దీదీ! చూస్తూవుంటే, సచ్చిదా కూడా పట్నానికి పారి పోయేటట్లువుంది...ఆ, ఆ, సరేలే, అందరూ వెళ్ళిపొండి పట్నానికి అవున్లే ఈ ఊళ్ళో ఏముందని? పట్నంలో అయితే అన్నీ వున్నాయి; బయస్కోప్, సర్కస్, సినేమా..."

"నిద్రపోనిస్తావా, లేదా నన్ను?"

"ఆహా!"

"ఎందుకని?"

"రేపు రాత్రి నుండి నీవు వుండవుగదా ఇక్కడ. అందుకని ఈ రాత్రంతా నిన్ను సతాయిస్తాను."

కొంత సేపటి వరకు వాళ్ళ మధ్య మౌనం ఆవరించింది. ఇద్దరూ నిశ్శబ్దంగా ఆలోచనలో పడ్డారు.

'బిజయా దీదీ' అంటూ చుర్మునియా ఆమెను కరచుకొని పండుకొంది.

"ఏమే?"

"పట్నం వాడిని పెళ్ళాడొద్దు."

విజయకు పట్టలేనంత నవ్వువచ్చింది. కాని బలవంతంగా నవ్వును ఆపుకొని అడిగింది, "ఎందుకే? పట్నం వాళ్లు నీకేమి అపచారం చేశారే?"

"నాకెవరైనా ఎందుకు అపచారం చేస్తారు?"

"అయితే ఎవరికి అపచారం చేశారని!"

"...నీకు! నీవు పెళ్ళే చేసుకోవద్దు. తర్వాత వాళ్ళు నిన్ను మరెప్పుడూ ఈ ఊరికి రానీయ్యరు."

"ఎందుకు రానీయరు?"

"దీదీ, ఊర్లో వాళ్లే ఊరువదలి పట్నం చేరుకుంటూంటే, పట్నం వాళ్ళు తమ పెళ్ళాలను ఊళ్ళోకి రానిస్తారా!"

"అయితే నన్ను ఖైదు చేసి పెడతారంటావా?"

"అవును మరి, రూములో ఖైదు చేసి వుంచుతారు."

గంగాపూర్ అవ్వ లేచి కూర్చుని జపం చేయటంలో నిమగ్నురాలైంది. ఇద్దరూ కిమ్మనకుండా వుండిపోయారు.

గంగాపూర్ అవ్వ బయటికి వెళ్ళి పోయింది. చుర్మునియా మరలా నిద్రలోకి జారుకుంది. విజయ ఆ పిల్ల ఉంగరాల జుత్తులో వ్రేళ్ళుదూర్చి నిమురుతూ కూర్చుంది.

పొద్దున్నే లేచి బయటికి వస్తూనే చుర్మునియా బిగ్గరగా కేకేసింది, "చూడు, అటు చూడు బిజయా దీది, అదుగో నీలకంఠ పక్షి."

గోఢీటోలా నుంచి చుర్మునియా బ్రతికి వున్న ఒక చేపను తెచ్చింది. ఓ మట్టి పాత్రలో నీళ్ళు పోసి దాంట్లో చేపను వుంచింది. తర్వాత ఉత్తర దిశనున్న బాబా జీన్ పీర్ దర్గానుండి మట్టి తేవడానికి వెళ్ళింది. పొద్దుటినుంచే చుర్మునియా ఎవరితో మాట్లాడకుండానే తనపనిలో లీనమై పోయింది. విజయ మామగారు ఆపిల్లను గేలిచేయటానికి ప్రయత్నించారు. విజయ కూడా చాలా మార్లు ఎగతాళి చేసింది. కాని ఆపిల్ల ఎవరి తోనూ ఏమీ మాట్లాడలేదు. గంగాపూర్ అవ్వ తిట్లకు కూడా మూతి ముడుచుకొని బదులివ్వటంలేదు...నిన్నేమో ఇలా అంది..."దీదీ, నీవు వెళ్ళిపోతే, రేపటి నుంచి అవ్వకూడా తిట్లు తిట్టదు. రాత్రింబవళ్ళు మూతిముడుచుకొని కూర్చుంటుంది. కళ్ళు మూసుకొని జపం చేసుకుంటూ వుంటుంది."

మధ్యాహ్నం విజయ మామగారు భోజనానికి కూర్చున్నప్పుడు చుర్మునియా నోరు విప్పింది, "మామా! బిజియా దీదీని కూడా మీ ముందర కూర్చొన బెట్టుకొని అన్నం తినమని చెప్పండి...నిన్నటి నుంచి, పాపం ఏమీ...తినటంలేదు."

ఈ మాట పూర్తి చేసిందో లేదో, కట్టతెంచుకొని వస్తున్నట్లు కన్నీళ్ళు ప్రవహించాయి. ఎక్కి ఎక్కి ఏడుస్తూ..."మా బిజయా దీదీ ఈ ఊరు నుంచి ఆకలి దప్పులతో వెళ్ళి పోతాది" అంది.

చుర్మునియా ఎఱ్ఱ బడ్డ కళ్ళలోంచి ప్రవాహం మాదిరి ఉప్పొంగి వస్తున్న కళ్ళనీళ్ళను చూచి విజయ వణికి పోయింది...అరే ఏమిటి ఈ పిల్ల...ఏడుస్తూ

ఏడుస్తూ ప్రాణాలు వదిలేటట్లు వుందే! విజయ బొంగురు పోయిన గొంతుకతో చుర్మునియాను ఓదార్చే ప్రయత్నం చేసింది - "లే, పదముందు స్నానం చేస్తువుగానీ పద. నీ స్నానం అయిన తర్వాత నేనూ నీతో పాటు కూర్చుని అన్నం తింటాను, లేమరి."

విజయ మామగారు ఇదంతా చూస్తూ విస్తుపోయారు. ఇంతవరకు విజయ ఏ అబ్బాయిని గానీ, అమ్మాయిని గానీ ఈ విధంగా ప్రేమతో ఓదార్చడం అతను చూడలేదు. అతను తొందర తొందరగా భోజనం ముగించుకొని లేచి బయటికి వెళ్ళిపోయాడు.

విజయ చుర్మునియాకు స్నానం చేయించింది. గంగా పూర్ అవ్వ మాత్రం బయట నిల్చుని తిట్ల వర్షం కురిపిస్తూనే వుంది. ఈ వేళ చుర్మునియా అవ్వ తిట్లకు ఏడ్చుతూవుంది...రేపటి నుంచి అవ్వతిట్టడం కూడా మానుకొంటుంది.

అన్నం తినే టప్పుడు విజయ అంది, 'చూడు, కడుపు నిండా తిను.'

"నేనూ, ఇదే నీతో అంటూ వుంది" చుర్మునియా బదులిచ్చింది.

ఇద్దరూ నవ్వారు. నవ్వుతూ నవ్వుతూ ఏడ్వటం మొదలెట్టారు.

తొందరగా కానివ్వండి అన్నట్టుబయటనుంచి మామ అన్నారు - టైం మూడవుతుంది! అంటే ఇక రెండు గంటలు మాత్రమే మిగిలాయి. ఆరున్నర గంటల బండి ఎక్కే దానికి ఇంటి నుండి అయిదు గంటలకే బయలుదేరి వెళ్ళాలన్నమాట,

'యమరాజు!' అంది చుర్మునియా.

"విజయ కడుపుబ్బ నవ్వింది...మనసులోని మాట కక్కేసింది చుర్మునియా,"

చూస్తూ వుండగానే సూర్యాస్తమయం అయింది. ఇక ఒక గంటమిగిలింది.

సామాన్లన్నీ సర్దుకొని వాటిని బయటకు పంపి విజయ చుర్మునియా ను పూజగదిలోనికి పిలిచింది. గంగాపూర్  అవ్వ వంట ఇంట్లో పిండి వంటలు చేస్తూవుంది. చుర్మునియా పూజగదిలోనికి వెళ్ళింది.

"చూడు, చుర్మున్, ఈ గదిలో రోజూ వూడ్చి, అలికి సాయంత్రం పూట దీపం వెలిగించటం మరచి పోకు, తెలిసిందా!"

"నీవేమి చెప్పనక్కర్లేదులే, నేను ఇంటిలోని దేవీ, దేవతలనూ ఊళ్లోని దేవుడూ, జీన్ పీర్ దర్గాని రోజూ శుభ్రం చేస్తాను. నేను వీళ్లకు కూడా మొక్కుకున్నాను" - ఓ తల్లీ, పార్వతమ్మా! ఓ జీన్‌పీర్ బాబా, మాబిజయాదీదీని ఎవరూ పట్నంలో ఖైదు చేయకుండా చూచుకోండి...నీవు తిరిగి వచ్చే రోజు కొరకు ఎదురుచూస్తూ

ఉంటాను. నీవు తిరిగి వచ్చిన నాడు మంటపంలో నాట్యం చేస్తాను...నెత్తిన పూలగంప బెట్టుకొని, నీవు తిరిగి వస్తే ఊళ్ళోని వాళ్ళంతాతిరిగి వస్తారు - మనోళ్లు, తనోళ్ళు అందరూనూ! నీవు తిరిగి రాక పోతే, మరి ఊ ఊర్లో ఏముందని చెప్పు! అవున్నది కూడా ఒక రోజు మాయమౌతుందిలే. ఆఖరికి ఈ ఊళ్ళో మొండి గోడలే నిలుస్తాయి. ఊరు పేరుతో."

"వద్దు, చుర్మున్ అలా మాట్లాడకు."

"అయితే నీవు ఒట్టేసుకో! నాతలపైన చేయి పెట్టి ప్రమాణం చెయ్యి..."

చుర్మునియా కళ్ళార్పకుండా విజయవైపు చూస్తూ వుండి పోయింది. విజయ కూడా ఆ పిల్ల కళ్ళల్లో కళ్ళుపెట్టి చూస్తూవుంది. "చుర్మున్, నేను పట్నంలో వుండలేను, నేను తిరిగి వస్తాను. ఇక్కడే బతుకుతాను ఇక్కడే చస్తాను" అంది.

"వద్దు, వద్దు అలా అనద్దు వెళ్ళేటప్పుడు ఈ అపశకునపు మాటలు అనొద్దు... నీకు తెలుసా బిజయాదీదీ ; నాకు ఏలా అనిపిస్తుందో - "నీవు నాకూతురివైనట్టూ, నేను మీ అమ్మ అయినట్టు...నీవు నన్ను అంటే మీ అమ్మను వదిలి శాశ్వతంగా వెళ్ళిపోతున్నట్టూ..."

"విజయ తబ్బిబ్బైపోయింది. ఆమె చుర్మునియా మొహంలోని మార్పుల్ని గమనించింది. తర్వాత "అవును, నీవు మా అమ్మవు! నీవే మా అమ్మవు!" అని అన్నది.

చుర్మునియాకు అంతులేని ఆనందం కల్గింది. "బిజయా దీదీ, మనసు దిట్ట పరుచుకో! ఏడవవద్దు...ధైర్యంగా వుండు...నాతప్పొప్పులేమన్నా వుంటే సరిదిద్దుకో...సరే" అంటూ ఆమె కాళ్ళకు నమస్కరించింది.

ఎడ్ల బళ్ళు బయలుదేరాయి. ఇంటివాకిలివద్ద గంగా పూర్ అవ్వతో బాటు నిల్చుని చుర్మున్ వాటిని కన్నార్పకుండా చూస్తూ వుండిపోయింది.

విజయ వ్రేళ్లపైన లెక్కపెట్టేది...పదకొండు నెలలు! పదకొండు మూప్పైలు మూడు వందలా ముప్పై...!

చుర్మునియా చెప్పింది నిజమైంది. సచ్చిదా కూడా పట్నం చేరాడు. ఒక ప్రైవేట్ కంపెనీలో దర్బాన్ (కాపలాదారు) అయ్యాడు. ఊరినుంచి పట్నానికి ఎవరు వచ్చినా విజయ మొట్టమొదట చుర్మునియాని గురించి వాకబు చేస్తుంది. తర్వాత అంటుంది - ఊరు వదలి ఎందుకు వచ్చావు అని. చుర్మునియా గురించి విజయ వాకబుచేస్తే సచ్చిదా జవాబిచ్చాడు, "చుర్మునియా పదహారణాల భక్తు

రాలిగా తయారైంది. తెల్లవారు ఝామునే రోజూ లేచి స్నానం చేసి శివుని గుడికి పోతుంది...ఆపిల్లకు ఏదో దేవుడు ఆవరించి నాడని అందరూ అంటారు."

పెళ్ళికి నిశ్చితార్థం అయిన రోజున విజయ గుండె జోరుగా కొట్టుకోసాగింది. ఆమెకు చుర్మునియా అన్న మాటలు మనసులో ప్రతిధ్వనించాయి.

ఆ పిల్ల చెప్పింది నిజం. చుర్మునియాని ఏదేవుడో ఆవేశించాడు. పెళ్ళి తర్వాత ఐదునెలలు కూడా సుఖంగా గడపలేదు. విజయ మరలా వ్రేళ్ళతో లెక్కలు మొదలు పెట్టింది.

"...పెళ్ళికి ముందు తన వూరిలో విజయకి ఎవరో అబ్బాయితో ప్రేమ సంబంధం వుండేదని, ఇప్పుడు అతని విరహంతోనే సగం పిచ్చిదైపోయిందని" విజయ భర్త ప్రచారం చేస్తూ దాన్ని నిరూపించే ప్రయత్నంలో వున్నాడు.

..."విజయ చిన్నాన్నకు వకీలు నోటీసు ఇప్పించాడు - అతను చేసిన మోసానికి అతని పైన కేసు ఎందుకు పెట్టరాదని!"

...విజయ భర్త విజయ చిన్నాన్న నుండి నష్ట పరిహారం రూపంగా అయిదు వేల రూపాయలు వసూలు చేసుకోవాలను కుంటున్నాడు...పాపం విజయకు ఈ విషయాలేవి తెలియవు. ఏమి జరుగుతున్నదో తెలుసుకోవాలని కూడా ఆమెకు లేదు. నిత్యం వేళ్ళ మీద లెక్కవేస్తూనే వుంటుంది.

హింగన్ మఠంలోని సూరత్ దాస్ బాబాతో చుర్మునియా విజయకు ఓ పోస్టు కార్డు రాయించింది. ఎన్నో పోస్టాపీసులను చుట్టి చుట్టి ఆ పోస్టుకార్డు నిన్ననే విజయ భర్త చేతి కందింది. "బిజయా దీదీ, నీవు ఎప్పుడు వస్తావు? ఇక రావు కదా!" దీని తర్వాత సూరత్ దాస్ బాబా తన తరఫు నుంచి ఈ వాక్యాలు జోడించాడు, "నెలరోజుల నుంచి చుర్మునియా మంచ మెక్కింది...రాత్రిం బవళ్ళు నీ పేరే స్మరిస్తూ..."

చుర్మునియా జబ్బుపడ్డ విషయం తెలిసి విజయ వ్యాకులత చెందుతూ వుందే కానీ భర్తకు కూడా చుర్మునియా ఎవరైంది వివరంగా చెప్పలేక పోయింది. కానీ ఒకటే రాగం ఆలాపించ సాగింది - 'నేను ఈ రోజే మా ఊరికి పోవాలి. ఇప్పుడే, ఈక్షణమే.'

అప్పుడు ఆమెను ఇంట్లో పెట్టి బయటి నుంచి వాకిలి గొళ్ళెం వేశారు. కానీ విజయ ఈ దఫా అరవటం గానీ, కేకలు వేయటం గానీ, ఏడ్వటం గానీ, వస్తువులు విరజిమ్మటంగానీ, తలుపులు బాదటం గానీ చేయలేదు. దీనురాలై అతి వినయంగా వేడు కోవటం మొదలెట్టింది - "నేను మీ కాళ్ళు పట్టు కొంటాను.

మీరు ఏమి చేయమన్నా చేస్తాను...నన్ను ఒక్కసారి మీ వెంట మా ఊరికి తీసుకె ళ్ళండి. నేను ఒక్కసారి ఆ అభాగ్యురాల్ని చూస్తాను చావనియ్, బతకనియ్ వెంటనే తిరిగి వస్తాను మీతోనే..."

"ఇంతకూ ఎవరూ ఈ చుర్మునియా?"

"మా ఊళ్లో ఓ పొరుగింటి అమ్మాయి."

"కానీ నీకు పుట్టిన పిల్ల మాదిరి తహతహ లాడి పోతున్నావే?"

"అవును అది మా అమ్మ, అమ్మ..."

"నన్ను మూర్ఖుడి కింద జమకట్టకు."

రోజు మాదిరి గానే ఆవేళ విజయ వున్నట్లుండి మౌనం వహించింది. కళ్ళు మూసుకొంది. కళ్ళు మూసుకొనే తన ఊరు రాణీడీహకు పారిపోయింది. ఇక ఎవరే మన్నా అననీ, కొట్టనీ, నరకనీ - గంటల కొద్దీ ఊళ్ళోనే పడి వుంటుంది... ఆమెకు దూరం నుంచే అన్నీ అగుపిస్తున్నాయి - ఊరిలోని ఆ పాత చింత చెట్టు అదిగో అది జీన్‌పీర్‌దర్గా...అదో అక్కడ చుర్మునియా. రాణీడీహ ఎత్తైయిన భూమి... ఎర్రనేల పొలంలో కుంకుమ - అక్షింతలు చల్లినట్లుగా వుంది. వేల కొలది పిచ్చు కలు...గోరువంకలు సూర్యుడు తొలికిరణాలు ప్రసరించక ముందే, పొలం మధ్యలో కిచ-కిచ మంటున్నాయి. నిజంగానే చుర్మునియా పిట్ట అయిందా? అరే కాటుక పిట్ట అయి ఎగిరి వచ్చిందా! విజయ అరచేతిలో ఆ చిన్నముద్దు ముద్దుగా వున్న పిట్టవచ్చి వాలింది...చుర్మున్...ఓచుర్మున్ - అమ్మా...!

...డాక్టరు సూది ఎక్కించాడో లేక మరెవరైనా కత్తితో పొడిచారో! ఎవరైనా కొట్టనీ, నరకనీ, విజయ తన ఊరినుండి ఎప్పటికీ ఇక తిరిగి రాదు!

(1966)

# రూపసౌందర్యం

ఫాతిమాదీదిని మరెప్పుడైనా ఈ విధంగా చూడ గల్గు తానని నేను అనుకోలేదు. పాట్నా మార్కెట్‌ను స్వప్నలోకంగా భావించి ఆ చెప్పుల దుకాణం వద్ద వాళ్ళను చూస్తూ ఉండి పోయాను...తలపై నుండి కాళ్ళవరకు వ్రేలాడుతున్నబుర్ఖాలో ఇద్దరు స్త్రీలు, వాళ్ల వెంట బొమ్మ లాంటి అందమైన ఎనిమిది - తొమ్మిది - సంవత్సరాల ఓ అమ్మాయి. ఆ అమ్మాయి మరో సారి అడిగింది - "మీరు పాట్నా ఎప్పుడు వచ్చారని మా పిన్నమ్మ అడుగు తుంది?"

దుకాణదారుడు చిల్లరపైసలు లెఖ్ఖపెట్టు కుంటూ అన్నాడు - "ఆ అమ్మాయి అడిగేది మిమ్మల్నే."

అమ్మాయి నవ్వింది. బురఖాల్లో నుంచి కూడా కంగుమని నవ్వు వినపడిం ది. అదే చిరపరిచిత నవ్వు! అమ్మాయికి వాళ్ళ పిన్నమ్మ అన్న ఏదో మాటకు నవ్వు వచ్చింది. అమ్మాయి మరలా అంది, "మా పిన్నమ్మే నీ ఫాతిమా దీదీ."

నశ్యం కలర్ బురఖాలోంచి ఫాతిమా దీది చిరపరిచితమైన మాటలు వినప డ్డాయి. "ఢిల్లోలోనో, బొంబాయి లోనే వుంటున్నావటగా!"

"గత పది సంవత్సరాల నుంచి నేను పాట్నాలోనే వుంటున్నాను."

"అరే! చాల చిత్రంగా వుందే! పాట్నాలో వుంటూ కూడా ఎప్పుడూ కనిపిం చలేదే?"

"మరి, మీరు...?" ఇప్పటికి తేరుకున్నట్లు అని పించింది నాకు.

నన్ను మధ్యలోనే ఆపి బురఖాలోంచే ఫాతిమా దీది అడిగింది - "నా విషయం అలా వుంచు. నీవు చెప్పు పెండ్లి -గిండ్లి చేసుకున్నావా?"

నేను జంకటం చూచి ఆమె ఇలా అంది - "బాకర్ గంజ్ వీధిలో 'దానిష్ మంజిల్' నీకు తెలుసుకదా? అక్కడే వుంటున్నాను. భార్యను తీసుకొని ఒక సారి వస్తావా? రేపే రారాదూ! రేపు ఉదయం ఎనిమిది గంటలకు రా."

మాటకు అడ్డువస్తూ అమ్మాయి అంది, "రేపు ఉదయం ఎనిమిది గంటలకు హమీదా పిన్నమ్మ ఇంటికి వెళ్ళాలి కదా!"

"ఆ అవునవును...ఎల్లుండిరా."

'నమస్కారం' నానోటినుండి అనాయాసంగా వచ్చింది.

'ఆశీ ర్వాదం.'

ఫాతిమా దీదిని 'ఆదాబ్ అర్జ్' అని నేను ఎప్పుడూ అభినందించలేదు. నా నమస్కారాన్ని స్వీకరిస్తూ 'ఆశీర్వాదం' అంటుంది. కాని నేను ఇంతకు ముందె న్నడూ ఫాతిమా దీదిని బురఖాలో చూడలేదు. ఇతర పరిచితులకు కనిపించ కుండా తిరిగేటప్పుడు కూడా ఆమెను బురఖాలో చూడలేదు.

ఆ రాత్రి నాకు నిద్ర రాలేదు. కళ్ళు మూసుకుంటూనే నశ్యం కలర్ బురఖా లోని ఆకృతి నా ఎదుట నిలబడింది...బురఖా రంధ్రాలోంచి రెండు కళ్ళు! ఎంత ప్రయత్నించినా బురఖాలోంచి కాకుండా వేరుగా నేను ఫాతిమా దీదీని చూడలేక పోతున్నాను. ప్రతి సారి కోపంతో కళ్లు తెరవబడుతున్నాయి.

భర్త నిద్ర లేకుండా వ్యాకులత జెందటం, వినీ-కనీ ఏగృహిణికి అయినా సందేహం కలుగుతుంది. కాని కథ అల్లిక జేసేటప్పుడు రచయిత కారణం లేకుం డానే, ఊరకనే వ్యాకులతతో కలత చెందుతూ వుంటాడని కథా రచయిత భార్యకు తెలుసు కావున మా ఆవిడ చీకు చింత లేకుండా నిద్రపోగలుగుతుంది.

కాని ఆరాత్రి మా ఆవిడ మేల్కొని వుంది. "నేను ఎప్పుడైనా నీకు ఫాతిమా దీదిని గురించి చెప్పానా?" అని అడిగాను.

"లేదే! ఎవరు ఆ ఫాతిమా దీది?"

"ఓ కథలో ని ఫాతిమాదీది" అని నేను అటువైపు తిరిగి పండుకొన్నాను.

కథలోని ఫాతిమా దీది! నాకు ఆశ్చర్యం కలిగింది. నేను ఇంత వరకు ఫాతి మా దీదిని గురించి ఆ విడకు ఎందుకు చెప్పలేదని...లేదు. దీంట్లో ఆశ్చర్యం ఏమీ లేదు. శుద్ధశ్రోత్రియుని కూతురూ, హిందూమహా సభ సభ్యుని చెల్లెలు అయిన మా ఆవిడకు నేను కావాలనే ఫాతిమా దీదిని గురించి చెప్ప లేదు. చెబితే విని మూతి ముడు చుకొని ఏమైనా అనే స్తుందనే భయం చేత 'అబ్‌సర్డ్' అంటుందని.

'అబ్‌సర్డ్' కాదు. విచిత్రం!

ముప్పై ఆరేళ్ళ క్రితమే ఫాతిమా దీదిని అందరూ అన్నారు - 'అబ్‌నార్మల్! సెమీక్రాక్' అని.

ఇలాంటి విచిత్రమైన మహిళతో నాకు దగ్గర సంబంధం కల్గియుండటం నేను నాసౌభాగ్యంగా భావిస్తాను.

...1930 నాటి ఆ సభాకార్యక్రమం నాకు గుర్తుకొస్తుంది. స్కూల్‌కి వెనుక

వైపున ఓ పెద్దగుంపు 'ఠాకుర్ వాడి' చావడిపైన గాంధీ టోపీలు ధరించి చాలా మంది కూర్చొని వున్నారు. ఓ పది-పన్నెండేళ్ళ అమ్మాయి ఉపన్యాస మిస్తుంది. ఆ అమ్మాయి పైజామా, కుర్తా ధరించి యుండటం చూచి నాకు ఆశ్చర్యం వేసింది. సోన్‌పూర్ మౌలవీ కూతురట. ఖిలాఫత్ ఆందోళన ప్రారంభమైనప్పటి నుంచి ఆయన ముతక ఖద్దరు బట్టలు ధరిస్తారు. రాట్నం వడకుతారు. తెల్లనిపైజామా -కుర్తా వేసుకొని భుజంపైన మూడు రంగుల ఝండా వుంచుకొని నిలబడి వుంది. ఆ అమ్మాయి.

...1934 నాటి భూకంపం తర్వాత మరలా రెండవతూరి ఆ అమ్మాయిని చూడటం జరిగింది. ఈ నాలుగేళ్ళలో ఆ అమ్మాయి చాలా ఎదిగి పోయింది. గాంధీ గారు భూకంపానికి దెబ్బతిన్నప్రాంతాలను సందర్శించే దానికి వచ్చారు. సభావేదిక మీద గాంధీ గారి ప్రక్కన నిలబడి వున్న ఆ అమ్మాయిని సులభంగా గుర్తు పట్టగలిగాను...ప్రార్థనా సభలో కురాన్ 'ఆయత్‌లను చదువుతున్న మౌలవీ సాబ్‌కూతురిని అక్కడా చూచాను. రెండు సంవత్సరాలు జైలు శిక్ష అనుభవించి ఈ మధ్యనే విడుదలైవచ్చింది. గిరఫ్తార్ చేసే టప్పుడు పోలీసులచే తుల్లో బాగా దెబ్బలు తిన్నది.

...1937లో మూడవసారి ఆమెను చూశాను. అప్పుడు ఆమెను దగ్గరగా చూచే అవకాశం దొరికింది. స్కూల్ ఆవరణలోని మైదానంలో జిల్లా రాజకీయ సమ్మేళనం ఏర్పాటు చేసారు. అవి కాంగ్రెస్ పాలన నాటి రోజులు. అందువల్ల స్కూల్ లోని స్కౌట్ పిల్లలు కాంగ్రెస్ సేవాదళంలోని జీ. ఓ. సీ. గారు మౌలవీ గారి కూతుర్ని తొలిసారి ఫాతిమాదీది అని పిలిచారు. ఆ సభలో ప్రొఫెసర్ అజీమాబాది గారు ఉపన్యాసం ఇచ్చేటప్పుడు ముస్లిం లీగ్ కార్యకర్తలు గొడవచేసే దానికి ప్రయత్నించారు. ఫాతిమా దీది సభావేదికపైకి ఉరికింది. ఆమె కంఠం కంచు మాదిరి మారు మ్రోగింది. -'దేశద్రోహులారా! సిగ్గు చేటు! మీకిది తగదు!

...తర్వాత 1943లో 5 నెలలవరకు ఆమెతో నిరంతరం కలసి పని చేసాను. బెనారస్, లక్నో, అలహాబాద్, గోరఖ్‌పూర్‌లోని వీధుల్లో 'ఆజాద్ దస్తా' లోని విప్లవకారుల కార్యకలాపాల్లో పాలు పంచుకొంటూ ఫాతిమాదీదితో పాటు తిరిగాను. అప్పటి ఫాతిమా దీదిగారి రూపం ఒక్కొక్కటి నా కళ్ళ ముందు తిరగాడుతుంది...ఆమెను గిరఫ్తార్ చేసేటప్పుడు పోలీస్ సార్జంట్ ఆమెను తిట్టినప్పుడు ఆమె దాల్చిన ఉగ్రరూపం. 1947లో హిందూ-ముస్లిం అల్లర్లు సంభవించినప్పుడు ఉపద్రవకార్లతో తలపడేటప్పటి ఆమె కాంతి వంతమైన ముఖం, అవి అన్నీ ఈ

నశ్యం కలర్ బురఖాలో ఎలా రాగాయి? ఎందుకిలా అయింది?

...ఆమె మొహం మీద వున్న బురఖా గుడ్డలోని పోగుపోగును నేను తునా తునకలు చెయ్యాలను కొంటాను. నేను ఫాతిమా దీది మొహాన్ని చూడాలను కొంటాను. కాని ఆవిడ బిగ్గరగా అరచి తన రెండు చేతులు ముఖానికి అడ్డుగా పెట్టుకుంటుంది, "వద్దు, వద్దు! ఓ...అజీత్...నా ముఖం చూడవద్దు."

కలకరిగి పోయిన తర్వాత నేను చాలా సేపటివరకు ఊరకే వుండిపోతాను. ఆల్ ఇండియా రేడియోనుండి 'సిగినేచర్ ట్యూన్' ప్రారంభమైంది. ఇంతవరకు ఆకాశవాణి నుండి వెలువడే 'సిగ్నేచర్ ట్యూన్' ను మార్పించాలంటూ ఆందోళన ఎందుకు మొదలవలేదు అన్న ఊహ నామనసులో మెదలింది. ఈ ట్యూన్‌లో అజీన్ (మసీదులో నమాజుసమయాన్ని సూచించుటకై పిలిచే పిలుపు)కి సంబం ధించింది. వయొలిన్ పైన ఆరోహ-అవరోహస్వరాలతో నమాజుకు పిలిచేపి లుపు.

'దాని శో మంజిల్' మెట్లు ఎక్కేటప్పుడు ఈ పాత బిల్డింగ్ ప్రతి ఇటుక నావైపు ఆశ్చర్యంగా చూస్తూవున్నట్లు నాకు అనిపించింది.

'ఎవర్ని కలవాలి?'

'ఫాతిమాదీదిని!'

'ఎవరిని?'

'ఫాతిమాదీదిని.'

వాకబు చేసేవాడు ఆశ్చర్య చకితుడై రాయిమాదిరి నిలబడి పోయాడు. గొణుగు తున్నాడు...'ఫాతిమాదీది.'

బొమ్మలాగుండే ఓ అందమైన చిన్న అమ్మాయి నవ్వుకుంటూ వచ్చి సలామ్ చేసి అడిగింది, "భార్యను ఎందుకు తీసుకు రాలేదు అని పిన్నమ్మ అడుగుతూ వుంది."

ఈ దఫా కూడా ఫాతిమా దీది నాముంగిటకు వచ్చి మాటలాడదని నాకు అర్థ మైపోయింది. ఈ వేళకూడా ఈ అమ్మాయిని మధ్యవర్తిగా వుంచుకొని మాట్లా డుతుంది!

అన్ని వైపుల నుండి రూము కిటికీలు దభీమని మూచుకొన్నచప్పుళ్ళు. రేడి యోలో వినిపిస్తున్నపాట ఠక్కని ఆగిపోయింది. చుట్టూ పుసపుసలు.గుసగుసలు.

"కథలు రాస్తావటగా? నిజమేనా?"తడక అటువైపు నుంచి ప్రశ్న.

నేలపైన పరచిన చిరిగి పోయిన దరీవైపు చూస్తూ నేను జవాబిచ్చాను,

"అవును, అబద్ధాలు చెప్పడాన్ని ఇప్పుడు వృత్తిగా చేసుకున్నాను."

కిలకిల మంటూ వెలువడ్డ ఆనవ్వువిని 'దాని శీ మంజిల్' లోని కిటికీలు కిర్రు మంటూ తెరుచుకున్నాయి. వేయిస్తున్న ఉల్లి గడ్డ వాసనతో రూమంతా నిండి పోయింది. ఈ వాసనతో కొంత కాలం క్రితం జరిగిన సంఘటన నాకు జ్ఞాపకం వచ్చింది...ఎన్.సి.సి. క్యాంప్‌లో వంటరూమ్‌వద్ద 'జహర్‌కాతిల్' విషపు సీసాతో పట్టు బడ్డ ఆ ముస్లీం యువకుడు-ఆ<-అతని పేరే మిటి - మరచాను.'

బొమ్మలాంటి ఆ అమ్మాయిపేరు నగ్మా. నగ్మా ఒక కప్పుటీ తీసుకొని వచ్చింది. నేను అబద్దం చెబుదామను కొన్నాను కాని అలా చేయలేక పోయాను. టీ కప్పుచేతిలోకి తీసుకొని నేను, "అయితే, ఫాతిమాదీది! మీరు ఇంతకాలం...అంటే ఇన్ని రోజుల వరకు ఎక్కడ మాయమై పోయారు?"

"భార్యను తీసుకొని ఎప్పుడు వస్తావు?" ఇది నా ప్రశ్నకు ఆమె ఇచ్చిన జవాబు.

నేను కళ్ళు మూసుకొని టీ తాగాను. నేనడిగిన దానికి ఫాతిమా దీది జవాబి వ్వదలచుకోలేదని నా కర్థమైంది. నాకు ఓ సందేహం కూడా కల్గింది. ఒకవేళ ఈ బురఖాలోని మహిళ మా ఫాతిమా దీది కాదేమో!

నేను కుర్చీ నుంచి లేచాను. నగ్మా చిన్న పళ్ళెరంలో తాంబూలం తెచ్చి పెట్టింది. ఇప్పుడు స్పష్టంగావే అబద్ధం చెప్తాను 'నేను తాంబూలం వేసుకోనని.'

"క్షమించండి. నేను పొరపడ్డాను. మీరు మా ఫాతిమాదీది కాదు." తిరగి వెళ్తూ ధైర్యం తెచ్చుకొని అన్నాను.

"అవును. నిజమే అజీజ్."

'అజీజ్?' నేను తృళ్ళిపడ్డాను. ఫాతిమాదీది నన్ను అజీత్ బదులు అజీజ్ అనేదని నాకు గుర్తొచ్చింది. నేను నిశ్చేష్టుడై నిలబడి పోయాను. తడికకు అటు వైపు నుంచి మరలా కిలకిల మంటూ నవ్వు వినిపించింది.

'దానివ్ మంజిల్' మెట్ల నుండి దిగుతున్నప్పుడు ఈ పాత బిల్డింగ్‌లోని ప్రతీ ఇటుక నావైపు అసహ్యంగా చూస్తునట్లు నాకు అనిపించింది...వెయ్యిక్యాడెట్లకు తయారు చేసిన భోజనంలో విషం కల్పిన ఆ ముస్లిం యువకుని పేరు గుర్తుకు తెచ్చు కొనే ప్రయత్నంలో నేను న్నాను.

'అమ్‌జదియా' హోటల్ ఎదుట గోడకు ఉర్దూలో పెద్ద పెద్ద అక్షరాలతో రాసిన పోస్టర్‌ను అతికిస్తున్నారు. 'నేషనలిస్ట్ ముస్లిం, కన్వెంషన్ ముర్దా బాద్...! దేశద్రోహు లున్నారు జాగ్రత్త!'

ఆ పోస్టరుని చదివి ఒక మౌలానా ఉగ్రుడై గొణగసాగాడు. "ఈ దూదేకుల పిల్ల వాళ్లు దూది ఏకటం వదిలి దేశాన్ని ఏకటం మొదలెట్టారు. వీరికి గుణపాఠం నేర్పాలి! నేషనలిస్టులట, నేషనలిష్టులు...వీళ్ళూ...వీరి మొహమూనూ..."

నాకు వాంతి కొచ్చినట్లు వుంది. రిక్షాలో కూర్చొని నేను నా నాడిపైన వ్రేళ్లు వుంచుకొని చూచు కున్నాను. గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఒళ్లు చెమటలు గ్రమ్మాయి...టీ రుచి కొంచెం పుల్లగా వుంది. అందువల్ల నేమో! కుడివైపు జనరల్ ఆస్పత్రి, ఎడమవైపు పోలీసుస్టేషన్ ఉంది. ముందు ఎక్కడికి వెళ్తే బాగుంటుందని ఆలోచనలో పడ్డాను.

కానీ, రిక్షావాడు ఎక్కడికి వెళ్ళాలి అని అడిగితే రాజేంద్రనగర్ తీసుకువెళ్ళమన్నాను.

ఒక కథా గోష్ఠిలో 'నయీకహానీ' 'అ-కహానీ' ఆజ్‌కీ కహనీ (ఈ నాటికథ) రేపటి కథగురించి నాల్గు గంటల సేపు వరసగా వాగ్వి వాదాలు విన్న తర్వాత తిన్నగా ఇంటికి రావాలంటే మనసొప్పలేదు. ఇటువంటి పరిస్థితుల్లో గంగానది ఒడ్డుకోలేక ఏదేనా బార్‌కు వెళ్ళి నన్ను నేను మరిపించుకొనే అవసరం వస్తుంది. కానీ రిక్షావానితో రాజేంద్రనగర్ వెళ్ళమని చెప్పాను మరి.

గోల్ మార్కెట్ చేరిన తర్వాత ఎప్పటి మాదిరే దూరం నుంచి నాఫ్లాట్‌ని, రూమ్‌ని చూశాను. రూమ్‌లో లైటు వెలగటం చూచి సందేహమేసింది. మరి ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాలి?

గుండెను రాయి చేసుకున్నాను - సరే, ఏమైనాకానీ, మా ఆవిడను క్షమించమని వేడు కుంటాను. ఏదో ఒక సాకు చెప్పేస్తాను.

మెట్లు ఎక్కుతూ వుంటే లోకంలోని బాధలన్నీ నావే అన్నట్లు అనిపించింది. ప్రపంచంలో జేజారెత్తిన వ్యక్తి ముసుగును తొడుక్కొని వాకిలి తట్టాను. వాకిలి తెరచి ఆనందంతో నిలబడి ఉన్న మా ఆవిడను చూచి నాకు ఆశ్చర్యమేసింది. దిగాలు పడ్డ నామొహాన్ని ఆమె చూడనేలేదు. సంతోషంగా ఆమె అంది, "చెప్పుకోండి ఎవరు వచ్చారో చూద్దాం!"

నేను ఆశ్చర్య చకితుడు కాక ముందే నగ్మా వచ్చిసలామ్ చేసింది. మా ఆవిడ అంది - అరే! మేము మూడు గంటల నుండి నవ్వుకుంటూనేవున్నాము. మీ రెక్కడ వున్నారు. ఇంతవరకు? ...అరే మీరు మంచివాళ్లే! ఇంతవరకు నాకు చెప్పలేదు ఎందుకని?

'ఏమి చెప్పలేదు?' నేను అన్నాను.

'ఇదే, మీరు హిందూకాదని, ముసల్మాన్ అని.'

ఫాతిమా దీది లైట్లు వెలిగించినట్లు ప్రకాశవంతంగా కూర్చొని వుంది. బురఖా నేలపై పడి వుంది. బురఖా తునాతునకలై పడివుంది.

"అరే, ఇదేమిటి? ఎలా జరిగింది ఇదంతా!"

"ఎలా జరగటమేమిటి? మీ ముద్దుల పట్టి 'నౌమీ' బురఖా తీసి పారేయనంత వరకు మొరుగుతూనే వుంది. బురఖా తీసి పడేస్తే దాన్ని చింపి చండాడి తునాతునకలు చేసేసింది."

"ఎక్కడుంది అది?"

అది ఫాతిమా దీది ఒడిలో చీర చెరుగుక్రింద దాక్కొని వుంది. ఎప్పుడైనా తప్పుచేస్తే అది ఇలానే దాక్కొంటుంది.

"ఒడిని వదిలి రావటం లేదు. ఏమన్నా అంటే గుర్రు మంటుంది" అని నగ్మా చెప్పింది.

దాదాపు 19-20 ఏళ్ళ తర్వాత ఫాతిమాదీదిని చూస్తున్నాను. మునుపటి మాదిరే వుంది. కాని కళ్ళ వద్ద మాత్రం కొన్ని ముడతలు పడ్డాయి. అంతే!

మా ఆవిడ మొహంపైన నవ్వుతాండ విస్తుంది. ఆవిడ వివరంగా చెప్ప సాగింది, "నౌ మీని కట్టేసి నేను వాకిలి తెరిచాను. ఇంట్లో అజీజ్ వున్నాడా? అని ఈ విడ అడిగింది. ఎవరు అజీజ్ అని నేన్నాను...అజీజ్ కాదు అజీత్! హా, హా! ఎవరో చెప్పారులే అతను తనపేరులోని ఒక అక్షరాన్ని మార్చుకొని తనను హిందువుగా మార్చుకొన్నాడట కదా! తర్వాత ఒక హిందూ అమ్మాయితో పెళ్ళి కూడా చేసుకున్నాడట. ఈ విడ చెప్పింది విని దిగ్భ్రాంతి కల్గింది."

"అరే! ఇప్పటికి వదినగారు భ్రమలోనేవున్నారన్న మాట. ఏంటి. అజీజ్ ఈవిధంగా ఇతరులను ధర్మభ్రష్టులు గా చేయటం పాపం కదా! వాహ్! చాలా చతురుడవే! చెప్పుకోదగ్గవాడవేన్న మాట. మూర్తి పూజకుడిగా మారిన తర్వాత దేవున్ని ఎన్నుకోవటంలో కూడా భలే తమాషా చేశావే గడ్డపు దేవున్ని ఎన్నుకొని..."

రామకృష్ణ పరమహంస విగ్రహంవైపు వ్రేళ్ళు చూపుతూ ఆమె అన్న ఆమాటలకు మేమంతా బిగ్గరగా నవ్వుకున్నాము.

నవ్వులు ఆగిన తర్వాత నేను ఆవిడను అడిగాను "సరే, ఇప్పుడు చెప్పండి! మీరు ఇన్నాళ్ళు ఎక్కడ వున్నారు? ఇప్పుడు ఎక్కడ వుంటున్నారు?"

"గోరీలో వున్నాను. గోరీలో వుంటున్నాను."

"మా ఆవిడ వంట గదిలోకి వెళ్ళింది. ఇప్పుడే ఈ ప్రశ్న అడగటం మంచి

ది కాదని నాకు అనిపించింది."

నీవు ఏమను కున్నావు? పాకిస్తాన్ వెళ్ళి పోయిందనుకున్నావు కదూ! "ఫాతిమా దీది" అడిగింది.

"మీరు పాలిటిక్స్ ఎందుకు వదిలేశారు?"

"ఇది నన్నెందుకు అడుగుతావు? రాత్రికి రాత్రులే దేశభక్తులుగా చలామణి అయి బొడ్డులో కత్తి చెక్కుకొని కాంగ్రెసులో చేరిన వారిని ఎందుకు అడగలేదూ! మీరాజకీయ నాయకులను నిలదీసి ఎందుకు అడగవు ఈ ప్రశ్నలు. నిన్నమొన్నటి వరకు గాంధీని, జవహర్-పటేల్‌లను బట్ట బయలుగా తిట్టి, జాతీయ ఝండాని కాల్చివేసే సాంప్రదాయవాదులను అందలం ఎక్కించి, దేశం కోసం త్యాగాలు చేసి సర్వస్వం కోల్పోయిన వాళ్ళను పాలల్లో పడ్డ ఈగల వలె ఏరి పారేశారే!... నీవు స్వయంగా ఈ ప్రశ్న ఎందుకు అడుక్కోవు!" ఫాతిమాదీది మొహం ఎర్ర బడింది. ఆవిడరూపాన్ని జూచి నాకు సంతోషం కల్గింది.

"కానీ, ఈ విధంగా మీరు అంతర్థానమవటం..."

"అంతర్థానమా? అంటూ ఆమె ఆడ సింహమై గర్జించింది." "ఈ హంతకులు నాపైన ఎన్ని అత్యాచారాలు చేశారో నీకేమి తెలుసు...నేను ఎవరెవరిని సహాయం కొరకు అభ్యరించలేదు! కానీ ఢిల్లీ లోనూ, పాట్నాలోనూ వుండే మన ప్రభువులు నాకు పిచ్చెక్కిందని, పిచ్చికుదిరే దానికి మందు తీసుకొమ్మని, మరి కొందరేమో పెళ్ళి చేసుకొని బిడ్డలు కనమని సలహాలిచ్చారు. మరి కొందరైతే చంపుతామని బెదిరించారు...అయ్యో, ఏమని చెప్పను...అజీజ్."

ఇవన్నీ చెప్పుతూ ఫాతిమాదీది గొంతు బొంగురు పోయింది. మా ఆవిడ ఎప్పుడు వచ్చిందో, అన్నీ విన్న తర్వాత అంది, 'అబ్బ! ఏం మనిషంది మీరూను!'

ఇంతసేపు దాక్కొని వున్న నౌమీ ఫాతిమాదీదిని వాసన చూస్తూ, 'కుయి, కుయి' అని అరవసాగింది.

"ఇప్పటికీ వీళ్ళు మేల్కొనలేదు. వీళ్ళకి కావలసిన దంతా అధికారమే, దేశం నాశనం కానీ వీళ్ళకేమి పట్టదు, ఫాతిమా దీది చెబుతూ చెబుతూ దుఃఖంలో మునిగి పోయింది. నీవు...నీవు కథలు రాస్తావు కదూ! నీకు గుర్తుకు వుంది కదూ... స్వాతంత్ర్యానికి ముందు దేశాభివృద్ధిని అభిలషించే సాహిత్యకారులు తమగీతాల్లో, కథల్లో హిందూ-ముస్లిం ఐక్యతను, మానవత్వాన్ని గురించి చాటి చెప్పేవారు, కానీ స్వాతంత్ర్యానంతరం వాళ్లు ఏమైనారు! వాళ్లు గొంతులు మార్చారు...సామాన్య ప్రజను ఉద్ధరిస్తామని గొంతు చించుకున్నవారు, కిమ్మనకుండా

చూస్తూవుండగానే సాంప్రదాయవాదులు పెనుబాములై దేశాన్ని మింగేస్తున్నారు."

'ఫాతి మాదీది, అన్నం చల్లారిపోతుంది,' అని మా ఆవిడ మధ్యలోనే అవిడ్ని ఆపేసింది.

టౌన్ హాల్‌లో నేషనలిస్ట్-ముస్లీం-కాంగ్రెస్-కాన్ఫరెన్స్‌కి ముమ్మరంగా ఏర్పాట్లు చేస్తున్నారు. దేశం నలుమూలల నుండి వచ్చే ప్రతి నిధులను గురించి వార్తలు పత్రికలు ప్రచురిస్తున్నాయి. ఈ వార్తలతో పాటు కాన్ఫరెన్సును ప్రతిఘటిస్తూ కూడా పెద్ద పెద్ద అక్షరాల్లో వార్తలు వస్తున్నాయి. ప్రతి రోజూ ఇరుపక్షాల తర పున వివరణలు వెలువడుతున్నాయి. విపక్షపార్టీల కథనం ప్రకారం ఎవరూ 'గైర్ నేషనలిష్టులు కాదు. ముస్లీం లందరూ నేషనలిష్టులే, తనను నేషనలిష్టులుగా భావించుకొనే వారు మాత్రం ముస్లీం లీగ్' పార్టీ వాళ్లందరిలో సాంప్రదాయకత అనే విషం దాగివుందని బట్ట బయలుగా చాటి చెపుతూ వాళ్లను నమ్మవద్దని ప్రజలను హెచ్చరిస్తున్నారు...చాలా కాలం నుంచి ఏరాజకీయ సభలోనూ నేను పాల్గొనలేదు. కానీ ఈ దఫాఈ సమ్మేళనంలో పాల్గొనటం నాకర్తవ్యంగా భావించి నేను ఇక్కడికి వచ్చాను. కాని ఇక్కడి పరిస్థితిని చూచి 'ఫుట్ పాత్' పైనే తటా లున నిలబడి పోయాను.

టౌన్ హాల్ ఎదుట రోడ్డుకు ఇరువైపుల వేలకొద్ది గుమిగూడి నినాదాలు చేస్తు న్నారు. తిట్లు, నినాదాలు, మధ్యమధ్యలో రాళ్ళవర్షం కురిపిస్తున్నారు. పేరుపద్ద ముస్లిం నాయకుల సుపుత్రులు, పెద్ద పెద్ద ఆఫీసర్ల కుమారులు ప్రదర్శన కారు లకు నేతృత్వం వహిస్తూన్నారు కాబట్టి పోలీసులు అలజడి చేయకుండా పంక్తిగా నిలబడి వున్నారు. మరలా 1947నాటి సంఘటనలు పునరావృతమైనట్లు నాకు అనిపించింది. అంతటా అదే ఉన్మాదం, అవే నినాదాలు, అవే దృశ్యాలు, అవే ముఖాలు!!

'పట్టుకో!పట్టుకో! అదుగో, వాడే...కాఫిర్!'

'పట్, పట్ మని దెబ్బల చప్పుడు!'

'ఇడిగో, నమ్మకద్రోహి! పట్టు కోండి, కొట్టండి నా కొడుకుని!'

'పటా పటామని దెబ్బల చప్పుడు.'

'పంది నా కొడుకు!'

'పటా పటా మని దెబ్బలు.'

ప్రతిడెలిగేట్‌ను వాళ్లు పట్టుకొని బాదుతున్నారు. పరిస్థితి హద్దుమీరి పోతూ వుంది. నివాదాలు, తిట్లు, రాళ్ళ వర్షం ఎక్కువైపోయింది.

'మహాత్మా గాంధీకీ జై!'

గలభా మధ్యలో ఒక సన్నని ఉత్తేజ కర మైన కంఠధ్వని...అంతటా నిశ్శబ్దం. 'అంజుమన్ ఇస్లామియా హాల్' ప్రవేశ ద్వారం - 'అబ్దుల్ బారీ తోరణ ద్వారం' ఎదుట ఒక స్త్రీనిలబడి నినాదాలు చేయటం అందరూ చూస్తున్నారు.

అరే! ఫాతిమా దీది! నాకు నమ్మశక్యంగా లేదు. అవును ఫాతిమాదీదియే!

"ఎవరు ఈ స్త్రీ?"

"ఎవరో హిందూ స్త్రీ అయివుంటుందేమో!"

"కాదు, కాదు, అరే గుర్తు పట్టలేదా? అదేరా! అదే ఆనీచురాలు."

"ఫాతిమా? ఈ ముండ మళ్ళీ వచ్చిందా?"

"నీచురాలు!"

"ఒక గుంపు పిచ్చి వాళ్ళ మాదిరి నాట్యం చేస్తూ అసభ్యకరమైన తిట్లు తిడుతూ ఫాతిమా దీదీ పైకి విరుచుకుపడింది. ఫాతిమా దీది మాత్రం నవ్వుతూ నిలబడి వుంది. చూస్తూ వుండగానే ఆ ఘాతుక మృగాలు ఆమెను నేలపై పడేసి వెంట్రుకలు పట్టి ఈ ద్చసాగారు. రెండువైపుల నిలుచున్న గుంపు లోని జనం శభాష్, శబాష్ అంటూ చప్పట్లు తట్టారు. పోలీసులు రంగంలోకి దిగే లోపలే వాళ్లు ఫాతిమాదీది ఒంటి పైనున్న బట్టలన్నీ లాగేశారు...దాని తర్వాత నేను ఆ దృశ్యాన్ని చూడలేక పోయాను."

చాలారోజుల తర్వాత నేను, మా ఆవిడ ధైర్యం తెచ్చుకొని ఫాతిమా దీదిని చూడటానికి ఆస్పత్రికి వెళ్లాము.

కేబిన్ వాకిలి వద్ద నగ్మా నిల్చుని వుంది. మేము కనబడుతూనే ఆ అమ్మాయి ఎక్కి ఎక్కి ఏడ్వసాగింది.

"ఆ క్రూరమృగాలు ఫాతిమా దీది మొహం మీద ఏసిడ్ కుమ్మరించారు. మొహం అంతా కాలి మసిబొగ్గు అయింది. ఒక కన్ను కాలిపోయింది...చేతి ఎముక విరిగిపోయింది."

మా అలికిడివిని ఫాతిమా దీది పెదాలు వణక సాగాయి. నవ్వటానికి ప్రయత్నిస్తూంది. నన్ను చూచి అంది, "ఊరుకో, పిచ్చివాడా! ఇక్కడ ఏడ్చే దానికి వచ్చావా నీవు? చూడు నా రూపసౌందర్యం...!" మా ఆవిడ వైపు తిరిగి, "వదినా! రేపు రవ్వతో చేసిన పాయసం...అదే, ఏమంటారు దాన్ని...హా. పరమాన్నం. చేసుకొనిరా? నౌమీని కూడా వెంట తీసుకొని రా." అంది.

ఫాతిమా దీదిని ఈ పరిస్థితిలో చూస్తామని మేము ఎప్పుడూ అనుకోలేదు.

(1966)

# రేఖలు వృత్తచిత్రాలు

ఆసుపత్రి సర్జికల్ వార్డులంటేనే నాకు చాలా భయం, అందుకే ఎల్లప్పుడూ దానికి దూరంగా వుంటూ వచ్చాను. గత్యంతరం లేక ఎప్పుడైనా దగ్గరి బంధువులనో లేక మిత్రులనో చూడటానికి అక్కడికి వెళ్ళ వలసి వస్తే వార్డు వరం డాలో ప్రవే శిస్తూనే ఒళ్లంతా చెమటతో తడసి పోయేది. తలతిరిగేది. పగిలిన మట్టి కుండల మాదిరి నాలుగు వైపులా కాళ్లూ చేతులు విరిగిన మనుషులు, విరిగిన శరీర భాగాలకు తెల్లని ప్లాస్టర్‌తో కట్లు, ఆ పరేషన్ చేసిన కాళ్లు, చేతుల, కడుపుల్లో నుండి వ్రేలాడే రబ్బరు గొట్టాలు మంచం వద్ద స్టాండుకు తగిలించబడి వ్రేలాడు తున్న బ్లడ్, ప్లాజ్మా లేక సలైన్‌బాటళ్ళు, గాలిలో ఈథర్ వాసన, అరుపులు, కేకలు, మూలుగులు...జబ్బు పడిన తర్వాత సర్జికల్ వార్డులో భర్తీ అయ్యాను. కానీ అంతా సామాన్యంగా సవ్యంగా ఉన్నట్లు అన్పించింది. గాభరా లేదు, తల తిరగటం లేదు. చెడ్డ వాసన ఏమి రావటం లేదు. స్పృహ వచ్చిన తర్వాత నా పరిస్థితికి నాకే నవ్వు వచ్చింది. భరించ రాని బాధను భరిస్తున్నట్లు అనిపించింది. ఈ వేళ ఉన్నట్లుండి భీష్మ పితామహుడి పరిస్థితి గుర్తుకు వచ్చింది. మహా భార తంలోని భీష్ముడి అవతారం నా కళ్ళ ముందర కనిపించింది...బ్లడ్ బాటల్, బెడ్ రెస్ట్, రైన్‌ట్యూబ్, సలైన్ బాటిలుకు తగిలించి వున్న రబ్బరు గొట్టం నాకాలి నరంలో గ్రుచ్చబడివుంది...'శరశయ్యపై శయనించిన భీష్మపితామహుడి మాదిరి నేను కనపడుతున్నాను. కదా!' అని ఉమతోఅన్నాను.

ఉమ పెదవులపై చిరునవ్వుకన్పించింది - 'రేపు మంగలిని పిలిపిస్తాను...మీ గడ్డం చాలా పెరిగిపోయింది' అని ఉమ అంది.

ఆవిడ అన్నదానికి వెంటనే నేనేమి అడ్డు చెప్పలేదు. కాని కొంతసేపు ఆగి, 'ఈ వేళే ఎందుకు పిలిపించ కూడదు మంగలిని?' అన్నాను.

నేను ఆలోచనలో పడ్డాను..."ఈ వేళ క్షవరం చేసుకోక పోతే ఒక వేళ నాకే మైనా జరిగి పోతే...ఏమైనా జరిగి పోవటం అంటే ఒకవేళ నేను చనిపోతే, నా జీవితంలో తీసిన ఆఖరి ఫొటో ఎంత వికారంగా ఉంటుందో! పెరిగిన గడ్డం, వికృతమైన రూపం, ముఖంపైన భయాందోళన...కాదు...కాదు. నా ఆఖరి ఫొటోలో

నా పెదాలు చిరునవ్వు చిందిస్తూ ఉండాలి, చస్తూ చస్తూ నవ్వుతూ చావాలి ... స్మైల్ ప్లీజ్...?"

జలధర్ గారు గుర్తుకు వచ్చారు. జలధర్ గారి శవయాత్ర ఫోటోలు మాధురి. ఫిల్మ్ ఫేర్, చిత్రఫట్ మున్నగు పత్రికల్లో ప్రచురించారు...మొహం ఎంతో ప్రశాంతంగా కనపడింది! పెదవులపైన ఏదో అపూర్వమైన చిరునవ్వు, లలాటం పైన చందనలేపనం. పూలదండలతో కప్పబడ్డ ఆప్రఖ్యాత సినిమా గాయకుడు జలధర్...కళ్లు మూసుకొని ఏదో మధుర మైన పాట పంక్తులను గుర్తు చేసుకుంటు న్నాడా అన్నట్లు వుంది. కాని ఆ పుష్పలాల్? ఆధునిక విప్లవకవి; కథకుడు ఐన పుష్పలాల్‌కి కెమేరాలు వున్న మిత్రులు ఓ డజను మంది ఉన్నారు. అతను బ్రతికుండగానే స్నేహితులు అతని ఫొటోలు రకరకాల ఫోజుల్లో ఎన్నో తీశారు కానీ అతని ఆఖరి ఫోటో ఎవరి దగ్గరాలేదు. ఎవరూ అతని ఆఖరి ఫొటో తీయ లేదేమో, లేక పోతే ఫోటో తీసేదానికి ఆస్కారం కల్గించ కుండానే అతను వెళ్ళి పోయాడేమో! పుష్పలాల్ పొట్టలో ఒకటి రెండు పెగ్గులు పడి అతను ఉషారు లోకి వచ్చి నప్పుడు మాట్లాడే ప్రతి మాటకి ముందు ప్రతిసారి మైథిలీ భాషలో ఒక చెడ్డ తిట్టు 'ధీచో ఓ ఓ' (ఒరే...నీ...) అని అంటాడు. చనిపోవటానికి ముందు అతను ఇదే తిట్టు తిట్టాడని అందరూ అంటారు. భగవంతుణ్ణి తిట్టి తిట్టిచని పోయాడంటాడు అతని మిత్రుడు ఒకాయన. అతను ఎవరినైనా తిట్టి వుండనీ, చని పోయేటప్పటి అతని రూపాన్ని నేను ఊహించుకుంటాను. రెండు పెదవులను ముడిచి గుండ్రంగా బెట్టి అతను తుపాకి గుండు కాల్చి నట్టు - 'ధీచో - ఓ - ఓ!...! అని వుంటాడు. క్రిందటి సంవత్సరం ఎదురుగా వుండే వార్డులోనే పుష్పలాల్ తన దేహాన్ని చాలించాడు. నేను జబ్బు పడ్డ వార్తవిని మా వాళ్ళందరికి జలధర్, పుష్పలాల్‌లు గుర్తుకు వచ్చి వుంటారు. ఎవరెవరు ఏమని అన్నారో నేను వూహించి కరెక్ట్‌గా చెప్పగలను.

ఉమ అటు వైపు నుంచి మొహం వ్రేలాడేసుకొని వస్తూంది ఎందుకో! బ్లెడ్ బ్యాంక్ లో 'ఓగ్రూపు' బ్లడ్ లేదట. రేపు కూడా ఒకవేళ 'ఓగ్రూపు' బ్లడ్ దానం చేసే దాత రాక పోతే ఎట్లా అంటూ ఉమ మళ్ళీ అటువైపు వెళ్ళిపోయింది. నాఖర్మ. ఎవరెవరో ఏమేమి పనులు చేసేవాళ్ళ రక్తమో? రోజు మార్చిరోజు నాశరీరంలోకి 300సీ.సీ.రక్తం నాడుల ద్వారా బొట్టు బొట్టుగా ఒకటిన్నర గంటల వరకూ ఎక్కిస్తారు. ఆ ఒకటిన్నర గంటలో నేను కదల కుండా వెల్లకిలా పడుకొని స్టాండుకు తలక్రిందులుగా తగిలింపబడిన బాటిల్ వైపు చూస్తూ వుండిపోతాను. రబ్బరు

గొట్టానికి మధ్యవున్న గ్లాసు బల్బులోకికారి పోతున్న చిక్కటి రక్తపు బిందువులను లెక్కపెడుతూ ఉంటాను. రక్తపు బిందువులు కారే చప్పుడు వల్ల మనసులో చోటు చేసుకొన్న ఊహలు పద్య బద్ధంగా వెలువడుతాయి.

"ప్రవహింప చేస్తున్నారు రక్తం నిత్యం నానాడుల్లో
300సీ.సీ. లు ఎవరిదో? ఏ దుర్మార్గుడిదో! ఏ దోపిడీ...-
దొంగదో! ఏ కసాయిదో! ఏబ్రహ్మచారిదో!
ఏదయామయుడైన భగవంతునిదో!"

అప్పుడు నాలో నుంచి ఎవరో నన్ను తిడుతున్నట్లు అన్పిస్తుంది. "ఏమి మనిషివిరా! ఈ పరిస్థితుల్లో కూడా కవిత్వమా...?"

ఈ దఫా ఆసుపత్రిలో స్పృహ వచ్చిన వెంటనే కవిత్వపు పంక్తులు దొర్లి పోతున్నాయి. లోలోన ఏవేవో పద్య పంక్తులు పునరావృత్తం కావటం, అంత్యానుప్రాసలు, కళ్లు కలపటం, అసభ్య కరమైన నా నుడులు వల్లె వేయడం! లేక ఇవి నా మూల వ్యాధికి ఉపసర్గలామరి! ఎన్నో భయంకర వ్యాధుల తర్వాత ఇటువంటి లక్షణాలు మొదలవుతాయి...పళ్ళతో గోళ్ళుకొరుక్కోవటం, మాటి మాటికి ముక్కు తుడుచుకోవటం, చేతి వ్రేళ్ళను నాట్యం చేయించటం, నాలుకతో పెదవులు తడుపుకోవడం...

ఉమబ్లెడ్ ప్రాబ్లమ్‌ని సాల్వ్ చేసివచ్చింది. ఆవిడ వెంట ఓ లావుపాటి మధ్య వయస్కురాలైన బెంగాలీ మహిళ వచ్చింది.

"ఈ విడ బ్లెడ్ గ్రూపు కూడా 'ఓగ్రూపే' గత కొన్ని సంవత్సరాలుగా బ్లెడ్ బ్యాంక్‌కి తన బ్లెడ్ డొనేట్ చేస్తూ వుందట" అని ఉమ అంది.

ఆ మహిళ తన బ్యాగ్‌లోనుంచి ఓ ఎర్రటి కార్డు తీసి ఉమ చేతికి అందిస్తూ - 'ఎమర్జెన్సీ అయినప్పుడే నాబ్లెడ్ అవసరం పడుతూ వుంటుంది.'

ఉమ ఆమెతో మాట్లాడింది. ఆవిడ రేపు ఉదయం ఎనిమిది గంటలకు వచ్చి బ్లెడ్ బ్యాంకుకు తన రక్తం ఇచ్చి పోతుంది. 12 గంటల నుంచి నానాడుల్లో ఈ లావుపాటి బెంగాలీ మహిళ రక్తం ఎక్కిస్తారు. ఆవిడ నమస్కారం చేసి వెళ్ళిన తర్వాత, అంతవరకూ మూతపడివున్న నోటిని విప్పాను - 'ఆడదాని రక్తమా? అందులోను ఈ విడగారిదా?...? ఊహు! వీలుపడదు! నసేమిరా వద్దు! నేను ఎక్కించు కోను ఈ రక్తం!'

ఉమ మౌనం వహించటం చూసి నేను ఒకే మాట మాటి మాటికి వల్లెవేశాను - 'నేను ఎక్కించుకోను. నాకొద్దు రక్తం నాకు రక్తం అక్కరలేదు...!'

'పిల్ల చేష్టలా ఏమిటి!' - ఉమ నవ్వుతూ బెదిరించింది. 'నేను ఎక్కించు కోను రక్తం!'

'వద్దులే! ఎక్కించుకోవద్దులే! ఊరక వుండండి చాలు!'

'నేను ఊరక వుండను! నేను ఇప్పుడు పాలు కూడా త్రాగను. మందు కూడా తీసుకోను.'

ఉమ ఫీడింగ్ కప్పులో పాలు పోసి స్పూన్‌తో మందు కలుపుతూ వుంటేనేనేమో పగిలి పోయిన పాత గ్రామఫోను రికార్డ్ మాదిరి ఒకటే మాట - 'మందు వద్దు! పాలు వద్దు! మందు వద్దు! పాలువద్దు! పదం మాదిరి పాడసాగాను.

నైట్ డ్యూటీ నర్సు నీలమ్మ రాకపోయివుంటే నేనేమో కళ్ళు మూసుకొని పది, పదునేదు నిమిషాలవరకు ఇవే మాటలు అంటూ వుంటేవాడిని. ఉమ ఏమో ఫీడింగ్ కప్పులో స్పూన్‌తో మందు కలుపుతూ నన్ను మందలిస్తూ బ్రతి మాలాడు తూంది. ఈ నీలమ్మను నేను 'వికసించిన రజనీ గంధ' అని పిలుస్తాను. నామన స్సులో రాత్రంతా తాజాగా చిరునవ్వులు చిందిస్తూ గుభాలిస్తూ ఉంటుంది.

'ఏమండీ ఏం పాట పాడుతున్నారండి! - నీలమ్మ మళయాళం నుడికా రంతో అడుగుతుంది.'

నా నోట్లో ఫీడింగ్ కప్పు గొట్టాన్ని వుంచి ఉమ నవ్వుతూ జవాబిస్తుంది - 'పాలు వద్దు! మందువద్దు.'

ఆహా! ఎంత మంచి మాట. రేపట్నుంచి ఫీడింగ్ కప్పు కాదు, ఫీడింగ్ బాటిల్ తీసుకురండి అని నీలమ్మ ధర్మా మీటరు విదిలించు కుంటూ ముందుకు సాగిపోతుంది. ఆజ్ఞాకారి పిల్లవాడి మల్లే పాలు త్రాగుతున్న నన్ను చూసి - 'పాలు త్రాగి పాట పాడుకో' అంటుంది.

ఉమ, నీలమ్మ ఒక్క సారిగా నవ్వుతారు.

నీలమ్మ టెంపరేచర్ చూసి వెళ్ళి పోతే ఉమ నీలమ్మను హేళన చేస్తూ - 'పాలు త్రాగి పాట పాడుకో...' అంటుంది.

కాని నేను నవ్వలేను. పాట, గీతం, సాంగ్, మ్యూజిక్, లయ, తాళం, రికా ర్డింగ్, ప్లేబ్యాక్ మొదలగు పదాలు వింటూనే నాకు ఎక్కిళ్ళు వస్తాయి. ఎక్కిళ్ళు ఒకసారి వచ్చాయంటే ఏడురోజుల వరకు రాత్రిం బవళ్ళు వస్తూనే ఉంటాయి. ఒక్కసారి ఎక్కిళ్ళు వస్తే డాక్టర్లు చాలా కష్టం మీద వాటిని పోగొట్టారు. ఎక్కిళ్ళ తర్వాత వాంతికి వచ్చినట్లు ఉంటుంది. తర్వాత పేగుల్లో ఏదో ఒక మూల నిద్ర పోతున్న నొప్పి నెమ్మది నెమ్మదిగా శూలంగామారి పొడవటం మొదలు పెడు

తుంది. అప్పుడు వాంతులు మొదలవుతాయి. ఇంకేముంది! తిన్న మందులు, ట్యాబ్లెట్స్, విటమిన్సు, పిల్స్, క్యాప్ సూల్స్ తీసుకున్న ఆహారం అంతా బయటికి వచ్చేస్తుంది. వాంతి తర్వాత స్పృహ తప్పి కోమాలోకి వెళ్ళి పోతాను.

నాకు ఎక్కిళ్ళు మొదలవుతూనే ఉమ డ్యూటీ రూంవైపు పరుగెడుతూ వెళ్ళింది. ఉమ వెంట 'టప్‌టప్' మంటూ నీలమ్మ వేగంగా వచ్చింది. నా నాడీని పరీక్షించి వెంటనే మరలా డ్యూటీ రూంకు పరుగెడుతూ వెళ్ళింది. పెద్ద డాక్టరుకు కబురు చేయడానికి వెళ్ళింది.

శిభూ! గంగానది అటు వైపు నుండి ఎవరో నన్ను పిలుస్తున్నట్లు ఉంది. నేను జవాబు ఇవ్వాలను కుంటాను కాని నోట్లో నుంచి మాటరావడం లేదు. కళ్ళు తెరిచాను. నా ముక్కు రంధ్రాంలో ఉంచిన రైస్ ట్యూబ్‌కు లావుపాటి సిరంజి తగిలించి, ప్రేగుల్లో పేరుకు పోయిన పైత్యరసాన్ని లాగి నీలమ్మ బయటపారేస్తుంది, దగ్గరే నిల్చున్న పెద్ద సర్జన్ అజయ్ గారు మౌనంగా నా వైపు చూస్తున్నారు.

కడుపులోని బాధ కొద్ది కొద్దిగా తగ్గుముఖం పట్టింది. ఎక్కిళ్ళు ఆగడానికి నాకు ఇంజక్షన్ ఇచ్చారు. ఈ ఇంజక్షన్ తర్వాత ఒక పెగ్గు స్కాచ్ విస్కీ తాగినంత మత్తు వస్తుంది...ఈ రోజు కోమాలోకి పోలేదు! కోమా! బెనారస్ లోని ఒక హాస్యకవి పంక్తి...బ్రతుకే ఒక వాక్యం అయితే...కోమా (కామా)...ఫుల్‌స్టాప్ ఏమౌతాయి?

కవిత్వం పంక్తి గుర్తుకు వచ్చింది గాని, ఆకవి గారి పేరు గుర్తుకు రావటం లేదు.

నేను మాత్రం కోమాను సమాధిగా భావిస్తాను. మూర్ఛను సన్నాసి రోగం అని కూడా అంటారు కదా! ఆశ్చరం! స్పృహ తప్పి పడివున్నప్పుడు కలలో చూచిన దృశ్యాలన్నీ నాకు స్పష్టంగా గుర్తుకున్నాయి.

అందరూ కడుపు పట్టుకొని వంగి వున్నారు, అందరూ వున్నట్లుండి వంగిపోయారు. ఎవరు ఎక్కడ వున్నారో అక్కడనే రెండు చేతులు నడుం పైన వుంచుకొని వంగి వున్నారు. పొలాల్లో - కల్లాల్లో పని చేసేవాళ్లు, కాలువ పక్కన నిల్చున్న వాళ్లు, శనగ చేలో పని చేసే ఆడ వాళ్ళు అందరూ నొప్పితో తల్లడిల్లుతున్నారు. గాలిలో ఒక విధమైన పులుపు వాసన! అంతా పుల్ల పుల్లగ ఉంది. గాలి విసురుగా వీస్తూంది, ఆ గాలి దెబ్బకుఅందరూ ఒకసారి అరచి మరీవంగి పోతారు. అందరి శరీరాలు వికారంగా వంగి పోయి స్వస్తిక్ చిహ్నాంలాగ తయా

రయ్యాయి...ఇంతలోనే ఎవరో రేడియో స్టేషన్ నుంచి ఎనౌన్స్ చేస్తున్నట్లు విన పడింది - మహా జనులారా! శ్రోత ల్లారా! ఏదో అణు సంబంధమైన సంఘటన జరిగి నట్లు ఉంది. నేలపైన బోర్లా పడుకోండి. వ్యాక్యూం వస్తుంది! వ్యాక్యూం! వ్యాక్యూ! వ్యా! వేల వంది ఒకేసారి వాంతి చేసుకుంటున్నారు. అందరి నోళ్ల నుంచి ఒకటే శబ్దం విన్పిస్తుంది - యాక్! యాక్! కాని ఉమకు ఏమి కాలేదు. పరిగెత్తూ వచ్చి 'భయపడవద్దు. భయపడవద్దు!' అంటుంది.

భయపడ వలసిన అవసరంలేదు. పొరపాటుతో అలా జరిగిపోయింది. ఎవరు చేశారు ఈ పొరపాటు? ప్రాణాల మీదికి వచ్చిన ఈ పొరపాటు ఎవరి వల్ల జరి గింది? అమెరికా శాస్త్రజ్ఞులా...? దీని పైన జుడిషియల్ ఎంక్వైరీ పెట్టాలి. పొర పాటు చేసిన వాళ్ళను శిక్షించండి లేక పోతే పదవులనుండి దిగిపొండి.

సమాధి స్థితి భగ్నమైన తర్వాత నాచుట్టూ నిలబడి వున్న డాక్టర్లను చూసి అడగాలను కుంటాను - 'ఆఖరికి ఎవరి పొరపాటు మూలంగా ఇలా సంభవించిం దని! కాని నోట్లో నుంచి మాట రావటం లేదు.'

ఆక్సిజన్ సిలెండర్ నుంచి నాకు ఆక్సిజన్ ఇస్తున్నారు...

రెండవ దృశ్యం అశోక్‌హైవే నుంచి ఒక గుంపు ఊరే గింపుగా వస్తుంది. నినాదాలు లేవు. ఎలాంటి గలాభా లేదు. ఊరే గింపు దగ్గర అవుతుంది. రోడ్డు కిరువైపులా అసంఖ్యాక జనం లైన్‌గా నిలబడి ఊరేగింపుగా వస్తున్న గుంపు కొరకు నిరీక్షిస్తున్నారు. కాని ఈ గుంపు మనుషులది కాదు. తెల్లనిబాతులది. మెలికలు తిరిగిన మెడలు, పాల లాంటి తెల్లని రెక్కలు, గులాభీరంగు ముక్కు లు...వేలకు వేలు బాతులు...బక్ బక్ బక్...బక్, బక్, బక్ మంటూ ఆసుపత్రి వైపు ఆగుంపు మళ్ళింది. అక్కడి నుంచి ఆ గుంపు లోని బాతులన్నీ పంక్తి కట్టుకొని గంగానది ఒడ్డున నీళ్ళలోకి దిగాయి. గంగానదికి ఈ ఒడ్డు నుంచి ఆ ఒడ్డుకు బాతుల వంతెనతయారయింది. నీలపు రంగు నీళ్ళ పైన తెల్లటి వంతెన...ప్రాణ మున్న వంతెన...బక్ - బక్ - బక్- బక్...ఉమ నాచేతులుపట్టుకొని లేపేదానికి ప్రయత్నిస్తుంది. - 'శిభూ! లే, జల్దీ జల్దీ ఆవలి ఒడ్డుకు పద ...శీఘ్రంగా వెళ్ళా లి...లేక పోతే ఈ వంతెన కూలి పోతుంది. బక్ - బక్ - బక్...నేను ఉమచే తులు వెతికి పట్టు కుంటాను. బాతు రెక్కలు చేతికి తగిలి రెపరెప మంటూ పోతాయి, బక్ - బక్- బక్ శబ్దాలు చేస్తూ నేను ఉమను పిలుస్తాను, కాని ఉమ జవాబు ఇవ్వడంలేదు. నేను ఉమని పేరు పెట్టి పిలవాలను కుంటాను, కాని నా నోటి నుండి బాతుల అరుపులే వస్తున్నాయి - బక్ -బక్ - బక్...'

స్పృహ వచ్చిన తర్వాత కళ్ళు తెరిచి చూస్తే ఉమ నాతల వైపు కూర్చుని స్టూలుకి మోచేతులు ఆనించి నిద్ర పోతూంది. నేను ఉమా! అని అరిచాను. కాని నా నోటి నుండి 'అమ్మా అమ్మా' అనే శబ్దాలు వినపడుతున్నాయి.

అమ్మ ఇక్కడ వుంటే ఈ మాదిరే తలవైపు కూర్చుని తల వెంట్రుకలను నిమురుతూ ఇలా అనేది - "ఒరే శిభూ! మన వూరు వదిలి నీవు ఇక్కడికి ఎందు కొచ్చావురా నాయనా? అక్కడ ఎంత బాగుంటివిరా నువ్వు! ఎలా అయిపోయా వురా! వాపసు వెళ్లాం పదరా! వూర్లోనే చప్పిడి మెతుకులు తిని బ్రతుకుదాం. చెట్టు నీడన బ్రతుకుదాం, కానీ..."

టైం అర్ధ రాత్రి అయివుంటుంది. బెడ్ నెంబరు పది వద్ద ఇంత జనం ఎందుకు మూగారో? వార్డు బాయ్ నామంచం పక్కనుంచి ఆక్సిజన్ సిలెండరు ఈడ్చు కొని పోతున్నాడు. డేంజరు నా బెడ్ నుంచి బెడ్ నెంబరు పదికి వెళుతు న్నట్లుంది. గచ్చు మీద సిలెండరు ఈడ్చడం వల్ల వచ్చే శబ్దం వార్డు అంతా మారు మ్రోగుతుంది. అందరికి కంగారేసింది. అయిదో నెంబరు బెడ్ పైన కత్తి పోట్లకు గురైన బిహార్ షరీఫ్ టాక్సి డ్రైవర్ అడ్మిట్ అయివున్నాడు. ఉన్నట్లుండి అతడు అరవటం మొదలెట్టాడు - "ఎక్కడ వున్నావురా! చిన్న? ఎక్కడ దాగి వున్నావురా! నీవు! పిలకోడా? రారా! ఎదురుగా రారా! ఇప్పుడు తీరా నీకత్తి!"

పదో నెంబరు బెడ్ వద్ద ఏడ్పులు మొదలయ్యాయి. కిడ్నీరోగి ఎనభై ఏళ్ళ ముసలోడు చనిపోయాడు. కూతురు, మనవళ్ళు, మనమరాళ్లు ఏడుస్తున్నారు. వాళ్ల ఏడుపులు విని నేను వాళ్లు ఉత్తర బీహర్‌కు చెందిన వాళ్ళని గుర్తు పట్టా ను.

పుష్పలాల్ తరచుగా అనేవాడు (ఇది అతని సొంత మాటో, లేక ఎక్కడైనా చదివిన మాటో తెలియదు గాని)- 'కవిత్వానికి తగిన వస్తువు ఒక్కటే! అదేమి టంటే మృత్యువు!'

పుష్పలాల్ రాసిన కవిత్వం కానీ, కథ కానీ నాకు అర్థమయ్యేది కాదు. పుష్పలాల్‌తో నా తొలి పరిచయం కలకత్తాలోని ఓ పదహారణాల బెంగాలీ బార్‌లో అయింది. ఆ బార్‌లోని విశేష మేమిటంటే, స్పెషల్ ఆర్డరు ఇస్తే నూనెలో వేయించిన వేడి వేడి కచోడీలు కాళీ మాత మార్క్ దేశీ సారాబాటిల్ దొరికేది. పదిపదనైదు మంది బెంగాలీ కుర్ర వాళ్ళ మధ్య కూర్చుని కచోడీలు కొరుకుతూ, గటగట మని దేశీ సారా తాగుతూ పుష్పలాల్ తాను రాసిన ఇంగ్లీషు కవిత్వం విన్పిస్తున్నాడు. కవిత్వ మేమో నాకు అర్థం కాలేదు కానీ, రెండు మూడు పదాలు

మాత్రం నాకు తెలిసి పోయాయి - 'ఓ, లుముంబా, లుముంబా, లు ముంబా, క్రాస్ అండ్ శివలింగ్...'

ఈ వేళ మధ్యాహ్నం మామిత్రుడు ఒకాయన ఉమకు 'ఆర్ట్ అండ్ ఆర్టిస్ట్' అనే ఇంగ్లీషు త్రైమాసిక తాజా సంచిక పంపాడు. ఆసంచికలో మాక్రేయోభి లాషి ఎవరో ఓ రచయిత తన రచనను దాంట్లో ప్రచురించుకున్నాడు. ఆరచ నలో మమ్మల్ని గురించి కూడా ప్రస్తావించాడు. ఆ రచన చదివి వినిపించమని ఉమను నేను ఎన్నో మార్లు అడిగాను. కాని ఆవిడ నా మాట పట్టించుకో లేదు - 'విని ఏమి చేస్తావులే? వింటే ఏమి లాభం? ఏదో రాశాడులే! తప్పేమి రాయలే దు. నీలాంటి వాళ్ళ కథలే రాశాడులే...వున్నది వున్నట్లుగా!' అని అంది.

ఉమ నేను చెప్పిన మాట వినక పోవడం నాకు నచ్చలేదు. ఆవిడ ఏదో పని మీద బయటికి వెళ్తే నేను నా పక్క బెడ్‌లో వున్న రోగి వద్ద నుండే అటెండర్ ను పిలిచి ఆ పత్రికలోని వ్యాసం చదివి పెట్ట మన్నాను. అతని మగహీ ఉచ్ఛా రణ మూలంగానూ మరి కొంత నా అల్పజ్ఞత కారణం గానూ ఆ వ్యాసాన్ని పూర్తిగా అర్థం చేసుకోలేక పోయాను. కాని దాని మూల భావం ఏమిటో తెలుసు కోగలిగాను. వ్యాసరచన శైలి చాలా బాగుంది...మూడేళ్ల క్రిందటి మాట? బొంబాయి ఫిల్మ్ జగత్తులో ప్రసిద్ధి చెందిన పాటల రచయిత జలధర్ ఇంట్లో రోజూసాయం కాలం సంవత్సరం పొడువునా సాగిన సమావేశాల్లో నలుగురు పేరు పద్ద కళాకా రులు చేరేవారు. వాళ్ళందరూ ఓ ఎక్స్ పెరిమెంటల్ సినిమా తీసే సందర్భంలో కథ, మాటలు, పాటలు ట్యూన్‌ల గురించి అక్కడ చర్చించే దానికి వచ్చేవారు. మాటలకు ముందు బాటిల్స్ ఓపన్ అయ్యేవి. ఇంక ఏముంది? ఎక్కడి మాటలు అక్కడే వుండేవి! ఒక వేళ ఎప్పుడైనా మాటలు మొదలు పెడితే ఒకరినొకరు దెబ్బలాడుకునే వారు. వాళ్ళు నలుగురు అంటే - జలధర్; జానపద గీతాల గాయకుడు శివనాథ్; బెంగాలీ శిల్పకారుడు రామరంజన్; బర్మాను తనమాతృ భూమి గా చెప్పుకొనే హిందీ - మైథిలీ కవి పుష్పలాల్. ఈ రచయితకు (నాకు) ఆర్ట్‌ఫిల్మ్, 'న్యూ సినిమా మూమెంట్' ప్రేమికులకు ఈ నల్గురి సమావేశాల వల్ల ఏదో గొప్ప కార్యం జరుగు తుందని ఆశవుండేది. కాని ఇప్పుడు రుజువు అయింది ఏమిటంటే ఆ నలుగురు ఆత్మద్రోహులని ప్రతి రోజూ సాయంత్రం వాళ్లు మృత్యు వాత పడే దానికే గుమిగూడే వాళ్ళు అని. గతసంవత్సరం జలధర్ లివర్ జబ్బుతో మరణించాడు. మూడు నెలల తర్వాత పుష్పలాల్ స్టమక్ క్యాన్సర్‌తో చని పోయా డు. శివనాథ్ ఏమో ఇప్పుడు భయంకరమైన కడుపు నొప్పితో స్పృహతప్పి

పాట్నా ఆసుపత్రిలో పడి వున్నాడు. రామరంజన్ కలకత్తాలోని ఓ వేశ్యాగృహం మెట్లపైన దెబ్బలు తిని మత్తులో పడి వున్నాడని ఇప్పుడిప్పుడే వార్త అందింది. వీళ్ల ఇద్దరి పరిస్థితి చాలా అధ్వాన్నంగా వుందని అంటున్నారు...

దీని తర్వాత వ్యాసంలో చెప్ప దల్చుకున్న విషయం ప్రశ్నలతో ప్రారంభ మవుతుంది - ఇది ఎలా జరిగింది? దీనికి కారణ మేమిటి? తర్వాత రచయితే పరిస్థితులను తత్వ శాస్త్రం, మనస్థత్వ శాస్త్ర దృష్టితో విశ్లేషించి, స్వయంగా నే జవాబు ఇచ్చాడు. మరి ఎప్పుడైన వీలు దొరికితే వ్యాసాన్ని స్వయంగా చదువు కొని అర్థం చేసుకోవాలనుకున్నానూ, ఇప్పుడు నా మెదడులో ఆవ్యాసంలోని ఎన్నో పదాలూ పంక్తులూ మాటి మాటికి చోటు చేసుకుంటున్నాయి - "పర్సనా లిటీ డిస్ ఆర్డర్...ఇది పస్‌కాంప్లెక్స్, డెత్‌విష్, సెల్ఫ్ డిస్ ట్రక్షియా...శాపేస్ హోవర్...సూసైడ్ జస్టిఫైడ్, బట్ నెవర్ కమిటెడ్ ఇట్...ఏమ్యాన్ ఈజ్ ద ప్రాడక్ట్ ఆఫ్ హిజ్ కల్చర్ అండ్ హిజ్ ఎన్వైర్న్ మైంట్!"

నేనే మో సాహిత్యం చదివే సాధారణ పాఠకుణ్ణి! నాకు ఈ చర్చలతో సంబం ధమేమిటి! ఉమ అప్పుడప్పుడు నాకు ఒక బెంగాలీ జాతీయాన్ని విడమరిచి విన్పిస్తూ వుంటుంది, అల్లం అమ్మేవానికి ఓడల గురించి తెలుసు కోవాల్సిన ఆగత్యం ఏమిటీ అని. కాని ఉమ ఈ జాతీయాన్ని గురించి చెప్పే కొద్దీ నేను అధిక ఉత్సాహంతో సాహిత్య - కళా రంగాల చర్చల్లో లీనమై పోతూవుంటాను. పుష్పలాల్ నాతో అనేవాడు - "శిభూ దాదా! ఈ హయ్యా ఓహయ్య, జానపద - గీనపదపాటలను వదిలేసి రాయటం మొదలెట్టు..." రాయటం మాత్రం నేను మొదలెట్టలేదు గాని గడ్డం పెంచేశాను. రామరంజన్ దాదాగారు ఓ రోజు తన చేతుల్తో నా గడ్డాన్ని బాగా గీకి అల్ట్రా మోడ్రన్‌గా తయారు చేశాడు. ఆరోజు నుంచి మోడ్రన్ కాంటెంపరరీ పదాల చర్చలో పడి పుష్పలాల్ రామరంజన్ దాదాలు దెబ్బలాడు కోవడం మొదలెట్టారు. పుష్పలాల్ తన తప్పుడు మాట లను ఒప్పులుగా సమర్థించు కునేప్పుడే రామరంజన్ దాదాకూడా అదే చేసే వాడు. మాగ్రూపులో అందరికన్న పెద్దవారు రామరంజన్ దాదా అయితే, అంత రికన్న చిన్నవాడు పుష్పలాల్, వీరిద్దరి దెబ్బలాట చూడ ముచ్చటగా వుండేది...

'అదిసరే గాని బేటా! నీవు మోడ్రన్ ఎప్పుడయ్యావురా?'

'నిజానికి నేను వీళ్ళ రొంపిలో ఎందుకు పడ్డాను? ఎలా పడ్డాను? కాని దీంట్లో నా తప్పు ఏముందని?...'

నేను రాజకీయాలలో పడ్డాను, బహిరంగ సభల్లో రాజకీయ పార్టీల ముఖ్య

నాయకుల ప్రసంగాలకు ముందు జనాన్ని శాంత పరిచే దానికి, పాటలతో వాళ్ళను మురిపించేదానికి నాయకులకు నా అవసరం పడేది. నేను చేతిలో గజ్జలు కంజీరా తీసుకొని సభా వేదికపైన గీతాన్ని ఆలపించే వాణ్ణి 'భయ్యాకి సనవా హో, దుస్మన్‌తో హార్ బడక జమీందార్! (ఓ తమ్ముడూ! కిష్టయ్యా, నిన్ను ముంచే వాడు ఈ జమీందారే!)'

నా కంఠంలో ఒక ప్రత్యేకమైన తియ్యటి స్వరం లేక పోతే, మోడ్రన్ అనిపించుకొనే పట్నం వాసులకు జానపద గీతాలు విని ఆనందించటం ఫ్యాషన్ కాక పోయివుంటే ఇప్పుడు నాగతి ఏమై ఉండేది? అప్పుడు రాజకీయాలలోనే కూరుకుపోయి ఉండి పార్టీలను మార్చి ఏ పార్టీలో వుండే వాడినో! ఒక వేళ పాట్నాలో రేడి యోస్టేషన్ పెట్టక పోయివుంటే నేను ఎక్కడి వాడిని అక్కడే వుండి పోయే వాణ్ణి. తొలిసారి రేడియోలో నేను 'సారంగా సదాబృజ్' గేయకథను ప్రసారం చేసి బయటికి వచ్చినప్పుడు స్టూడియో బయటకాచుకొని వున్న ప్రొగ్రామ్ ఎక్జిక్యూటివ్ ఒక అ హిందీ మాతృభాషి మిస్ నైనీ కుట్టి ఆనంద పరవశురాలై గద్గద స్వరంతో నాకు కంగ్రాచ్యులేషన్స్ చెప్పింది - "నాకు మీ గేయంలోని ఒక్క పదం కూడా బోధ పడలేదు, కాని గేయాన్ని వింటూ వుంటే నాలో ఏవో మధురాను భూతులు కలిగాయి" అని ఆవిడ అన్న మాటలు నాకు ఇంకా గుర్తుకు వున్నాయి.

తర్వాత వారంలో ఒక రోజు ఉదయం సాయంత్రం నాగేయాలు ప్రసారమయ్యేవి; కొద్దిరోజుల్లోనే నా గేయాలు అందరి నోళ్ళలో మెదిలేవి; ప్రతి సాంస్కృతికి సమ్మేళన ఆహ్వాన పత్రంలో నా పేరు పెద్ద అక్షరాలలో ప్రింట్ అయ్యేది, పేరుకు ముందు కొన్ని విశేషణాలను తగిలించి ప్రింటు చేసేవారు.నాగేయాలు సుగంధాన్ని విరజిమ్ము తాయని...నా కంఠంలో మైథిలి విరహిణి అయిన నాయికవచ్చి కూర్చుంటుందని, జీవితమే గేయాలు పాడుతుందని...ఎన్నెన్నో? ఆమధ్యనే ఫిల్మ్ జగత్తులో పంజాబి 'భాంగ్ డాన్సృత్యం' బాగా ప్రసిద్ధికెక్కింది. ఇప్పుడేమో జానపదగేయాల వంతు వచ్చింది. దీంతో పాటు నా జీవితంలో ఒక క్రొత్త ఊపు వచ్చింది... బొంబాయి, మద్రాసు, కలకత్తా...మరి మధిర, మహిళ, జూదం, దుర్వ్యసనం, విలాసం...పనీబాటా చేయకుండా ఒళ్లును పెంచుకోవటం, మోసం, దగా - రక రకాల వ్యసనాలు, మట్టిలో దాగి మరుగైపోయిన పల్లెపదాలను బయటికి లాగి, డజన్ల కొద్దీ కథలు అల్లి, గేయకథలుగా మలచి, సాంప్రదాయసిద్ధమైన ట్రెడిషనల్ జానపద గేయాలను చెపుతూ - మహా ఆవా, ఘట వారిన్, నైకసున్న

రీ, నైనా జోగిహ, మైనా వంతి, ధోలన్ సర్దార్, దుఃఖా మాఫీ గేయ కథలను తెలివిగా ప్రచారం జేసి ప్రసారం చేశాను. ఒక సినిమాలో దయ్యాల బృంద నాట్యానికి రూపకల్పన చేసి ఓ ప్రొడ్యూసర్ - డైరెక్టర్ కళ్లలో కారం కొట్టాను - మీకు ఏమి తెల్సండి? ఎన్నో కష్టాలకు ఓర్చి నేపాల్ లోని మోరంగ్ తరాయి ప్రాంతంలో నివసించే కోచ్ జాతీయుల ఒఝూ గుణి, ధారు జాతీయుల భగథా, కిరాత జాతీయుల ధామియాల కాళ్ళు పట్టుకొని వాళ్ల సేవచేసి ఈ నృత్య నాటకానికి కావలసిన గేయాలను సంపాదించ గలిగాను...ఈ బృంద నృత్య నాటక గేయాన్ని తర్వాత సెన్సార్ వాళ్లు కట్ చేశారు. హాల్లో సినిమా చూసే టప్పుడు పిల్లలు, ముసలి వాళ్లు, యువకులు కూడ భయపడి మూర్ఛపోయారు.

ఉమ లేక పోతే నేను జలధర్ పుష్పలాల్ కంటే ముందు గానే ఆలోకానికి ప్రయాణం కట్టి వుండేవాడిని. కాని పోయిన సంవత్సరం ఉమ విసుగుచెంది "నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో, ఇక నేనేమి అనను ఇక నిన్ను సంభాలించడం నా వల్ల కాదు ఇక నేను నీతో ఏగలేను" అంది.

ఇక నాకు విచ్చల విడిగా తిరిగే దానికి అవకాశం దొరికి పోయింది. పది నెలలు ఇల్లు వదలి మాయమై పోయాను - కాట్మాండు, కామరూపం, కామాఖ్య, సింగ్ భూమ్ ప్రాంతాల్లోని అడవుల్లో, కొండల్లో, కోనల్లో ఏదో క్రొత్త సభ్యతలో, క్రొత్త లైఫ్ ఫిలాసఫీ ప్రవక్తగా అరడజను మంది దేశ - విదేశాల ఆడపిల్లలతో తిరుగుతూ జీవితాన్ని గడిపాను...రకరకాల వేషాలు వేశాను.

'ఇది ఆసుపత్రిరా! చర్చికాదు!'

అదికాదు, నేను నా తప్పిదాలేమిటో ఒప్పుకోవటం లేదు. నేను చెప్పదల్చుకున్న దేమిటి అంటే - నేనేమి పాపం చేయలేదు. ఈ ప్రపంచంలో అంటే ఈ విశాల వేశ్యల వాడలో నే నొకణ్ణే పుణ్యాత్ముణ్ణి. ఎందు కంటే నేనే దీన్ని రూపు మాపాలను కుంటున్నాను. ధ్వంసం చేస్తాను.

ఉమ నిద్ర మేలు కొన్నది.

నా వైపు చూసి - ముక్కులో నున్న ట్యూబ్ పెరికి పారేశావా!...ఇక నీతో నేను భరించలేను! అంది.

ముక్కులో పుండు అయింది.

అని ఎవరు చెప్పారు?

ఎవరన్నా చెప్పేదే ముంది!...

ఉమ నీలమ్మను పిల్చేదానికి వెళ్ళింది. తెల్లార బోతుంది. కాని నీలమ్మ

అప్పుడే వికసించిన పుష్పం మాదిరి తాజాగా వుంది. "ముక్కులోట్యూబ్‌వుం చుకోవా! వుంచు కోవటం ఇష్టం లేదా! అంటూ ట్యూబ్ లోపల పెడుతూ పీల్చండి అంటూంది. వాంతి అవుతుందా! కాదు. కాకుండా నేను చూచుకుంటాగా! మా బంగారు కొండ కదూ!"

నీలమ్మ 'బంగారు కొండ' పదాన్ని ఎక్కడ నేర్చుకుందో, కాని సరియైన సందర్భంలో, టక్ మని అనేస్తుంది ఇక మరల ట్యూబ్ తీశా వంటే నేను వచ్చి నీ రెండు చేతులు మంచానికి కట్టి పడేస్తానని బెదిరించింది.

ఇదేమిటి? నేను నీలమ్మ ప్రేమలో పడ్డానా? నేను నీలమ్మ ప్రేమలో పడ్డా నని ఉమ అను కొంటుందా? ప్రేమలో పడటానికి నాకు ఆసుపత్రే దొరికిందా!

మూర్ఖముండా కొడకా! ఇప్పుడు నీలమ్మను గాని ఏ అమ్మను గాని ప్రేమించి నీవు ఏమి చేస్తావు? బొందిలో ప్రాణం వున్నంత వరకు కామాగ్ని ఆరి పోదేమో! నీలమ్మను చూస్తునే నా శరీరంలోని రోమరోమం నినాదం చేస్తుంది. సరిగ్గా పద హైదు ఏళ్ళు క్రితం ఉమను చూడగానే ఇలానే అయ్యింది.

నీలమ్మ నా ఆక్సిజన్ సిలెండరు! ప్రేమను పునఃప్రజ్వలింప జేసే మిధున రాశి కన్యక!

'ఏమిరా, మరలా కవిత్వం మొదలెట్టావు?'

పుష్పలాల్ తన లెటర్ ప్యాడ్‌పైన ఒక మూల మిథున రాశి చిహ్నాన్ని ప్రింటు చేయించుకున్నాడు-మైథున లీలలో లీనమై వున్న అర్ధ నగ్న పురుషుల జంట! గత అయిదేండ్ల నుంచి ఉమ నాతో బాటు నిద్ర పోవటం లేదు. నిద్ర పోవటం లేదు అంటే శరీరసంపర్కానికి దూరంగా వుంటున్నది అన్నమాట. ఆవిడ నా అవ యవాలను అపవిత్రంగా అసహ్యకరంగా భావిస్తుంది. నాకు ఈ అయిదేండ్ల నుంచి ఉమ అంటే సిగ్గేస్తుంది...నేను కిశోరావస్తలో వున్నప్పుడు, అంటే గుప్తాంగాలపైన నల్లనల్లని వెంట్రుకలు మొలిచేప్రాయంలో ఒక నాటి ఉదయాన నేను 8 గంటలకు నిద్రపోవటం చూచి మా అమ్మ కోపంతో వచ్చినా దోమతెర తొలగించి నేను కప్పుకొన్నదుప్పటి లాగేసింది. దుప్పటి కింద నేను నగ్నంగా పడి వున్నాను...త ర్వాత ఏడెనిమిది రోజులవరకు అమ్మకు ఎదురుగా రావాలంటే నాకు సిగ్గయ్యేది... అటు వంటి సిగ్గే నాకు ఇప్పుడు ఉమ అంటే కలుగుతుంది. నా కుటుంబీకులను, పరిసరాల ప్రేమ సంబంధాలను కలుషితం చేశానన్న దోషారోపణ ఆమె నాపైన వేస్తున్నందుకు నేను సిగ్గు చెందుతున్నాను.'

ఈ విషయాన్ని అలా వుంచినా, అసలు విషయం ఏమిటంటే నేను పూర్తిగా

దివాలా కోరునయ్యాను. మద్యం! పాము విషంతో తయారైన మద్యాన్నికూడా నేను వదలలేదు. అధికమోతాదులో మద్యపానం, గంజాయి, భంగు, సిగరెట్టు సేవించడం వల్ల నా కంఠ స్వరం వికృతమైంది. ఇక ఈ స్వరం కచేరీలో రాణించదు. ఏ కంఠస్వరంతో నేను సంపెంగ పూల కుసుమ కోమల రేఖలు రాలే శబ్దాలను వినిపించకలిగానో ఆకంఠస్వరం నుండి ఇప్పుడు బొంగురు గొంతుక ధ్వనులు విన్పిస్తాయి. పాడటమే చేత గానప్పుడు ఈ జీవితానికి ప్రయోజనమేమిటి? మా ఇంట్లో అలమారాలో ఇప్పుడూ డింపర్ మార్కు సారా సీసావుంది. నేను లేక పోతే బాటిల్ ఎవరు తాగుతారు? ఉమ దాన్ని తీసి కిటికీ నుండి బయట పారేస్తుంది. ఊహూ! బయట పారవేయలేదు, పారవేయాలని అనుకున్నా పారవేయలేదు; తను బ్రతికి నంత కాలం దాన్ని భద్రపరుస్తుంది, తన పూజా గదిలో కాళికామాత ఫోటో వద్ద వుంచు తుంది. గంగా జలం ప్రక్కన - గంగా...గంగా...

పాట్నాలో ప్రవహించే గంగా నదిని అందరూ మగహీ గంగా, అంటే పుణ్యహారిణి గంగా అని అంటారు. అందువల్లనే పాట్నా వద్ద గంగానదికి స్నానఘట్టాలు లేవు. ఒకటి రెండు కూడా లేవు - గంగా నది ఇక్కడ చెప్పలేనంత కలుషితమై వుంటుంది. కావున అటువైపు ఎవరు మొహం కూడా త్రిప్పలేదు. పాట్నా వద్ద వున్న గంగా నది ఒడ్డున కాలే శవాలకు శాంతి గానీ, ముక్తిగానీ దొరకదు, కాబట్టే పుష్పలాల్ లాంటి విప్లవ కవిని అటువైపున సెమరియా ఘాట్‌కు తీసుకెళ్ళి కాల్చారు...కాని గంగానది ఒడ్డున వున్న పాట్నాక్లబ్‌లోని రమణీయమైన లాన్‌లో కూర్చుని మత్తుతో మందుకొట్టేటప్పుడు లేదా పాట్నా మెడికల్ కాలేజి ఆస్పత్రిలోని రమణీయమైన లాన్లో కూర్చుని మత్తుతో మందు కొట్టేపుడు లేదా పాట్నా మెడికల్ కాలేజి ఆస్పత్రిలో బెడ్‌పైన పడుకొని మందు త్రాగేటప్పుడు మనసులో జై గంగా! జైగంగా అనే ధ్వనులు మారుమ్రోగుతాయి. ఈ ఆస్పత్రిలో అడ్మిట్ అయ్యే 70 శాతం రోగులు ఈ సర్వ రోగ వినాశిని గంగానది నుంచి వీచేగాలి ప్రభావం వల్లనే ఆరోగ్యం చేకూర్చు కొంటారని, చచ్చిపోతూ చచ్చిపోతూ బ్రతికి బట్ట గడతారని నానమ్మకం.

ఘాట్ నుండి స్టీమర్ ఏదో బయలు దేరిపోతున్నట్లుంది. ఇప్పుడు స్టీమర్లకు క్రొత్తసైరన్లు అమర్చి నట్లుంది. విచిత్ర శబ్దాలతో సైరన్ మోత - నదీ గర్భాన్ని చీల్చుకొని ఆరోహ - అవరోహ ధ్వనులలో వస్తున్న శబ్దం...ఈ క్రొత్త సైరన్ పేరేమిటో తెలుసుకోవాలి!

కాదు, స్టీమర్ కాదు. ఇది క్రైసెస్!! అంటే ఆక్సిజన్ సిలెండర్ తీసుకొస్తు

న్నారు. నేల పైన గచ్చుమీద ఈడ్చుకొని వస్తున్న శబ్దం దగ్గరౌతుంది. అరే, దాన్ని నావద్దకే తీసుకొస్తున్నారే! మరలా నా వద్దకు ఎందుకు తీసుకొస్తు న్నారు? నేను స్పృహలోనే వున్నాను. మేల్కొని వున్నాను. నా మంచానికి స్టూలును ఆనించి నా ఎడమభుజం వద్ద తలపెట్టి ఉమనిద్రపోతూ వుంది. నెమ్మదిగా 'ఉమా!' అని పిలిచాను. నోట్లో నుంచి మాట వెలువడక ముందే సిలెండర్‌ను లాక్కొచ్చే వాడు ఎగిరి నా మూతిని నొక్కి పట్టుకొంటాడు. సిలెండర్ను లాక్కొచ్చిన వాడు వార్డు బాయ్ కాదు, కాని పోలీసు ఇన్స్పెక్టరు. అతని వెంట చాలా మంది పోలీ సులు వచ్చారు. వారు నా మంచాన్ని చుట్టు ముట్టారు...వాళ్లు నన్ను సోదా చేస్తా రట. నేను రజాయి క్రింద అశ్లీలమైన పుస్తకాలు, గంజాయి, నర్సు నీలమ్మ శ వాన్ని దాచానట. చూడు ఉమా! వీళ్ళు ఏమంటున్నారో వింటున్నావా? పోలీసు ఇన్స్పెక్టరు 'నోరు మూసుకో, బడవా!' అని అరిచాడు. ఒకపోలీసు నా రజాయిని లాగెయ్యాలని ప్రయత్నిస్తాడు. నేను ప్రతిఘటిస్తాను. రజాయి క్రింద నేను నగ్నంగా వున్నాను...దొంగ నాయాళ్ళారా! లంజ కొడుకుల్లారా...నీ అమ్మ...నీ అక్క,...అని తిట్లు తిటుతూ నేను తన్నటం మొదలు బెట్టాను. ధనాధన్...తన్నుల చప్పట్లకు తగ్గట్టు నగాడా వాయిద్యపు ధ్వనులు వినబడుతున్నాయి...మొహాలపైన, కడుపు లపైన, పిరుదులపైన. ఇంత గొడవ జరిగిపోతున్నా ఉమ మాత్రం నిద్రపోతున్న ఆవిడ నిద్ర పోతూనే ఉంది. అప్పుడు రజాయి క్రిందనుంచి మెడబయటికి పెట్టి నీలమ్మ - "పోలీసులు అందరూ వెళ్ళిపోయారా? ఇక నీవు నన్ను గప్ చిప్‌గా చంపే సెయ్యి, రా!" అని అంది. రజనీ గంథ సువాసనతో నా నాసికారంధ్రాలు నిండిపోయాయి. నీలమ్మ చాలా వినయంగా 'ప్లీజ్ కిల్‌మీ...కిల్‌మీ!' అని అంటు న్నది. నేను ఉమని కదిపిలేపాను. ఉమ దొర్లినేలమీద పడింది జల తరంగం వాయించినట్లు సంగీత ధ్వనులు వినపడ్డాయి. ఆధ్వనులు ఉమ దొర్లి పడినందు వల్ల ఏర్పడినాయొ లేక నీలమ్మ కిలకిల నవ్వటం వల్ల ఏర్పడి నాయో తెలియ టంలేదు. నేను కూడా నీలమ్మతో పాటు నవ్వాలను కుంటాను కాని నవ్వుకు బదు లు, 'అమ్మ, అమ్మ' అంటూ ఏడవసాగాను. నేను ఏడుస్తు ఉంటే నీలమ్మ నా ఏడుపుతో పాటే శృతి కలుపుతూ 'రామప్రసాది' ఆలపిస్తుంది - 'అమ్మా, అమ్మరో!' అసలు విషయం ఏమిటంటే ఏడ్చేదానికి బదులు పాడుతూవున్నాను!

నేను సమాధి స్థితిలో లేను కదా! కలా? ఏది నిజమో, ఏది కలో తెలియటం లేదు. ఏది ఏమైనప్పటికి నేను నీలమ్మను హత్య చేయలేదు. అదిగో నీలమ్మ డాక్టరుకు హెల్ప్ చేస్తుంది. డాక్టరు 'నేను కలలో కాళ్ళు చేతులూ జోరుగా కొట్టు

కుంటున్నానట అని అంటున్నాడు. ఈయన నన్ను ఇక్కడ గట్టిగా పీక్కు తిన్నాడు. నొప్పి తాళలేక నేను నవాల్ జిన్ తీసుకొవాల్సి వచ్చింది..." నీలమ్మ నవ్వుతూ డాక్టరుతో అంది.

నాకు మరల ఈ రోజు ఇంజక్షన్ ఇస్తున్నారు.

ఉమ నా వైపు చాలా గాభరాగా చూస్తూఉంది. ఎందుకో మరి! జీవితంలో ఇంతకు ముదు ఎన్నడూ ఆవిడ మొహంలో ఇటువంటి గాభరా నేనెప్పుడూ చూడలేదు. బొంగురు పోయిన స్వరంతో "ఏమైంది? ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నావు? ఇప్పుడు ఎలా వుంది నీకు ? చెప్పండి...మాట్లాడండి...శిభూ...ఓ శిభూ!" ఉమ నన్ను అడుగుతూంది.

ఉమ వున్నట్లుండి కేక లేసింది. మిన్ను విరిగి మీద పడ్డట్లు అన్పించింది. నక్షత్రాలన్నీ ఒక్కొక్కటే రాలి పోతున్నట్లు - "అమ్మా! మమ్మల్ని సర్వ నాశనం చేస్తావా!...అలా చేయవద్దు తల్లీ! నాకు ఎవరూ గతిలేరు..డాక్టరు బాబు గారు! మీరు తప్ప నాకు ఎవరు దిక్కులేరు...ఊ!ఊ! డాక్టరు బాబు గారు!"

నాకు అంతా వినపడుతూనే ఉంది, అంతా చూస్తూనే ఉన్నాను. కాని నోరు మెదపలేక పోతున్నాను. నీలమ్మ ఉమను రెండు చేతుల్తో పట్టుకొని లేపి ఆమెకు నచ్చ చెప్పుతుంది - 'ఒక క్రొత్త డ్రగ్ యిచ్చాము. దాని రియాక్షన్ ఇది. కొద్ది సేపట్లో నయమవుతుంది. ఇప్పుడు ఇంజక్షన్ ఇచ్చాము కదా...'

సర్జన్ అజయ్ ఉమను మందలిస్తాడు - 'ఉమా! ఏమిటి ఈ రభస?'

'నాశిభూ మాట్లాలేక పోతున్నాడు ఎందుకో చెప్పండి డాక్టరు గారు.'

'మాట్లాడు తాడు...ఇప్పుడే మాట్లాడుతాడు...నీవు కొద్దిసేపు నోరు మూసుకొని వుండు!'

'సరే డాక్టరు గారు నేను ఇక మాట్లాడను.'

హార్ట్ స్పెషలిస్ట్ డాక్టరు శ్రీవాస్ వచ్చారు. అతని తెల్లటి పొడవైన గడ్డాన్ని చూసి నాకు కవిరాజు చక్రవర్తి గుర్తుకు వచ్చారు. కవిరాజు చక్రవర్తి రోగి వాసన చూసి రోగ నిర్ధారణ చేసేవారు. దూరం నుంచే నన్ను చూసి డాక్టరు శ్రీవాస్ - 'హార్ట్ నార్మల్‌గా ఉంది' అని అంటాడు...

మెడిసెన్ డాక్టరు దాసు గారు వస్తారు. ఆయన నాకు దూరం గానే వుంటూనే పరీక్షి స్తాడు. ఎవరూ నన్ను ముట్టుకోవటం లేదు. వాళ్ళు నన్ను నోరు విప్పి మాట్లాడ మంటున్నారు. నేను, మాట రావటం లేదని చేతులతో సైగ చేసి చెప్పాను - 'అవును! రియాక్షన్ అయింది' అని అంటాడు డాక్టరు.

గొంతుకేన్సర్ అయితే ఇలానే అవుతుందని నాకు తెల్సు. ఇంతకు ముందు ఇలాంటి కేసులు నాకు తెలుసు. నోరు వున్నట్లుంది మూగ బోతుంది. ఒక వేళ మాట తిరిగి రాక పోతే! ఓకల్ కార్డ్సు గానీ డ్యామేజ్ కాలేదు కదా! 'నేను డాక్టరు ను అడగాలను కుంటాను - డాక్టర్?...

అందరూ ఒక్కుమ్మడిగా అరిచారు - మాట వచ్చింది!

కరెంటు పోయి మళ్ళీ తిరిగి వస్తే అందరూ ఇలానే ఒక్కసారిగా అంటారు - వచ్చింది. కాని ఉమకు ఇంకా నమ్మకం కలుగలేదు ఆమె నా వద్దకు వచ్చి - 'మాట్లాడండి, చెప్పండి, నేను ఎవర్ని?' అని అడుగుతుంది.

నాకు నవ్వువస్తుంది. ఇది కలకాదు గదా. అని నేను ఆశ్చర్యంగా అడుగుతా ను.

'నీకు ఏమని పిస్తుంది?' ఉమ ప్రశ్నిస్తుంది.

నేను మంచంపైన పక్కకు పొర్లడానికి ప్రయత్నిస్తాను. ఉమ వారిస్తుంది...క డుపు మధ్యభాగంలో భరించలేనంత ఈ బాధ ఏమిటి?...నాకడుపుపైన ఏమన్నా భారం వుంచారా! కొంచెం కూడా అటు యిటు కదలలేక పోతున్నాను. లేక నీలమ్మ నిజంగానే నన్ను మంచానికి కట్టి వేసిందా.

పాట్నా టైమ్స్ స్టాఫ్ రిపోర్టర్ మిత్తల్ వచ్చాడు. ఉమను అతను ఏదో అడు గుతున్నాడు - 'ఆపరేషన్ తరవాత సరిగ్గా పది గంటలు గడిచిన తర్వాత ఇప్పుడే కొన్ని నిమిషాల క్రితం స్పృహలోకి వచ్చాడు ఇప్పుడు బాగుంది' అంటూ ఉమ చెప్పింది.

ఆపరేషనా? ఏమి ఆపరేషన్? ఎప్పుడు చేశారు నాకు ఆపరేషన్?

ఉమ నవ్వుకుంటూంది - డాక్టర్ అజయ్ పదిగంటలతర్వాత ఇప్పుడే తన ఇంటికి వెళ్ళిపోయాడు.

మరి డాక్టర్ శ్రీవాస్, డాక్టర్ దాస్ ఎప్పుడు వెళ్ళారు?

ఉమ ఆశ్చర్యంగా అడుగుతుంది - 'డాక్టర్ శ్రీవాస్, డాక్టర్ దాసా? వాళ్లు ఎప్పుడు వచ్చారిక్కడికి?'

నాకంఠ ధ్వని విరిగి పోయిన తాళాల ధ్వని మాదిరి ఉందా?

లేదే!

నాకు డ్రగ్ రియాక్షన్ అయిందా? వున్నట్లుంది నానోరు పడిపోయివుందా?

నీవు పదిగంటల వరకు అపస్మారక స్థితిలో వున్నావు.

మరి నీలమ్మ? నీలమ్మను ఒకమారు ఇటు పిలవరాదు.

నీలమ్మ ఎవరు? ఉమ ఆశ్చర్యంగా అడుగుతుంది.

నన్ను నేను గిచ్చుకొని పరీక్షించు కొన్నాను-నేను నేనా కాదా అని! అవును నేను నేనే. ఇది కలకాదు. ఇప్పుడు...నేను కలకాదు. మళ్ళీ సందేహం ఏర్పడు తుంది. భయపడుతూ, భయపడుతూ ఉమతో అంటాను - 'సరే ఉమ, పుష్పలాల్, ఆ ఎదురుగా వుండే వార్డులోనే చనిపోయాడు కదా?'

ఉమ విసుగుతో అడుగుతుంది - "ఏ పుష్పలాల్? ఎవరండి పుష్పలాలు? నీవు మాట్లాడేది ఏమిటో నాకు అర్థం కావటం లేదు! మాట్లాడకండి. డాక్టరు మాట్లాడ వద్దని చెప్పాడు."

ఇదంతా కలేనని అర్థమైంది. ఈ స్వప్నం నుంచి ముక్తి పొందటం అసంభవం! ముక్తి పొంది కూడా ఏమి చేయగలను? గంగా నది ఒడ్డుకు వెళ్ళి, నీటిలో నాశరీరాన్ని చూసుకుంటూ  నా సుందర రూపాన్ని పొగుడుకుంటూ కూర్చుంటే బాగుంటుందేమో! జీవితమంతా ప్రపంచంలోని ప్రతి వస్తువులోనూ, ప్రతి వ్యక్తిలోనూ ప్రతి బింబాన్ని వెదుక్కుంటూ చూసుకుంటూ ముగ్ధుడనై వచ్చాను...'నార్సిసస్?' నాన్‌సెన్స్! కలలో ఒక మారు పాడాలని అను కుంటాను, నాకంఠ ధ్వని ఎంత వరకు విన్పిస్తుందో! గంగా నది ఆవలి ఒడ్డున...శ్వేత సైకత్ శయ్యల కు అటు వైపు పచ్చని పొలాలపైన ఎగురుతున్న...లేక పోతే నది జలగర్భంలో మ్రోగేసైరన్ మాదిరి అగాధ జలాల లోతుల్ని వెతుక్కుంటూ నా కంఠస్వరం కిందికి వెళ్తుందేమో!

(1970)

# అగ్ని భక్షకుడు

సూర్యనాథ్ బయటికి వెళ్లాలని బయలుదేరాడు. ఇంత లోనే భార్య, "ఎక్కడికి వెళ్తున్నావు? ఈ వేళ పది గంటలకు ఆభా కొడుకు వస్తున్నాడు" అని అతనికి అడ్డుతగిలింది.

సూర్యనాథ్ చొక్కా గుండీలు పెట్టుకుంటున్నాడు. భార్య మాటవిని అతని చెయ్యి ఆగిపోయింది. రాత్రి ఇంటికి వచ్చినప్పుడు, "ఈవేళ ఆభా కొడుకు బజారులో అగుపించాడు...అరే, 'ఆభా' అంటే గుర్తు రాలేదా? ఆమేనండీ, మీ ఆభారాణీరాయ్ ఆమె కొడుకంటే వాడే! ఆమె కొడుకే!" అంది.

"చూడటానికి ఎట్లున్నాడు?...అంటే పిల్లవాడి మొక్కట్లు ఎవరి పోలిక-అంబు లెన్స్ డ్రైవరు మొక్కట్లా, బట్టల దుకాణం ముసలియజమాని పోలికా?" సూర్య నాథ్ భార్యను అడిగాడు.

"నేను ఇవన్నీ పరిశీలించి చూడలేదు. రేపు ఉదయం పది గంటల కొస్తాడు గా! అప్పుడే చూసి తెలుసుకోండి. వాడి కెవరి పొలికలెచ్చాయో? " భార్య జవా బిచ్చింది.

"మరి నువ్వు బయటికి వెళ్తున్నట్లుందే!" తొడుక్కున్న చొక్కా విప్పుతూ సూర్యనాథ్ అన్నాడు.

"అతను మీతో కలవటానికి వస్తున్నాడు. మీకేదో ఇన్ఫర్మేషన్ ఇవ్వాలట! భార్య నవ్వుతూ అంది: ఆ మరిచాను. నిన్న ఆకుర్రవాడు నన్ను కొంతసేపు ఇబ్బంది లో పెట్టాడు. ఎక్కడి నుంచి వచ్చాడో ఏమోకాని, ఉన్న పళంగా నాముందుకొచ్చి నిలబడి, మీరు అన్నపూర్ణ అమ్మగారు కదా? నన్ను గుర్తు పట్టారా? నేనెవరినో! తర్వాత అతనే అన్నాడు, ఎట్లా గుర్తుపడ్తారులేండి -ఎప్పుడూ చూడలేదు కదా! మీ ఆభారాణి కొడుకును..." అతని మాటలు విని నేను ఆశ్చర్య చకితు రాలైనాను.

"మీ ప్రియమైన ఆభారాణి అని అనలేదా" సూర్యనాథ్ వ్యంగ్యంగా అన్నా డు.

అన్నపూర్ణ వర్కింగ్ ఉమెన్స్ అసోషియేషన్ వారి సర్క్యులర్ లెటర్‌ను

తన బ్యాగులో పెట్టుకుంటూ 'నా ప్రియమైనా, మీప్రియమైనా?' అన్నాడు.

'నీ ప్రియమైన ఆభారాణి.'

"వాడితో అనవసరపు మాటలు మాట్లాడొద్దు" అంటూ అన్నపూర్ణ నవ్వి బయటికెళ్లి పోయింది. 'పిల్లవాడు తొలి సారి మనింటికొస్తున్నాడు. బిస్కట్లు స్వీట్లు ఉన్నాయి. టిఫిను పెట్టండి' అని పోతూ పోతూ చెప్పింది. సూర్యనాథ్ మానస పటలం మీద అరే పద్దెనిమిది సంవత్సరాలనాటి అవిస్మరణీయ సంఘటనలెన్నో చిత్రాల మాదిరి మెదిలాయి.

...అప్పుడు అన్నపూర్ణ మెటర్నిటీ సెంటరుకి అనరరీ సెక్రెటరీగా ఎన్నికయింది. అందువల్ల యింటికి, లేడీ హెల్త్ విజిటర్సు నర్సులు, మిడ్‌వైఫ్ ట్రైనింగు పొందడానికివచ్చే ఆడపిల్లలు తరచుగా వస్తూ వుండేవారు. అన్నపూర్ణ వాళ్ళను ఇంటికి రావద్దని చెప్పింది.

...కానీ ఆభారాణిరాయ్ సెంటరులో ట్రైనింగు కొరకు చేరిన తర్వాత ఆమెను అన్నపూర్ణే స్వయంగా యింటికి తీసుకొచ్చి, 'ఇదుగో ఈమె ఆభారాణిరాయ్. మా సెంటరులో ట్రైనింగు కోసం చేరింది. బెంగాలీ కీర్తనలు వినాలన్నావు గదా!' ఎన్ని కీర్తనలు వింటావో విను. ఈవిడ కీర్తనలు చాలా బాగా పాడుతుంది. ఈ విడ శరణార్థికాదు, పాపం వితంతువు! అని పరిచయం చేసింది.

'శ్యామా సంకీర్తనలా?' అని సూర్యనాథ్ అడగ్గా ఆభారాణి మెల్లగా 'కృష్ణుని కీర్తనలు' అంది.

సూర్యనాథ్ కండ్లుపైకెత్తి ఆభాను పరీక్షగా చూశాడు. యుక్త వయస్సులోనే వితంతువులైన ఎంతోమంది ఆడవాళ్ళను తాను చూశాడు. అందరి మొహాలు ఇలాగే వుంటాయి...కానీ ఈవిడ ముఖంలో ఎంతో లావణ్యం కన్పిస్తోంది. అందువల్లనే అతను 'ఆభా పేరు సార్థక నామధేయం' అన్నాడు.

సూర్యనాథ్ అభిప్రాయాన్ని అన్నపూర్ణ కంటే ముందు ఆభానే తెలుసుకుంది. ఆమె నవ్వి, 'మీరు కవి పుంగవులు' మీకు మాటలు చెప్పాలా! అంది.

'మీకెవరు చెప్పారు నేను కవినని? శ్రీమతి అన్నపూర్ణ చెప్పిందా?'

'కాదు నేను కవి అని చెప్పలేదు. రచయిత' అని అన్నాను. అన్నపూర్ణ నవ్వింది.

'రెండూ ఒకటే కదా?' అంటూ ఆభారాణీ తన కుడి కన్ను అదోలాగ మూసుకుంది. దీన్ని సూర్యనాథ్ గమనించి అర్థం చేసుకొన్నాడు.

"వితంతువు కాదు, పరిత్యక్త, భర్తఆమెను వదిలేశాడు." అని ఆభావెళ్ళి

పోయిన తరువాత అన్నపూర్ణ చెప్పింది.

సూర్యనాథ్ కూడా ఆభా మాదిరే కుడికన్ను మూసుకుంటూ "రెండూ ఒకటే అన్నాడు."

'రెండూ ఒకటే ఎట్లా అవుతుంది?'

"భర్త ఈమెను వదిలేయకున్నా పాపం అతను చనిపోయి వుండేవాడే! అప్పుడూ ఈమె విధవ అయి వుండేది." అని సూర్యనాథ్ అనటం చూస్తే ఈయనకు ఆభా గురించి, ముందే తెలిసినట్లుంది. అందువల్లనే అన్నపూర్ణ వెంటనే అడిగేసింది. 'అంటే ముందు నుంచే ఈ విడ మీకు తెల్సునా? అటువైపే, అంటే పూర్ణియా సహర్సావైపు ఏదో వూళ్ళో వుంటుందట.'

ఏవూరయితే ఏం గానీ, ఈ విడ ఒకరికి భార్యగా ఉండటానికి పుట్టలేదు. నీవు చూశావు గదా! స్వభావంలో సఖ్య భావం ఉంది. ఈమె ఎవరికైనా సఖి కాగలదు. కానీ భార్య కాలేదు. అని నవ్వాడు సూర్యనాథ్.

భర్త నవ్వటం జూసి అన్నపూర్ణకు సందేహం కల్గింది. 'మీరనేది ఏమిటంట?' అంది.

'శ్రీమతి గారు! నేను అన్నది అర్థం చేసుకోవాలంటే వైష్ణవ సాహిత్యాన్ని గురించి కూలంకషంగా వివరించ వలసి వుంటుంది!'

"అదే నేనడిగేది ఒకరికి సఖిగా వుండటమంటే ఏమిటి?"

అన్నపూర్ణకు అనుమానంగా ఉన్నదని సూర్యనాథ్ తెలుసుకున్నాడు. ఆమెకు అనుమానం కలిగి కోపమొస్తే ఆమెకు నచ్చ చెప్పటం చాలా కష్టం. గంటల కొద్దీ బుజ్జగించి, రకరకాల ఒట్లు వేసుకోవాలి. 'అందువల్లనే,' 'సఖి అంటే స్నేహితురాలు అని అర్థం...నేను చెప్పేదే మంటే ఇలాంటి పిల్ల మగవాళ్లతో స్నేహితురాలుగా మాత్రమే ఉండ గలదు అని.'

అన్నపూర్ణ అప్పటికేమో మాట్లాడకుండా ఉండి పోయింది. కానీ మరల కొద్దిసేపటికి కానీ భర్త ఈ విడను వదిలేయక పోతే పాపం అతను చనిపోయివుండేవాడు. అని అన్నావు కదా, దీని అర్థమేమిటి అని వెంటనే రెండో ప్రశ్న వేసింది. 'ఆమె మొహం చూసి నేనలా అన్నాను. సూర్యనాథ్ జవాబిచ్చాడు.'

"మీకేదో పెద్ద జ్యోతిష్యం తెలిసినట్లు."

"త్రిభుజాకారంగా ఎత్తయిన నుదురు, మెరిసే పాపటి. ఇటువంటి శరీరాకృతి ఉన్నస్త్రీ ఎక్కువ ఎనర్జిటిక్‌గా ఉంటుంది. ప్రమది, ప్రమదామణి."

"సరే ఆభా, కవి పుంగవుడన్నది కదా దాని అర్థం ఏమిటో తెలుసా?"

"కవి పుంగవుడంటే రసిక పురుషుడన్నమాట."

"ఇంతే కాదు. దీనికింకా చాలా అర్థముంది...సాహిత్యకుల నడత కొంచెం సరిగా వుండదు! ఇది అందరూ ఎరిగిందే."

"కొంచెంగా కాదు పూర్తిగా" సూర్యనాథ్ స్వీకారోక్తిగా తల ఆడించాడు.

ఆ రాత్రి చాలా నేపటి వరకూ ఇద్దరూ ఒకరి నొకరు ఎక సక్కలాడుకుంటూ, నవ్వుతూ పేలుతూ ఒకరి నొకరు ఎగతాళి చేసుకుంటూ మేల్కొనేవున్నారు.

...ఆవేళ, హరి కథ నాటి సాయంత్రం.

తొలిసారి హరి కథలో సూర్యనాథ్, అన్నపూర్ణ, ఆభారాణీ కీర్తనలు విని నిజంగానే మంత్రముగ్ధులయ్యారు. తర్వాత, ఆభా వాళ్ల ఇంటికి వచ్చి కీర్తన పాడ్తానంటే అన్నపూర్ణ ఒప్పుకోలేదు. కీర్తనలు, భజనలు హరి కథలు దేవాలయంలో వింటే బావుంటాయి.

అన్నపూర్ణ చాతుర్యాన్ని తెలివి గల ఆభా గుర్తించి, మనస్సులో ఆమెను తిట్టుకుంది. ఒకరోజు ఆభా సంచి తగిలించుకొని మాయింటి కొచ్చింది.

"అక్కయ్యా! నేను అక్కగారికి, బావగారికి ఒక స్పెషల్ డిష్ తయారు చేసి తీసుకొచ్చాను. దయచేసి దీన్ని ఆరగించండి."

ఆవేళ ఆభా ఎంతో శ్రమపడి తను చేసుకొచ్చిన 'మీగడ కరి' సూర్యనాథ్ కు, అన్నపూర్ణకు రుచి చూపించింది. సూర్యనాథ్ రుచి చూసి నాలుక నాక్కుంటూ ఏదో అనాలను కున్నాడు. ఇంతలోనే అన్నపూర్ణ మందలిస్తూ, అడ్డు పడింది. 'మీరు ఏమి చెప్పాలనుకున్నారో నాకు తెల్సు 'అద్భుతం' ఇదే గదా?'

'కాదు. ఇది కాదు. నేను అద్భుతానికి బదులు 'భీషణ్ సుందర్ ' అనాలను కున్నాను. కానీ నీవునన్ను అడ్డగించావు గనుక, అపూర్వమని మాత్రమే అంటు న్నాను.'

పచ్చి కొబ్బరి పాలు తీసి దాంట్లో రోహూ చేప బొద్దులేసి...సూర్యనాథ్ బెంగాలీ వైష్ణవ సాంప్రదాయకులువాడే భాషలో 'ఓహో, క్షీరసాగరంలో స్వయంగా భగవంతుడు మత్స్యా వతారంలో వచ్చా డన్నమాట' అని నవ్వాడు.

"బావగారూ, మీరు రసికులే కాదు. సురుచిగల రసికులు."

"సురుచిగల కాదు. జిహ్వా చాపల్యం గల తిండిపోతుని! ఒక్కసారి ఢిల్లీలో గొంతు వరకు తిని...మధ్యలోనే సూర్యనాథ్ అందుకొన్నాడు. అవునవును. అవస్థీ గారింట్లో అక్కడగూడా ఇటువంటి భోజనమే. రకరకాల కూరలు. అవస్థీగారి మర దలు తయారు చేసింది. ఈవిధంగానే వడ్డించి తినమన్నారు. అప్పుడే అవస్థీ

మరదల్ని సంస్కృతంలో ' కేళికుంజిక' అంటారని" అన్నప్పుడు గుర్తు!

"ఆభా కొంచెం జాగ్రత్తగా ఉండు," అన్నపూర్ణ నవ్వుతూ అంది.

వర్షపు నాటి ఒక సాయంకాలం...పరుగెత్తుకుంటూ ఆభా ఒంటరిగా వచ్చిం ది. 'అక్క ఇంట్లో లేదా?'

"అరే నీవు వెళ్లలేదా? నిన్ను తనతో తీసుకెళ్లలేదా అన్నపూర్ణ? ఈ వేళ వర్కింగ్ ఉమెన్స్ వాళ్ళ 'చారిటీ షో' ఉంది గదా" సూర్యనాథ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఈ వేళ నాకు 'ఆఫ్టర్‌నూన్ డ్యూటీ' ఉండింది. నేను పూర్తిగా తడిసి పోయాను బావగారూ."

బాత్ రూముకు వెళ్ళి అన్నపూర్ణ చీర, రవిక వేసుకొని ఆభా బయటి కొచ్చిం ది. సూర్యనాథ్ చేతిలో టీ కప్పు తీసుకొని నిలబడ్డాడు. "టీ కాదు, దీంట్లో 'గులె బన్ ఫసా' కషాయం-అల్లం, నిమ్మకాయ రసంతో కలిపింది. చుట్టు ప్రక్కల ఫ్లూ ఉంది. గటగటా తాగండి. ఏం ఫరవాలేదు." ఆభా ఒక గుక్కెడు తాగింది. నిజం గానే కషాయమే. కషాయమే మరి! కానీ మీరు ఏమనుకున్నారు? చెప్పండి సూర్య నాథ్ అడిగాడు.

"చూడండి మీరు నన్ను 'మీరు' అని ఎందుకంటారు?" ఆభా మృదువుగా అడిగింది.

"నేను టీలో ఏమన్నా మత్తు పదార్థం కలిపానని మీకు సందేహం వచ్చిందా?"

"మీ మీద నమ్మకం ఏమిటి? మీకేం, మీరేమయినా చెయ్యగలరు" అని ఒక నవ్వు విసిరి సూర్యనాథ్ వైపు చూస్తువుండి పోయింది.

"మీరే మన్నా తక్కువ తిన్నారా! మీరు కూడా సాహసవంతులే!"

"నన్ను 'మీరు' అని పిలిస్తే నేను జవాబివ్వను."

సూర్యనాథ్ ఆవిడ వద్దకు వెళ్లి కూర్చున్నాడు. ఆవిడ తడిసిన వెంట్రుకల్ని విరగబోసుకొని ఆరబెట్టుకుంటూంది. "నిజంగానే మీరు టీలో మరేమి కలుప లేదా? అయితే నా శరీరంలో పంపర ఎందుకు మొదలయింది. తల తిరుగు తుందే మరీ." ఆభా ఉన్నట్లుంది అడిగింది.

సూర్యనాథ్ కషాయంలో గుల్‌బన్ ఫుషా , నిమ్మకాయ రసం, అల్లం తప్ప ఏమీ కలుపలేదు. అయినప్పటికి ఆభాకు మత్తుగా వుందంటే తనేంజేస్తాడు?

'ఆభారాణి!'

సినిమా హీరో మాదిరి ఆభా సూర్యనాథ్ భుజం మీద తన తల పెట్టింది.

సూర్యనాథ్ శరీరం వేడెక్కింది. యాంత్రికంగా అతని బాహువులు ఆమెను కౌగి లించుకున్నాయి. బయట ఆకాశంలో మెరుపు మెరిసింది. మేఘాలు ఉరిమాయి. సూర్యనాథ్ వేడెక్కిన శరీరం వెంటనే చల్ల బడింది. అతను ఆభాను వదిలించు కొని ప్రక్కకు వచ్చాడు. "ఎవరూ రాలేదు - గాలి వల్ల కిటికీ తెరుచు కుందిలే, సూర్యదేవ్..బావ గారూ...మీరు ఏలోకంలోకి వెళ్లిపోయారు...?" ఆభా అస్పష్టం గా అన్నది.

ఈ సంఘటన తర్వాత ఆభా సూర్యనాథ్ తో మాట్లాడటం ఆపేసింది. తర్వాత అన్నపూర్ణ కూడా ఆవిడను వాళ్లంటికి రావద్దంది. ఆభా లేదూ, ఆవిడ కులట! మీయింటికి ఆవిడను రాకుండా చేయి. అని ప్రక్కింటిలో పని జేసే ముసలావిడ అన్నపూర్ణకి ఒక నాడు గుసగుసలాడుతూ చెప్పింది.

అవమానం పాలయిన ఆభా తనను మంగళాతాలాబ్ సెంటరుకు ట్రాన్స్‌ఫర్ చేయించుకుంది. దీని తర్వాత ఏదైన పని మీద ఎప్పుడైనా అన్నపూర్ణ సెంట రుకు వస్తే అన్నపూర్ణను విష్ చేసి నమస్కారం కూడా చేసేది కాదు.

పది, పదకొండు నెలల తర్వాత ఒక సాయంకాలం ఆభా వాళ్ళింటి కొచ్చిం ది, అన్నపూర్ణకు పాదాభి వందనం చేసింది. పాసయ్యావు కదా! అన్నపూర్ణ సంతోషంగా అడిగింది.

'అవును అక్కగారు' తలవంచుకొని జవాబిచ్చింది ఆభా.

"నీవు చెప్పింది 'నిజమే' లేక పోతే ఆవిడ ధైర్యం చూడు ఆరు నెలల కడు పుతో సిగ్గు శరం లేకుండా తిరుగుతూ వుంది. ఇప్పుడేమో అబార్షన్ చేసుకోవా లనుకుంటూంది ఛీ ఛీ నా వద్దకు వచ్చి ఏడుస్తు కూర్చుంది. ఎలాగైనా సరే. తనను వుద్ధరించ మంటూంది. ఈ పరిస్థితులలో గద్దించి ఆవిడను వెళ్ళి పొమ్మన లేక పోయాను. గంటలకొద్దీ ఏడుస్తు కూర్చుంది." ఆ రాత్రి అన్నపూర్ణ సూర్య నాథ్‌కు విషయం అంతా వివరంగా చెప్పింది.

అంబులెన్స్ డ్రైవరుతో కూడా ఈమెను సినిమాలలో ఎన్నోమార్లు చూశా ను...సూర్యనాథ్ భార్యతో అన్నాడు.

"కాని ఆ బట్టల దుకాణపు ముసలి యజమాని ఏమేమో ఆశజూపి తనను సర్వనాశనం చేశాడని చెప్పు కుంటూందే" సూర్యనాథ్ ఏమో చెప్పాలను కున్నా డు. కాని అన్నపూర్ణ ఆగకుండా చెప్పుకు పోతూంది. "మన సెంటరు నుంచి వేరే సెంటరుకు ట్రాన్స్‌ఫర్ చేయించుకుని మంచి పని చేసింది. లేకపోతే ఇక్కడ ఆ అపనింద ఎవరెవరి మీదనో వేసేది."

సూర్యనాథ్ ఇప్పుడు కూడా తన మనస్సులోని మాట చెప్ప లేక పోయాడు. అన్నపూర్ణ నిష్ఠూరంగా నవ్వి, "ఆవిడ ఒక పాట పాడుతూండేది కదా - 'సంపకే, సఖీ సంపకే, నన్ను సంపకే...' ఇప్పుడు నిజంగానే ఆముండకు చావు దాపురించింది. కాని ఆభారాణీ రాయ్ చావలేదు. 'హోలీ ఫ్యామిలీ హాస్పిటల్‌లో పుత్రరత్నాన్ని కని ఎక్కడికో వెళ్ళిపోయింది. అక్కడి మదర్ పేరిట ఒక ఉత్తరం రాసి పెట్టింది."

...ఆభారాణి కొడుకే ఈ రోజు సూర్యనాథ్‌కు ఏదో అవసరమైన ఇన్ఫర్మేషన్ ఇచ్చేదానికి వస్తున్నాడు.

సూర్యనాథ్ మనో పటలంపైన ఆభారాణి సుందర రూపం తారట్లాడింది. నేపథ్యంలో ఆమె ఆలపించిన సంకీర్తనలు వినిపిస్తున్నాయి - ఆమారో...షకలి... గరళ...భేల్...

'ఆ...ఆ...ఆయారో...సంగమ...'

కాలింగ్ బెల్ మ్రోగింది. ఎవరో కావాలని తమాషాగా మ్రోగించినట్లు ఆబెల్ మ్రోగింది. సూర్యనాథ్ అయిష్టంగా వెళ్ళి వాకిలి తెరిచాడు. బెల్ బటన్‌ను మాటి మాటికీ నొక్కుతూ పిల్లవాడు నవ్వుతున్నాడు - "వా ఫేంటాస్టిక్...నేను ఆభారాణి కొడుకును..."

"లోపలికి రండి."

గోధుమరంగు, రికరికమంటూ శరీరం, మధ్యస్థమైన ఎత్తు, రేగిన జుట్టు, ముఖ కవళికలు అచ్చంగా ఆభారాణీ వే...ఆమె పిల్లవాడిది ఆభారాణీ పోలికే!

లోనికి వచ్చి - "నేను ఎవరికీ సాష్టాంగ ప్రణామము చెయ్యను. అసలు నేను ఎవరికీ నమస్కరించను. మీరు ఇది మంచి దనుకొండి చెడ్డదను కోండి. నాకేం ఫర్వాలేదు,"'ఐక్ స్లా' అన్నాడు.

సూర్యనాథ్ వెంట అతను సిట్టింగు రూములోకి వచ్చాడు. రూములోకి వచ్చిన తర్వాత పకపకా నవ్వుతూ "వా సాహెబ్...మీరేమో అన్ని ఏర్పాట్లు చేసుకొని దిట్టంగా కూర్చున్నారు."

"నేనేమో మీతో ఇంటార్వ్యూ చేసేదానికి వస్తున్నాట్లు - ఐక్‌స్లా...ఈమధ్య మీ ఇంటర్వ్యూలు చాలా పేపర్లలో వచ్చాయి. మీకింకా తనివి తీరలేదేమో పాపం! కాని నేను మీతో సాహిత్యం పై చర్యాగోష్ఠి చేసి ఏ పేపరుకు పంపడానికి రాలేదు. మీ సాహిత్యం మీ తరానికి చెందిన చెత్త సాహిత్యాన్ని చదవను నేను. చదవకుండానే చెప్పగలను, మీరూ మీ సాహిత్యం చచ్చి పోయిందని. వ్యాపార

సాహిత్యం - ఐక్స్లా నేను చదవను. ఇట్ ఈజీనాన్ సెన్స్-అంటే మీరు నిరాశ చెందవలిసిన పని లేదు. ఒక ఇన్ఫర్మేషన్ చెప్పేదానికి మాత్రమే నేనిక్కడికి వచ్చాను" అన్నాడు.

సూర్యనాథ్ నిశ్చేష్టుడై పెదవులపైన నవ్వు తెచ్చుకునే దానికి ప్రయత్నించాడు...కానీ మధ్య మధ్యలో మీరు అదే రోమాట..ఐక్స్లా అన్నారు కదా. అంటే దాని అర్థ మేమిటనీ అడిగాడు..."ఇది నా వ్యక్తి గత శబ్ద నిఘంటువు లోని మాట! దీనికి ఏమైనా అర్థం చెప్పుకోవచ్చు" అని కేర్‌లెస్‌గా అంటూ సోఫాలో కూర్చున్నాడు.

అతను రూములోని గోడలపైన దృష్టి సారించి వికటంగా నవ్వుతూ మొదలెట్టాడు. "హౌ డిజ్‌గస్టింగ్ - ఐక్స్లా మీరు మీ ఫోటోలను, అభినందన పత్రాలను, ఉపాధి పత్రాలను సర్టిఫికెట్ ఆఫ్ మెరిట్‌లను చాలా చక్కగా ప్రదర్శించు కుంటారే..." మీ రూములోకి వచ్చే ఆగంతకునికి మీ వ్యక్తిత్వం తోడేలు మాదిరి మీద పడి చీల్చి చెండాడేటట్లు ఉండాలనే కదా మీ ఉద్దేశ్యం. అందువల్లనే కాదా ఇవన్నీ ప్రదర్శించుకున్నారు. కాని ఇవన్నీ మీకు వల్గర్‌గా తోయటం లేదా? సూర్యనాథ్ క్లుప్తంగా "ఏమాత్రం లేదు," అని జవాబిచ్చాడు.

"ఐక్స్లా - ఎందుకుంటుందిలే? అది మీ వృత్తే గదా. వ్యాపార సాహిత్యం రాసేవాళ్ల హేల్ప్‌లెస్‌నెస్...కానీ మీ సాహిత్యాన్ని గురించి నేనేమీ మాట్లాడను. మాటల మధ్యలో సాహిత్య ప్రసక్తి వస్తే నన్ను వారించండి."

నిరుత్సాహంతో మారుతున్న ముఖ కవళికలను చూసి అతని ఉత్సాహం పెంపొందింది - "పెద్దమ్మ బయటికి పోయింది కదా! నాకు తెలుసు, ఆమె తరచుగా మిమ్మల్ని ఒంటరిగా వదిలేసి పోతూ వుంటుంది. మీ గురించి నాకు సర్వం తెలుసు...మీ ఈ ప్లాట్, ఇటీజ్ ఎన్ ఐడియల్ ప్లేస్‌ఫార్ ఆత్మరతీ..."ఐక్స్లా.

"ఓహో, మీరు ఆభారాణిగారి సుపుత్రులన్న మాట!" సూర్యనాథ్ గొంతు సవరించు కుంటూ అన్నాడు.

"అవును. ఇప్పుడు నేను ధన్‌బాద్‌లో ఉంటున్నాను. నా కెన్నో పేర్లున్నాయి. కాని అన్ని పేర్లు అసలయినవే. దొంగ పేర్లుకాదు! ఇప్పుడు నేను సూతపుత్రుని పేరున మీతో మాట్లాడుతున్నాను" అన్నాడతను.

సూర్యనాథ్ నవ్వాలని ప్రయత్నించి కూడా నవ్వలేక పోయాడు. సూతపుత్రుడు "నా కవి నామధేయం - ఐక్స్లా శివలింగ" అని అన్నాడు.

సూతపుత్రుడు, శివలింగా, సూర్యనాథ్‌తో ఏం ఆశ్చర్యం గావుంది కదూ?

అని అన్నాడు.

"ఎందుకు ఆశ్చర్య పడతాను? మాయింటి ప్రక్కనే నిజలింగా సాబ్ గారుం టున్నారు, ఇక మీరు తమరి రాకకు ఉద్దేశ్య మేమిటో చెప్పండి."

సూతపుత్రుడు సూర్యనాథుని ఓర గంటితో చూశాడు. ఆభారాణి కూడా సరిగ్గా ఇదే మాదిరి కనురెప్పలు కొంచెం ముడుచుకొని చూస్తుంది.

"ఉద్దేశ్యం చాలా శుభప్రదమైంది. మీకు ఒక ఇన్ఫర్మేషన్ ఇచ్చేదానికి వచ్చాను. అంతే..." అతను అన్నాడు.

"మీ తల్లిగారు!"

సూర్యనాథ్ తనమాట పూర్తి చేయక ముందే అందుకొని "తమరి కేళి కుంజికా ఆభారాణి గురించి నాకేమి తెలియదు. నా వద్ద నాకు జన్మనిచ్చినావిడ ఒక లావు పాటి డైరీ ఒకటి వుంది. 1955-1956 కి సంబంధించినది...హోలీఫ్యామిలీ హాస్పిటల్ లోని మదర్ దీన్ని సంబాళించి ఉంచారు...అర్థమయింది కదూ."

"అర్థమయింది. ఐక్స్లా, ఇప్పుడు ఆసమాచార మేమిటో చెప్పండి" సూర్య నాథ్ అడిగాడు.

ఆసమాచారం చెప్పేముందు మీ మానసిక పరిస్థితి ఎలాగుందో, నేను చెప్ప బోయే సమాచారాన్ని గ్రహించే శక్తి దాని కుందోలేదో నేను ముందు తెలుసుకోవాలి. నేను మీరు వ్రాసిన సాహిత్యాన్ని చదవలేదు. అందువల్ల మీరు ఎటువంటి వారో నాకు తెలియదు. కాని మీతరమంతా ఇల్లిటరేట్స్ హాఫ్‌లిటరేట్స్ అని నేనెరుగుదును. ప్రప్రథమంగా మీకు కల్గిన ఆశ్చర్యాన్ని పోగొట్టుతాను. సరేనా? హోలీఫ్యామిలీ హాస్పిటల్ నుంచి అనాధాశ్రమం, అక్కడి నుంచి టాంటీ జరియా, కలకత్తా, జబల్‌పూర్, అలహాబాద్ మున్నగు చోట్ల నా బాల్యం గడచిపోయి యవ్వనం దశలోకి వచ్చాను. చదువు సంధ్యలకు లోపం లేకుండా బాగానే జరిగాయి. కవిత్వం కథలు రాస్తాను. నాటకాలేస్తాను. చిత్రకారుణ్ణి కూడా! కాని ఇవన్నీ మీ అవగాహన పరిధి బయటి విషయాలు. ఐక్స్లా - నేనిప్పుడు ధన్‌బాద్‌లో ఉంటున్నాను. చాలా ఆనందంగా కాలం గడుపు తున్నాను...మీ బాత్ రూమ్ ఎటువైపుంది?

సూతపుత్రుడు బాత్‌రూములోకి వెళ్ళాడు. ఇప్పుడు సూర్యనాథ్‌కు ఆలోచించే దానికి అవకాశం దొరికింది. సూతపుత్రుడు క్రమంగా ఐక్స్లా ప్రయోగం తగ్గి స్తున్నాడని అతను గమనించాడు.

ఈ పిల్లవాడు చెప్పుకో దగ్గ సరుకే. అతని జుట్టు వేసుకొన్న బట్టలు, ఆరోగ్యం

అంతా బీట్స్, హిప్పీలకంటే భిన్నంగా వుంది. కాని వ్యవహార సరళి వాళ్ల మాదిరే వుంది. ఆలోచిస్తూ సూర్యనాథ్ నవ్వుకున్నాడు - వచ్చీరాగానే వీడు కొరడాతో కొట్టినట్లు దబాదబా మాటలు వాయించేస్తున్నాడు. అలాగ పెరిగి పెద్దయిన వాళ్లు అంతేమరి.

బాత్ రూము నుంచి బయటికొచ్చి "బాత్ రూములో మీరు పారాయణం జేసే పత్రికల సంపాదకులకు, మలబద్ధకాన్ని పోగొట్టే సాహిత్యాన్ని గూడా ప్రచురించమని రాయండి. మరొక మాట మీరు దేశ విదేశాలలోని బిగ్ బగర్స్ - ఐక్స్లా సోకాల్డ్ వి.ఐ.పి. ల ఫోటోలన్నీ గోడలకు తగిలించి వున్నారే. కానీ...వైనాట్ ఎన్యూడ్ పిక్చర్. నేనొక సలహా ఇస్తాను మీకు మీరు నగ్నంగా ఒక ఫోటో తీయించుకొని గోడకు తగిలించండి - దాని కింద 'విత్‌మై సెల్ఫ్' అని రాయించండి. ఈ నా మంచి సలహా పాటిస్తారు గదూ!" అని అన్నాడు.

బాత్ రూమ్ నుంచి బయటి కొచ్చి సిట్టింగు రూములో ప్రవేశించి, అసభ్యకరంగా ఫ్యాంటుగుండీలను వేసుకుంటున్నాడు. అతను ఇలాగే ప్రవర్తిస్తాడని సూర్యనాథ్ ముందుగానే వూహించాడు. అందువల్ల అతని మాటలు విని నవ్వుకోసాగాడు.

సూర్యనాథ్‌ను మరల నొప్పించే విధంగా ప్రశ్నలు వేయటం మొదలు పెట్టాడు..."సరే. మీ స్వీటీ, సాఫ్టీ మరదలు ఆభారాణితో మీ సంబంధం ఎప్పుడు ఎట్లా కుదిరిందో చెప్పండి, ఐక్స్లా." "మీరు ఏ సమాచారం చెప్పాలని వచ్చారో అది ముందు చెప్పండి. మీరు నా ఇంటర్వ్యూ తీసుకోవడానికి రాలేదు. అలాంటప్పుడు ఈ ప్రశ్నలు, జవాబులు దేనికి అంటూ సూర్యనాథ్ కుర్చీలో పద్మాసనం వేసుకొని దిట్టంగా కూర్చునాడు."

"ఐక్స్లా, నేను ముందే చెప్పానుగా సమాచారం చెప్పడానికి ముందు మీ మానసిక స్థితిని..."

"ఐక్స్లా - నేను ముందు - ఐక్స్లా - మీ ఐక్స్లా సమాచారం తెలుసుకోవాలి. - ఐక్స్లా అంతే." సూర్యనాథ్ గాంభీర్యంతో అన్నాడు.

సూతపుత్రుడు నవ్వాడు. ఆనవ్వులో ఆ బట్టల దుకాణపు ముసలి యజమాని కనిపించాడు సూర్యనాథ్‌కు.

"అదిసరే. నీ వెంట్రుకలు ఇప్పటికీ నల్లగానే ఉన్నాయే. మీరు డై చేసుకుంటారని నేను అనుకుంటాను. మీ అమ్మ తన డైరీలో మీ వెంట్రుకలను గురించి గొప్పగా రాసుకుందిలే. ఇప్పటికీ ఇంత నల్లగా ఉన్నాయంటే...మీపళ్లు కట్టించు

కున్నవి కాదు. అంటే ఇంకా ఒక దశాబ్దం పాటు ప్రేమ కథలు రాయగల రన్నమాట. యాభై ఏండ్ల ఈ వయస్సులో కూడా నల్లని, గుబురైన వెంట్రుకలు, ఎముకలను కర కరా నమిలేయగల దంత పంక్తి...ఆయిన్... అంటే వీటి రెండింటికి ఏమయినా సంబంధముందా? మీరే మయినా మూలికలు వాడతారా?"

సూర్యనాథ్‌కు, ఈ పిల్లవాడికి చెపర్ కణాతి, మైలు తుత్తం, పెరుగులో కరిగించి వాడానని చెబుదామని పించింది, కాని అతనితో, "ఇది నాట్రేడ్ సీక్రేట్" అన్నాడు.

పెద్దగా నవ్వాడు సూతపుత్రుడు. వీడు తనను "ఫైర్ ఈటర్ - అగ్ని భక్షకుడు అనుకుంటున్నాడు. సెల్ఫ్ పోజ్‌లోన్లీ రెబెల్‌కి ఒక నకిలీ నమూనాగా - ఐయామ్ బార్న్ బి ఫోర్ మైలైమ్, అని చెప్పుకునే ఒక రచయిత సూర్యనాథ్‌కు గుర్తుకొచ్చాడు."

"మీరేం పని చేస్తారు? అంటే తిండి తిప్పలు ఎవరు చూస్తారు?" సూర్యనాథ్ అధికార పూర్వకంగా అడిగాడు.

"నన్ను ఉపయోగించుకుంటున్నవాళ్లు."

"మీరు ట్రేడ్ యూనియన్ మెంబరా?"

"నేను ఆవాంగార్డును. మీరు 'అతర్కవాదం' అనే పేరువిన్నారు కదా."

"అతర్కవాదమా, కుతర్కవాదమా?"

"మీకు విడమర్చి చెప్పేదానికి కుతర్కం అవసరం. సరే మీరు విలియమ్ బ్లాక్, జాన్ కోక్టో, జాన్ జేనేలను ఎరుగుదురా! మెటామర్ఫసిస్ రైటర్ ఎవరో తెలుసా! హెన్రీ మిలర్ గురించి తెలుసునా" అని అన్నాడు.

"నాకు ఇవన్నీ తెలుసుకోవల్సిన అవసరం లేదు. నీవు ఏం పని చేస్తుంటావో, తెలుసుకోవాలని" మాత్రం అనుకుంటున్నాను.

"చూడండి. ఈ నీవు, నువ్వు అనే ప్రయోగాలు వాడకండి. ఐక్స్లా."

'ఐక్స్లా.'

'అంటే?'

"మీరే చెప్పారు గదా. దీనికి ఎంతయినా అర్థం చెప్పుకోవచ్చని. దయచేసి చెప్పండి మీరు..."

"నేను కవిత్వం రాయటం మానేసి పొట్టకోసం కమేడియన్ పని మొదలు పెట్టాను. ధన్ బాద్, ఝరియా, జమ్‌షెడ్‌పూర్, కలకత్తాలోని ఎన్నో అండర్ గ్రౌండుక్లబ్బుల్లో డిస్కో థేక్సుల్లో నా షోలు ప్రదర్శించాను."

"డొంక తిరుగుడు దేనికి? స్పష్టంగా చెప్పరాదూ. ధూర్తులు చేసే పని చేస్తున్నాననీ సూర్యనాథ్ అచ్చమైన బిహారీ బాబు మాదిరి మందలించాడు."

కాదు ఇది ధూర్తుల పనికాదు. ఇదొక క్రొత్త పంథా, క్రొత్త ఆర్టు. దీనిపేరు మీ గ్రేట్ గ్రాండ్ ఫాదర్ కూడా విని వుండడు...నేను తిట్లు తిడ్తాను, ఎన్నో చెడ్డవి, వినరానివి అశ్లీలమైనవి.

"వాడెవరో బాగా మేకప్ చేసుకొని ఉదయం, సాయంత్రం ముజఫ్ఫూర్ వీధుల్లో తిరుగుతూ వుంటాడే - 'ఒకపైసా తీసుకొని ఐదు తిట్లు తిడ్తాను. తిట్టిన తిట్లు తిట్టకుండా, తాత ముత్తాలను తిడ్తాను అని' అలాంటి దేనా నీవృత్తి కూడా."

"ఈ కామెడీ రంగంలో నాట్రేడ్‌నేమ్ డొగ్‌లాస్. ఇప్పుడు నేను డోగ్‌లాస్ పరిభాషలో మీతో మాట్లాడుతాను. ప్రస్తుతం మాత్రం తిట్లు, అపశబ్దాలు భోజ్‌పురిలో చెప్పి వాటికి ఇంగ్లీషు అనువాదం చేస్తున్నాను. కాని మీ సన్నిధిలో ఈ యింటి వాతావరణంలో విశుద్ధమైన మగహీ లేక మైధిలీ భాషలోనే..."

వీణ్ణి మర్యాదగా బయటికి పంపేద్దామని సూర్యనాథ్ అనుకున్నాడు. కాని మరల ఏదో ఆలోచించుకొని ఇంకా కొంతసేపు ఓర్చు కుందాములే అనుకున్నాడు...ఏమయినప్పటికి కొద్దిరోజుల క్రితం 'హిందీ సాహిత్యంలో రాముని వంశజులు' అనే అంశం మీద విషయ సేకరణ కోసం నా దగ్గరికొచ్చిన పి.హెచ్.డి రిసర్చి స్కాలర్ కంటే మేలే అనుకున్నాడు. ఆ స్కాలర్ రాముడు పరిశోధన కాదు, ప్రార్థనా భంగిమలో - సార్, పేరుకు ముందూ వెనుకా, మధ్యలో రాముని పేరు పెట్టుకున్న సాహిత్యకారుల మీద రాముని ప్రభావం ఉన్న దని రాస్తానన్నాడు. మీ బాల్యంలో ఎవరైనా ఎప్పుడో ఒక సారి రామ్ సూరజ్‌నాధ్ అని పిలచే ఉంటారు. అందుకని మిమ్మల్ని గూడా రాముని వంశీకులగా గుర్తించి రాస్తే మీ కేమి అభ్యంతరముండదు గదా అని కూడా అడిగాడు.

"మీరు కనీవినీ ఎరగని పనిచేస్తున్నారు. తిట్లు తిట్టి వాణ్ణి నవ్విస్తున్నారు. జనం సంతోషించి మీకు డబ్బులిస్తున్నారు" అని ప్రశాంతంగా అన్నాడు సూర్యనాథ్.

"నవ్వంటే అల్లా టప్పా నవ్వుకాదు. పూర్తిగా రెక్టమ్ రప్టరింగ్‌లాఫ్" డోగ్‌లాస్ అన్నాడు.

"మాజిల్లాలో ఒక రాజుగారు తన దర్బారులో ఒక 'బుడిరాజ్' అంటే మూర్ఖ మహారాజును పెట్టుకునేవాడు..."

"ఐక్స్ట్రా - యువర్ రాజా సాబ్! అదుగో మరలా మీరు ఫ్యూడల్ ఏజ్ మాటలు

మాట్లాడుతున్నారు. నేను అకస్మాత్తుగా దెబ్బకొట్టి అసలు విషయాన్ని తెలుసుకో వడంలోనే గొప్పదనం ఉందని భావిస్తాను."

"డోగ్‌లా" సాబ్! మీరు ఎలాంటి షోలు ఇస్తారో నాకు తెలియదు కానీ ముప్పై ఏళ్ల క్రిందట ఆబుడిరాజా చేసే తమాషాలు చూశాను. వాటిలో ఒకటే మీకు విన్పి స్తాను. దీన్ని కూడా మీషోలో వాడుకోవచ్చు.

డోగ్‌లాస్ సరే అన్నాడు. సూర్యనాథ్ చెప్పటం మొదలెట్టాడు, "రాజుగారు ఏర్పాటు చేసే తిరనాళ్ళలో పేరుమోసిన పహిల్మాన్‌ల కుస్తీ జరిగేది. ఒకసారి ఒక చాంపియన్ పహిల్మాన్ అందరినీ ఓడించి విజయగర్వంతో చాతీ విరుచు కుంటూ మైదానంలో తిరగసాగాడు...అంటే ఎవరైనా ఉన్నారా వీరుడు మీలో నాతో తలపడడానికి అన్నట్లు! బుడిరాజ్‌కు కోపమొచ్చింది. అతను ఎగిరి గంతేసి మైదానంలోకి వెళ్లాడు. తన బట్టలన్నీ విప్పేసి తొడలు చరుచుకుంటూ, రారా అంటూ, చాంపియన్ పైహిల్మాన్ పైన విరుచుకుపడ్డాడు. ప్రజలు బిగ్గరగా నవ్వా రు. చాంపియన్ పహిల్మాన్‌కు ఏమి అర్థం గాక కొద్దిక్షణాలు చూస్తూ వుండి పోయాడు. ఇంతలోనే పరుగెత్తుకుంటూ పారిపోయాడు. ఒక బలిష్ఠుడైన పహి ల్మాన్ నగ్నంగా వచ్చిన ఒక మామూలు మనిషిని ఎదుర్కోలేక పోవడం చూసి అందరూ కడుపుబ్బ నవ్వారు." డోగ్‌లాన్‌కు ఈ ఘటన నచ్చింది, "నేను దీని పైన వర్క్ చేస్తాను. దీన్ని రిఫైను చేసి వాడతాను...నేనీ మధ్యనే ఒక స్కిట్ ప్రవేశ పెట్టాను - హోటల్లో ఒక వ్యక్తి మధ్యాహ్నం, రాత్రిళ్ళు పాన్ పోసేదానికి వాష్ బేసిన్లను..." అన్నాడు.

సూర్యనాథ్ ఇటువంటి సందర్భాలు వచ్చినప్పుడు వూరికేవుండిపోడు "ఇరే గా, బ్రేకింగు పాయింట్ అంటే, డోగ్‌లాస్ సాహెబ్‌ను వారిస్తూ అరే, అఫాదరీ రాసిన ప్రహసనం, అదే, అమెరికన్ కమేడియన్ 'లెనీబ్రూస్' రాసింది. పది, పద కొండు సంవత్సరాల క్రితం దీన్ని అభినయించి చాలా పేరు ప్రతిష్ఠలు పొందా డుకూడా." అని నవ్వుతూ అన్నాడు.

లెనీబ్రూస్ పేరు వింటూనే డోగ్‌లాస్ ముఖం కుంచించుకు పోయింది: "ఆహా! మీకు లెనీ బ్రూస్ తెలుసునా? ఐక్స్లా" -లెనీబ్రూస్ మీకెలా తెలుసు?

"తెలియడమే కాదు. 1964లో అతన్ని విడుదల చేసేదానికి పంపిన అప్పీ ళ్లలో సంతకం చేసినవారిలో నేను కూడా ఒకన్ని. ఇప్పటికీ అసంతకం మూలాన నారాజకీయ మిత్రులు నన్ను తిడుతూవుంటారు - ఐక్స్లా. ఇప్పుడేమో స్వర్గంలో లెనీబ్రూస్ దేవతలను తిడుతూ సంతోషపరుస్తూ వుంటాడు. అందుకని ఇప్పుడు

మీరు తమను ఈ ప్రక్రియకు భారతీయ అవాంగార్డుగా ప్రకటించుకోవచ్చు" అంటూ సూర్యనాథ్ తన గడియారంవైపు చూసుకున్నాడు.

డోగ్లాస్ సాబ్‌లోని సూతపుత్రుడు తబ్బిబ్బైపోయాడు. అతడు నంగినంగిగా "సరే, నేనిప్పుడు అసలు విషయానికొస్తాను. నా వద్ద మా అమ్మ డైరీ వుంది. డైరీ ప్రకారం మీరే నా జనకులు. నేను మీ అబ్బాయిని."

"అసంభవం."

"అసంభవం కాదు. ఇది మీక్రోమోజోమే...మీరు గాబరా పడవలసిన పనిలేదు. నేను మీ ఆస్థిపైన దావా వెయ్యను."

"డైరీ నీ వద్ద వుందా?" సూతపుత్రుడు బ్యాగ్‌లోంచి డైరీ తీసి పుటలు తిప్పుతూ "బెంగాలీ చదవటం మీకు బాగా వచ్చుకదా? ఈ పేజీ చదువుకోండి." అన్నాడు.

దస్తూరి ఆభారాణీదే అని సూర్యనాథ్ తెలుసుకొన్నాడు. దాంట్లో "ఈ రోజు సూర్య నాథ్‌తో గడిపినట్లు జీవితంలో ఇంతకు ముందెవ్వరూ గడపలేదు" అని రాసి వుంది.

సూతపుత్రుని ముఖం ఎర్రబడసాగింది. "సరే, ఏమదరైతే నీకీ డైరీ అప్పజెప్పిందో ఆవిడ నీ డేట్ ఆఫ్ బర్త్ కూడా చెప్పి వుంటుంది. ఆదేటేమిటో చెప్పు?" సూర్యనాథ్ అడిగాడు.

"ఆఫ్ కోర్స్...దటీజ్ దేర్. ఆడైరీలోనే రాసివుంది."

"మీరు ఈ డైరీలోని తారీఖుతోనే పుట్టిన తేదీని జోడించి చూశారా?"

"ఇలాంటి ఖచ్చితమైన ఎవిడెన్సును మీరు తోసిపుచ్చలేరు.జనకమహాశయా గారు!"

సూర్యనాథ్ అతని గొంతుతో గొంతు కలిపి - "సూతపుత్ర మహాశయా! తమరు ఒప్పుకోండి, ఒప్పుకోక పోండి నాకేం పర్వాలేదు. కాని ఇది సత్యంకాదు. వాస్తవంగా...ఏదో ఆకర్షణ తప్ప ఆభారాణితో నాకెలాంటి సంబంధం కలగలేదు. కామోద్రేకంలో ఆసుందరాంగిని ఒంటరిగా చూచి ఉద్రిక్తుడయిన మాట నిజమే. కాని...కాని ఆసుందరాంగి నోటినుంచి భరించరాని దుర్వాసన వచ్చినందువల్ల నాకు వెంటనే విరక్తేసింది."

"దుర్వాసనా!"

"అవును, చెడ్డవాసన. ముఖమేమో అంత ఆకర్షణీయంగా వుంది. కంఠ స్వరం కూడా తియ్యనిదే! మధుర కంఠంతో సంకీర్తనలు పాడేది - నోటిలోంచి

మాత్రం కుళ్ళు కంపు, ఛీ ఇప్పటికీ అది గుర్తుకొస్తే డోకు వచ్చేస్తుంది."

సూతపుత్రుని నోటిలోంచి సన్నటి అరుపులాంటి శబ్దం వచ్చింది. అతను గజగజా వణకసాగాడు. కళ్ళనుంచి నీళ్ళు కారుతున్నాయి. అతను మరేమి మాట్లాడలేక పోయాడు.

ఆపిల్లవాడి మాటలను ఇంతవరకూ ఓపికగా విన్నదానికి కారణం ఇతని ముఖంలో ఆభారాణి అమాయకత్వం కనపడటం వల్లనేనని సూర్యనాథ్ అర్థం చేసుకొన్నాడు."కాని మీరు ఆదుష్ట సంస్కృతికి, ఆదుష్ట సంప్రదాయానికి కట్టుబడి తండ్రిని వెదుక్కుంటూ ఎందుకు తిరుగు తున్నారో నాకు బోధపడటంలేదు." అన్నాడు సూర్యనాథ్ చిన్న స్వరంతో.

"ఐక్స్లా - వెదకటం లేదు గత ఎనిమిది, తొమ్మిది సంవత్సరాల నుంచి ఒక దృఢమైన నమ్మకం నాకు కలిగింది - నా తండ్రి ప్రసిద్ధ సాహిత్యకారుడు, నా నరాల్లో ప్రవహించే రక్తానికి ఒక గొప్ప కళాకారునితో సంబంధం ఉందని! ఆ తండ్రిని నా శత్రువుగా భావించు కొనటంతో నాకు కొత్త స్ఫూర్తి కలిగేది! కాని ఈ వేళ నాప్రేరణకు గల మూలమే హఠాత్తుగా కూకటి వేళ్ళతో పెకలించుకు పోయింది."

అతను వెక్కి వెక్కి ఏడవసాగాడు, ఇంటి నుంచి తప్పిపోయిన పిల్లవాడి మాదిరి! సూర్యనాథ్ ఆలోచనలో పడ్డాడు - కవచకుండల రహితుడైన కర్ణుడు కూడా ఇలానే ఏడ్చాడు? ఏడుస్తున్న ఆభారాణి కొడుకు తల నిమురుతూ ఓదార్చాలా అనుకున్నాడు కాని, సానుభూతి, దయ, జాలి, కృపాదృష్టి చూపితే మరల ఇతను కోపంతో తిట్టేస్తాడేమో అని సందేహమేసింది. బహుశా ఇతను వైలెంట్ కూడా కాగలడు. "అగ్ని భక్షకుడు గారూ! ఇక తమరు దయచేయండి! నన్ను ఏకాంతంగా ఉండనివ్వండి" అన్నాడు సూర్యనాథ్.

సూతపుత్రుడు నిలబడి గట్టిగా అరిచాడు - "అవును, అయామ్ ఏ ఫైర్ ఈటర్...అగ్నిభక్షకుణ్ణి! సరే, ఈ పేరుకూడా పెట్టుకుంటా, మంచిదే! ఐక్స్లా..."

(1972)

# భిత్తి చిత్రాల మయూరి

పుల్ పతియా అమ్మ చిత్రంలోని ఏనుగు తొండానికి నల్లరంగు నింపి కుంచెతో నెమలి పింఛాన్ని సరిచేయడంలో లీనమయింది. ఉన్నట్లుండి మెరుపు మెరిసినట్లనిపించింది. ఆమెకు! వెనుదిరిగి చూస్తే ప్రభుత్వపు అధికారిలాగున్న యువకుడు తాంబూలం పెట్టె మూదిరున్న ఒక నల్లని పెట్టెలోకి చూస్తూ నిలబడివున్నాడు. ఆవిడ గాభరాపడి అస్తవ్యస్తంగా వున్న బట్టలు సర్ధు కోసాగింది. మరల ఒక మెరుపు మెరిసింది. ఆవిడకు భయవేసింది. అస్పష్టంగా ఆవిడ 'శ్రీమాన్' హజూర్ అని అన్నది.

కానీ ఆయువకుడు వంగి పుల్‌పతియా అమ్మ పాదాలు తాకి అమ్మగారూ, నేను శ్రీమాన్ నేమీకాదు. నీకొడుకు లాంటివాడను అన్నాడు.

పుల్‌పతియా అమ్మ దిగ్భ్రాంతురాయింది. గడగడా వణకసాగింది. ఎంతో ప్రయత్నం మీదట ఆమె, పుల్‌పతిరే అని అనగలిగింది.

ఈ లోపల పల్లెలోని పది, పదహారుమంది పిల్లలు అక్కడికి చేరారు. పుల్ పత్తి ఇంటి పెరట్లో రాయిపైన నాన బెట్టినబియ్యం నూరుతుంది. 'పుల్ పతియా అక్కా, నీవేమొ ఇక్కడ కూర్చుని బియ్యం నూరుకుంటున్నావు. వాకిట్లో పెద్దమ్మ నేమో ఇనస్పెక్టర్‌గోరూ అరెస్ట్ చేశారు. ఎనిమిది, తొమ్మిది సంవత్సరాల పిల్లవాడొకడు పరగెత్తుకుంటూ వచ్చి ఆమెతో చెప్పాడు. '

"అః! ఏ ఇన్సపెక్టరురా? నీటితీరువా టాక్సు వసూలు జేసే కాలువ ఇన్సపెక్టరా."

"తెలియదక్కా, కాలువ ఇన్సపెక్టరో అప్పులు వసూలు జేసే కాలువ ఇన్సపెక్టరో," పోయి చూడరాదా. అక్కడే కనుక్కో ఎవరైంది. పెద్దమ్మ పిలుస్తూంది.

"ఓపుల్ పత్తీ!"

అమ్మ అరుపు విని పుల్‌పతియా చేతులు కడుక్కోకుండానే ఇంటి ముంగిట్లోకి పరిగెత్తింది. వాకిట్లోకి పోయి చూస్తే ఇన్‌స్పెక్టరు వాళ్లమ్మ దగ్గర మోకాళ్ల మీద కూర్చొని 'అమ్మగారూ, మీ పని పూర్తి చేసుకోండి. తర్వాత నేనొచ్చిన పని చెప్తాను' అంటూ కన్పించాడు.

పుల్‌పతియాకు దేవతపూని నట్లువుంది. వాళ్లమ్మకేమో భూమి అనేది లేదు

సొంతంగానీ, కౌలుకు తీసుకున్నది గాని. కాలువ సూపర్‌వైజరు నీటి తీరువాటాక్సు 15 రోజులు లోపల కట్టమని ప్యూనుతో నోటీసు పంపాడు. అలాకట్టక పోతే ఆస్థిని, పశువులను జప్తు చేస్తామని నోటీసులో వుంది. నీళ్లలో నిప్పు పెట్టడ మంటే ఇదేనేమో! ఫుల్‌ఫతియా ఉగ్రురాలయింది. "ఇన్‌స్పెక్టరూ, అరెస్టు చేయాలంటే నన్ను అరెస్టు చెయ్యండి. జైల్లో వేయాలంటే నన్ను జైల్లో వేయండి. ఈ వృద్ధాప్యంలో మా అమ్మ చేతికి సంకెళ్ళు వేయటం నేనే మాత్రం ఒప్పుకోను. నా బొందిలో ప్రాణముండగా నేనిది జరగనివ్వను."

ఈ విషయం తెలిసికొని ఊళ్లోని వాళ్లందరూ పొలాల్లోంచి, తోటల్నుంచి పరుగెత్తు కుంటూ వచ్చి అక్కడ గుమిగూడారు. పద్దెన్మిది సంవత్సరాల ఫుల్‌పతియా అమ్మను వెనకేసుకొని "నాప్రాణం పోనీ నాశవం ఇక్కడి నుంచి వెళ్ళినా, నేను మాత్రం ఇది జరగనివ్వను" అని బిగ్గరగా అరిచింది.

మాటిమాటికి ఉమ్మేస్తూ...కారణం లేకుండా మాటి మాటికి నవ్వే వాడు 'తోఫాలాల్ సాహు' అందరికంటే ముందు పరుగెత్తు కుంటూ వచ్చి, ఇన్స్పెక్టరుకు సలామ్ చేసి ముసిముసినవ్వులు నవ్వుకుంటూ ఎదురుగా నిలబడ్డాడు. అదును దొరికే మాట్లాడాలని! ఆ ఊరిలో ఎవరికి ఏ ఆపద సంభవించినా ఏ దుర్ఘటన జరిగినా, తండ్రీ కొడుకుల మధ్య పోట్లాట జరిగినా, ఎవడైనా తన భార్యను కొట్టినా అందరికంటే ముందు తోఫాలాల్ ఆ స్థలానికి చేరుకుంటాడు. ఇతరులు కష్టాల్లో వుండటం చూసి అతనికి మహా ఆనందం కలుగుతుంది. ఎక్కడైనా ఎవరికైనా మంచి జరిగితే ఆ చల్లని సమాచారం విని అతనెప్పుడూ అక్కడికి వెళ్ళడు. ఇప్పుడేమో ఫుల్‌పతియా అమ్మ అరెస్టుమాట విని అందరి కంటె కూడా ఎక్కువ సంతోషం కల్గింది. తన తమ్ముని కూతురి పెళ్ళి సందర్భంలో వదినా, నీవు వచ్చి పెళ్ళిమండపం దగ్గర గోడలపైన బొమ్మలు గీచి పెట్టు ఫుల్ పతియా నిదానంగా వాటికి రంగువేస్తుంది-అని ఫుల్‌పతియా అమ్మను బ్రతిమాలాడు. కాని ఆవిడ కాదంటేకాదు అంది. నడుము నొప్పిగా వుందని ఏదోసాకు చెప్పింది. అప్పుడు గూడా ఫుల్‌ఫతియా ఎగతాళిచేస్తూ 'పోరాదే అమ్మా తోఫా కాకా పట్నం నుంచి డాక్టరును పిలిపించి వైద్యం చేపిస్తాడులే' అని అంది. ఇన్ని రోజుల తరవాత ఇప్పుడు తోఫాలాల్‌కు ఫుల్‌పతియా అమ్మను, ఫుల్‌పతియాను ఎగతాళి చేస్తూ నవ్వే అవకాశం లభించింది. "ఫుల్‌పతియా ఎదిగిందానివి, పెళ్ళికాని దానివి ఎందుకు పోతావే జైలుకు, ఇప్పుడు మీ అమ్మను పోనీలే, మీ అమ్మ జైలుకు పోతే జైల్లో సర్కారీ డాక్టరు ఉచితంగా వైద్యం కూడా చేస్తాడు. అంటూ నవ్వుతూ

అన్నాడతను."

"నీ వెవరు మా మధ్యలో మాట్లాడటానికి. ఎప్పుడూ నవ్వే మగవాణ్ణి, సకిలించే గుర్రాన్ని నమ్మకూడ దంటారు. నువ్వు నోరు మూసుకుంటావా లేదా." అని గద్దించి తోఫాలాల్ నోరు మూయించింది.

ఇంతలోనే ఊరి సర్పంచ్ "తాహామియా" కూడా వచ్చాడు. వస్తూనే గవర్నమెంటు వాళ్ళ మనిషి మాదిరి "నీకేమైనా పిచ్చి పట్టిందా? ఊరుకో" అని పల్ఫతియాని గదిమాడు.

పుల్పతియా ఈ రోజు ఎవరి మాట వినేట్టు లేదు. ఊరికి పెద్దగానీ, సర్పంచ్గానీ. తాహామియామాటకు అడ్డొచ్చి "మాకు ఈ రోజు ఎవరడ్డు వచ్చినా వాళ్లను వదిలేది లేదు. సర్పంచ్ గానీ పుర్పంచ్గానీ, అంటూ బల్లగుద్దినట్లు పుల్ఫతియా అన్నది."

ఆవిడ చెప్పింది విని పిల్లలగుంపు కేరింతలు కొట్టింది.

ఇన్స్పెక్టరు పుల్ఫతియా దగ్గర కొచ్చి నిలబడి చేతులెత్తి నమస్కారం చేస్తూ "ఏమండీ, నేను ఇన్స్పెక్టర్ను గాను, ఎవర్నీ అరెస్టు చేయటానికీ రాలేదు. నేను కుటీర శిల్ప విభాగం, పాట్నా నుంచి వచ్చాను. నేను వచ్చిన పనేమిటంటే..." అన్నాడు.

అతని మాటలు విని అక్క డగుమిగూడిన అందరూ గొల్లు మన్నారు. "భలే! ఎవరూ ఏమీ తెలుసుకో కుండానే ఏమిటనీ ఇంతరాద్ధాంతం."

కాని ఈ విషయం నవ్వులాటగా వుండి పోలేదు. నెమ్మది నెమ్మదిగా ఊరంతా వ్యాపించింది. "ఏమి విడ్డూరం. ఇరెక్కడైనా విన్నారా! పాట్నా నుంచి ఎవరో జంటిల్మెన్ ఆఫీసరొచ్చి పుల్పతియా రాసిన చిత్రాలను బొమ్మలను చూసి వీటిని ప్రింటుజేసి అమెరికా, రష్యా పంపిస్తారట"

"ఎవరిని పంపుతారట రష్యా, అమెరికాలకు పుల్ఫతియా అమ్మనా?"

"డబుల్ ఇనామ్ ఇస్తానన్నారట. కానీ అతనేమో, చూడటానికి మన దేశపు వాడిలాగే వున్నారు. అతని ముఖం చూస్తే విదేశస్తుడుగా కన్పించటంలేదు."

పుల్పతియా అప్పుడేమో గర్జించింది. ఇప్పుడు చూడుపో, పట్నం నుంచి వచ్చిన ఆ ఆఫీసర్కు రకరకాల వంటకాలు తయారుచేస్తుంది.

అతడు మన అన్నం తింటాడే? ఏ కులస్తుడోమరి?

"పుల్పతియా అమ్మ అదృష్టం లేచొచ్చిందనుకో!"

"అదికాదురా పాపం, ఆవిడ ఆస్తి పాస్తులను భర్తనూ పోగొట్టుకొని ఎన్ని కష్టాలు అనుభవిస్తూందో నీకేం తెల్సు. ఇంటి వాకిళ్లకు 'శుభలాభ్' పెండ్లీ

పేరంటాలప్పుడు ఊళ్ళో వాళ్ల ఇంటి గోడలకు పూలు తీగలు, వాటి మధ్య దేవుళ్ళు దేవతలను చిత్రిస్తుంది గదా! ఆ సుకృత ఫలమే ఇది. మనం అంటా ముగానీ భగవంతుడు గుడ్డివాడేమి కాదు."

"ఇంకేమి ఫర్వాలేదు. ఫుల్‌పతియా పెళ్ళికూడా జరిగిపోతుంది. పెళ్ళిఖర్చులకు అమెరికా, రష్యాల నుంచి పైసలొచ్చేస్తాయి."

గులాబీ రంగు దిండుపైన గంజాయి ఆకులను కత్తెరతో కత్తిరిస్తూ అనూప్‌లాల్ - అరే, అప్పుడే ఏమయింది? ఏమిటేవిటో వాగుతున్నారే. ముందు ఆ వచ్చిన మనిషి ఎవడు? అసలోడా నకిలీ వాడా. అన్నీ ఆలోచించాలి గదా. మీకు గుర్తుంది గదా ఒక సారి నకిలీలాటరీ కంపెనీ వాడు, నకిలీ ఏజెంటు వచ్చి లబ్‌బోలియా ఊరులోని 'మరచూమహతో' ను మోసం జేసి యాభైరూపాయలు కాజేసాడు. అప్పుడు అన్ని ఊళ్ళల్లోపుకార్లు పుట్టించారు గదా, మరచూమ హతో లాటరీతో లక్షాధికారి అయినాడని! యాభైరూపాయల స్టాంపు పేపరు కొని దాని పైన అఫిడవిట్ రాయించాడు. అఫిడివిట్ చూపించి బ్యాంకు నుంచి లక్షరూపాయలు తీసుకో అన్నాడు. మరే మయిందో మనందరికీ తెలిసిన విషయమే గదా. మరచూమహతో ఆదెబ్బకు పిచ్చోడై పోవాల్సింది. అదృష్టం బాగుంది పిచ్చివాడుకాలేదు," అని అన్నాడు.

అందరూ నవ్వారు. 'రామ్‌ఫల్' మాటలు అల్లేదాంట్లో నేర్పరి. మరచూకు లక్షరూపాయలు దొరకలేదు గాని వోటర్ల లిస్టులో అతని పేరు మహతో లక్షాధికారి అని నమోదయింది. అరే ఒకటే ఊరిలో ఇద్దరు మరుచూలు, ఇద్దరూ మహతోలే! వోటర్ల పేర్లు నమోదు చేసుకునే ఆయన ఒక టే పేరుతో ఇద్దరు వ్యక్తులుంటే చాలాతంటా అవుతుంది అన్నాడు. అప్పుడు మరచూమహతోను ఊళ్లో వాళ్ళు ఎగతాళికి లక్షాధికారి అని అంటారని చౌకీదారు అన్నాడు. ఇంకేముంది నమోదు చేసే ఆయన ఆవిధంగా నమోదు చేసుకున్నాడు."

'నాగేశర్‌దాస్' ఆ ఉళ్ళో అబద్ధాలకోరని ప్రతీతి-కానీ అతను చెప్పేదంతా ఊళ్లో వాళ్లు చాలా శ్రద్ధగా వింటారు. "మర్చూమహతాకు తగిలిన లాటరీలో ఒక రహస్యముంది. అది మీలో ఎవరికన్నా తెలుసా అన్నాడు. మర్చూ దగ్గరికి వెళ్ళి నీవు ఐదు వేల రూపాయలు ఖర్చు చేశావంటే మంచి వయస్సులో వున్నవితంతువుతో నీ వివాహనికి ఏర్పాటు చేయిస్తానన్నాడు. మర్చూమహతో ఒప్పుకున్నాడు. ఒప్పుకున్నట్లు ఒక కాగితం మీద రాయించు కున్నాడు. పాపం మర్చూకు లాటరీ తగల లేదు. కానీ జోఖన్ అతని చేత రాయించుకున్న కాగితాన్ని ఆధారంగా

పెట్టుకొని మర్నాడు మాట తప్పినందుకు అతని రెండు గేదెలను..."

"ఏమయ్యో, ఈ మనిషి సర్కారు మనిషని మాకు నమ్మకం కుదరటం లేదు. తప్పకుండా సి.ఐ.డి. అయిండచ్చు లేక పోతే పట్నాలలో ఫొటోలు, చిత్రాలు కరువా, చిన్న చిన్న పాన్ దుకాణాలలో కూడా ఒక దాని కంటే ఒకటికి మించిన రంగు రంగుల దేవతల, దేవుడి బొమ్మలు గల కాలెండర్లు వేలాడుతూ వుంటాయి. ఇలాంటప్పుడు పట్నం నుంచి ఈ పల్లెటూరికి వచ్చి, ఈ పల్లెటూర్ల గోడలపై రాశిన చిత్రాలపైన మోజు పడటం నమ్మదగిన మాటేనా అని ఒక మధ్య వయస్కుడన్నాడు."

ఊరిలో వాడవాడలోని ప్రతి ఇంట్లో రోజంతా ఫుల్‌పతియా అమ్మ గురించి, ఫుల్‌పతియా గురించే చర్చ. ఈ లోపల పట్నం నుంచి వచ్చిన ఆ జంటిల్మన్ పాలు, పంచదారా కలిసి పోయినట్లు వాళ్లిద్దరితో కల్సిపోయాడు - అతనికి వాళ్ళే సర్వస్వం అయినట్లు.

సాయంత్రం బండి ఎక్కిపోయే ముందు "వచ్చేవారం మీకు ఉత్తరం వ్రాసి అన్ని విషయాలు తెలియజేస్తామని ఫుల్‌పతియా అమ్మతో చెప్పి పోయాడు."

"బాబూ, అన్ని విషయాలు చెప్పినావు గానీ నీపేరు మాత్రం చెప్పలేదు," అంది ఫుల్‌పతియా అమ్మ...

నాపేరు సనాతన్ ప్రసాద్, అన్నాడు అతను నవ్వుతూ.

"తెలియక కోపంతో నేను ఏమేమో అన్నాను. అవన్నీ మనసులో పెట్టుకోకండి." అని ఫుల్‌పతియా సిగ్గుతో తలవంచుకొని.

"ఉహూ మనసులో ఉంచుకుంటాను. నీవు నాతో ఏమన్నావు - 'నన్ను అరెస్ట్ చేయండి' అని అన్నావు! సనాతన్ ఎగతాళిగా ఆమె వైపు చూస్తూ అన్నాడు."

ఫుల్‌పతియా ముఖం సిగ్గుతో ఎర్రబడింది. పరుగెత్తు కుంటూ లోపలికి వెళ్ళి పోయింది.

లక్ష్మి వచ్చిందంటే పై కప్పును కూడా చీల్చుకొని వస్తుంది. అంటే ఇదేనేమో.

కానీ ఇప్పుడు ఫుల్‌పతియా అమ్మ ఇంటి కప్పుపైన బోద కూడా సరిగ్గా లేదు. పద్దెన్మిది, పందొమ్మిదేళ్ల క్రిందట ఫుల్‌పతియానాన్న కోర్టు వ్యవహారాల్లో ఉన్న ఆస్థి నంతా తగలేసి తను తగలబడి పోయాడు. కోర్టు కేసులో ఓడిపోయాననే దుఃఖంతో విషంతాగి చని పోయాడు. అప్పటి నుంచి ఊళ్ళో వాళ్ల ఇళ్లల్లో

దంచి, విసరి ఒడిలో వున్న ఒక్కగా నొక్క సంతానాన్ని సాకింది. తన చేతిలో వున్న నైపుణ్యం వల్ల ఊళ్ళో పేరు ప్రతిష్ఠలుండేవి. కానీ ఇప్పుడు కాగితాలపైన ప్రింటయిన రంగు రంగుల చిత్రాలు రావటంతో ఇప్పుడు పెళ్ళి పేరంటాలకు గోడలపైన ముగ్గులూ, రకరకాల బొమ్మలు అలంకరించే దానికి ఆమెను ఎవరూ పిలవటం లేదు. నిన్న పోస్ట్‌మ్యాన్ వచ్చి ఆమెకు 250-రూపాయల మనియా ర్డరు వచ్చిందని డబ్బులిచ్చిపోతే అప్పుడనిపించింది ఊళ్ళోవాళ్ళందరికి పాత కాలపు వస్తువులన్నీ బేకారు కాదని. "పాట్నా నుంచి వచ్చిన ఆ వ్యక్తి నకిలీ కాదని; అసలైన ఆఫీసరేనని ఊరిలో అందరికీ తెలిసిపోయింది.

వారం పదిరోజుల తర్వాత సనాతన్ ప్రసాద్ మరల ఆ ఊరికొచ్చారు. "ఇప్పుడు ఊరిలో అందరి నాలుకలపైన ఫుల్‌పతియా అమ్మ అదృష్టాన్ని గురించే గాని మరే విషయం చర్చకు రావటంలేదు. ఆవిడ ఇంటి ముందు ఆడవాళ్లు గుమి గూడి వుంటారు. సర్పంచ్, ఊరిపెద్ద ఇంటికొచ్చి ఆమె క్షేమ సమాచారాలు అడిగి పోతుంటారు."

"ఫుల్‌పత్తి అమ్మ వెళ్లి పోయిందని - పాట్నాకు కాదు సరాసరి ఢిల్లీకి, సనాతన్ ప్రసాదే ఆమెను తీసుకెళ్ళాడని, ఢిల్లీలో ఒక్కొక్క భిత్తి చిత్రానికి వెయ్యిరూపాయలు మజూరీ ఇస్తారట అని ఊళ్ళోవాళ్లకు తెలిసి పోయింది."

"మజూరీ కాదు బక్షీస్ అను."

"ఫుల్‌పత్తి! వెంటపోలేదా?"

పోలేదు. ఏదో ఊళ్లో టీచరుగా పనిచేసే ఆవిడ అత్త వచ్చిందట. ఇక్కడే పది, పదిహేను రోజులు ఉండి పోవటానికి సెలవు తీసుకొని వచ్చిందట.

ఇక చూడండి. అందరూ వచ్చి చేరుతారు - మామా, అత్త, పెద్దమ్మ - పెద్దనాన్న, మేనత్త - మేనమామ వీళ్ళేకాకుండా అమ్మ వైపు వాళ్ళు, నాన్న వైపు వాళ్ళు బంధుత్వం కలుపు కుంటూవస్తారు. ఇంతకు ముందెన్నడూ వీళ్లను పట్టించుకోని వారంతా వస్తారు. చాలారోజుల తర్వాత స్టేషన్ బజారులో ఉండే 'బదరీభగత్' ఫుల్‌పత్తి అమ్మ ఫోటో పడిన పేపర్ తీసుకొని వచ్చాడు. చాలా పెద్ద ఆఫీసరు చేత్తో ఫుల్‌పత్తి అమ్మ బహుమానం తీసుకొంటున్న ఫోటో అది.

బదరీభగత్ ఉండేదేమో స్టేషను బజారులో. జాతికి కోమాటాయన. బియ్యం, పప్పుల ధరలతో పాటు ప్రపంచంలో జరిగే సంఘటనల సమాచార మంతా తెలుసుకొంటాడు. ఎప్పుడూ పేపర్ చదువుతూనే ఉంటాడు. ఏరోజు ఫుల్‌పత్తి అమ్మ తిరిగొస్తుందో ఆరోజు మనందరమూ స్టేషను వద్ద ఆమెకు బ్రహ్మాండంగా

స్వాగతం పలకాలని అందరికీ చెప్పాడు. వెదుర్లతో బోదతో స్వాగత తోరణాలు కట్టించి వాటికి మట్టిమెత్తి ఆమట్టి గోడలపైన ఫుల్‌పత్తితో బొమ్మలు గీయిద్దాం. ఓ 'పూలోదీదీ' నీకు సంక్రమించిన అమ్మ విద్యను జాగ్రత్తగా నేర్చుకున్నావంటే నీకు కూడ ఒక రోజు సర్కారోళ్ళు బహుమానం ఇస్తారు. అప్పుడు మన ఊరు ప్రతిష్ఠలు ఆలిండియా ఏమిటి, ఇండియా బయటకి కూడా వ్యాపిస్తాయి. ఈ పేపరులో ఏమి రాశారో తెలుసా? శ్రీమతి ఫణియా ఉరఫ్ పన్నాదేవి తాను గీసే ప్రతి చిత్రంలో వచ్చీ రానీ భాషలో తనపేరు తో పాటు తన ఊరు జిల్లా పేరు కూడా తప్పక రాసుకుంటుంది. మీరే చెప్పండి అలాంటప్పుడు మన ఊరి పేరు 'గణింపులోకి వస్తుంది కదా!'

"అవునుమరి."

"పన్నాదేవికీ జై. పన్నాదేవికీ జై!" ఊరిలోని యువకులందరూ జయజయ కారాలు జేశారు.

మహిళల బృందంలో కూర్చున్నప్పుడు ఫుల్‌పత్తి మామి 'కచరాహి' భాష లోనే మాట్లాడుతుంది. జాతీహూ, ఖాతీహు, పీతీహు, (వెళ్తాను, తింటాను, త్రాగు తాను) అని. ఆవిడ మాట్లాడేది విని ఊరిలోని ఆడవాళ్లందరూ తమ ముసుగుల లోపలే నవ్వుకుంటారు.

ఇప్పుడు ఫుల్‌పత్తి చెయ్యి బాగా తిరిగింది. అమ్మ విద్యను ఆకట్టుకున్నది.

"ఎందుకురాదు. అమ్మచేత నేర్చుకునేటప్పుడు ఫుల్‌పత్తి తక్కువ దెబ్బలు తిందా" అంది ఫుల్‌పత్తి అత్త.

ఫుల్‌పత్తి అత్త తన ఊరు 'పోఠియా'లోని కన్యా పాఠశాలలో పంతులమ్మ. ఎప్పుడు తాంబూలం నములుతూంటుంది.

బయటి పరపురుషునితో మాట్లాడాలంటే ఆమెకు జంకూ బొంకూ లేదు. బదరీభగత్ ఆమెతో మాట్లాడాలని వచ్చి నప్పుడు తలపైన కొంగు కూడా వేసు కోలేదు. ఆవిడ భగత్‌తో "మిగతా పనులన్ని వాళ్ళ అమ్మ ఉన్నప్పుడు ఫుల్‌ప త్తినే చేసేది. నానిన బియ్యాన్ని బండపైన చాలా మెత్తగా నూరటం, పిండిని పాలల్లో కలపటం, ఆ తరవాత అడవిచెట్టు 'మేధాకాశ్' చిగుళ్ళను" దానిలో వేసి బాగా చిలకటం. బొమ్మలు గీసే పుల్లలకు గుడ్డ పీలికలు చుట్టటం, రంగులు కలుపు కోవటం ఇలాంటి పనులన్నీ ఫుల్ పత్తి చిన్నప్పటి నుంచే చేస్తూ ఉంది. ఎప్పుడైనా పిండి కొంచెం మందమైనా చిత్రాలు గీసే పుల్లలకు కట్టిన గుడ్డ పేలి కలు వదులయినా, లేక రంగు ఎక్కువ చిక్కగా తయారయినా లేక పల్చనయి

నా, జుట్టు పట్టుకొని వీపు పైన బాదేది. ధమా ధమా!

"మామి, ఫుల్‌పత్తిని మీయింట్లో ఉంచుకొని నాలుగు అక్షరాలు నేర్పిస్తే బాగుంటుంది గదా అని బదరీభగత్ అన్నాడు."

"నిజమేనండి భగత్‌గారు, ఫుల్‌పత్తిని లోయర్ వరకు చదివించి రామాయణం చదవటం నేర్పించిన తర్వాత అప్పర్ ప్రైమరీ కూడా చదివిచాలని అనుకొన్నాను. కాని వాళ్లమ్మ మొండి పట్టు పట్టింది. పిల్లను ఇంక చదివించకూడదని. అక్కకూ ఒకటే కూతురుగదా! మన మేం జేస్తాం," ఆ అత్త అన్నది.

"ఇక నీవే ఏదో ఒక మంచి సంబంధంచూసి, ఫుల్‌పతికి పెండ్లి చేయించు అంతోయింతో ఇవ్వాల్సి వచ్చి నా ఫర్వాలేదులే," అన్నాడు భగత్.

బదరీభగత్ ఇచ్చిన జర్దా నోట్లో వేసుకుంటూ, మామి "బదరీ బాబు, మంచి సంబంధం దొరికేది ఉందే అదంతా భగవంతుని చేతిలో ఉంది. భగవంతుడి దయ ఉంటే ఏపనైనా సులువుగా అయిపోతుంది," అని అన్నది.

నాగేశర్ దాస్ మరల ఒక కథ చెప్పటం మొదలు పెట్టాడు. "జోఖన్ ఇక్కడ విచారించి ముందు వెనుకా చూసి ఒక సంబంధం చూశాడు. ఫుల్‌పత్తి అమ్మ అయిదువేలు అడ్వాన్సు ఇచ్చిఉంటే పెళ్ళికొడుకు దొరికుండేవాడు. కానీ ఫుల్ పత్తి అత్తకు సంబంధం నచ్చలేదు."

ఫుల్‌పత్తి అమ్మ తిరిగొచ్చింది.

తనవెంట తనకు లభించిన ఇనాము బాపతు సరుకు మూడు ఎడ్ల బండ్లలో వెంట తీసుకొచ్చింది.

స్టేషను వద్ద జయజయ కారాలతో ఆమెకు ఘనంగా స్వాగతం పలికారు. నిజంగానే చూడముచ్చటైన స్వాగత తోరణాలు కట్టారు. స్టేషను వద్ద. ఫుల్‌పత్తి నైపుణ్యం - ఎనిమిదణాల నుండి పన్నెండణాల వరకు పెరిగింది. సనాతన్ ప్రసాద్‌కూడా వెంట వచ్చాడు. బండి దిగుతూనే అతని దృష్టి అందరికంటే ముందు స్వాగత తోరణాలపై నున్న చిత్రాలు, వాటి కళా నైపుణ్యం పైన పడింది. వాటి ఫ్రేము తయారు చెయ్యటం, కలశ నిర్మాణం, పువ్వుల తీగల అల్లికలతో కూడిన చిత్రాలు చాలా సేపటి వరకు అతను వీటినే చూస్తుండి పోయాడు. ఇంటి కెళ్లిన తర్వాత ఫుల్‌పత్తిని అడిగాడు. "ఎఱ్ఱరంగు చేపలు ఏనదిలో దొరుకుతాయి. అక్కడ కలశానికి నాలుగువైపులా నీవు గీసిన చేపల ఎఱ్ఱరంగును చూసి నా మనసులో ఈ ప్రశ్న రేకెత్తింది," అన్నాడు.

"ఎక్కడేమిటి? మా ఊరిలోని చంద్ర భాగానదిలో జ్యేష్ఠ ఆషాడమాసాల్లో

కురిసే వర్షాల తర్వాత వెళ్ళి చూడండి. మీకే తెలుస్తుంది ఈ చేపల కారణం గానే నదికూడా అప్పుడపుడు ఎఱ్ఱగా మారిపోతుంది. ఈ నదులు మీ పాట్నా వైపు ప్రవహించవా."

"అటువైపు చంద్రభాగా కోసీ నదిగాని వీటి ఏ ఉపనది గాని ప్రవహించదు."

ఫుల్‌పతి మామ నరోత్తమ్ బాబుకు ఒక్క నిమిషము కూడా విశ్రాంతి తీసుకొనకుండా "ఢిల్లీ విశేషాలేమిటి?" అని అందరూ చుట్టు ముట్టారు.

"ఇప్పుడే వచ్చారుగదా! మమ్మల్ని ఇంటి విషయాలు కూడా మాట్లాడుకొనివ్వండి." అని ఫుల్‌పతి అత్త వాళ్ళతో అంది.

ఫుల్‌పత్తి అత్త తన భర్తను లోపలకి తీసుకెళ్ళి ఏకాంతంగా అడిగింది. 'ఈ సనాతన్ ప్రసాద్ ఏమంటున్నాడో నీకు తెలుసా?'

"తెలుసు అతను అంటున్నది నిజమే! ఇక్కడ ఏముందని? నాలుగు గుడిసెలు, తాతలనాటి కాలంలోని ఒక పాత మిద్దె ఉంది అంతేకదా. మీ అక్క ఈ కొంపలోనే పడి ఉంటే ఏమి లాభం? భగవంతుడే దయతలచి ఆమె అదృష్టాన్ని మార్చాలన్నపుడు మీ అక్క పట్నంలో పోయివుండచ్చు కదా. అయిదు నుంచి తొమ్మిది వందల వరకు నెలసరి జీతం, లోహిచానగరంలో ఉండటానికి ఒకమంచి ఇల్లు. సనాతన్ ఆవిడ మంచికే చెప్పాడని ఫుల్‌పతి మామ జవాబిచ్చాడు."

"సనాతన్ మన బంధువా ఏమన్నానా!"

"బంధువులు ఎవరికి సహాయం చేస్తున్నారు ఈ కాలంలో. మనిషి ఎవరూ? అతను హోదాఏమిటి? ఇది తెలుసుకొంటే చాలు. మన బంధమే అవ్వాల్సిన అవసరం లేదు. సనాతన్ గొప్పింటి బిడ్డ. తండ్రి గొప్ప ఆస్థి పాస్తులు సంపాదించి చనిపోయాడు. తండ్రి కట్టించిన పెద్దఇల్లుంది... కారుంది. సంవత్సరంలో పది, పన్నెండు వేల చిత్రాలు కొని అమ్ముతూ ఉంటాడు. పాట్నాలో పెద్ద పెద్ద చదువుకొన్న వాళ్లతోను, క్లబ్బుల వాళ్లతోనూ మంచి పరిచయాలున్నాయి. పాట్నా కళా అకాడమీకి సెక్రటరీగా ఉన్నారు. ఇంత కంటే ఏమికావాలి మరి?"

"అక్కదీని కేమంటుంది? అక్కకిది సమ్మతమేనా?"

"సమ్మతం దేని కుండదు? సమ్మతం లేక పోయినా ఆమెను ఒప్పించే ప్రయత్నం చేయటం మనపని."

ఫుల్‌పతి అమ్మ గోవు, గంగి గోవు తోసమానం. ఆవిడ మనసులో ఎలాంటి మోసము, కపటం లేదు. ఆవిడ వాళ్లు చెప్పిన మాటలన్నీ విని అర్థం చేసుకొని రాజీఅయింది. కానీ ఈ పిల్ల ఫుల్‌పతి ఏమంటుందో?

ఫుల్‌పతి బొత్తిగా ఒప్పుకోవటం లేదు. ఈ సంబంధం గురించి ఆలోచిస్తు న్నారని ఎప్పుడైతే ఫుల్‌పతికి తెలిసిందో అప్పటి నుంచి తిండీ తిప్పలు మానేసి ఇంట్లోనే పడి ఉంది. అమ్మ నచ్చ జెప్పాలని ఎంతో ప్రయత్నించి అలసి పోయిం ది. మామకూడా ప్రయత్నించి లాభం లేదనుకొన్నాడు. నేను నచ్చ జెప్పి ప్రయత్నిస్తానంటు మామి ఫుల్‌పతి వద్దకు వెళ్ళింది.

"అమ్మాయీ, ఫుల్‌పతి!"

"అత్త ఇక నువ్వొచ్చావా నన్ను ఏడిపించడానికి? ఢిల్లీ పాట్నా పోవాలని నీ మనస్సు ఉబలాట పడ్తుందా? మాతాతా, తండ్రులు ఉన్న చోటును వదలి నేనె క్కడికీ పోను. మీరు మొండి పట్టు పట్టారంటే నా శవమే ఈ ఇంటి నుంచి బయ టికి పోతుంది" అంటూ ఏడవసాగింది.

"చిన్నప్పటి నుంచే ఇంతే ఈ పిల్ల మొండిఘటం..."

సనాతన్ ఆలోచిస్తూ కూర్చున్నాడు. గత రెండు రాత్రుళ్ళుగా అతనికి నిద్ర రలేదు. కళ్ళు మూస్తూనే అతనికి తన లోపల ఎవరోకూర్చుని ఉన్నట్లు తనను గుడ్లురిమి చూస్తూ, 'నీవు చేసే దేమిటి? బలత్కారమా? కన్నెను అపవిత్రం చేస్తావా? నీ కామోద్రేకం తీర్చుకోవటానికా ఈ కళావ్యాపారం? హ, హ, హ,... బిగ్ స్కేల్ ఫాక్ ఆర్ట్ ఇండస్ట్రీ? హి, హి,హి...ఇండస్ట్రీ పట్నం లో - మీ ఫ్యాక్ట రీలో ఫుల్‌పతి, వాళ్ళ అమ్మను బలి చేస్తావా? మధుబనీ శైలి లో మర్మజ్ఞుడు. ప్రవక్త, అధికారిగా వ్యవహరిస్తూ లోక కళ్యాణ వాతావరణానికి కళ్ళు గప్పి నీవే మో నీ ప్రైవేటు చాంబరులో కూర్చుంటావు. ఫుల్‌పతి, వాళ్లమ్మ వీళ్లే కాకుండా, వందల కొద్దీ కళాకారులు నీ స్లాటర్ హౌసులో బలి అవుతూ ఆక్రందనలు చేస్తా రు." అని అడుగు తున్నట్లు అనిపించింది.

ఈ వేళ తను ఫుల్‌పతి తో స్వయంగా మాట్లాడుతాడు.

ఈ వేళ ఫుల్‌పతి కొంచెం శాంతంగా వుంది. తన వాకిలి ప్రక్క నున్న గోడ పైన అమ్మగీసిన నెమలి రేఖల పైన రంగు పూస్తూఉంది.

ఆమె దగ్గరికి వెళ్ళి సనాతన్ అడిగాడు, "నాట్యం చేసేది మగనెమలా లేక ఆడనెమలా."

'ఆడ నెమలికి నాట్యం చేసే దానికి ఈకలు పింఛం ఉంటే గదా. దానికి ఈకలు చాలా తక్కువగా ఉంటాయి.'

"నీ వెప్పుడైనానెమలి నాట్యం చూశావా?"

ఈ అడవిలో ఉండే కుగ్రామంలో నివసించే ప్రతి ఒక్కరూ ప్రతి వర్షాకాలం

నెమళ్ళు అరవటం వింటారు. అడవిలో అవి నాట్యం చేయటం కళ్ళారా చూస్తారు. అసలు మీరు ఏమి చెప్పదలుచు కున్నారో స్పష్టంగా ఎందుకు చెప్పరు?

"అదే...అదే... మీరు మరలా ఒక మారు ఆలోచించుకోండి!"

"మాటి మాటికి ఆలోచిస్తే ఏమవుతుంది? ఆలోచించవల్సింది ఒకే సారి సనాతన్ బాబుగారు. మీరు తీసుకొని వెళ్ళాలని ఉంటే ఆమె కూడా రావాలను కుంటే అమ్మను తీసుకెళ్లండి. అంతేగాని నన్నేమి అడక్కండి."

"నాకు తెలుసు. అది వచ్చిన రోజే విన్నానుగదా!"

"మీరు మమ్మల్ని ఏమనుకుంటున్నారు? మమ్మల్ని కూడా బొమ్మల్లోకి జమ కట్టారా?"

"అంటే!"

"అంటే మీరు డబ్బులిచ్చి ఏమయినా కొనగలరను కుంటున్నారు."

"కొనటమా! లేదే! నేనే అమ్ముడు బోవాలను కుంటున్నాను."

"సనాతన్ బాబు, మీరు చదువుకున్న వాళ్లు విషయాలు ఎందుకు తెలుసు కోలేక పోతున్నారు."

సనాతన్ మౌనం వహించి తెలుసుకొనేందుకు ప్రయత్నించాడు. కొంత సేపాగి సరే. ఒకటడుగుతాను దయచేసి జవాబిస్తారా? అతను ఎవరు? అదే ఆ అదృష్ట వంతుడు. మీరు వరించిన అతను ఎవరో చెప్పండి. అతని పేరువిని నేను చాలా సంతోష పడ్తాను అని అన్నాడు.

ఫుల్‌పతి గోడపై పింఛాన్ని విప్పి ఆహ్లాదకరంగా నాట్యం చేస్తూ ఉన్నట్లు రంగు రంగులతో చిత్రింప బడిన నెమలి వైపు వేలితో చూపిస్తూ, "అతడే అక్కడ నాట్యం చేస్తున్నాడే అర్థమయిందా?" అంది.

ఒక నిట్టూర్పు విడచి సనాతన్ అన్నాడు. "అర్థం చేసుకున్నా ఏమి లాభం లేదు. సరే నాది మరొక కోరిక అంటే ప్రార్థన అన్నమాట."

సనాతన్ తన రెండో కోరిక చెప్పుకుంటూ పోతున్నాడు. కానీ ఫుల్‌పతీ చాలా ఉత్సాహంగా గోడపైన చిత్రింప బడిన నెమలి పింఛానికి రంగులు పూస్తు ఉంది.

ఉన్నట్లుండి నెమలి ఫించాన్ని విప్పి ఎగిరి నట్లు అతనికి అన్పించింది. నెమలి అరుపుతో అతని మనస్సులోని బిజూబన్ వికసించింది. మామిడి వనంలో ఉయ్యాల్లో ఊగుతూ బారా మాస పాటలు పాడే బాలికల కంఠధ్వని - బిజూబన్ కూహూక మయూర్... చాలా సేపటి వరకు ప్రతిధ్వనిస్తూ ఉంది.

పల్లెలో మరొక మారు ఈ మాట వ్యాపించింది. పోవటంలేదు. ఫుల్‌పతి అమ్మ ఊరువిడిచి ఎక్కడికీ పోదు. తన భర్త ఇల్లు వదలి ఆమె ఎక్కడికి వెళ్ళదు. "కాని సనాతన్ ఊరిలో ఒక సెంటరు తెరవాలని నిర్ణయించు కొన్నాడు. పాట్నా, ఢిల్లీ, కలకత్తా నుండి ఎన్ను కొనబడిన బాలికలు, మూడు నెలలట్రైనింగు పొంద డానికి ఇక్కడి కొస్తారు. అంటే అయిదు వందల నుంచి వెయ్యిరూపాయల వరకూ ఇంట్లో కూర్చునే నెలనెలా దొరుకుతాయన్నమాట. దీనితో పాటు జిల్లాలోని ఆడపిల్లలు కూడా ట్రైనింగు ఇస్తారు. పేపర్లో కూడా ఈ సమాచారం వచ్చింది. బదరీ భగత్ పేపర్లో పడిన ఈ వార్తను చదివి అందరికీ విన్పిస్తున్నాడు. ఈ దఫా పేపర్లో మన ఊరి పేరు పెద్ద అక్షరాలతో పడింది. 'మోహన్ పూర్ మధుబనీ ఆర్టు సెంటరు.' ఈ సెంటరు బిల్డింగ్ శంఖుస్థాపనకు దేశంలోని ప్రసిద్ధి గాంచిన చిత్రకారుడు హుసేన్‌ను రమ్మని ఆహ్వానించారు."

వినే వాళ్ళందరూ బిగ్గరగా జయజయ కారాలు చేశారు 'మోహన్‌పూర్ గ్రామానికి జై...మోహన్‌పూర్ గ్రామానికీ జై...'

Lasertypeset at UNIQUE Graphics, 2/3 Old Rajinder Nagar, New Delhi - 60
and printed at J.J. Offset Printers, Press Area, Wazirpur, Delhi - 110035